శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవచన భూషణము

శ్రీమల్లోకాచార్య ప్రణీతము.

ఇయ్యది

విశదవాక్శిఖామణియగు

శ్రీమణవాళ మహామునులవారిచే రచియింపఁబడిన

వ్యాఖ్యానముతో సహా

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ దాంతవాచస్పతీత్యాది

బిరుదాంకితులును,

ఆంధ్ర శ్రీభాష్యకారులునగు

## శ్రీమాన్ కందాడై శేషాచార్యులవారిచే

ఆంధ్రీకరింపఁబడి

స్వకీయ

వేదాంతముద్రాయంత్రమున

ముద్రింపఁబడి ప్రచురింపఁబడినది

**MADRAS.**

**1925.**



    

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీవచన భూషణము

## సవ్యాఖ్యానమ్.

---

పొత్తు తనియన్గళ్.

అళకియమణవాళరు సాయించినది.

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్॥

ఆళ్వాను సాయించినది.

లక్ష్మీనాథసమారమ్భాం నాథయామునమధ్యమామ్।
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

యోనిత్యమచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసిన్ధోః రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥

ఆళవన్దారులు సాయించినది.

మాతా పితా యువతయస్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్।
ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥

భట్టరు సాయించినది.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాఙ్ఘ్రిరేణుపరకాల యతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్

---

రహస్యార్థసంప్రదాయ తనియన్గళ్.

మణవాళమామునులు సాయించినది.

లోకగురుం గురుభిస్సహ పూర్వైః కూరకులోత్తమదాసముదారమ్।
శ్రీనగపత్యభిరామవరేశౌ దీప్రశయానగురుం చ భజేహమ్॥

ఈయుణ్ణిమాధవప్పెరుమాళ్ సాయించినది.

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే। సంసారభోగిసన్దష్ట జీవజీవాతవే నమః॥

తిరువాయ్మొఴిప్పిళ్ళైసాయించినది.

లోకాచార్యకృపాపాత్రం కౌణ్డిన్యకులభూషణమ్।
సమస్తాత్మగుణావాసం వన్దేకూరకులోత్తమమ్॥

మణవాళమామునిసాయించినది.

నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే। ప్రసాదలబ్ధపరమప్రాప్య కైఙ్కర్యశాలినే॥
లోకాచార్యపదామ్భోజ రాజహంసాయితాన్తరమ్।
జ్ఞానవైరాగ్యజలధిం వన్దేసౌమ్యవరంగురుమ్।
శ్రీజిహ్వావదధీశదాసమమలమ శేషశాస్త్రవిదమ్।
సున్దరవరగురుకరుణాకన్దళిత జ్ఞానమన్దిరంకలయే॥

అఴకియమణవాళర సాయించినది.

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్।
యతీన్ద్రప్రవణంవన్దే రమ్యజామాతరంమునిమ్॥



## శ్రీ వచన భూషణ త్తనియన్గళ్.

పురుషకారవైభవఞ్చ సాధనస్యగౌరవమ్
తదధికారికృత్య మస్యసద్గురూపసేవనమ్।
హరిదయామహేతుకీం గురోరుపాయతాఞ్చయో
వచనభూషణేఽవద జ్జగద్గురుమ్తమాశ్రయే॥

సాఙ్గాఖిలద్రవిడసంస్కృతరూపవేద సారార్థసఙ్గ్రహమహారసవాక్యజాతమ్।
సర్వజ్ఞలోకగురునిర్మిత మార్యభోగ్యమ్ వన్దే సదా వచనభూషణదివ్యశాస్త్రమ్॥

ఆకణ్ఠోత్కణ్ఠవైకుణ్ఠ ప్రియాణాంకణ్ఠభూషణమ్।
గురుణా జగతాముక్తం వ్యాప్తంవచనభూషణమ్॥

పేఱుతరువిక్కుమవళ్ తన్ పెరుమై యాఱు పెఱువాన్ ముఱై యవన్
కూఱుకురువైప్పణువల్ కొళ్వదిలైయాకియ కుణన్దవరుళ్ తాన్
మాఱిల్ పుకఴ్ నఱ్కురువిన్ వణ్మైయొడలామ్ వచనభూషణమతిల్
తేఱిడ నమక్కరుళ్ ముడుమ్బైయిఱైయవన్ కఴల్కళ్ శేరెన్మననే.

తిరుమామకళ్తన్ శీరరుళేఱ్ఱముమ్, తిరుమాల్ తిరువడి శేర్వఴినన్మైయుమ్,
అవ్వఴియొఴిన్దనవఱ్ఱిన్ పున్మైయుమ్, మెయ్వఴియూన్ఱియమిక్కోర్ పెరుమైయుమ్
ఆరణమ్వల్లవరమరుమ్ నన్నెఱియుమ్, నారణన్దాళ్ తరునఱ్కురునీతియుమ్,
శోతివానరుళ్ తూయమాకురువిన్, పాతమామలర్ పణిపవర్తన్మైయుమ్.
ఈతిల్వానవర్ తేవనుయిర్కళై యేతమిన్ఱి యెడుక్కుమప్పడియుమ్,

మన్నియశిన్నముమ్ పారాశరియుమ్‌కురు వెన్నునిలైపెఱు మిర్ఱపొరుళ్ తన్నైయుమ్
అన్నైవిలావేత మతనుళ్ నైత్తైయుమ్ వశనభూషణ వళ్ళియాలరుళియ
మత్రైయవర్ శికామణి వణ్‌పుకళ్ ముదుమ్బై యిత్రైయవ నెజ్ఞో నేరులకారియన్
తేర్ మలర్ చ్చేవడి శిన్దైశెయ్‌పవర్ మానిల త్తిన్బమ తెయ్ తివాళ్‌పవరే.

లోకాచార్యకృతే లోకహితే వచనభూషణే।
తత్త్వార్థదర్శినో లోకే తన్నిష్ఠాశ్చ సుదుర్లభాః॥

జగదాచార్యరచితే శ్రీమద్వచనభూషణే। తత్త్వజ్ఞానశ్చ తన్నిష్ఠాం దేహినాథయతీన్ద్ర మే

ఉలకారియన్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.



శాత్తుమ్బోతనుసన్ధిక్కుమ్ తనియన్గళ్.

కోతిలులకారియన్ కూరకులోత్తమ తాతర్
తీతిల్ తిరుమలై యాళ్వార్ శెళుఙ్గురవైమణవాళర్
ఓతరియపుకళ్ తిరునావుడైయపిరాన్ తాతరుడన్
పోతమణవాళమునిపొన్నడిగళ్ పోత్తువనే॥

వాళ్ళియులకారియన్ వాళ్ళియవన్ మన్నుకులమ్
వాళ్ళిముడుమ్బై యెన్నుమ్ మానకరమ్—వాళ్ళి
మనమ్ శూళ్‌న్ద పేరిన్బమ్ మల్కుమికునల్లార్
ఇనమ్ శూళ్‌న్దిరుక్కుమిరుప్పు॥

ఓతుముడుమ్బైయులకారియనరుళ్
ఏతుమఱవాత వెమ్బెరుమానే—నీతి
వళువాచ్చిఱునల్లార్ మామత్రైయోన్ పాతమ్
తొళువార్ క్కువారాతుయర్.

పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.



తిరునామము. ఆనందభైరవిరాగం - ఆదితాళం.

ఉపపల్లవి॥ ఎన్ని శాస్త్రిములకైన । తనయెదుటనిల్వనివ్వదు॥
పల్లవి॥ అన్ని శాస్త్రిములవంటిది గాదమ్మా
శ్రీవచనభూషణ మన్ని శాస్త్రిముల మించినదోయమ్మా॥
చరణములు ॥ సాంగాఖిల సంస్కృతద్రవిడ । రూపవేదార్థ సారసంగ్రహసారస్య
మిమిడి । పొంగి లోకగురుపుంగోక్తులెస । గంగనార్యభోగ్యంబై వెల
సిన దన్ని శాస్త్రిములవంటిది గాదమ్మా॥

పురుషకారోపాయవైభవము । అధికారికృత్యసరణి సద్గురుసేవేఘనము
హరిదయామహిమయార్యసాధనము । పరమభోగ్యమని గుణముగ దెలసిన
దన్ని శాస్త్రముల॥ ౨॥

వర్ణాశ్రమజన్యాద్యహంకృతిని । శ్రీహరిదాసుల వర్ణాదులెన్నే వారిధృతిని । తూర్ణ
ముగాబలుతునియలు జేయును । దీప్తమహిమగలదివ్యశాస్త్రమిది॥ అన్ని॥ ౩॥

భోగేచ్ఛనించుకయొద్దనెను । విహితవిషయత్యాగముజేయుటేవిధియనెను । ఆగమా
ర్థములుయన్నియేకమై బాగుమీఱ శ్రీపతిగా వెలసినదన్ని॥ ౪॥

విడువేయుగనైయున్నదనుచు । విలక్షణులకు నడిమ జేసేఘనులు । ఈడుదెలసి
బల్జోడుగూడిహరిని । యాడుచుబాడుచునతిశయించినది॥ అన్ని॥ ౫॥

ప్రకటప్రభావశాస్త్రమనుచు । దెలియకభువిని । నొకరు నీయర్థమిట్టిదనుచు । నక
లుషమతులకు నను(ష్ఠా)తలు యొకానొకరు నీయుర్వినిగలరని॥ అన్ని॥ ౬॥

పరదారధనేచ్ఛవద్దనెను। మమకహంకృతిని। పరనిందస్తుతులు మానుమనెను । పర
విరోధమునభక్ష్యభక్షణము సరళిగూడదని చాటెనీశాస్త్రము॥ అన్ని॥ ౭॥

ఒప్పుగమూరంగేశునివంటి । రామానుజగురుని। కప్పగించెనన్న న్యాడననుకొనక ।
అప్పటప్పటికి నరసిజూచినను । కుప్పతెప్పలుగ తేనియలూరును॥ అన్ని॥ ౮॥

## మంగళహారతి.

### శ్రీరాగం - అటతాళం.

మావరవర పురవసులకు మణవాళమహామునులకు
శ్రీవెలయు త్రిదండమునకు చెన్నగు కాషాయములకు॥ మావరవరపుర॥

రంగనాయకులకు సంతరంగగోష్ఠిసల్పుసత్య । సంగులకితరవిషయ నిస్సంగు
లకు । శృంగారముగలవద సరసిజములకును జానువులకు । బంగారపు జంఘలకును
భాసిల్లెడు కటితటికిని॥ మావరవరపుర॥ ౧॥

ముజ్జగంబులనుభరించి ముద్దుగుల్కుచుండుచిన్న బొజ్జకు తిరుమాలికలకువిపుల
వక్షంబునకు । సజ్జుపుయుగు భుజద్వయంబులకు కరంబులకును । గొజ్జగివాసనలు
గొనుకోశ ముద్రహస్తములకు॥ మావరవరపుర॥ ౨॥

ఘనతజెందు బ్రహ్మసూత్రమునకు గళమునకును సమ్మతము । దనరునక్త్రి
మునకు తిరునయనములకు ముఖమునకును। మొనసితిరుముడికిని శిఖకుముందుశంఖ
చక్రములకు । మున్నుద్వాదశోర్ధ్వపుండ్రములకు శుభగిరీశులైన॥మావరవరపుర॥ ౩॥



# విషయసూచిక.



## ప్రథమ ప్రకరణము.

విషయము. పుట సంఖ్య.



## పురుషకారవైభవము.



## ఉపాయవైభవము.

## ద్వితీయ ప్రకరణము.

| విషయము. | పుట. సంఖ్య. |
|---|---|

విషయము. — పుట సంఖ్య.



## తృతీయ ప్రకరణము.

| విషయము. | పుట సంఖ్య. |
| --- | --- |

# ప్రవేశము.

శ్రీ నంబిళ్ళగారి శ్రీపాదముల నాశ్రయించి వారియెడల యెక్కువ ప్రేమాతిశయములు గలవారగు శ్రీ వడక్కుత్తిరువీధిపిళ్ళగారి గర్భమున వారి యాచార్యుల వరప్రసాదముగ ఒక్క కుమారుండు జన్మించెను. వీరికి పిళ్ళైలోకాచార్యులను పేరుపెట్టిరి. వీరు సకలశాస్త్రములను కరతలామలకముగాఁ జేసికొని ఈ శ్రీవచనభూషణము గ్రంథమును రచియించిరి.

వీరి కాలమున సత్సంప్రదాయమనఁబడు తెన్నాచార్యసంప్రదాయము మిక్కిలి వృద్ధిలోనికి వచ్చినదాయెను. ఈ సంప్రదాయము విషయమున గ్రంథజాలమును బలపఱచుటకై శ్రీ నంబిళ్ళగారును, పెరియవాచ్చాఁబిళ్ళగారును, వడక్కుత్తిరువీధిప్పిళ్ళగారును దివారాత్రములు కృషిచేసి ఆళ్వారాదుల గ్రంథముల కెన్నియో వ్యాఖ్యానములను అరుంబదములనున్ను రచియించి భగవద్విషయము మొదలుగాఁగల యుద్గ్రంథరూపమగు గ్రంథజాలము నెంతయో బలపఱచిరి.

పాశురములా! వేలకొలది. వాటికి వ్యాఖ్యానములా ఒకటికి పది. అరుంబదములా లెక్కలేవు. శ్రీ పిళ్ళలోకాచార్యులవారికి వీటినన్నింటిని చూచిన తోడనే వీరి మనస్సున నొక సంశయము కలిగెను.

ఈ వేలకొలది పాశురములను అర్థముతో తెలిసికొనగలవాఁడెవ్వఁడు? వీటి వ్యాఖ్యానములను అరుంబదములనున్ను పరిశీలించే వాఁడెవ్వఁడు? జనుల కంత జ్ఞానమున్ను శక్తియున్ను లేవు. కాలమున్ను లేదు. ఇవ్వాళియున్న వాఁడు రేపుండుట సంశయము. లోకస్థితి యిట్లుండ, వీటినన్నింటిని చదివి, యవగాహనచేసికొని, జ్ఞానానుష్ఠానంబులను సంపాదించుకొని, వాటిమూలముగ మోక్షమును బొందవలయునన్న, అంత దుర్లభము వేఱొక్కటి లేదు. ఏమి చేయవలయునా? అని చిరకాలము యోచించి, యీ చేతనులకు ఉజ్జీవనార్థము ముఖ్యముగాఁ దెలియవలసినది అర్థపంచకము కదా? దానిని సులభముగా నొక్కమాటలో తెలుపునట్టివి తిరుమంత్ర, ద్వయ చరమశ్లోకములే. వీటి యర్థములఁ దెలిసికొని యందులకనుగుణముగ ప్రవర్తించినట్లయిన, సూక్ష్మములో మోక్షమున్నట్లు, యీచేతనులు సులభముగా కడతేరగలరు. ఇట్లు తలంచి తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకముల యర్థములను వివరించునట్టి చిన్న చిన్న గ్రంథములను రచియించిరి. ఇవి ముముక్షుప్పడి మొదలగు పదునెనిమిది. తరువాతివారు యీయర్థములను రహస్యముగా ననుసంధించుకొనుచున్నందున నివి రహస్యములను పేరున ప్రసిద్ధినొందిన వాయెను. ఇట్టి చిన్న చిన్న రహస్య గ్రంథములను రచియించుటకు వీరే ప్రాథమికులు. తరువాత వీరినిచూచి వడకల సంప్రదాయమువారును ఇట్టి రహస్యగ్రంథములను రచియించుటకు మొదలిడిరి. వైష్ణవసంప్రదాయమున తిరుమంత్రాదుల కింతకుముందే ప్రాచుర్యమున్నను వీరికాలముననే వాటియర్థములను సక్రమముగ వివరించునట్టి ప్రత్యేక గ్రంథములేర్పడినవి.

సత్సంప్రదాయప్రవర్తకులలో ప్రాథమికులగు శ్రీనంబిళ్ళై పెరియవాచ్చాంబిళ్ళై మొదలగు వారికిన్ని వీరికిన్ని గల తారతమ్యమేమనఁగా— వారు లోకస్థితినిన్ని జనులయొక్క జ్ఞానశక్తులనున్ను గమనింపక, గ్రంథజాలమును వృద్ధిపఱచుటనే ముఖ్యోద్దేశముగా నెంచి గ్రంథముల్పైని గ్రంథములనువ్యాఖ్యానములనున్ను వ్రాసిపోయిరి. వీరన్ననో, లోకస్థితినిన్ని జనులజ్ఞానశక్తులనున్ను గమనించి సూక్ష్మములో మోక్షమున్నట్లు సులభముగా జనులకు జ్ఞానానుష్ఠానుష్ఠానంబులను గలుగఁజేయుటయే ముఖ్యోద్దేశముగాఁ దలంచి, సారమును తెలుపునట్టివియగు చిన్నచిన్న స్వతంత్రగ్రంథములను వ్రాసిపోయిరి.

వీరు రచియించిన గ్రంథములలో కొన్నిజ్ఞానప్రతిపాదకములు. మఱికొన్నియనుష్ఠానప్రతిపాదకములు. అనుష్ఠానప్రతిపాదకములగు గ్రంథములలో శ్రీవచనభూషణము ప్రధానమైనది. జ్ఞానప్రతిపాదకములగుగ్రంథములలో ముముక్షుప్పడి ప్రధానమైనది. కావున అందఱును తప్పక యీ రెండుగ్రంథములను తరుచుగ సేవించుట వాడుకలోఁగలదు.

తేనెటీగ యన్నిపుష్పములలోనుండు మకరందమునుగొనివచ్చి యొక తావునఁ జేర్చునట్లు వీరున్ను వేద, వేదాంత, స్మృతీతిహాసపురాణంబులలోను ఆళ్వారాదులురచియించినట్టిప్రబంధములలోనునుండు సారభూతములైనట్టియర్థములనన్నింటిని యొకతావునఁజేర్చి యీ గ్రంథమును రచియించిరి. ఇట్టి విషయంబులనన్నింటినిగొని యీగ్రంథమును రచియించినందు దీనికి శ్రీవచనభూషణమను పేరు సార్థకనామమని వేఱుచెప్ప నక్కఱలేదు, ఈ గ్రంథముయొక్క వైభవమును గుఱించి శ్రీ మణవాళమహాముమునులే ఉపదేశరత్నమాలయందు తెలిపియున్నారు.

అన్నపుగళ్ ముడుమ్బైయణ్ణలులగాశిరియర్, ఇన్నరుళాల్ శెయ్దకలైయావైయిలుమ్,
ఉన్నిల్ తిగళ్ వచనభూషణత్తిన్ శీర్మైయొన్నుక్కిల్లై, పుగళ్లైవిర్వాక్ మెయ్యిప్పో.

తా. అట్టి మహిమాతిశయముగల పిళ్ళలోకాచార్యులు కృపతో అనతిచ్చిన సకల ప్రబంధములలో శ్రీవచనభూషణము అను దివ్యమైన శాస్త్రముయొక్కమహిమ వేఱొక్కశాస్త్రమునకు లేదు, మేము ఇట్లు వచించుట వట్టి స్తోత్రముకాదు, ఇదివాస్తవమని.

మున్నమ్ కురవోర్ మొళిన్దవచనఙ్గళ్ దన్నై మిగక్కొణ్డుకఱ్ఱోర్ దమ్మురుక్కు,
మిన్నదియా ప్పేరచ్చుమెత్తవరేశిర్ వచనభూషణమెన్ఱేర్, ఇక్కలైకిట్టార్ పిన్.

తా. సమస్తపూర్వాచార్యులు సాధించిన శ్రీసూక్తులను విశేషముగ అభ్యసించినవారియొక్క స్వరూపమునకు ప్రకాశకరమైన ఆభరణముగ దీనినిచేర్చియుంచి తర్వాత ఆపిళ్ళ లోకాచార్యుల వారే శ్రీవచనభూషణమనెడు తిరునామమును, ఈ శాస్త్రమునకు ఉంచినవారైరని.

ఆర్ వచనభూషణత్తి సార్పొరుళెల్లామఱివార్, ఆరదుశొన్నెఱిలనుష్టిప్పార్,
ఓరొరువరుణ్డాగిలత్తనెగాణుళ్ళమే, యెల్లార్క్కు మణ్డాదదన్రోవదు.

తా. శ్రీవచనభూషణమునందలి గంభీరమైన అర్థవిశేషములన్నిటిని దెలిసికొనువారెవరు అం

గూనఁజెప్పిన ప్రకారముగ నడుచుకొనవారెవరు? ఓమనసా! శ్రీదు చెప్పిన ప్రకారముగఁ దెలిసికొనుటయును నడుచుకొనుటయును అంతటికని అశక్యమని.

ఉయ్యనినైవుడైయీర్గుర్గళుక్కు చొల్లుకిన్దేన్. వైయగురుమున్నమ్ వాయ్ మొళిన్ద,

శెయ్యకమలైయాళ్ వచనభూషణత్తిన్ పొరుళై, కఱ్ఱదనుక్కు మనిలైయిల్ నిల్లుమెన్ఱు,

తా. ఉజ్జీవింపనిచ్ఛగలవారలారా పూర్వమందు శ్రీలోకాచార్యులు సాధించిన శ్రేష్ఠముగు శ్రీవచనభూషణమందలి అతిగంభీరమగు అర్థవిశేషములను అభ్యసించి దానికి అనుగుణమైన నిష్ఠయందు నెలకొందిన బుద్ధివిశేషము గలిగి నిలుతురుగాక.

తేశికర్ పాల్ కేట్ట శెళుమ్పొరుళై, చ్చిన్దైదన్నిల్ మాశఱవే యూన్ఱ మననం శెయ్యాగ,

ఆశిరిక్కవల్లార్గళ్ వాన్ వచనభూషణత్తిన్ వాన్పొరుళై, కఱ్ఱదనాల్ నేర్ వర్న్దు,

తా. ఆచార్యులసన్నిధిని తాము వినిన శ్లాఘ్యమైన అర్థములను మనస్సునందలి కల్మషము వదలి నిలకడనొందునట్లు చింతనచేసి అనుష్ఠింప సామర్థ్యముగలవారలు అతిశయముగు శ్రీవచనభూషణార్థములను అభ్యసింపకుండుటకు కారణమేమని.

సచ్చమ్ప్రదాయమ్ ఉడైయోర్ కేట్టక్కాల్, మెచ్చుమ్పడియాక్క వ్యాఖ్యానఙ్గళ్,

నచ్చిఱదిగరియుమ్ పిర్ వచనభూషణత్తుక్కు ఉళ్ళదిఱ ఉడైయీర్, మత్తియత్తరాయ్.

తా. సత్సంప్రదాయముగల వారలందరును వినినపుడు మెచ్చునట్టి వ్యాఖ్యానములున్నయెడల జ్ఞానవంతులారా అట్టివానిని అపేక్షగలిగి సావకాశముగ మీరు అభ్యసింపవలయునని.

శీర్ వచనభూషణత్తిన్ శెమ్పొరుళై, చ్చిన్దైదన్నాల్ తేఱిలుమామ్ వాయ్ కొణ్డు శొల్లిలుమామ్,

ఆరియర్గాళ్ ఎన్దనక్కు నాళుమినిదాగా నిన్ఱదైయో, ఉన్దమక్కు ఎవ్విన్బముళదామ్.

తా. అత్యంతశ్లాఘ్యమగు శ్రీవచనభూషణార్థములను మనస్సుతోఁదలచినను వాకా అనుసంధించినను చాలును. ఆర్యులారా! మాకెల్లప్పుడును మనోజ్ఞమగుచున్నది, అయ్యో మీకెట్టియానందముగలుగునో యెఱుగనని.

వీరు మోక్షసాధనముగా నీగ్రంథముయొక్క తత్త్వతుదిని నిర్ణయించినట్టి యాచార్యాభిమానమును గుఱించి కొంచము తెలుపవలసియున్నది. వీరి యభిప్రాయప్రకారము ఆచార్యుండనఁగా "అరియాతన వడయ వరివిత్త యాచార్యకృత్యత్తై యుమ్" అని వీరే సాయించినట్లు తెలియనివాటిఁదెలిపి శిష్యునికి మొదటినుండి తుదివరకును జ్ఞానానుష్ఠానంబులఁ గలుగఁజేసినవాఁడని యర్థము. శిష్యుండనఁగా తన సంశయములన్నింటిని పోగొట్టి తనకు మంచిజ్ఞానానుష్ఠానంబులఁ గలుగఁజేయునట్టి యాచార్యునివలన సర్వమును తెలిసికొని యాచార్యప్రీతికిగాను వాటినన్నింటిని బాగుగా ననుష్ఠించుకొనువాఁడని యర్థము.

ఆచార్యాభిమానమనఁగా—తానిచ్చిన విద్యను వృద్ధిపఱచుకొని తదనుగుణముగా ననుష్ఠించుకొనువాఁ డగుటంజేసి వానివిషయమున యాచార్యునికిఁగల ప్రీతివిశేషమని యేర్పడుచున్నది. ఇదియే శాస్త్రీయముగు శిష్యాచార్యసమాశ్రయణమని కేనోపనిషత్తు పీఠికయందు దానుండు తెలిపియేయున్నాఁడు.

ఈ గ్రంథకర్తకు పెరియాళ్వారన్నను శ్రీ మధురకవియాళ్వారన్నను యెక్కువ ప్రీతి. పెరియాళ్వారులు తక్కిన యాళ్వారులవలెనే స్వార్థపరులు కాకుండ, పరా

ర్థపరులై, భగవంతునికి మంగళాశాసనముఁ జేసి యందుమూలముగ భగవంతునికి గలుగునట్టి యతిశయమే తమకొక ప్రయోజనమునుగాఁ దలంచియున్నందున తక్కిన యాళ్వారులకంటెను వీరిని యెంతయో యెక్కువగా శ్లాఘించియున్నారు. కావుననే ఆచార్యుండు శిష్యునిదిద్దుపాటు చేయుటయనఁగా మంగళాశాసనపరునిగాఁ జేయుటయని పలుమారు వీరు తమగ్రంథమునఁ జెప్పియున్నారు.

ఈపైని చెప్పినప్రకారము పెరియాళ్వారుల విషయమున నెక్కువ యభినివేశమున్నట్లు, శ్రీ మధురకవులన్నను వీరికి యెక్కువ యిష్టము. తక్కిన యాళ్వారులు ఒకప్పుడొక్కమాటను మరియొకప్పుడొక్కమాటనున్ను చెప్పుచుందురు. వీరో “తేవుమత్తఱియేన్” అన్నట్లు ప్రాప్యప్రాపకములన్నియును తమ యాచార్యులగు శ్రీ నమ్మాళ్వారులేయని తలంచి వారినితప్ప వేఱొక్కవిషయము నెఱింగి యుండరు. కావుననే, తక్కిన యాళ్వారుల శ్రీసూక్తులట్లుండగా, వీరియొక్క శ్రీసూక్తినిన్ని అనుష్ఠానమునున్ను ఆధారముగాఁగొని ఆచార్యాభిమానమే యుత్తారకమని నిరూపించినవారైరి.

పూర్వాచార్యులందఱిలో వీరి మతప్రకారము ఆచార్యాభిమాననిష్ఠులగు శ్రీయామునాచార్యులవారినిన్ని శ్రీవడగునంబిగారినిన్ని తమయభిప్రాయముతో నేకీభవించినవారినిగాఁగొని వారి నెంతయో యాదరించి గ్రంథమును ముగించినారు.

శ్రీమణవాళమహామునులవారు పరమకృపతో ఈగ్రంథమునకు వేంచేపుచేసిన వ్యాఖ్యానమును చదివినట్లయినను, ఆయా రహస్యార్థములన్నియును వారివంటి మహనీయులకే గోచరములు కాని, యితరులకంతగోచరములుకావని విశదపడును.



## స్వ వి ష య ము.

మన యాంధ్రదేశముననుండు వారలందఱికిన్ని మన పూర్వాచార్యులయభిప్రాయములను తేటతెల్లముగ తెలియఁజేయుటకై ద్రావిడభాషలోనుండు గ్రంథములనున్ను సంస్కృతభాషలోనుండు గ్రంథములనున్ను తెనిగించుట ప్రారంభించి మొదట శ్రీభాష్యమును తెనిగించి ముగించి, అటుపిమ్మట శ్రీవైష్ణవసంప్రదాయమున నెక్కువ ప్రసిద్ధిబొందినవగు “శ్రీవచనభూషణ” “ఆచార్యహృదయ” గ్రంథములను వ్యాఖ్యానములతోఁగూడ తెనిగించి రెంటినిన్ని యేకకాలముననే ముద్రించుకొనుచు వచ్చితిని. అయితే గతసంవత్సరమున ఆరుమాసములు ఖాయిలాలోపడియుండి శరీరములో శక్తినంతయును గోల్పోతిని. కావున శ్రీవచనభూషణమును మాత్రమే ముందుగ ముగించినాడను. ఆచార్యహృదయమునున్ను క్రొద్దిదినములలో ముగించుటకై ప్రయత్నించుచున్నాఁడను.

ఇట్లు,

కం దా డై శే షా చా ర్యు లు

    

శ్రీమతే రామానుజాయ నమః.

పిళ్ళైలోకాచార్యర్ తిరువడికళే శరణమ్.

పెరియజీయర్ తిరువడికళే శరణమ్.



## శ్రీవచనభూషణత్తుక్కు పెరియజీయర్ తిరువాయ్మలర్న్దరుళియ వ్యాఖ్యానత్తిన్ అవతారికై.

సకలవేదసఙ్గ్రహమాన తిరుమన్త్రత్తిల్, పదత్రయత్తాలుమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱ ఆకార త్రయముమ్ సర్వాత్మసాధారణమాకైయాలే, “యత్ర ఋషయః ప్రథమజా యే పురాణాః” ఎన్గిఱ

---

సకలవేదార్థములను సంగ్రహముగాఁ దెలుపునదియగు తిరుమంత్రమునందుండు *మూఁడుపదములచేతను ప్రతిపాదింపఁబడు మూఁడు ఆకారములును జీవులకందఱికిని సర్వసాధారణము అగుటంజేసి “యత్ర ఋషయః ప్రథమజా యే పురాణాః” (యజు. అచ్ఛి. ప. ౨౨) (ఏపరమపదమున సర్వమును సాక్షాత్కరించినవారును, అనాదిసిద్ధులును, పూర్వమును నవీనులు అనఁగా నింతకుపూర్వమనుభవించనవే యయినను రోజారోజు నూతనముగా భగవద్గుణముల ననుభవించునట్టి నిత్యసూరులు కలరో) అని చెప్పియున్నట్లు నిత్యసూరులవలెనే తక్కినజీవులందఱును శుద్ధసత్త్వమయమగు

---

* “ఓమ్ నమో నారాయణాయ” అనునది తిరుమన్త్రము. “ఓమ్” అనియు, “నమః” అనియు, “నారాయణాయ” అనియు నివి యందుండు మూఁడు పదములు. వీటిలో “ఓమ్” అనునది జీవుఁడు సర్వేశ్వరునికితప్ప వేఱొక్కనికి శేషభూతుఁడు కాఁదగడని తెలుపుచున్నది. దీనినే యనన్యార్హశేషత్వమందురు. “నమః” అనునది జీవునికి సర్వేశ్వరుఁడే శరణముగాని, వేఱొక్కఁడు శరణముకాఁడని తెలుపుచున్నది. దీనినే యనన్యశరణత్వమందురు. “నారాయణాయ” అనునది జీవుఁడు సర్వేశ్వరునికే భోగ్యమైన వస్తువుకాని వేఱొక్కనికి కాదని తెలుపుచున్నది. దీనినే యనన్య భోగ్యత్వమందురు. ఈపైని గనఁబఱచిన అనన్యశేషత్వ,అనన్యశరణత్వ, అనన్యభోగ్యత్వములే తిరుమంత్రమునందలి మూఁడు పదములచేఁ దెలుపఁబడిన మూఁడు ఆకారములు. ఇవి బద్ధముక్తావస్థలయందుండు జీవులందఱికిని సమానములయినట్లు “దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః” అను హారీతస్మృతివాక్యమువలనఁ దెలియుచున్నది.

దక్కైయాలే, ఆళ్వారుడైయ నిర్హేతుకకటాక్షలబ్ధ దివ్యజ్ఞానరాన నాథమునికళ్ తుడక్కమాక సత్సమ్ప్రదాయసిద్ధరాయ్ సకలశాస్త్రనిపుణరాయ్ పరమదయాళుక్కళాన పూర్వాచార్యర్కళ్ అన్దవేదాదికళి లర్థఙ్గళై సఙ్గ్రహిత్తు, మన్దమతికళుక్కుమ్ సుగ్రహమామ్పడి ప్రబన్ధికరిత్తు ముపదేశిత్తుమ్ పోన్దార్కళ్.

అప్పడియే, సంసారిచేతనరిఴవు సహిక్కమాట్టాత పరమకృపైయాలే, తదుజ్జీవనార్థమాక తాముమ్ పలప్రబన్ధఙ్గళు మరుళిచ్చెయ్త పిళ్ళైలోకాచార్యర్, ఆచార్యపరమ్పరాప్రాప్తఙ్గళాన వర్థఙ్గళిల్, అవర్కళ్ తాఙ్గళ్ గౌరవాతిశయత్తాలే రహస్యమాక ఉపదేశిత్తు పోన్దవైయాయ్, అరుమై పెరుమైకళైప్పఱ్ఱి, ఇదుక్కుమున్బు తాముమ్ ప్రకాశిప్పియామల్ అడిక్కొణ్డు పోన్దవైయుమాన వర్థవిశేషఙ్గళెల్లావఱ్ఱైయుమ్, పిన్బుళ్ళారుమిఴక్క వొణ్ణాతెన్గిఱ తమ్ముడైయ కృపాతిశయత్తుక్కమేలే, పెరుమాళుమ్ స్వప్నత్తిలే తిరువుళ్ళమాయరుళుకైయాలే, శ్రీవచనభూషణమాకిఱ ఇప్ప్రబన్ధముఖేన వెళియిట్టరుళినార్.

## శ్రీవచనభూషణత్తై అరుళిచ్చెయ్వతర్కు భగవన్నియమనమ్.

మున్బే పేరరుళాళప్పెరుమాళ్, తమ్ముడైయ నిర్హేతుక కృపైయాలే, మణల్పాక్కత్తిలే ఇరుప్పారొరునమ్బియారై విశేషకటాక్షమ్పణ్ణియరుళి, తఙ్ఘమాయిరుప్పన శిలవర్థవిశేషఙ్గళైత్తామే యవర్కు స్వప్నముఖేన వరుళిచ్చెయ్తు, "నీర్ పోయ్ ఇరణ్డాత్తుక్కుమనడువే వత్తియుమ్, ఇన్నుమునక్కివ్వర్థఙ్గళెల్లామ్ విశదమాక నామఙ్గేశొల్లుకిఱోమ్" ఎన్ఱు తిరువుళ్ళమాయరుళుకైయాలే,

---

గనంబడిన హేతువులవలన నిరాశులై పోవలసిరాఁగా, ఆళ్వారుల నిర్హేతుక కటాక్షమువలనదివ్యజ్ఞానమును లభించినవారును, శ్రీనాథముని మొదలుగాఁగల సత్సంప్రదాయసిద్ధులును సకలశాస్త్రనిపుణులును, పరమ దయాళువులునగు పూర్వాచార్యులు ఆవేదశాస్త్రము మొదలగువాని యర్థములను సంగ్రహించి మందమతులకునుసులభముగా బోధపడునట్లు చిన్నచిన్నగ్రంథములను రచియించిరి.

అట్లే సంసారులగు జీవుల కష్టములఁజూచి సహింపజాలని పరమ కృపగలవారగుటచేవారల నుజ్జీవింపఁజేయుటకై అనేకగ్రంథములను రచియించిన శ్రీపిళ్ళై లోకాచార్యులవారు సంప్రదాయ సిద్ధములగు నర్థములలో వారువారు ఆయాయర్థములవిషయమగు గౌరవాతిశయము మూలముగ రహస్యముగ నుపదేశించినవియు, వాటి స్వరూపమును మహాత్మ్యమున్నట్టి తామం యింతకుపూర్వము ఇతరులకుఁదెలుపక రహస్యముగా నుంచుకొనిన యర్థములనన్ని వాటినన్నింటిని తమ యనంతరము తక్కినవారును నష్టపడకూడదని తమకు కృప గలుగుటయేగాక, అటుపైని పెరుమాళ్లును స్వప్నమున సెలవొయించి నియమించుటవలన శ్రీవచనభూషణమనుప్రబంధము ద్వారా వాటినన్నింటిని కృపతో బయలుపరచినారు.

## శ్రీవచనభూషణమును రచియించుటకు భగవన్నియమనము.

ఒకానొక సమయమున వరదరాజప్పెరుమాళ్లు మణల్పాకమను గ్రామమున నివసించునట్టి మణల్పాకనంబియను నొక భక్తునియెడల తమయొక్క నిర్హేతుకకృపవలన విశేషముగ కటాక్షించి ఆయన యుజ్జీవనమున కుపయుక్తములగు కొన్నిరహస్యార్థములను తామే స్వప్నమున ప్రసాదించి, "మీరు పోయి రెండునదులకు మధ్యను (తిరుకావేరికిని కొళ్ళడమునకును మధ్యనుండు శ్రీరంగమున) నివసింపుము. ఇంకను ఈయర్థములనన్నింటిని విశదముగాను మేము మీకక్కడనే తెలిపెదము." అనిచెప్పఁగా, అంతట ఆభక్తుఁడచటికేగి శ్రీరంగనాథుని సేవించుకొనుచు తన

వరిగ్గే వన్ద పెరియపెరుమాళై సేవిత్తుక్కొణ్డు, తమక్కు మున్బు అరుళిచ్చెయ్తవగ్రన్థఙ్గళైయుమ్, అళలఱియాతపడి యనుసన్ధిత్తుక్కొణ్డు ఏకాన్తమాన తొరుకోయిలిలే వర్త్తియానిఱ్కచ్చెయ్తే, తమ్ముడైయ శ్రీపాదత్తుక్కన్తరఙ్గరాన ముతలికళుమ్ తానుమాక పిళ్ళై, ఒరునాళ్ అక్కోయిలిలే యాదృచ్ఛికమాక వెழுన్దరుళి, అవ్విడమేకాన్తమాయిరుక్కైయాలే, రహస్యార్థఙ్గళై యవర్కళుక్కరుళిచ్చెయ్తుకొణ్డెழுన్దరుళి యిరానిఱ్క, అవైతమక్కు స్వరుళాళ పెరుమాళరుళిచ్చెయ్త వర్థవిశేషఙ్గళాయిరుక్కైయాలే, అవర్ పోరవిదరాయ్, ఉళ్ళిల్ నిన్ఱుమ్ పుఱప్పట్టువన్దు, పిళ్ళై శ్రీపాదత్తిలేవిழுన్దు, “అవరో? నీర్” ఎన్న “అవనేతు?” ఎన్ఱుపిళ్ళై కేట్టరుళ, పెరియపెరుమాళ్ తమక్కివ్వర్థఙ్గళై ప్రసాదిత్తరుళినపడియైయుమ్, ఇద్దేశత్తిలే పోకవిట్టరుళినపడియైయుమ్, “ఇన్నమ్ మక్కళ్ నెఞ్చిల్ విశదమాక చొల్లుకిరోమ్” ఎన్ఱరుళిచ్చెయ్తపడియైయుమ్ విణ్ణప్పమ్ శెయ్య, కేట్టు మికవుమ్ హృష్టరాయ్ అవరై మికవుమభిమానిత్తరుళ, అవరుమప్పిళ్ళైక్కు అన్తరఙ్గరాయ్ వర్త్తిక్కిఱ నాళిలే, పెరుమాళ్ అవర్కు స్వప్నత్తిలే, “ఇవ్వర్థఙ్గళ్ మఱన్దుపోకాతపడి ఇవఱ్ఱై యొరు ప్రబన్ధమాకచ్చొల్లుమ్ ఎన్ఱు నీర్ పిళ్ళైక్కుచ్చొల్లుమ్” ఎన్ఱు తిరువుళ్ళమాక, అవర్ “ఇప్పడి పెరుమాళ్ తిరువుళ్ళమాయరుళినార్” ఎన్ఱు విణ్ణప్పమ్ శెయ్య, “అనాళప్పడి శెయ్కిరోమ్” ఎన్ఱు తిరువుళ్ళమ్ పఱ్ఱి, అనన్తరమ్ ఇప్ప్రబన్ధమిట్టరుళినారెన్ఱు ప్రసిద్ధమిఱే.

రత్నప్రచురమాన భూషణత్తుక్కు రత్నభూషణమెన్ఱు పేరామాపోలే, పూర్వాచార్యర్కళుడైయ వచనప్రచురమాయ్, అనుసన్ధాతాక్కళుక్కు ఔజ్జ్వల్యకరమాయిరుక్కైయాలే, ఇతుక్కు “వచనభూషణమ్” ఎన్ఱు తిరునామమాయిత్తు.

## వ్యాఖ్యానావతారికై సంపూర్ణం.

---

కొంతకాలముంగ ప్రసాదించిన యర్థములను యితరులకు వినబడకుండ అనుసంధించుకొనుచు, ఏకాంతముగా నొక కోవిలలో నుండగా, ఒకదినమున శ్రీపిళ్ళైలోకాచార్యులవారు తమ అంతరంగులగు శిష్యులతోఁగూడ అకస్మికముగా నాకోవిలలోనికి వచ్చి అచ్చట యేకాంతముగానుండుటంజేసి కొన్ని రహస్యార్థములను తమతోవచ్చిన శిష్యులకు ఉపదేశించుచుండగా ఈభక్తుండును ఆయర్థములు తనకింతకుపూర్వము శ్రీపెరియపెరుమాళ్లు ప్రసాదించినవియే యగుటంజేసి మిక్కిలి యానందించి బయటికివచ్చి శ్రీపిళ్ళైలోకాచార్యులవారికి సాష్టాంగదండప్రణామంబులాచరించి “వారెవరు? మీరు?” అనియడుగగా, శ్రీపిళ్ళైలోకాచార్యులవారును “అది యేమి” అనియడిగిరి. అంతట యీభక్తుండును పెరియపెరుమాళ్లు తనకీయర్థములను ప్రసాదించిన సంగతిని, ఈతావునకు పొమ్మని నియమించిన సంగతిని, ఇచ్చట నివసించుమని యానతిచ్చిన సంగతినిన్ని విన్నవించగా, పిళ్ళైలోకాచార్యులవారు విని మిక్కిలి సంతోషించి యీభక్తుని యెక్కువ గౌరవించిరి. ఇట్లు కొంతకాలము జరుగుచుండగా నొకనాటిరాత్రి పెరుమాళ్లు ఈభక్తునికి స్వప్నమున సేవసాయించి “ఈయర్థములన్నియు మరుపు తగులకుండుటకై వీటిని యొక గ్రంథముగా రచియింపుమని పిళ్ళైలోకాచార్యులవారితోఁ జెప్పుము” అని యానతియ్యగా ఈభక్తుండును పెరుమాళ్లు ఆనతిచ్చినవిషయమును ఆచార్యులవారి కెఱింగించిరి. తరువాత వారును “అట్లే చేయుదును” అనిచెప్పి తరువాతనే యీగ్రంథమును రచియించిరనెడివిషయ మందఱును యెఱింగినదియే.

రత్నములతో నిండియుండు భూషణమునకు రత్నభూషణమని పేరగునట్లు పూర్వాచార్యుల శ్రీసూక్తులతో నిండియుండునదియును, అయర్థముల ననుసంధించువారల కొక తేజస్సును గలుగఁజేయునదియునదియైనందునను దీనికి “వచనభూషణము” అని పేరుగలిగెను.

వ్యాఖ్యానావతారిక ముగిసెను.

## మూలత్తిన్ ప్రకరణ విభాగప్రకారమ్

ఇప్ప్రబన్ధత్తిల్, ‘‘వేదార్థమఱుతియిడువతు’’ ఎన్నుమదక్కి, ‘‘అత్తాలే యతు ముఱ్పట్టతు’’ ఎన్నుమళవాక, వక్ష్యమాణార్థనిర్ణాయక ప్రమాణనిర్దేశమ్పణ్ణుకిఱతాకైయాలే ప్రబన్ధోపోద్ఘాతమ్.

‘‘ఇతిహాసశ్రేష్ఠమ్’’ ఎన్నుమదక్కి ‘‘ప్రపత్త్యుపదేశమ్పణ్ణిఱ్ఱుమివళుక్కాక’’ ఎన్నుమళవుమ్ పాపరానచేతనరుడైయ సర్వాపరాధఙ్గళైయుమ్ సర్వేశ్వరనై సహిప్పిత్తు రక్షిప్పిక్కైయే స్వరూపమాన పురుషకారవైభవముమ్, అన్దపురుషకారముమ్ మికైయామ్బడియాన ఉపాయవైభవముమ్ శొల్లుకిఱతు.

‘‘ప్రపత్తిక్కు’’ ఎన్నుమదక్కి ‘‘ఏకాన్తీవ్యపదేష్టవ్యః’’ ఎన్నుమళవుమ్, ఇవ్వుపాయవరణరూప ప్రపత్తియినుడైయ దేశకాలాదినియమాభావమ్, విషయనియమమ్, ఆశ్రయవిశేషమ్, ఇతై సాధనమాక్కిల్ వరుమవద్యమ్, ఇతిన్ స్వరూపాఙ్గఙ్గళ్ ముతలానవఱ్ఱైచ్చేరచ్చొల్లి, ప్రపత్తవ్యనే ఉపాయమెన్ను సాధిక్కైయాలే, పూర్వోక్తోపాయశేషమాకైయాల్ ఉపాయప్రకరణమ్. ఇతిల్ ‘‘ప్రాప్తిక్కుకప్పనుమవనే’’ ఎన్నుమళవుమ్ ప్రధానప్రమేయమ్, మేల్ ప్రాసఙ్గికమ్.

‘‘ఉపాయత్తుక్కు’’ ఎన్నుమదక్కి ‘‘ఉపేయవిరోధికళుమాయిరుక్కుమ్’’ ఎన్నుమళవుమ్, ఉపాయత్తైక్కొణ్డు ఉపేయత్తై పెఱువానొరు చేతననుకు, ఉపాయోపేయాధికారప్రధానాపేక్షితఙ్గళైయుమ్, ఉపాయాన్తరత్యాగహేతుక్కళైయుమ్, మఱ్ఱుమ్ త్యాజ్యోపాదేయఙ్గళాయుళ్ళవఱ్ఱైయుమ్ విస్తరేణ శొల్లుకైయాలే, అధికారినిష్ఠాక్రమమ్ శొల్లుకిఱతు.

---

## మూలగ్రంథపు ప్రకరణవిభాగము

ఈగ్రంథమున, ‘‘వేదార్థమఱుతియిడువతు’’ (వా. ౧) అనునది మొదలుకొని, ‘‘అత్తాలే యతుముఱ్పట్టతు’’ (వా. ౭) అనువరకును ఇందుప్రతిపాదింపఁబోవు విషయములను నిశ్చయించు ప్రమాణమును జూపించుటచే నీగ్రంథభాగము ఉపోద్ఘాతమును గుఱించినది.

‘‘ఇతిహాసశ్రేష్ఠమ్’’ (వా. ౫.) అనునది మొదలుకొని ‘‘ప్రపత్త్యుపదేశమ్ పణ్ణిఱ్ఱుమివళుక్కాక’’ (వా. ౨౨.) అనువరకును అపరాధపడిన వారలగు నిచేతనులయొక్క సర్వాపరాధములను ఈశ్వరునిచే సహింపఁజేసి వారలను రక్షించుటయే స్వరూపముగాఁగల పురుషకారముయొక్క (పురుషకారభూతురాలగు పిరాట్టియొక్క) వైభవమును, ఆపురుషకారమునున్ను మించి యుండు ఉపాయముయొక్క (ఉపాయభూతుఁడగు సర్వేశ్వరునియొక్క) వైభవమును చెప్పఁబడినవి.

‘‘ప్రపత్తిక్కు’’ (వా. ౨౩.) అని యారంభించి ‘‘ఏకాన్తీవ్యపదేష్టవ్యః’’ అనువరకును ఈయుపాయ వరణరూపమగు ప్రపత్తికి దేశకాల నియమములు లేకుండుటయు, విషయనియమమును, ఆశ్రయ విశేషమును, దీనిని సాధనముగాఁ గొనినచో వచ్చెడు దోషమున్ను, దీని స్వరూపాంగములు మొదలగువానిని చెప్పి ప్రాప్యనిస్తారే ప్రాపకమునని నిరూపించుటచే పూర్వము జెప్పఁబడిన యుపాయములో సంబంధించినది యగు యుపాయమునుగుఱించిన ప్రకరణము. ఇచట ‘‘ప్రాప్తిక్కుకప్పనుమవనే.’’ (వా. ౭౦.) అనువాక్యమువరకును ప్రస్తుతవిషయమునుగురించి చెప్పఁబడినది. తక్కినది యంతయు ప్రాసంగికము.

‘‘ఉపాయత్తుక్కు’’ (వా. ౭౧) అనునది మొదలుకొని ‘‘ఉపేయవిరోధి కళుమాయిరుక్కుం’’ (వా. ౩౦౭) అనువరకును, ఈయుపాయము నవలంబించి ఫలమును బొందఁగోరునట్టి యొక జీవునికి ఉపాయోపేయ విషయముల యెడల ముఖ్యముగాఁ గావలసిన వాటినిన్ని, ఉపాయాంతరములను త్యజించుటకుగానగు హేతువులను, మిగిలిన త్యాజ్యోపాదేయముల నన్నింటిని విస్తృతముగాఁ జెప్పుటచే నధికారి నిష్ఠాక్రమమును గుఱించి చెప్పఁబడియె.

“తాన్ హితోపదేశమ్ పణ్ణుమ్పోతు” ఎన్నతుడఙ్గి, “ఉకప్పుముపకారస్మృతియుమ్ నడక్క వేణుమ్” ఎన్నుమళవాక, హితోపదేశసమయత్తిల్ స్వాచార్యపారతన్త్ర్యాదికళాన సదాచార్యలక్షణమ్, సచ్ఛిష్యలక్షణమ్, తదుభయర్ పరిమాఱ్ఱమ్, తిరువమ్ కెడుత్త స్వాచార్యవిషయత్తిల్ శిష్యనుపకార స్మృతిక్రమమ్, ఇవఱ్ఱైచ్చొల్లుకైయాలే, సిద్ధోపాయనిష్ఠనాన వధికారియుడైయ స్వాచార్యానువర్తనక్రమమ్ శొల్లుకిఱతు.

“స్వగోషానుసన్ధానమ్ భయహేతు” ఎన్నతుడఙ్గి, “నివర్తకజ్ఞానమభయహేతు” ఎన్నుమళవాక, ఇవ్వధికారిక్కు అద్వేషమ్ తుడఙ్గి ప్రాప్తిఫలమానకైఙ్కర్య పర్యన్తమాక ఉణ్డాన పేఱుకళుక్కెల్లామ్ హేతువాయ్, స్వకర్మత్తయ నివర్తకమానభగవన్నిర్హేతుకకృపా ప్రభావమ్ శొల్లుకిఱతు.

“స్వతన్త్రనై ఉపాయమాక త్తాన్ పఱ్ఱినపోతిఱే” ఎన్నతుడఙ్గి మేలెల్లామ్ మిక్క వేదియర్ వేతత్తినుట్పొరుళాన చరమపర్వనిష్ఠైయై వెళియాక చ్చొల్లుకిఱతు.

“వేదార్థమఱుతియిడువతు” ఎన్నతుడఙ్గి ఇవ్వర్థత్తిలే తలైక్కట్టుకైయాలే, ఇప్ప్రబన్ధత్తిల్ చరమప్రకరణ ప్రతిపాద్యమానవర్థమ్ వేదాన్త తాత్పర్యమెన్నుమిడమ్ సమ్ప్రతిపన్నమ్. శ్రీగీతైక్కు చరమశ్లోకమ్పోలే యిఱే, ఇప్ప్రబన్ధత్తుక్కు చరమప్రకరణమ్; అఙ్గు, సాధ్యోపాయఙ్గళై ఉపదేశిత్తుక్కొణ్డు పోన్దు, స్వస్వాతన్త్ర్యభీతనానవనుక్కు, అవఱ్ఱైత్తవిర్న్దు సిద్ధోపాయమ్ కాట్టప్ప

---

“తాన్ హితోపదేశమ్ పణ్ణుమ్పోతు” (సూ. ౩౦౮.) అనునది మొదలుకొని” ఉకప్పుముపకారస్మృతియుం నడక్క వేణ్డుం” (వా. ౪౬౫) అనువఱకును హితోపదేశ సమయమున స్వాచార్యునికి పరతంత్రుడై యుండుట మొదలగు సదాచార్య లక్షణమును సచ్ఛిష్యలక్షణమును, నిరుభయుల నడవడికయును, ధనమును నశింపజేసిన యాచార్యుని విషయమున శిష్యుని కుండవలసిన యుపకారస్మృతియు, వీటిని చెప్పుటచే నిచట సిద్ధోపాయనిష్ఠుడగు నధికారికి తన యాచార్యుని విషయమున వర్తించుకొను విధమును గురించి చెప్పబడియె,”

“స్వదోషాను సంధానం భయహేతు, (వా. ౩౬౬.) అనునది మొదలుకొని “నివర్తకజ్ఞానమభయహేతు” (సూ. ౪౦౬.) అనువఱకును ఈ యధికారికి అద్వేషము మొదలు కైంకర్యప్రాప్తి వఱకును లభించునట్టి ఫలముల కన్నింటికిని హేతుభూతమును, తనయొక్క కర్మముల వలన కలుగు భయమును పోగొట్టునట్టి భగవన్నిర్హేతుక కృపాప్రభావమును గురించి చెప్పబడియె.

“స్వతన్త్రనై ఉపాయమాక తాన్ పత్తినపోతిఱే. (సూ. ౪౦౭.) అనునది మొదలుకొని పైని మిగుల వైదికులగువారి వేదములోని సారార్థమగు చరమపర్వనిష్ఠను గురించి చెప్పబడినది.

“వేదార్థమఱుతియిడువతు” (సూ. ౧.) అను ప్రారంభ వాక్యము మొదలుకొని యీ పైని గనబడుచున్న విషయమునే యుపదేశించి ముగించుటచే ఈ గ్రంథమునందలి చరమప్రకరణమునం బ్రతిపాదింపబడినయర్థమే వేదాంత శాస్త్రముయొక్క తాత్పర్యముగా నంగీకరింపబడుచున్నది. శ్రీ భగవద్గీతలకు చరమశ్లోక మెట్టిదియో, అట్టిదియే యీ ప్రబంధమునకు చరమ ప్రకరణము. అది యెట్లనిన, అచట సాధ్యోపాయములను (కర్మజ్ఞాన భక్తులను) ఉపదేశించుకొని పోయి, యాసందర్భమున స్వస్వాతంత్ర్యము ప్రాప్తించునేమోయని భయపడిన వానికి వాటిని

"తాన్ హితోపదేశమ్ పణ్ణుమ్బోతు" ఎన్నుతుడఙ్గి "చేతననుడైయ రుచియాలే వరుకైయాలే" ఎన్నుమళవుమ్ సదాచార్యలక్షణప్రకరణమ్.

"శిష్యనెన్బతు" ఎన్నుతుడఙ్గి "ఉపకారస్మృతియుమ్ నడక్క వేణుమ్" ఎన్నుమళవుమ్ సచ్ఛిష్యలక్షణ ప్రకరణమ్.

"స్వదోషానుసన్ధానమ్" ఎన్నుతుడఙ్గి "నివర్తకజ్ఞానమభయహేతు" ఎన్నుమళవుమ్ భగవన్నిర్హేతుక విషయీకారప్రకరణమ్. "స్వతన్త్రనై" ఎన్నుతుడఙ్గి, మేలడఙ్గ చరమప్రాప్య ప్రాపకప్రకరణమ్.

ఇవ్విరణ్డు క్రమత్తైయుమ్ పత్తి ఇవర్ "పేఱుతరువిక్కుమవళ్ తన్ పెరుమై" "తిరుమామకళ్ తన్" ఎన్గిఱ తనియన్గళిరణ్డుమవతరిత్తతు; ఆకైయాలిరణ్డు ప్రకారము మనుసన్ధిక్కక్కడవైయిఱే.

ఇప్ప్రబన్ధన్దాన్, దీర్ఘశరణాగతియాన తిరువాయ్మొழிపోలే ద్వయవివరణమాయిరుక్కున్. ఎఙ్ఙనేయెన్నిల్, తిరువాయ్మొழிయిల్ ముతల్ మూన్ఱుపత్తాలే ఉత్తరఖణ్డార్థత్తైయుమ్, మేల్ మూన్ఱుపత్తాలే పూర్వఖణ్డార్థత్తైయుమ్ శొల్లి, మేల్ నాలుపత్తాలుమ్ ఉపాయోపయోగియాన గుణఙ్గళైయుమ్, ఆత్మాత్మీయఙ్గళిల్ తమక్కన్వయమఱ్ఱపడియైయుమ్, అవనోడు తమక్కుణ్డాన నిరుపాధిక సమ్బన్ధత్తైయుమ్, తాన్ప్రార్థిత్తపడియే పెఱ్ఱపడియైయుమ్ ప్రతి

---

"తాన్ హితోపదేశమ్ పణ్ణుమ్బోతు." (వా. ౨౦౫.) అనునది మొదలుకొని, "చేతనరుడైయ రుచియాలే వరుకైయాలే" (వా. ౩౨౦.) అనువరకును సదాచార్యలక్షణమును తెలుపు ప్రకరణము.

"శిష్యనెన్బతు. (వా. ౪౨౧.) అనునది మొదలుకొని "ఉపకారస్మృతియుమ్ నడక్కవేణుం" (వా. ౩౪౫.) అనువరకును యోగ్యుఁడగు శిష్యునిలక్షణములఁ దెలుపు ప్రకరణము. "స్వదోషానుసంధానం" (వా. ౩౬౬) అనునది మొదలుకొని "నివర్తకజ్ఞానమభయహేతు" (వా. ౪౦౬) అనువరకును భగవన్నిర్హేతుక విషయీకారమును గురించిన ప్రకరణము. "స్వతన్త్రనై" (వా. ౪౦౭) అనునది మొదలుకొని తుదివరకును ఈపైని గనఁబడిన చరమప్రాప్య ప్రాపకములను గురించిన ప్రకరణము.

## రెండుఅనుసంధానతనయులు ప్రవర్తించుటకు హేతువు.

ఈపైని గనఁబడిన రెండువిధములను ప్రకరణములను బట్టియే కదా "పేఱుతరువిక్కుమవళ్ తన్ పెరుమై" అనియు, "తిరుమామకళ్ తన్" అనియు నిట్లు రెండుతనయులు ప్రవర్తించినవి. కావున ఈపైని గనఁబడిన ప్రకారము రెండువిధములుగాను ననుసంధించుకొనినను బాధకము లేదు.

## తిరువాయిమొழிవలెనే ద్వయార్థమును వివరించుననీ యనుట.

ఈగ్రంథము దీర్ఘశరణాగతియగు తిరువాయ్మొழிవలెనే ద్వయమును వివరించుననియు చెప్పినది, తిరువాయ్మొழிయందలి మొదటి మూఁడుపత్తులచేతను ద్వయముయొక్క ఉత్తరఖండార్థమును, తరువాతి మూఁడుపత్తులచేతను పూర్వఖండార్థమునున్ను తెలిపి, పైనాలుగుపత్తులచేతను ఉపాయమగుటకు ఉపయుక్తములగు గుణములను, తన విషయమైగాని, తనతోసంబంధించినవాని విషయమునఁగాని తనకెట్టి సంబంధము లేకుండుటను, సర్వేశ్వరునితోఁ దనకుఁగల నిరుపాధిక సంబంధమునున్ను, తాను ప్రార్థించినవిధముననే లభించినవిధమును ప్రతిపాదించుటచే నంమలకను

సాధిక్కైయాలే, తదనురూపాఙ్గఙ్గళై చ్చొల్లి త్తలైక్కట్టినాప్పోలే, ఇతిలుమ్, ప్రథమత్తిలే పురుషకారత్తైయుమ్, అనన్తరమ్ ఉపాయత్తైయుమ్, అనన్తరమ్ ఏతదుపాయాధికారి నిష్ఠైయైయుమ్ శొల్లుకైయాలే పూర్వఖణ్డార్థత్తైయుమ్ అవ్వధికారి నిష్ఠైయై శొల్లుకిఱవళవిల్ ఉపేయాధికారాపేక్షితఙ్గళై చ్చొల్లుకిఱ ఇతుక్కు ళ్ళే ఉత్తరఖణ్డార్థత్తైయుమ్ శొల్లి మేల్ ప్రబన్ధశేషత్తాలుమ్, తదుపదేష్టావాన ఆచార్యనళవిల్, ఇవనుక్కుణ్డాక వేణ్డుమ్ ప్రతిపత్త్యనువర్తన ప్రకారఙ్గళైయుమ్, ఇవనుక్కు మహావిశ్వాసహేతువాన భగవన్నిర్హేతుక కృపాప్రభావత్తైయుమ్, వాక్యద్వయోక్తోపాయోపేయ చరమావధియైయుమ్ శొల్లి త్తలైక్కట్టుకైయాలే.

ఒన్ఱత్థ ప్రతిపాదకమాన పక్షత్తిలుమ్, పూర్వవాక్యత్తిల్ క్రియాపదోక్తమాన స్వీకారమ్ ఉపాయాన్తర త్యాగపూర్వకమాయల్లది రామైయాలుమ్, దినచర్యైయుమ్ అప్పదత్తిలే ప్పడుకిఱ అధికారిక్కే యుళ్ళతాకైయాలుమ్, సదాచార్యలక్షణమ్ ద్వయోపదేష్టావాన ఆచార్యన్పడి శొల్లుకిఱతాకైయాలుమ్, ద్వయవివరణమాక నిర్వహిక్కక్కుఱైయిల్లై.

ఇప్పడి ద్వయవివరణమానవితిలే, ద్వయత్తిల్పోలే మఱ్ఱై రహస్యద్వయార్థఙ్గళుమ్ సఙ్గ్రహేణోక్తఙ్గళాయిరుక్కుమ్; ఎఙ్గనేయెన్నిల్;

వ్యా.—(అహమర్థత్తుక్కు) [వా. ౨౩] ఎన్ఱుతుడఙ్గి (అడియానెన్ఱిరే) [వా. ౨౭] ఎన్ను

---

రూపములగు నర్థములను ప్రసాదించి ముగించినట్లు, ఈ గ్రంథమునను, ప్రథమమున పురుషకారమును, తరువాత ఉపాయమును, తరువాత ఈ రెంటిని యాశ్రయించునట్టి యధికారికిఁ గావలసిన నిష్ఠనున్ను తెలుపుటచే పూర్వఖండము యొక్క యర్థమును, అట్టి యధికారికిఁ గావలసిన నిష్ఠను చెప్పి ముగింపువరకు ఫలప్రాప్తియందధికారముండుటచేఁ గావలసినవాటిఁ జెప్పునట్టి యీసందర్భమున ఉత్తరఖండము యొక్క యర్థమును తెలిపి తక్కిన గ్రంథమున నట్టి యర్థముల నుపదేశించునట్టి యాచార్యునివిషయమున నితనికుండవలసిన విశ్వాసముయొక్కయు అనువర్తనముయొక్కయును విధములను, ఈతనికి ఎక్కువవిశ్వాసము గలుగుటకు హేతుభూతమగు భగవన్నిర్హేతుక కృపయొక్క ప్రభావమునున్ను, వాక్యద్వయమునందును జెప్పఁబడిన ఉపాయోపేయములయొక్క చరమావధిని చెప్పి ముగించియున్నారు.

తొమ్మిదియర్థములను ప్రతిపాదించుపక్షమునను, ద్వయ వివరణమగుట

ఈ గ్రంథము తొమ్మిదియర్థములను ప్రతిపాదించునదిగాను గొనఁబడిన పక్షమునను, ద్వయముయొక్క పూర్వవాక్యమునందలి క్రియాపదముచేఁ దెలుపఁబడిన స్వీకారమనునది, ఉపాయాంతరములను విడలుకొనిననే తప్ప కలుగదు గనుకను, దినచర్యయును అపదముచేఁ దెలుపఁబడినట్టి యధికారికే యుండునదైనందునను, సదాచార్యలక్షణముఁ జెప్పినపుడు దానిని ద్వయము నుపదేశించునట్టి యాచార్యునితోఁ బోల్చి చెప్పుటవలనను, ఇది ద్వయార్థమును వివరించునదియని నిరూపింపవచ్చును.

తక్కిన రెండుమంత్రములను వివరించునది యనుట.

ఇట్లు ద్వయార్థమును వివరించునట్టి యీ గ్రంథమున ద్వయమునందువలెనే తక్కిన రెండు రహస్యములును సంగ్రహముగాఁ జెప్పఁబడినవి. అదియెట్లనిన,

“అహమర్థత్తుక్కు” (వా. 23) అనునది మొదలుకొని “అడియానెన్ఱిరే” (వా. 28) అను

తళవాకవుమ్ (స్వరూపప్రయుక్తమాన దాస్యమిఱే ప్రధానమ్) [వా. ౧౧౧] ఎన్నుమ్ ప్రణవార్థమ్ శొల్లప్పట్టతు.

(స్వయత్న నివృత్తి) (వా. ౨౧) ఇత్యాదియాలుమ్ (తన్నైత్తానే ముడిక్కైయావతు) (వా. ౧౮౦) ఎన్ను తుడజ్గి (ఇప్పడి సర్వప్రకారత్తాలుమ్) (వా. ౨౪౩) ఎన్గిఱత్తుక్కు క్కీళిలుళ్ళత్తాలుమ్ నమశ్శబ్దార్థమ్ శొల్లప్పట్టతు.

(పరప్రయోజనప్రవృత్తి) (వా. ౨౭) ఇత్యాదియాలుమ్, (ఉపేయత్తుక్కిళైయపెరుమాళై యుమ్) (వా. ౮౦) ఇత్యాదియాలుమ్, (కైజ్కర్యత్తాన్ భక్తిమూలమల్లాతపోతు) (వా ౫౮౧) ఇత్యాదియాలుమ్, తృతీయపదార్థమ్ శొల్లప్పట్టతు.

(అజ్ఞానత్తాలే) (వా. ౪౩) ఇత్యాదియాలుమ్, (ప్రాపకాన్తర పరిత్యాగత్తుక్కుమ్) (వా. ౧౧౫) ఇత్యాది యాలుమ్, ఉపాయాన్తరత్యాగత్తై సహేతుకమాక చ్చొల్లుకైయాలే, తత్త్యాజ్యతైయాన త్యాగప్రకారముమ్ శొల్లుకిఱ పదద్వయార్థముమ్ శొల్లప్పట్టతు.

(ఇనుతనక్కు స్వరూపమ్) (వా. ౫౫) ఇత్యాదియాలుమ్, (ప్రాప్తిక్కుపాయమవన్ నినైవు) (వా. ౬౬) ఇత్యాదియాలుమ్, "మామేకమ్, శరణమ్" ఎన్గిఱ పదజ్గళిలర్థమ్ శొల్లప్పట్టతు.

(ప్రపత్త్యుపాయత్తుక్కు) (వా. ౧౩౪) ఇత్యాదియాలే, "వ్రజ" ఎన్గిఱ స్వీకారలక్షణమ్ శొల్లప్పట్టతు.

(అవనివనై) (వా. ౧౪౩) ఎన్నుతుడఙ్గి (స్వాతన్త్ర్యత్తాలేవరుమ్ పారతన్త్ర్యమ్ ప్రబలమ్)

---

వరకును, "స్వరూపప్రయుక్తమానదాస్యమిఱే ప్రధానమ్" (వా. ౧౧౧) అనువఱకు నీతావుల ప్రణవముయొక్కయర్థము తెలుపఁబడినది.

"స్వయత్న నివృత్తి" (వా. ౨౧) ఇత్యాది గ్రంథముచేతను "తన్నైత్తానేముడిక్కైయావతు" (సూ.౧౮౦)అనువాక్యము మొదలుకొని "ఇప్పడి సర్వప్రకారత్తాలుమ్" (వా.౨౪౩)అను వాక్యమునకు పూర్వపు గ్రంథభాగమునను "నమః" అనుశబ్దముయొక్క యర్థము తెలుపఁబడినది.

"పరప్రయోజన ప్రవృత్తి" (వా.౨౭) ఇత్యాదివాక్యములచేతను "ఉపేయత్తుక్కిళైయ పెరుమాళైయుమ్" (వా.౮౦) ఇత్యాదివాక్యములచేతను "కైంకర్యంధాన్ భక్తిమూలమల్లాతపోతు" (వా.౫౮౧) ఇత్యాదివాక్యములచేతను మూఁడవపదముయొక్క (నారాయణాయ) అనుపదము యొక్క) యర్థము తెలుపఁబడినది.

"అజ్ఞానత్తాలే" (వా.౪౩) ఇత్యాదివాక్యములచేతను "ప్రాపకాన్తర పరిత్యాగత్తుక్కుమ్" (వా.౧౧౪)ఇత్యాదివాక్యములచేతనున్ను ఉపాయాంతరత్యాగమును సహేతుకముగాఁ దెలుపుటం జేసి, వాటిఁద్యజించుటనున్ను త్యజించుపద్ధతినిన్ని తెలుపునట్టి రెండవపదములయొక్క (చరమశ్లోకమునందలి సర్వధర్మాన్—పరిత్యజ్య అను రెండుపదములయొక్క) యర్థము చెప్పఁబడినది.

"ఇనుతనక్కు స్వరూపం" (వా.౫౫) ఇత్యాదివాక్యములచేతను, "ప్రాప్తిక్కుపాయమవన్నినవు" (వా.౬౬) ఇత్యాదివాక్యములచేతను "మామేకం-శరణం" అనుపదములయొక్క యర్థము తెలుపఁబడినది.

"ప్రపత్త్యుపాయత్తుక్కు" (వా. ౧౩౪) ఇత్యాది వాక్యములచేత "వ్రజ" అను పదముచే దెలుపఁబడిన స్వీకారముయొక్క వైలక్షణ్యము తెలుపఁబడినది.

"అవనివనై" (వా.౧౪౩)అనువాక్యము మొదలుకొని "స్వాతన్త్ర్యత్తాలేవరుమ్ పారతన్త్ర్యమ్

### మూ॥ ౧॥ వేదార్థమ్

(వా. ౧౪౪) ఎన్నుమళవుమ్, సర్వపాపఙ్గళైయుమ్ తళ్ళియఙ్గీకరిక్కు మీశ్వరస్వాతన్త్ర్యత్తైయుమ్, (కృపాఫలముమనుభవిత్తే యఱివేనుమ్) (వా. ౪౦౨) ఎన్రు,ఫలసిద్ధియిల్ కణ్ణళివిల్లామైయైయుమ్ శొల్లుకైయాలే, ఉత్తరార్ధత్తిలర్థమ్ శొల్లప్పట్టతు.

ప్రకరణవిభాగప్రకారమ్ సంపూర్ణం.

---

## ప్రమాణవిచారమ్.

(వేదార్థమిత్యాది) ప్రమాణానాన్తరమ్, ప్రమాణత్తైక్కొణ్డిఱే ప్రమేయత్తై నిశ్చయిప్పతు. అన్దప్రమాణఙ్గళ్, ప్రత్యక్షాదిరూపేణ అష్టవిధమాక చ్చొల్లువర్ కళ్. అతిల్ * "ప్రత్యక్షమేకంచార్వాకాః" ౧ ఇత్యాదియిల్ శొల్లుకిఱ బాహ్యర్ దృష్టికళైప్పోలన్నియే, ప్రత్యక్షానుమానాగమఙ్గళ్ మూన్రైయుమ్ ప్రమాణతయా అఙ్గీకరిత్తు, ఉపమానాది పఞ్చకత్తై

### మూ॥ ౧॥ వేదార్థమును

ప్రబలం" (వా.౧౪౨) అనువాక్యమునరకము సర్వపాపములను తొలగించి యాచేతను నంగీకరించునట్టి యీశ్వరుని స్వాతంత్ర్యమును, "కృపాఫలము మనుభవిత్తే యఱివేనుమ్" (వా.౪౦౨)అను వాక్యమున ఫలము సిద్ధింపవిషయమై శోకింపకుమని చెప్పినందున చరమశ్లోకముయొక్క యుత్తరార్థముయొక్క యర్థమును చెప్పఁబడినది.

ప్రకరణవిభాగప్రకారము ముగిసెను.

---

## ప్రమాణవిచారము.

అవతారిక:—ప్రమాత (ఒకవస్తువును తెలిసికొనువాఁడు) ప్రమాణముఁగొనియే కదా (దానిఁ దెలుపుటకాధారమగు సాధనముఁ గొనియేకదా) ప్రమేయమును (తెలియఁదగు వస్తువును) నిశ్చయించును. అట్టి ప్రమాణము ఎనిమిది విధములని చెప్పుదురు. అందు మనవారు *"ప్రత్యక్షమేకంచార్వాకాః" (లోకాయతికులు ప్రత్యక్షమును మాత్రమే ప్రమాణముగాఁ గొనుదురు) అని చెప్పియున్నట్లు

* చార్వాకులకు ప్రత్యక్షమొక్కటియే ప్రమాణము. ప్రత్యక్షమనఁగా చక్షురాదీంద్రియములద్వారా గలుగు జ్ఞానము. వైశేషికులకును బౌద్ధులకును ప్రత్యక్షానుమానములు ప్రమాణములు. ప్రత్యక్షాదిమూలముగాఁ దెలియవచ్చునట్టి ధూమాదులమూలముగ అగ్న్యాదులనూహించుట యనుమానము. సాంఖ్యులకు ప్రత్యక్షానుమానాగమములు ప్రమాణములు. ఆగమమనఁగా శాస్త్రమును ఆప్తవాక్యమును. నైయాయికులలో భూషణమతావలంబులకు ఈపైమూఁడే ప్రమాణములు. ఉదయనుని పక్షమున ప్రత్యక్షానుమానోపమాన శబ్దములు ప్రమాణములు. ఒకవస్తువునిజూచి యందుమూలముగ తత్సదృశమగు వస్తువుఁ దెలిసికొనుట యుపమానము. ప్రాభాకరునికి ఈనాలుగును అర్థాపత్తియును ప్రమాణములు. "దేవదత్తుఁడు పగలుభుజింపఁడు అయితే క్రొవ్వియున్నాఁడు" అంటే మేని భుజింపకపోతే క్రొవ్వియుండుట యసంభవముగాన, పగలుభుజింపకపోయినను రాత్రిభుజించునని యూహించుట యర్థాపత్తి యనఁబడును. భాట్టునికిని మాయావాదులకును ఈపైయైదును అనుపలబ్ధి

యుమ్ అవఱ్ఱిలే యథాయోగమ్ అన్తర్భవిప్పిత్తు, అవఱ్ఱిల్ ప్రత్యక్షమ్ ఇన్ద్రియగ్రాహ్యా
ర్థఙ్గళిలుమ్, అనుమానమ్ ప్రత్యక్షసిద్ధవ్యాప్తి గ్రహణానురూపమాక కతిపయపరోక్షార్థఙ్గళిలుమ్
ప్రమాణమాకవుమ్, అతీన్ద్రియార్థత్తిల్ శాస్త్రమే ప్రమాణమాకవుమ్ నిష్కర్షిత్తు, అతుతన్నిలుమ్
(౧) "వేదేకర్త్రాద్యభావాద్బలవతిహి నయై స్త్వన్మ్యఖే నీయమానే తన్మూలత్వేన మానం తదితర
దఖిలం జాయతే" ఎన్గిఱపడియే స్వప్రామాణ్యత్తుక్కు మూల సాపేక్షమాన పౌరుషేయశాస్త్రి
త్తైప్పఱ్ఱి, స్వతఃప్రామాణ్యముడైయ వేదమే ప్రబలమాణమాకవు మఱుతియిట్టిరుక్కుమ్ పరమ
వైదికరాకైయాలే, ఇప్ప్రబన్ధత్తిల్ తామరుళిచ్చెయ్కిఱ వర్థఙ్గళెల్లామ్ వేదప్రతిపాద్యమెన్ను మిద
మ్ తోఱ్ఱ, ముతలిలే వేదత్తై ప్రమాణమాక అఙ్గీకరిత్తుక్కొణ్డు, తదర్థనిర్ణయమ్ పణ్ణుమ్ క్రమత్తై
ఇవ్వాక్యత్తాలే యరుళిచ్చెయ్కిఱార్.

అఖిలహేయప్రత్యనీకత్వ కల్యాణై కతానత్వఙ్గళాలే ఈశ్వరన్ అఖిలప్రమేయ విలక్షణ

---

వేదబాహ్యులగు కుదృష్టులవలెఁగాక, ప్రత్యక్షము, అనుమానము, ఆగమము ఈమూటినిన్ని ప్రమాణ
ములనుగా నంగీకరించి తక్కిన ఉపమానాదుల నయిదింటిని సందర్భానుగుణముగ నామూడింటి
లో నంతర్భవింపఁజేసి, వాటిలో ప్రత్యక్షమును ఇంద్రియములద్వారా తెలియవచ్చునట్టి పదార్థముల
విషయమునను, అనుమానమును ప్రత్యక్షముగాఁ దెలియవచ్చువాటిఁ బోలియుండు కొన్ని యప్రత్య
క్షములగు పదార్థముల విషయమునను, ప్రమాణముగానును, ఇంద్రియములద్వారా తెలియరానివాటి
విషయమున శాస్త్రమునే ప్రమాణముగానును నిశ్చయించి, దానిలోను, "వేదే కర్త్రాద్యభావాద్బ
లవతిహి నయై స్త్వన్మ్యఖే నీయమానే తన్మూలత్వేనమానం తదితరదఖిలం జాయతే" (శ్రీరంగ. స్త.
౨. ౧౮) "కర్తయును వానిమూలమూలముగా సంప్రాప్తించునట్టి ప్రమాదాదిదోషములును లేనిదై
నందున స్మృతులు మొదలగు వానికంటెను ప్రబలమైనదగు వేదము సామాన్యముగాను విశేషము
గానును నిన్ను ప్రతిపాదించునదిగాను గొనఁబడుటచే తదితరములగు స్మృత్యాది గ్రంథజాలమంత
యును అట్టి వేదమునే యాధారముగాఁ గొని ప్రవర్తించినదియగుటచే ప్రమాణముగాఁగొనఁబడు
చున్నది" అని చెప్పియున్నట్లు, తాను ప్రమాణమగుటలో స్మృత్యాది పౌరుషేయ శాస్త్రముకం
టెను స్వతఃప్రమాణమగు (తనకుతానే ప్రమాణమగు) వేదమునే ప్రబలప్రమాణముగాఁ దెలియఁ
జేయునట్టి పరమవైదికులగుటచే శ్రీపిళ్లై లోకాచార్యులవారు తాము రచియించిన యీగ్రంథమునఁ
బ్రతిపాదింపఁబడినట్టి యర్థములన్నియును వేదప్రతిపాదితములనెడి విషయమును సూచింపుచు ప్ర
థమమున, వేదమును ప్రమాణముగా నంగీకరించి, అట్టి వేదార్థములను నిర్ణయించునట్టి పద్ధతినియీ
వాక్యమునఁ బ్రతిపాదించుచున్నారు.

## వేదశాస్త్రము అపౌరుషేయమని ప్రతిపాదించుట.

సర్వేశ్వరుఁడు అఖిలహేయప్రత్యనీకుఁడును, కల్యాణగుణైకాశ్రయుఁడును నగుటచే తక్కిన

---

యును చేరి ఆఱు ప్రమాణములు. అనుపలబ్ధియనఁగా దెలియరాకుండుట. ఉ.—ఘటము కంటికి తెలి
యరాకుండుటయే యదిలేకపోవుటకుఁ బ్రమాణము. పౌరాణికులకు ఈపైయాఱును సంభవమును ఐతి
హ్యమును చేరి యెనిమిది ప్రమాణములు. వేయియున్నవానివద్ద నూఱు తప్పక యుండుట సంభవము.
చెప్పినవారు తెలియక, పెద్దలు చెప్పఁగానిన జనప్రవాదము ఐతిహ్య మనఁబడును. ఈవిషయమునే
"ప్రత్యక్షమేకం చార్వాకాః కణాదసుగతౌ పునః । అనుమానంచ తచ్చాపి సాంఖ్యాశ్శబ్దంచ
తేఅపి। న్యాయైకదేశినోప్యేవ ముపమానంచకేచన। అర్థాపత్త్యాసహైతాని చత్వార్యాహ ప్రభాకరః॥
అభావషష్ఠాన్యేతాని భాట్టా వేదాన్తినస్తథా । సంభవైతిహ్యయుక్తాని తానిపౌరాణికావిదుః॥

ఇత్తై వేదమెన్గిఱతు, "వేదయతీతి వేదః" ఎన్గిఱ వ్యుత్పత్తియాలే. బుభుత్సుక్కళాయ్ ఆస్తికరాయిరుప్పార్కుక్కు స్వార్థప్రకాశకమాయిరుక్కైయాలే. ఇప్పడియిరున్దుళ్ళ వేదన్దాన్, ప్రతిపాద్యార్థవిశేషత్తాలే భాగద్వయాత్మకమాయిరుక్కుమ్. అత్తై ఇవ్విడత్తిల్ ఉభయభాగసామాన్యవాచియాన వేదశబ్దత్తాలే సాకల్యేన శొల్లుకిఱతు.

(అర్థమ్) ఎన్ఱు పూర్వభాగ ప్రతిపాద్యమాన కర్మత్తైయుమ్, ఉత్తరభాగ ప్రతిపాద్యమాన బ్రహ్మత్తైయుమ్ శొల్లుకిఱతు.

పూర్వోత్తర మీమాంసైకళిల్ "అథాతో ధర్మజిజ్ఞాసా" ఎన్ఱుమ్ "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఎన్ఱుమిఱే ఉపక్రమిత్తతు. అకైయాలే భాగద్వయత్తుక్కుమ్ ప్రతిపాద్యమ్, ఆరాధనరూపమాన కర్మముమ్, ఆరాధ్యవస్తువాన బ్రహ్మముమిఱే. కర్మత్తినుడైయ భగవదారాధనత్వమ్, "స ఆత్మా అఙ్గాన్యన్యా దేవతాః" ఎన్ఱు అగ్నీన్ద్రాది సకలదేవతైకళుమ్ భగవచ్ఛరీరభూతరాక శాస్త్రమ్ శొల్లుకైయాలే సిద్ధమిఱే. ఇవ్వాకారత్తైయఱిన్దు అగ్నీన్ద్రాది దేవతాన్తర్యామి సమారాధనమాక అనుష్ఠిక్కుమవర్కళిడత్తిల్, ఇతినుడైయ భగవదారాధనత్వమ్ సుస్పష్టమాయిరుక్కుమ్. ఇవ్వాకారమఱియాతార్ అన్యదేవతామాత్రఙ్గళై యుద్దేశిత్తుప్పణ్ణుమ్ కర్మముమ్, వస్తుగత్యా భగవదారాధనమాయ్ త్తలైక్కట్టుమ్. "యే యజన్తి పితౄన్దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్, సర్వభూతా

---

## వేదశబ్దముయొక్క యర్థము.

"వేద" శబ్దమునకు "వేదయతీతి వేదః" అను వ్యుత్పత్తి. "విదజ్ఞానే" అని ధాతువు. తెలియఁజేయునది యని యర్థము. అనఁగా, తెలిసికొనవలయునని కోరికగల యాస్తికులకు తనయర్థమును ప్రకాశింపఁజేయునది యనుట. ఇట్టి వేదము తాను ప్రతిపాదింపఁబడునట్టి విషయములవలన రెండు భాగములుగలదిగా నుండెను. ఆయినందున మొత్తముమీఁద రెండుభాగములను తెలుపునది యగు "వేద" అనుశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నది.

## వేదార్థవిచారము భగవదారాధన మనుట.

(అర్థము) అర్థమనఁగా పూర్వభాగమునఁ బ్రతిపాదింపఁబడు కర్మమును ఉత్తరభాగమునఁ బ్రతిపాదింపఁబడు బ్రహ్మమునను. కావుననే పూర్వమీమాంసను (పూర్వభాగముయొక్క యర్థవిచారమును) "అథాతో ధర్మజిజ్ఞాసా" (పూ. సూ. ౧. అ. ౧. పా. ౧. సూ) (తరువాతకర్మమును గూర్చిన విచారము) అనియు, ఉత్తరమీమాంసను (ఉత్తరభాగముయొక్క యర్థవిచారమును) "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (బ్ర. సూ. ౧. అ. ౧. పా. ౧. సూ) (తరువాత బ్రహ్మమును గూర్చిన విచారము) అనియును గదా ఆరంభించియున్నారు. కావున ఈరెండు భాగములయందును తెలుపఁబడునది యారాధనరూపమగు కర్మమును దానిచే నారాధింపఁబడువాఁడగు బ్రహ్మమును గదా! కర్మము భగవదారాధన రూపమైనట్లు "స ఆత్మా అఙ్గాన్యన్యా దేవతాః" (సర్వేశ్వరుఁడాత్మ, తక్కిన దేవతలవయవములు) అను శాస్త్రవాక్యమున అగ్నీంద్రాది సకలదేవతలును భగవంతుని శరీరమని చెప్పియుండుటచే సిద్ధముగుచున్నది. ఈవిషయమును తెలిసికొనినవారై, అగ్నీంద్రాదిదేవతల కంతరాత్మయగు వానిని సంతోషింపఁజేయుటకై కర్మముల ననుష్ఠించువారికే కర్మము భగవదారాధనమనెడి విషయము బాగుగా తెలిసియుండును. ఈ విషయము తెలియనివారు అగ్నీంద్రాదిదేవతలను మాత్రముద్దేశించి యనుష్ఠించునట్టి కర్మమును పర్యవసానమున భగవదారాధనమే యగును. ఏలననఁగా, "యే యజన్తి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్

న్తరాత్మానం విష్ణుమేవ యజన్తితే" ఎన్నక్కడవదికాణ్. "యేఽప్యన్యదేవతాభక్తా యజన్తేశ్రద్ధయాన్వితాః, తేఽపిమామేవకౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్" ఎన్ఱు తానేయరుళిచ్చెయ్దానిఱే ఆకైయాలే ఎల్లాప్పడియాలుమ్ కర్మత్తుక్కు భగవదారాధనత్వమ్ సిద్ధమిఱే.

ఇప్పడి ఆరాధన రూపమాన కర్మముమ్ ఆరాధ్యవస్తువాన బ్రహ్మముమాకిఱ అర్థద్వయత్తైయుమఱియవే, త్యాజ్యోపాదేయ రూపసకలార్థఙ్గళైయుమఱియలాయిరుక్కైయాలే, భాగద్వయ ప్రతిపాద్యమ్ కర్మబ్రహ్మఙ్గళెన్గిఱతు. ఎఙ్గనేయెన్నిల్; కర్మత్తాన బుభుక్షుక్కళుక్కు ఐశ్వర్య సాధనమాయ్, ముముక్షుక్కళిల్ భక్తినిష్ఠర్కు ఉపాసనాఙ్గమాయ్, ప్రపన్నర్క్కు కైఙ్కర్యరూపమాయిఱే ఇరుప్పతు. ఇప్పడి యిరున్దుళ్ళ కర్మత్తై వేదత్తై ఉళ్ళపడి యఱియవే, అనన్తస్థిరఫల బ్రహ్మప్రాప్తికామరాన సాధకర్క్కు, ఇతు ఉపాసనాఙ్గత్వేనోపాదేయమ్, ఐశ్వర్యార్థికళుక్కు ఉపాదేయమాన వాకారత్తాల్ త్యాజ్యమెన్ఱఱియలామ్. అనన్యసాధనర్క్కు ఇతుకొణ్డు సాధిక్కవేణ్డువతొన్ఱిల్లామైయాలే కైఙ్కర్యరూపేణోపాదేయమ్. ఉపాసకర్క్కు ఉపాదేయమాన వాకారత్తాలే త్యాజ్యమెన్ఱఱియలామ్. బ్రహ్మత్తై యఱియుమ్పోతు, తత్స్వరూప రూపగుణ విభూతికళెల్లా మఱియవేణ్డుకైయాలే, విభూతిభూత చేతనాచేతనఙ్గళిన్ స్వరూపమఱియలామ్.

---

సర్వభూతాన్తరాత్మానం విష్ణుమేవ యజన్తితే" (దక్షస్మృ) (ఎవరు పితృదేవతలను, ఇంద్రాదిదేవతలను, నిత్యాగ్నిహోత్రులను బ్రాహ్మణులనున్ను పూజించుచున్నారో, వారు సర్వభూతములలో నంతరాత్మగానుండునట్టి విష్ణువునే పూజించుచున్నారు.) అని చెప్పఁబడియె గదా "యేప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః తేపిమామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్" (భగీ. ౯. అ. ౨౩. శ్లో॥ (ఎవరు పరమాత్మికంబైన వేఱయినవారలగు ఇంద్రాదిదేవతలయెడల భక్తిగలవారై వారిని పూజించుచున్నారో. వారును, ఇది భగవదారాధనమనెడి జ్ఞానము లేనివారై నన్నే పూజించుచున్నారు.) అని భగవంతుఁడే స్వయముగ చెప్పియున్నాడు. కావున అన్నివిధములను కర్మము భగవదారాధనమని సిద్ధించుచున్నది.

**అధికారిభేదమునుబట్టి కర్మములయుపయోగమున భేదము.**

ఇట్లు కర్మము ఆరాధనమనియు, దానిచే నారాధింపఁబడునది బ్రహ్మమనియు నిరూపించుటవలన ఈ రెండింటిని తెలిసికొనియె గదా! త్యాజ్యములును ఉపాదేయములునగు సమస్తార్థములను తెలిసికొనఁగలము. కావున పైని గనఁబఱచినప్రకారము వేదముయొక్క రెండుభాగములలోనను ప్రతిపాదింపఁబడునవి కర్మమును బ్రహ్మమునని యేర్పడుచున్నది. కర్మమనునది లౌకికసుఖముల నపేక్షించువారికి ఐశ్వర్యము నిచ్చునదియు, ముముక్షువులలో, భక్తినిష్ఠులకు ఉపాసనాంగముగాను, ప్రపన్నులకు కైంకర్యరూపముగాను నుపయోగపడును. ఇవ్విధముగ నుండునట్టి కర్మముయొక్క స్వరూపము వాస్తవముగాఁ దెలిసికొనిననే అనంత స్థిరఫలమును గోరునట్టి సాధకులకు (ఉపాసకులకు) వారియుపాసనమున కంగముగా గ్రహింపఁబడునది యగును. ఐశ్వర్యకాములు దీనిగ్రహము నెట్టిస్వరూపమున గ్రహింతురో, అట్టిస్వరూపమున నిది వీరికి త్యాజ్యమనియును ఎఱుంగఁదగును. వేఱొకసాధనము నపేక్షింపనివారికి (ప్రపన్నులకు) దీనిఁగొని సాధింపవలసిన దద్దియును లేకుండుటంజేసి వారిచే నిది కైంకర్యరూపమున గ్రహింపఁబడినదగును. అయితే దీని నుపాసకులు గ్రహించిన ప్రకారము మిది వీరికి త్యాజ్యమని యేర్పడుచున్నది. బ్రహ్మమును తెలిసికొనవలయునన్న, దాని స్వరూపమును, ఆకారమును, గుణములను విభూతులను వీటినన్నింటిని తెలిసికొనవలసియుండుటం జేసి, యట్టి విభూతులగు చేతనాచేతన పదార్థముల స్వరూపములను తెలిసికొన వచ్చును.

మూ॥ అఱుతియిడువతు

అతిల్ జ్ఞానానన్దలక్షణమాన చేతనస్వరూపవైలక్షణ్యమఱియాక వరుకిఱతాకైయాలే, కైవల్య త్తిన్ వేషముమఱియలామ్. బ్రహ్మత్తినుడైయ శేషిత్వ ప్రాప్యత్వజ్గళై యఱియవే, తదనుభవాది కళ్ పురుషార్థమెన్ఱఱియలామ్. తదుపాస్యత్వ శరణ్యత్వజ్గళై యఱియవే, తత్ప్రాప్తిసాధన విశేష జ్గళై యఱియలామ్. సాధ్యాన్తర సాధనాన్తరజ్గళినుడైయ త్యాజ్యత్వత్తైయుమ్, బ్రహ్మత్తినుడైయ నిరతిశయ భోగ్యత్తైయుమ్, అనన్యసాధ్యత్వత్తైయుమ్, తత్ప్రకారతయా పరతన్త్రమాన స్వస్వ రూపత్తైయుమ్ దర్శిక్కవే, సుస్పష్టమాక వఱియలామ్. ఆక ఇప్పడియిరుక్కైయాలే భాగద్వయ త్తుక్కుమ్ ప్రతిపాద్యమ్, ఆరాధనస్వరూపమాన కర్మముమ్ ఆరాధ్యవస్తువాన బ్రహ్మముమెన్నక్క డవదు. "త్వదర్చావిధిముపరి పరిక్షీయతే పూర్వభాగః। ఊర్ధ్వోభాగస్త్వదీహాగుణవిభవపరిజ్ఞాప నైస్త్వత్పదాప్త్యై" ఎన్ఱిఱె భట్టరరుళిచ్చెయ్తతు.

ఇప్పడి భాగద్వయ ప్రతిపాద్యజ్గళాన ఇవ్వర్థజ్గళై యఱుతియిడుకైయావతు, కర్మత్తినుడైయ స్వరూపాఙ్గ ఫలాదికళైయుమ్, బ్రహ్మత్తినుడైయ స్వరూపరూపగుణ విభూత్యాదికళైయుమ్ సంశయ విపర్యయమఱ నిర్ణయిక్కై, అతు తాన్ శేయ్యుమ్బోతు, సకలశాఖా ప్రత్యయన్యాయ

మూ॥ నిర్ణయించుట

అందులోను జ్ఞానానందస్వరూపమగు చేతన పదార్థములయొక్క స్వరూపవైలక్షణ్యమును బట్టివచ్చు నది యగుటంజేసి యాసందర్భమున కైవల్యముయొక్క స్వరూపమునున్ను తెలిసికొనవచ్చును. బ్రహ్మము శేషియనియు, ప్రాప్యమనియును తెలియుటచే నట్టి బ్రహ్మము ననుభవించుటయే పురుషార్థ మని తెలియఁ దగును. బ్రహ్మము ఉపాస్యమనియు, శరణ్యమనియును తెలిసికొనుటచే అట్టిబ్రహ్మ మును బొందుటకుగా నగు సాధన విశేషములనున్ను తెలియఁదగును. వేఱొక్క సాధ్యమును వే ఱొక్క సాధనమునున్ను విడువవలసిన దనియు, బ్రహ్మము తనకు మించిన భోగ్యవస్తు వెద్దియును లేనిది యనియు, అది వేఱొక్కదానిఁ గొని సాధింపఁ దగినది కాదనియు, అట్టి బ్రహ్మముకు శరీర భూతుఁ డగుటచే పరతంత్రుఁడుగా నుండుట యనెడి స్వస్వరూపమునున్ను గానిపించినతోడనే (సాధనాంతరాదులు త్యాజ్యములని) స్పష్టముగాఁ దెలియ వచ్చును. కావున ఈపైని చెప్పిన ప్రకా రము వేదముయొక్క రెండుభాగముల యందును ప్రతిపాదింపఁ బడునది ఆరాధన స్వరూపమగు కర్మమున్ను ఆరాధ్యవస్తువగు బ్రహ్మమునని చెప్పఁదగును. కావుననే శ్రీపరాశరభట్టరును "త్వద ర్చా విధిముపరి పరిక్షీయతే పూర్వభాగః। ఊర్ధ్వోభాగస్త్వదీహా గుణవిభవ పరిజ్ఞాపనైస్త్వత్ప దాప్త్యై" (వేదశాస్త్రముయొక్కపూర్వభాగము నీయొక్క యర్చనము విశదీకరించు చున్నది. ఉత్త రభాగము నీయొక్కగుణవిభవములఁ దెలుపుచు నంపూర్ణముగ నిన్ను పొందించుటయం దుప యోగ పడుచున్నది.) అని కదా ప్రసాదించి యున్నారు.

ఇట్లు రెండుభాగములయందును ప్రతిపాదింపఁబడునట్టి యర్థములను నిశ్చయించుటయనునది కర్మముయొక్క స్వరూపము అంగములు ఫలము మొదలగువానిని, బ్రహ్మముయొక్క స్వరూపము రూపము గుణములు విభూతి మొదలగువానినిన్ని సంశయవిపర్యయములుగలుగకుండ నిర్ణయించుట.

మూ॥ స్మృతీతిహాస పురాణఙ్గళాలే.

త్తాయుమ్, సకలవేదాన్తప్రత్యయన్యాయత్తాలుమ్ శెయ్యవేణుమ్. అతిల్ సకలశాఖాప్రత్యయన్యాయమావతు - ఒరువాక్యత్తిలే ఓరర్థత్తైచ్చొన్నాల్, అతినుడైయ అఙ్గోపాఙ్గాదికళై నేరాకవఱిక్కైక్కాక, శాఖాన్తరఙ్గళిల్లావఱ్ఱైయుమ్ పరిశీలిత్తు, అవఱ్ఱిలుళ్ళ వర్థఙ్గళైయుమ్ జ్ఞానమ్పిఱన్దు, అవ్వర్థఙ్గళుక్కు అన్యోన్య విరోధఙ్గళైయుమ్ శమిప్పిత్తు, తనక్కభిమతమాన అర్థత్తోడే శేరుమవఱ్ఱైచ్చొల్లుకై. సకలవేదాన్తప్రత్యయన్యాయమావతు - ఒరువేదాన్తత్తిలే ఒరువాక్యమోరర్థత్తై చ్చొన్నాల్, అల్లాత వేదాన్తఙ్గళిలుమ్ పరిశీలిత్తు అవఱ్ఱిలుళ్ళ వర్థఙ్గళుక్కు అన్యోన్యవిరోధమ్ పిఱవాతపడి విషయవిభాగమ్పణ్ణి, తనక్కభిమతమాన వర్థత్తోడే శేరుమవఱ్ఱైచ్చొల్లుకై.

ఇతుతాన్ మహామతికళాన మహర్షికళుక్కేయుళ్ళతు, ఎల్లారాలుమ్ శెయ్యప్పోకామైయాల్, ఉపబృంహణఙ్గళ్ కొణ్డే నిర్ణయిక్కవేణుమ్. అవైయాలే తన్నిర్ణాయకఙ్గళై యరుళిచ్చెయ్కిఱార్, (స్మృతీతిహాస పురాణఙ్గళాలే) ఎన్ఱు. స్మృతికళావన-అష్టాదశ మన్వత్రి విష్ణుహారీత యాజ్ఞవల్క్యాదికళాలే అభిహితఙ్గళాన ధర్మశాస్త్రఙ్గళ్. ఇతిహాసఙ్గళావన-పురావృత్త ప్రతిపాదకఙ్గళాన శ్రీమద్రామాయణ మహాభారతాదికళ్; పురాణఙ్గళావన-సర్గాదిపఞ్చలక్షణోపేతఙ్గళాన బ్రాహ్మ్యపాద్మవైష్ణవాదికళ్.

---

మూ॥ స్మృతీతిహాస పురాణంబులం గొని.

ఆటినిర్ణయముఁ జేయునపుడు సకల శాఖాప్రత్యయన్యాయమున సకల వేదాన్త ప్రత్యయన్యాయమున్ను గొనియే దానిఁ జేయవలయును. వాటిలో సకల శాఖా ప్రత్యయన్యాయమనఁగా, ఏదైన నొక వాక్యమున నొకయర్థమునుఁ జెప్పినట్లయిన, దానియొక్క యంగోపాంగములను బాగుగా తెలిసికొనుటకుగాను శాఖాంతరముల నన్నింటిని బరిశీలించి వానిలోఁ జెప్పఁబడునట్టి యర్థములఁ దెలిసికొని వాటికిఁగల పరస్పర విరోధములను శమింపఁ జేసి, తన కభిమతమగు ప్రధానార్థముతో జేరునట్టివానిఁ జెప్పుకొనుట యని యెఱుఁగునది. సకల వేదాన్త ప్రత్యయన్యాయమనఁగా, ఏదైన నొక యుపనిషత్తునందలి యొకవాక్య మొకయర్థమునుఁ జెప్పినట్లయిన, తక్కిన యుపనిషత్తులనున్ను పరిశీలించి వానిచేఁ దెలుపఁబడు నర్థములకు పరస్పరము విరోధము పొసఁగకుండ విషయవిభాగముఁ జేసి, తన కభిమతమగు నర్థముతో నేకీభవించుమాటనిఁ జెప్పుకొనుట యని యెఱుంగునది.

ఇది యొక్కువ బుద్ధిమంతులగు మహర్షులకుతప్ప తక్కినవారికి శక్యముగానందున నిరూపణగ్రంథములఁగొనియే దానిని నిర్ణయించవలయును. ఆటి నిరూపణగ్రంథము లెవ్వియనఁగా (స్మృతీతిహాస) ఇత్యాదివాక్యముచేఁ దెలుపుచున్నారు. స్మృతులనఁగా, పద్దెనిమిదగు మనువు, అత్రి, విష్ణు, హారీతుఁడు యాజ్ఞవల్క్యుండు మొదలగువారిచే రచియింపఁబడిన ధర్మశాస్త్ర గ్రంథములు. ఇతిహాసములనఁగా పూర్వము జరిగినదానిఁ దెలుపునవియగు శ్రీమద్రామాయణము-మహాభారతము మొదలగు గ్రంథములు. పురాణములనఁగా, *సర్గాది పంచలక్షణములతో గూడియుండునవియగు బ్రాహ్మ్యపురాణము పద్మపురాణము విష్ణుపురాణము మొదలగునవి.

---

* పురాణలక్షణం — "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశమన్వన్తరాణి చ । వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణం॥"

**౨. స్మృతియాలే పూర్వభాగత్తి లర్థమఱుతియిడక్కడవతు; మత్తైయిర ణ్డాలుమ్ ఉత్తరభాగత్తిలర్థమఱుతియిడక్కడవతు.**

---

వేదార్థమఱుతియిడువతు ఇవత్తాలేయెన్ఱు ఇప్పడి నియమేన వరుళిచ్చెయ్‌తతు-ఇవత్తై యొழియ స్వబుద్ధ్యా నిర్ణయిక్కుమళవిల్, అల్పశ్రుతనానవనుక్కు విప్రపత్తి వరుమాకైయాలే, వేదకాలుష్య హేతువామెన్ఱు నినైత్తు. ఇన్నియమస్థానం "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ । బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి" ఎన్ఱు బార్హస్పత్యస్మృతియిలుమ్ మహాభారతత్తిలుమ్ శొల్లప్పట్టతిఱే.

ఇవ్వుపక్రమ వాక్యప్రక్రియైయాలే, పురుషకార వైభవమ్ తొడఙ్గి ఆచార్యాభిమాన పర్యన్తమాక, ఇప్ప్రబన్ధత్తిలవతరుళిచ్చెయ్‌కిఱ వేదార్థఙ్గళెల్లామ్, ఉపబృంహణఙ్గళ్ కొణ్డే నిశ్చయిత్తరుళిచ్చెయ్‌కిఱారెన్నుమిడమ్ తోత్తుకిఱతు; అతు తాన్ తత్తదర్థఙ్గళరుళిచ్చెయ్‌కిఱ స్థలఙ్గళిలే సమ్ప్రతిపన్నమ్.

ఆక ఇవ్వాక్యత్తాల్, సకల ప్రమాణఙ్గళిలుమ్ వేదమే ప్రబలప్రమాణమెన్నుమిడముమ్, తదర్థనిర్ణయమ్ పణ్ణుమ్ క్రమముమ్ శొల్లిత్తాయిత్తు.

౨ * ఇవత్తిల్ ఎత్తాలే ఎన్దభాగత్తిలర్థమ్ అఱుతియిడక్కడవతెన్న అరుళిచ్చెయ్‌కిఱార్, (స్మృతియాలే) ఎన్ఱుతుడఙ్గి, ఉపబృంహ్యమాన వేదత్తుక్కు, ప్రతిపాద్యార్థ విశేషత్తాలే యిఱే భాగభేదముణ్డాయిత్తు; అప్పడియే ఉపబృంహణఙ్గళుక్కుమ్ ప్రతిపాద్యవిశేషత్తాలే భేదముణ్డి

---

**౨. స్మృతిచే పూర్వభాగముయొక్క యర్థము నిర్ణయింపఁబడుచున్నది. తక్కినరెంటిచేతను ఉత్తరభాగముయొక్క యర్థము నిర్ణయింపఁబడుచున్నది.**

---

వీటిమూలముగానే వేదార్థమును నిర్ణయించవలెననెడి నియమ మెందులకనఁగా వీటిని వదలి స్వబుద్ధిచే నిర్ణయించు పక్షమున స్వల్పజ్ఞానముగలవాని కచ్చటచ్చట విరుద్ధార్థములు తోచుటచే నది వేదశాస్త్రమున కొక కాలుష్యమును గలుగఁజేయునని తలంచి యిట్లు నియమింపఁబడియె. మఱియు "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ । బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి" (ఇతిహాసపురాణములఁగొని వేదార్థములను విశదపరచుకొనునది. ఏలనఁగా, ఈతఁడు నన్ను వంచించునని (అపార్థము చేయునని) స్వల్పజ్ఞానముగల వానినుండి వేదము భయపడుచున్నది) అని బార్హస్పత్య స్మృతియందును మహాభారతమునందునున్న అట్టి నియమము చెప్పఁబడినది.

పురుషకార వైభవము మొదలుకొని ఆచార్యాభిమానము వఱకును ఈ గ్రంథమునఁ బ్రసాదింపఁబడినట్టి యర్థములన్నియును ఉపబృంహణములఁగొనియే నిర్ణయింపఁబడినవనెడి యంశము మొదటినుండి యింతవఱకును చెప్పినదానినుండి తోచుచున్నవి.

కావున ప్రమాణము లన్నింటిలో వేదమే ప్రబలమైన ప్రమాణమనెడు అంశమున్ను, అట్టి వేదముయొక్క యర్థమును నిర్ణయించునట్టి పద్ధతియును ఈ వాక్యమువలనఁ దెలుపఁబడినది.

అవతారిక:—వీటిలో నేది యేభాగముయొక్క యర్థమును నిశ్చయించుననఁగా, "స్మృతియాలే" ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

ఇట్లు వివరింపఁబడునట్టి వేదశాస్త్రమునఁ బ్రతిపాదింపఁబడు అర్థములు భిన్నము లగుటంజేసియే గదా దానియందును విభాగము గలిగెను. వివరింపఁబడునట్టి యర్థములకు భేద

తే. అతిల్ స్మృతికళ్ పూర్వభాగోప బృంహణఙ్గళాకవుమ్, ఇతిహాసాదికళ్ ఉత్తరభాగోప బృంహణఙ్గళాకవుమ్ నిర్మితఙ్గళాకైయాలే, తత్తదుప బృంహణఙ్గళైక్కొణ్డే తత్తద్భాగార్థ నిశ్చయమ్ పణ్ణవేణ్డియిరుక్కుమెన్ఱపడి. అతైప్పఱ్ఱి ఆచారవ్యవహార ప్రాయశ్చిత్తాదికళుక్కు ప్రతిపాదకఙ్గళాన ధర్మశాస్త్రఙ్గళాలే, కర్మప్రతిపాదకమాన పూర్వభాగత్తిలర్థనిశ్చయమ్ పణ్ణక్కడవతు; భగవత్స్వరూప రూపగుణ విభూతిచేష్టితఙ్గళుక్కు ప్రతిపాదకఙ్గళాన ఇతిహాస పురాణఙ్గళాకిఱ మహత్తై యిరణ్డాలుమ్, బ్రహ్మప్రతిపాదకమాన ఉత్తరభాగత్తిలర్థ నిశ్చయమ్ పణ్ణక్కడవ తెన్గిఱార్.

ఇప్పడి ఉభయవిధమాన ఉపబృంహణఙ్గళాలే ఉభయభాగార్థత్తైయుమ్ అఱుతియిడుకై యావతు-అనధీత శాఖాన్తరార్థఙ్గళుక్కుమ్ ప్రతిపాదకఙ్గళాన ఇవఱ్ఱాలే, అధీతశాఖార్థఙ్గళై అపేక్షిత విశేషఙ్గళోడేకూడ నిశ్చయిక్కై, స్మృతికళ్ తన్నిల్ బ్రహ్మ ప్రతిపాదనముమ్, ఇతిహాసాదికళిలే కర్మప్రతిపాదనము ముణ్డాయిరున్దతే యాకిలుమ్, స్మృతికళిల్ బ్రహ్మప్రతిపాదనమ్-కర్మఙ్గళినుడైయ తదారాధన రూపత్వ జ్ఞాపనార్థమాకవుమ్, ఇతిహాసపురాణఙ్గళిల్ కర్మప్రతిపాదనమ్-కర్మఙ్గళినుడైయ ఉపాసనాఙ్గత్వ జ్ఞాపనార్థమాకవుమ్ ఆకైయాలే, ఇప్పడివక్కైయిట్టు చొల్లక్కుఱైయిల్లై. "ప్రాయేణపూర్వభాగార్థ పూరణంధర్మశాస్త్రతః। ఇతిహాసపురాణాభ్యాం వేదాన్తార్థః ప్రకాశ్యతే" ఎన్నక్కడవతిఱే.

---

ముండుటంజేసి వివరణగ్రంథములను భేదము గలవి. వానిలో స్మృతులు పూర్వభాగమును వివరించునవిగాను, ఇతిహాసాదులు ఉత్తరభాగమును వివరించునవిగాను నిర్మింపఁబడినవి యగుటచే నాయా వివరణగ్రంథములఁగొనియే యాయా భాగములయందలి యర్థములను నిర్ణయింపవలయును. అందువలన ఆచారవ్యవహార ప్రాయశ్చిత్తములను ప్రతిపాదించునవియగు ధర్మశాస్త్రములచే కర్మప్రతిపాదకమగు పూర్వభాగముయొక్క యర్థమును నిశ్చయింపఁదగును. భగవత్స్వరూపము, రూపము, గుణములు, విభూతి, చర్యలు మొదలగువానిఁ బ్రతిపాదించునవియగు ఇతిహాస పురాణము లనఁబడు తక్కిన రెంటిచేతను బ్రహ్మప్రతిపాదకమగు ఉత్తరభాగముయొక్క యర్థము నిశ్చయింపఁదగునని తెలుపుచున్నారు.

ఇట్లు రెండువిధములగు ఉపబృంహణ గ్రంథములచే వేదములయొక్క రెండుభాగముల యర్థములను నిశ్చయించుటయనఁగా, తాను చదివియుండని తక్కిన శాఖల యర్థములనున్న ప్రతిపాదించునవియగు వీటిఁగొని ఇంకను అవశ్యకములగు విశేషముల సహాయముతోఁగూడ తాను చదివి యున్నశాఖ యొక్క యర్థములను నిశ్చయించుట.

స్మృతులయందె (కొన్నిటావుల) బ్రహ్మప్రతిపాదనమును, ఇతిహాసాదులయందే కర్మప్రతిపాదనమున్న గానఁబడుచున్నను, స్మృతులు బ్రహ్మమును ప్రతిపాదించుటయనునది కర్మములు బ్రహ్మముయొక్క యారాధనరూపములని తెలుపుటకుగాను, ఇతిహాసపురాణములు కర్మముఁ బ్రతిపాదించుట యనునది కర్మములు భగవదుపాసనమున కంగభూతములు (సహాయకములు) అనియును తెలుపుటకుగానును కావచ్చును. కావుననిట్లని గనఁబఱచిన ప్రకారము విభజించి చెప్పుట పొసగును కావుననే "ప్రాయేణపూర్వభాగార్థ పూరణంధర్మశాస్త్రతః। ఇతిహాసపురాణాభ్యాం వేదాన్తార్థః ప్రకాశ్యతే" (సామాన్యముగ వేదములయొక్క పూర్వభాగపుటర్థము స్మృతులనంబడు ధర్మశాస్త్రముచే ప్రతిపాదింపఁబడుచున్నది. దాని యుత్తరభాగపుటర్థము (ఉపనిషత్తులయర్థము) ఇతిహాస పురాణములచే ప్రతిపాదింపఁబడుచున్నది.) అని చెప్పఁబడి యున్నది.

**మూ॥ 3. ఇవై యిరణ్డిలుమ్ శైత్తుక్కొణ్డు ఇతిహాసమ్ ప్రబలమ్**

3. * ఉత్తర భాగోపబృంహణద్వయత్తుక్కుమ్ తారతమ్యముణ్డో, తన్నిలొక్కుమో, ఎన్గిఱ శఙ్కైయిలే యరుళిచ్చెయ్‌కిఱార్ మేల్. అన్ఱిక్కే, ఏకభాగవిషయమాన ఇరణ్డు ఉపబృంహణఙ్గళిలుమ్, ఇన్నదు ప్రబలమెన్ను మత్తైయుమ్ దర్శిప్పిక్కవేణుమెన్ఱు తామే తిరువుళ్ళమ్ పత్తి యరుళిచ్చెయ్‌కిఱాగాక వుమామ్, (ఇవై యిరణ్డిలుమ్) ఎన్ఱుతుడఙ్గి. అతావదు – శ్రేష్ఠభాగోపబృంహణతయా వన్దశేర్త్తియై యుడైత్తాన ఇవై యిరణ్డిలుమ్ వైత్తుక్కొణ్డు, ప్రామాణ్యత్తిల్ వన్దాల్ పురాణత్తిలుమ్, ఇతిహాసత్తుక్కు ప్రాబల్యముణ్డెన్గై.

పురాణత్తిల్ కాట్టిల్ ఇతిహాసత్తుక్కు ప్రాబల్యమ్, పరిగ్రహాతిశయమ్, మధ్యస్థతై, కర్తురాప్తతమత్వమ్, ఆకిఱ వినల్ఱాలే. ఇవత్తిల్ పరిగ్రహమావదు-శాస్త్రపరిగ్రహమ్, "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే। వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా" "మతిమన్థానమావిధ్యయేనాఽసౌ శ్రుతిసాగరాత్। జగద్ధితాయ జనితో మహాభారత చన్ద్రమాః" "వ్యాసవాక్య జలౌఘేన కుధర్మతరుహారిణా ॥ వేదశైలావతీర్ణేన నీరజస్కా మహీకృతా" "బిభేతిగహనాచ్ఛాస్త్రా న్నరస్త్రీ వాదివౌషధాత్। భారతస్యాస్త్ర సారోఽయమతః కావ్యాత్మ

---

3. ఈ రెంటిలో ఇతిహాసము ప్రబలము.

---

అవతారిక:—వేదముయొక్క యుత్తరభాగార్థమును నిశ్చయించునట్టి యీరెంటికిని భేదముండునా? రెండును సమానములేనా? యని శంకింపఁగా, ప్రసాదించుచున్నారు. ఇంతియేకాక. ఒక్కటియే విభాగమును గురించినవియగు రెండు ఉపబృంహణములలో నేది ప్రబలమయినదో గాన్పించవలయునని తామే స్వయముగ తలంచి ప్రసాదించుచున్నారనియును చెప్పవచ్చును.

(ఇవై యిరణ్డిలుమ్) శ్రేష్ఠమైనభాగముయొక్క యర్థమును వివరించుటచే వచ్చిన యతిశయముతోఁగూడిన యీరెంటిలో, ప్రామాణ్యవిషయమున, పురాణముకంటెను ఇతిహాసమునకు ప్రాబల్యము కద్దు.

పురాణముకంటెను ఇతిహాసమునకుఁగల ప్రాబల్యమనునది పరిగ్రహాతిశయము, మధ్యస్థత, కర్తయాప్తతముండగుట యనునవి. వీటిలో పరిగ్రహమనఁగా శాస్త్రపరిగ్రహము, అదియెట్లనిన, స్కాందమున, "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే। వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా" (వేదవేద్యుండగు పరమపురుషుండు దశరథునికుమారుండుగా నవతరింపఁగా, వేదమును శ్రీమద్రామాయణరూపముగా బ్రహ్మచే జేయఁబడెను) అనియు, "మతిమన్థానమావిధ్యయే నాఽసౌ శ్రుతిసాగరాత్। జగద్ధితాయజనితో మహాభారతచన్ద్రమాః" (ఏవనిచే బుద్ధిరూపమగు మన్థరపర్వతముతో శ్రుతిరూపమగు సముద్రమును చిలికి మహాభారతరూపమగు చంద్రుఁడు దీయఁబడెనో) అనియు, "వ్యాసవాక్యజలౌఘేన కుధర్మతరుహారిణా। వేదశైలావతీర్ణేన నీరజస్కా మహీకృతా" (వేదరూపమగు పర్వతమునుండి ప్రవహించునదియు, కుకర్మరూపమగు వృక్షములపెళ్ళగించి పడద్రోయునట్టిదియునగు శ్రీవ్యాసాచార్యుని వాక్యరూపమగు జలప్రవాహముచే జగమంతయును (ధూపరాగరహితముగా) రజోగుణ రహితముగాఁ జేయఁబడినది) అనియు, "బిభేతిగహనాచ్ఛాస్త్రా న్నరస్త్రీ వాదివౌషధాత్। భారతస్యాస్త్రసారోఽయ మతః కావ్యాత్మనాకృతః"

శాకృతః'' "విష్ణౌ వేదేషు విద్వత్సు గురుషు బ్రాహ్మణేషుచ। భక్తిర్భవతికల్యాణీ భారతాదేవ ధీమతామ్'' ఇత్యాదికళాలే పురాణవిశేషఙ్గళిలే ఇతిహాసమ్ శ్లాఘిక్కప్పడానిన్ఱతిఱే.

మధ్యస్థతైయావతు - "యస్మిన్ కల్పేతుయత్ప్రోక్తం పురాణం బ్రహ్మణాపురా। తస్య తస్యతు మాహాత్మ్యం తత్స్వరూపేణ వర్ణ్యతే'' ఎన్ఱు సర్వపురాణఙ్గళుక్కుమ్ ప్రవర్తకన్ బ్రహ్మావాయ్, అవనుక్కు ఒరోరుకల్పత్తిలే గుణత్రయత్తిల్ ఒరోరుగుణమ్ విఞ్జియిరున్దతు, అన్ద గుణానుగుణ దేవతైయుడైయ మాహాత్మ్యత్తై అప్పురాణత్తిల్ శొల్లుకైయాలే, పక్షపాతికళాయిరుక్కుమ్ పురాణఙ్గళ్ పోలన్ఱిక్కే, లౌకిక వైదిక సకలార్థనిర్ణయత్తిలే అధికృతఙ్గళాకైయాలే ఒరు విషయత్తిలుమ్ పక్షపాతమిన్ఱిక్కే యిరుక్కై.

కర్తురాప్తతమత్వమావతు - ప్రబన్ధకర్తావానవన్ యథార్థ దర్శన సామర్థ్యత్తైయుమ్ యథాదృష్టార్థవాదిత్వత్తైయుమ్ మికవుముడైయవనాయిరుక్కై. "అథేతిహాసపురాణయోరితిహాసో బలీయాంసః. కుతః-తేషాం పరిగ్రహాతిరేకాత్, సర్వత్రమాధ్యస్థ్యేన భూతార్థప్రతీతేః. వచనసౌష్ఠవేన, కర్తురాప్తతమత్వావగతేశ్చ'' ఎన్ఱుశొన్న పరిగ్రహాతిశయాదికళాలే పురాణాదిక

(జనుఁడు భిన్నమగు నావధమునుండివలెనే గంభీరమగు శాస్త్రమునుండి భయపడును కావున వేద శాస్త్రముయొక్క సారభూతము భారతము కావ్యరూపముగాఁ జేయఁబడినది) అనియు. "విష్ణౌ వేదేషువిద్వత్సు గురుషు బ్రాహ్మణేషుచ। భక్తిర్భవతికల్యాణీ భారతాదేవ ధీమతాం''(బుద్ధిమంతులగు వారికి భారతమువలననే శ్రీమహావిష్ణువువిషయమునను, వేదములవిషయమునను, విద్వాంసులవిషయమునను, బ్రాహ్మణుల విషయమునను, మంచిభక్తికలుగుచున్నది) అనియు నీపైని గనఁబఱచిన పురాణవిశేషములయందు ఇతిహాసము కొనియాడఁబడినదిగదా!

మధ్యస్థత యనఁగా:—

"యస్మిన్ కల్పేతుయత్ప్రోక్తం పురాణం బ్రహ్మణాపురా। తస్యతస్యతుమాహాత్మ్యం తత్స్వరూపేణవర్ణ్యతే''(చతుర్ముఖబ్రహ్మచే ఏయేకల్పమునందు ఏయేపురాణము సృజింపఁబడుచున్నదో, ఆయాపురాణమునందు ఆయాదేవతయొక్క ప్రభావము ఆయాదేవతయొక్క స్వరూపముతోఁ గూడ వర్ణింపఁబడుచున్నది.) అని చెప్పియుండుటచే సర్వపురాణములకును ప్రవర్తకుండు చతుర్ముఖబ్రహ్మయై వానికి యేయేకల్పమున మూడుగుణములలో నెద్దియో యొక గుణము ప్రకాశించి ఆగుణమున కనుగుణమగు దేవతయొక్క మాహాత్మ్యమును ఆపురాణమున వర్ణించుటచే పక్షపాతయుక్తములగు పురాణములవలెఁగాక, లౌకిక వైదిక సమస్త విషయములయందను ఉపయోగపడుచు ఒకవిషయమునను పక్షపాతము లేకుండుట యనునది: మధ్యస్థత యనఁబడుచున్నది.

కర్త యాప్తతముఁడగుట యనఁగా:—

ప్రబంధమును రచియించినవాఁడు(తాను ప్రతిపాదించు విషయములను) యథార్థముగాఁ దెలిసికొనుటకుఁ దగిన సామర్థ్యమును, తాను చూచినట్లుగానే తెలుపుటయును ఈరెంటిని ఎక్కువగా గలిగియుండుట.

"అథేతిహాస పురాణయోరితిహాసోబలీయాంసః కుతః? తేషాంపరిగ్రహాతిరేకాత్, సర్వత్ర మాధ్యస్థేన భూతార్థ ప్రతీతేః, వచనసౌష్ఠవేన కర్తురాప్తతమస్య ప్రతీతేశ్చ'' (ఇతిహాసపురాణములలో నితిహాసములు ప్రబలములు.ఏలననఁగా వాటికి పరిగ్రహాతిశయము కలదు. అవి యంతటను పక్షపాత రహితముగ జరిగిన విషయములఁ దెలుపునవి. వాటియందు వచనసౌష్ఠవముగలదు కర్తయును ఆప్తతముఁడు) ఇత్యాదివాక్యములయందు పరిగ్రహాతిశయాదులచే నితిహాసము పురా

మూ॥ ౮. అత్తాలే యతుమున్బుట్టతు.

హాస ప్రాబల్యమ్, సామాన్యేనతత్త్వనిర్ణయ త్తిలే ఉదాహ్యకొణ్డారాలుమ్; (అ) «మహాభారతంహి పరిగ్రహవిశేషావసితమ్» ఎన్తుతుడఙ్గి, «ధర్మేచార్థేచ కామేచ మోక్షేచభరతర్షభ। యదిహాస్తితదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్» ఇతి లౌకికవైదిక సకలార్థ నిర్ణయాధికృతత్వేన, క్వచిదపి అపక్షపాతిత్వాచ్చ, పురాణేభ్యో బలవత్తరమ్» ఎన్నుమళవాక. పరిగ్రహాతిశయత్తాలుమ్ మధ్యస్థత్తైయాలుమ్ పురాణఙ్గళిల్ కాట్టిల్ ఇతిహాసవిశేషమాన మహాభారతత్తుక్కుణ్డాన ప్రాబల్యమ్, శ్రీసహస్రనామభాష్యత్తిలే భట్టరాలుమ్ ప్రతిపాదిక్కప్పట్టతిఱే.

౮ అత్తా ప్రాబల్యత్తై యిచ్చైనిక్కిఱార్, (అత్తాలే) ఎన్తుతుడఙ్గి. అన్ద ప్రాబల్యత్తాలే, «ఇతిహాసపురాణంపఞ్చమమ్» ఎన్తుమ్, «ఇతిహాసపురాణాభ్యామ్» ఎన్తుమ్, శ్రుతిస్మృతికళిలే ఇరణ్డైయుమ్ శేరచ్చొల్లుకిఱవళవిల్. ఇతిహాసమానతు పురాణత్తుక్కు మున్నే శొల్లప్పట్టతెన్గై. ద్వన్ద్వసమాసత్తిల్ «అల్పాచ్తరమ్» ఎన్గిఱపడియే, «అభ్యర్హితమ్» ఎన్గిఱపడియే మున్బు వరుమతు; అతిల్ అల్పాచ్తరమిన్తియిలే యిరుక్క, అతుమున్బుట్టతు అభ్యర్హితత్వత్తాలే యిఱే;

మూ॥ ౮. అందుచే నది ముందు పేర్కొనఁబడినది.

ణముకంటెను ప్రబలమైనది యని యీవిషయమును సామాన్యముగ తత్త్వనిర్ణయమను గ్రంథమున శ్రీఉయ్యక్కొండారులు ప్రతిపాదించియున్నారు. మరియు భట్టరును «మహాభారతంహి పరిగ్రహవిశేషావసితం»(మహాభారతము పరిగ్రహాతిశయముగలది)అనువాక్యము మొదలుకొని «ధర్మేచార్థేచ కామేచ మోక్షేచభరతర్షభ। యదిహాస్తితదన్యత్ర యన్నేహాస్తినతత్క్వచిత్» ఇతి లౌకికవైదిక సకలార్థ నిర్ణయాధికృతత్వేన, క్వచిదపిఅపక్షపాతిత్వాచ్చ పురాణేభ్యోబలవత్తరం» (ధర్మమును గురించికాని, అర్థమును గురించికాని, కామమును గురించికాని యేది యిచట చెప్పఁబడినదో, అది చే వేరొకచో నుండును చెప్పఁబడినది. ఏది యిచట చెప్పఁబడలేదో అది వేరొకచోట నుండు నెచ్చటను గాన్పింపదు. ఇట్లు లౌకిక వైదిక సమస్తార్థములను నిర్ణయించుటలో నుపయోగపడునదియైనందునను, ఏవిషయమునను పక్షపాతము లేనందునను,పురాణములకంటెను బలమైనది) అనువరకును పరిగ్రహాతిశయమును బట్టియు, మధ్యస్థతనుబట్టియు, పురాణములకంటెను ఇతిహాసమగు శ్రీమహాభారతమునకుఁగల ప్రాబల్యమును శ్రీసహస్రనామభాష్యమునఁ బ్రతిపాదించియున్నారు.

అవతారిక:—దాని ప్రాబల్యమును వివరించుచున్నారు.

అట్టి ప్రాబల్యమునుబట్టియే. «ఇతిహాసపురాణం పంచమం» అనియు, «ఇతిహాసపురాణాభ్యాం» అనియు నిట్లు శ్రుతి స్మృతులయం దీరెంటినిచేర్చి పేర్కొనునపుడు పురాణముకంటెను ఇతిహాసము ముందుగ పేర్కొనఁ బడుచున్నది.

ద్వంద్వ సమాసమున స్వల్పాక్షరములుగల పదమునుగాని, పూజ్యమైన పదమునుగాని ముందుగాఁ బేర్కొనుట కద్దు. వాటిలో«పురాణ»శబ్దము కంటెను «ఇతిహాస» శబ్దము స్వల్పాక్షరములు కలదికాకుండ యుండగా, దీనిని ముందుగా పేర్కొనుటయును నది దీనికిఁగల పూజ్యతను బట్టియే కదా! అట్టి పూజ్యత దీనికుండుటకు మూలము దీనికిఁగల ప్రాబల్యమే యని యభిప్రాయము.

ఇన్దవఛ్ఛర్హితత్తుక్కుమూలమ్ అతిల్ ప్రాబల్యమెన్నుకరుత్తు. — అథవా «స్మృతీతిహాసపురాణజ్గళాలే» ఎన్ను భాగద్వయోపబృంహణజ్గళైయుమ్ సమస్తమాకచ్చొల్లుకిఱవిడత్తిల్. «ఇతిహాసాశ్చ పురాణానిచ ఇతిహాసపురాణాని, స్మృతయశ్చ ఇతిహాస పురాణానిచ స్మృతీతిహాసపురాణాని» ఎన్ఱిప్పడియివర్ఱుక్కు సమాసవివక్షైయాకైయాలే, అల్పాచ్తరమాన పురాణత్తుక్కు మున్నే ఇతిహాసత్తై అరుళిచ్చెయ్యతిల్కరుత్తై «ఇవై యిరణ్డిలుమ్» ఇత్యాదియాలే యరుళిచ్చెయ్కిఱారాకవుమామ్. ఇన్దయోజనైయిల్ «అత్తాలేయతుముఱ్పట్టతు» ఎన్గిఱవితుక్కు అన్దప్రాబల్యత్తాలే, «ఇతిహాసపురాణజ్గళాలే» ఎన్గిఱవిడత్తిల్ పురాణత్తుక్కు మున్నే ఇతిహాసమ్ శొల్లప్పట్టతెన్ఱు పొరుళాకక్కడవతు.

ఆక వేదార్థనిర్ణయమ్ పణ్ణుమిడత్తిల్ తదుపబృంహణజ్గళాలే పణ్ణవేణుమెన్నుమ్, అతిల్ పూర్వోత్తరభాగోపబృంహణజ్గళిన్నదెన్నుమ్, ఉత్తరభాగోపబృంహణజ్గళాన ఇతిహాసపురాణజ్గళిల్ ఇతిహాసమ్ ప్రబలమెన్నుమ్ అరుళిచ్చెయ్కైయాలే, మేల్ తామరుళిచ్చెయ్యప్పుకిఱ వర్థజ్గళుక్కు ప్రమాణ మెరుజ్గవిట్టరుళినారాయిఱ్ఱు.

## పురుషకారవైభవమ్.

ముతలిలే (౧) «వేదార్థమ్» ఇత్యాదియాలే వేదతదర్థతదుపబృంహణజ్గళై సాకల్యేనోపాదానమ్పణ్ణి, అన్దవేదత్తినుడైయ భాగవిభాగ తదుపబృంహణవిభాగజ్గళుమ్ పణ్ణినారేయాకిలుమ్, చేతనరుడైయ ఉజ్జీవనత్తుక్కు అపేక్షితార్థజ్గళైయరుళిచ్చెయ్య విశీర్ణవరాకైయాలుమ్, అతుతాన్ పూర్వభాగవేద్యమన్ఱిక్కే ఉత్తరభాగవేద్యమాకైయాలుమ్, పూర్వభాగత్తిల్ ముముక్షువుక్కు

---

అథవా—«స్మృతీతిహాస పురాణంగళాలే» అని యిట్లు భాగద్వయముయొక్కయును ఉపబృంహణములఁజేర్చి చెప్పుతావున వీరికి «ఇతిహాసాశ్చ పురాణానిచ ఇతిహాసపురాణాని, స్మృతయశ్చ ఇతిహాసపురాణానిచ స్మృతీతిహాసపురాణాని» అనియిట్లు సమాసవివక్షయుండును గాన, స్వల్పాక్షరములుగల పురాణశబ్దమునకుముందుగ ఇతిహాసశబ్దమును పేర్కొనుటకుఁ గారణమును «ఇవై యిరెండులుమ్» ఇత్యాది వాక్యముచే ప్రదించియుండియు నుండవచ్చును. ఇవ్విధమున నన్వయించుకొనుపక్షమున, (అత్తాలేయతుముఱ్పట్టతు) అనువాక్యముకు (అత్తాలే=ఆ ప్రాబల్యముచే) «ఇతిహాసపురాణంగళాలే» అనుతావున పురాణశబ్దముకు ముందుగా ఇతిహాసశబ్దము ప్రయోగింపఁబడినది) అని యర్థము చేసుకొనునది.

కనుక వేదార్థమును నిర్ణయించునపుడు ఉపబృంహణములఁగొనియే నిర్ణయింపవలయుననియు, వాటిలో పూర్వభాగార్థమును నిర్ణయించునవి యివి యనియు, ఉత్తరభాగార్థమును నిర్ణయించునవి యివి యనియు, ఉత్తరభాగార్థమును నిర్ణయించునవియగు ఇతిహాసపురాణములలో నితిహాసము ప్రబలమనియును చెప్పియుండుటచే నిఁక మీఁదు తాము ప్రసాదింపఁబోవునట్టి యర్థములవిషయమున ప్రమాణమును గాన్పించినారు.

## పురుషకార వైభవము.

అవతారిక:—మొట్టమొదట «వేదార్థం» ఇత్యాది వాక్యములచే వేదమును, తదర్థములను తదుపబృంహణములను విస్తృతముగాఁ గాన్పించి, వేదముయొక్క భాగ విభాగములను తదుపబృంహణ విభాగములనున్ను చేసినవారె యయినను, చేతను లుజ్జీవించుటకుఁ గావలసిన యర్థములను ప్రసాదించుట కుద్యమించిన వారయినందునను, అవి పూర్వభాగమునుండి తెలియవచ్చునవికాక, ఉ

## మూ॥ ౫. ఇతిహాసశ్రేష్ఠమాన శ్రీరామాయణత్తాల్

జ్ఞాతవ్యాంశ ముళ్ళతుమ్, ఉత్తరభాగార్థఙ్గళాన స్వరూపోపాయ పురుషార్థ ప్రతిపాదనస్థలఙ్గళిలే తత్తదనుగుణత్యాజ్యోపాదేయ కథనముఖేన జ్ఞాపిక్కలాయిరుక్కైయాలుమ్, ఉత్తరభాగార్థనిర్ణయత్తిలే ప్రవృత్తరాయ్, అతుతన్నిలుమ్ భగవత్స్వరూపరూపగుణ విభూతికళైయుమ్, భగవదుపాసనాదికళైయుమ్ పరక్కనిన్ఱు ప్రతిపాదిక్కుమ్ విడఙ్గళిల్, సారాసారవివేకపూర్వకమాక తాత్పర్యార్థఙ్గళై సఙ్గ్రహిత్తు, సంశయవిపర్యయమఱచేతనర్కళుక్కు ప్రతిపత్తివిషయమామ్పడి యరుళిచ్చెయ్తు శెల్లుకిఱార్ మేల్.

౫. అతిల్ ప్రథమత్తిలే ఉత్తరభాగోపబృంహణద్వయత్తిల్ ప్రబలమాకచ్చొన్న ఇతిహాసఙ్గళిల్ వైత్తుక్కొణ్డు, శ్రీరామాయణత్తినుడైయ ప్రాబల్యత్తై ప్రకాశిప్పియానిన్ఱుకొణ్డు, తత్ప్రతిపాద్య విశేషత్తై యరుళిచ్చెయ్కిఱార్ (ఇతిహాసశ్రేష్ఠ మెన్ఱుతుడఙ్గి). శ్రీరామాయణత్తుక్కు ఇతిహాసశ్రేష్ఠత్వమావతు “వాల్మీకయే మహర్షయే సన్దిదేశాసనంతతః । బ్రహ్మణా సమనుజ్ఞాత స్సోఽప్యుపావిశదాసనే” ఎన్ఱు సర్వలోకపితామహనాన బ్రహ్మావాలే సమ్భావితనాన శ్రీవాల్మీకి భగవానాలే ప్రణీతమాకైయాలుమ్ “నతేవాగనృతాకావ్యే కాచిదత్ర భవిష్యతి” ఎన్ఱు బ్రహ్మ అనుగ్రహిక్కైయాలే ఇతిల్ శొన్న వర్థఙ్గళెల్లామ్ మెయ్యాకక్కడవతాకైయాలుమ్, “యావద్రామాయణకథాలోకేషు ప్రచరిష్యతి” ఎన్ఱు సకలలోక పరిగ్రహముణ్డాకైయాలుమ్, ఇతి

## మూ॥ ౫. ఇతిహాసశ్రేష్ఠమగు శ్రీరామాయణమున

త్తరభాగమునుండి తెలియవచ్చునదియైనందనను, పూర్వభాగమున ముముక్షువులచేఁ దెలియవలసిన యంశ మెద్దియయినయున్నను, దానిని, ఉత్తరభాగ ప్రతిపాదితములగు స్వరూపోపాయ పురుషార్థములఁ బ్రతిపాదించుతావుల తత్తదనుగుణములగు త్యాజ్యోపాదేయములఁ దెలుపునపుడు తన్మూలముగ తెలుపఁదగి యుండుటంజేసియును, ఉత్తరభాగార్థమును నిర్ణయించుటకై యవలంబించి, దానిలోను భగవత్స్వరూప రూపగుణ విభూతులను, భగవదుపాసనాదులనున్న తావుగ ప్రతిపాదించుతావులయందు సారాసారవివేక పూర్వకముగ తాత్పర్యార్థములను సంగ్రహించి, సంశయ విపర్యయములు గలుగకుండ జనులకు తెలియవచ్చునట్లు యిఁక మీఁదు ప్రతిపాదింపఁబోవుచున్నారు.

అవతారిక:—అందు, ప్రథమమున, ఉత్తరభాగముయొక్క యర్థమును నిర్ణయించునట్టి రెంటిలో ప్రబలమైనదిగాఁ జెప్పఁబడిన యితిహాస గ్రంథములలో నొక్కటియగు శ్రీరామాయణముయొక్క ప్రాబల్యమును తెలుపఁదలచి యందు ప్రతిపాదింపఁబడు విషయముఁ దెలుపుచున్నారు.

“వాల్మీకయే మహర్షయే సన్దిదేశా సనంతతః । బ్రహ్మణా సమనుజ్ఞాత స్సోఽప్యుపా విశదాసనే” (శ్రీవాల్మీకిమహర్షి వేంచేయఁగా వారికాసనముఁ గొనిరమ్మని యాజ్ఞాపించెను. శ్రీవాల్మీకిమహర్షి చతుర్ముఖ బ్రహ్మముయొక్క యనుజ్ఞచే నాసనమునఁ గూర్చుండెను) అని చెప్పియున్నట్లు సర్వలోక పితామహుఁడగు చతుర్ముఖబ్రహ్మముచే గౌరవింపఁబడిన వాఁడగు శ్రీవాల్మీకిమహర్షిచే రచియింపఁబడినది యగుటంజేసియు, “నతేవాగ నృతాకావ్యే కాచిదత్ర భవిష్యతి” (ఈ కావ్యమున నీవు వ్రాసినది యొక్కటియును అబద్ధము కానేరదు) అని యిట్లు బ్రహ్మముయొక్క యనుగ్రహమువలన వీరు ప్రసాదించిన యర్థములన్నియును సత్యములేయయి యుండవలెనని యున్నందునను, “యావద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి” (ఎంతవఱకు రామాయణకథ లోకముల

**మూ॥ శిఱైయిరున్దవళేఱ్ఱమ్ శొల్లుకిఱతు;**

---

హాసాన్తగజ్గళైప్పఱ్ఱ ప్రబలప్రమాణమాయిరుక్కై. ఇతుతనై నడువిల్ తిరువీతిప్పిళ్ళై భట్టర్ తత్త్వత్రయప్రబన్ధత్తిల్ ప్రమాణాధికారత్తిలే యరుళిచ్చెయ్‌తారిఱే. ఇన్నుమ్ "వేదవేద్యే పరే పుంసి" ఇత్యాదిప్పడియే సర్వస్మాత్పరనాన సర్వేశ్వరన్ సంసారిచేతనరక్షణార్థమాక ఇతరసజాతీయనాయ్ వన్దవతరిత్తాప్పోలే, సర్వప్రమాణోత్కృష్టమాన వేదముమ్, తదవతారగుణచేష్టితప్రతిపాదనముఖేన తదాశ్రయణరుచియై సంసారికళుక్కుణ్డాక్కి రక్షిక్కైక్కాక, శ్రీరామాయణరూపేణఅవతరిత్తతెన్ఱు శొల్లప్పడుకైయాలుమ్, ఇతినుడైయ వేఱ్ఱమ్ సమ్ప్రతిపన్నమ్.

పిరాట్టియెన్నాతే "శిఱై యిరున్దవళ్" ఎన్ఱరుళిచ్చెయ్‌తతు-అవళుడైయ దయాతిశయత్తై ప్రకాశిప్పిక్కైక్కాక; దేవదేవదివ్యమహిషియాన తన్ పెరుమైయైయుమ్, శిఱైయిరుప్పిన తణ్మైయైయుమ్ పారాతే. దేవస్త్రీకళ్ శిఱైయై విడువిక్కైక్కాక తాన్ శిఱైయిరున్దవళ్ దయాపరవశైయాయిఱే. ప్రజై కిణఱ్ఱిలే విழுన్దాల్ ఒక్కక్కుతిత్తెడుక్కుమ్ మాతావైప్పోలే, ఇచ్చేతనర్ విழுన్దసంసారత్తిలే తానుమొక్కవన్దు పిఱన్దు, ఇవర్‌కళ్ పట్టతై తానుమ్పట్టు రక్షిక్కైయాలే, నిరుపాధికమాతృత్వసమ్బన్ధత్తాల్ వన్ద నిరతిశయవాత్సల్యత్తుక్కుమ్ ప్రకాశకమిఱేయితు.

---

**మూ॥ చెరసాలలోనుండిన యాపెయొక్కమహిమ చెప్పఁబడినది.**

---

యందు వ్యాపించునో) అనియును చెప్పియున్నట్లు దీనికన్నిలోకములయందును అంగీకారమున్నందునను, ఇది యితిహాసాంతరములకంటెను ఎక్కువ ప్రబలమైన ప్రమాణముగానుండుటయే దీనిని ఇతిహాసశ్రేష్ఠమని వ్యవహరించుటకు మూలము. ఈవిషయము శ్రీ నడువిల్ తిరువీధిప్పిళ్ళై భట్టరువారు తత్త్వత్రయప్రబంధమునందు ప్రమాణాధికారమున ప్రసాదించియున్నారు గదా! ఇంతియె కాక, అందఱికంటెను ఉత్కృష్టుండగు సర్వేశ్వరుండు సంసారులగు చేతనులను రక్షించుటకై ఇతరులతో సజాతీయుండై వచ్చి యవతరించినట్లు, ప్రమాణము లన్నింటిలో నుత్కృష్టమైనదిగా నెన్నఁబడు వేదమున్ను అట్టి సర్వేశ్వరుని యవతారములను, గుణములను, కార్యములనున్ను ప్రతిపాదించుచు నందుమూలముగ సంసారులను వాని నాశ్రయించు విషయమున నాశను గలుగఁజేసి రక్షించుటకై శ్రీరామాయణ రూపముగా నవతరించినట్లు "వేదవేద్యే పరేపుంసి" ఇత్యాదిశాస్త్రవాక్యములయందుఁ జెప్పియుండుటంజేసియును దీనియొక్క గౌరవము అందఱు నంగీకరించినదియే.

మూలమున "పిరాట్టి" అని పేర్కొనక, "చెఱసాలలోనున్న యాపె" అని పేర్కొనుట యాపెయొక్క దయాతిశయమును గాన్పించుటకుగానని యెఱుంగునది. దేవదేవుని దివ్యమహిషియగు తనయొక్క గొప్పతనమును, చెఱసాలలోనుండుటవలని యచ్చుచిన్నతనమునున్ను గమనింపక, దేవతాస్త్రీలను చెఱసాలనుండి విడిపించుటకుగాను తాను చెఱలో నుండుట యనునది యాపె దయాపరవశురాలగుటంజేసియే కదా! ఉదాహరణము:—బిడ్డభావిలో పడినపైన తోడనే భావిలోదుమికినట్టి తల్లివలెనే, ఈచేతనులు పడియుండునట్టి సంసారమున తానును వచ్చి పుట్టి వాళ్లుపడు పాట్లు తానును పడి రక్షించుటంజేసి, యట్లు చెఱలో నుండుట యనునది యాపెకు నిరుపాధికమాతృత్వమువలన నుండు నిరతిశయ వాత్సల్యమునున్ను ప్రకాశింపఁ జేయునది గదా!

ఇన్నగుణాధిక్యత్తై వెళియిడుకైక్కాక విఱే పరమాచార్యరాన నమ్మాళ్వార్ "తనిచ్చిఱై యిల్ విళప్పార్ ఇ కిళిమొழியాళ్" ఎన్ఱరుళిచ్చెయ్‌తతు. అవరుడైయ దివ్యసూక్తియిఱే ఇవరిప్పడి యరుళిచ్చెయ్‌కైక్కు మూలమ్. శిఱైయిరుప్పు తణ్ణై ఱ్రయావతు - కర్మనిబన్ధనమాకిలిఱే; ఆశ్రితరాన దేవర్‌కళుడైయ స్త్రీకళ్ శిఱైయైవిడువిక్కైక్కాక త్తన్ననుగ్రహత్తాలే తానేవలియ చ్చెయ్‌తతాకైయాలే, ఏన్గత్తుక్కుడలామిత్తనైయిఱే యితు. సంసారికళోడొక్క గర్భవాసమ్ పణ్ణి ప్పిఱక్కిఱవిసితు. "పలపిఱప్పాయొళివరుమ్" ఎన్నుమ్పడి సర్వేశ్వరనుక్కు త్తేజస్కర మాకిఱతు, కర్మనిబన్ధనమన్ఱిక్కే అనుగ్రహ నిబన్ధనమాకైయిఱే. అనపిన్బు, ఇతువుమ్ అనుగ్రహ నిబన్ధనమాకైయాలే ఇవళుక్కు తేజస్కరమామిత్తనై. ఇత్తై రావణబలాత్కారత్తాలేవన్దతాక నినై ప్పార్-ఇవళ్ శక్తివిశేషమఱియాత క్షుద్రరిఱే "శీతో భవ" ఎన్ఱవళ్ "నశ్యో భవ" ఎన్న మాట్టాళన్ఱే; ఆకైయాల్, ఇతు తన్ననుగ్రహత్తాలే పరరక్షణార్థమాక చ్చెయ్‌త శెయలాకైయాలే, ఇతువే ఇవళ్ దయాదిగుణఙ్గళుక్కు ప్రకాశకమెన్ఱు తిరువుళ్ళమ్‌పఱ్ఱియాయి ఱ్ఱు ఇవర్ "శిఱైయిరున్దవళ్" ఎన్ఱరుళిచ్చెయ్‌తతు. శ్రీరామాయణమెల్లామివళుడైయవేఱ్ఱమ్ శొల్లుకిఱతెన్నుమిడమ్ "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" ఎన్ఱు శ్రీవాల్మీకిభగవాన్ తానేవాయోలైయిట్టువైత్తానిఱే. "శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే" ఎన్ఱరుళిచ్చెయ్‌తారిఱే భట్టర్,

---

ఇట్లు యీపెసుఁగల గుణాతిశయమును బయలుపఱచుటకైయే గదా పరమాచార్యులగు శ్రీనమ్మాళ్వారును "తనిచ్చిఱైయిల్ విళప్పార్ ఇ కిళిమొழியాళ్" (క్రూరమైన చెరలోనున్నప్పుడు ఎల్లరచే బొగడదగినదై చిలుకపలుకులుగలది) అని ప్రసాదించి యున్నారు. వారి దివ్యసూక్తియే కదా వీరివ్విధముగ ప్రసాదించుటకు హేతువు. కర్మమూలకముగా వచ్చినచోఁగదా చెఱలోనుండుట చిన్నతన మనిపించుకొనుచున్నది. ఆశ్రితులగు దేవతలయొక్క స్త్రీలను చెఱనుండి విడిపించుటకుగాను తన యనుగ్రహముచే తనకుతానే చెఱలో ప్రవేశించెనుగాన, నది గౌరవమునకే హేతువగును. ఇంతియే. సంసారులతో సమానముగ గర్భవాసముచేసి జన్మించుట యనునది "పలపిఱప్పాయొళివరుమ్" (అనేకజన్మములనెత్తి ప్రకాశించువాఁడు) అని శ్రీనమ్మాళ్వారులు ప్రసాదించినట్లు సర్వేశ్వరునికి తేజస్కరమగును. అట్లగుట యది కర్మమూలముగఁ గలిగినది కాక, యనుగ్రహమూలకమగుటంజేసియే కదా అట్లగునేని, యిదియును ఈపెకు అనుగ్రహమూలముగ సంప్రాప్తమగుటంజేసి తేజస్కరమే కాఁగలదు. ఇంతియె. ఇది యీపెకు రావణుని బలాత్కారమువలనఁ గలిగినది యని తలంచువారు ఈపెయొక్క సామర్థ్యము నెఱింగియుండని నీచులు గదా! అగ్నిని "శీతో భవ=చల్లగానగుమా" అనినట్టి యీపె రావణుని "నశ్యో భవ=నశించుమా" అననేరదా? కావున నిది యీపె తన యనుగ్రహమువలన పరులను రక్షించుటకై చేసినపని యగుటంజేసి యిదియే ఈపెయొక్క దయాదిగుణములను ప్రకాశింపఁజేయునని తలంపుతో శ్రీపిళ్లై లోకాచార్యుల వారు మూలమున ఈపెను "చెరలోనున్నయాపె" అని పేర్కొని యుండిరి.

శ్రీరామాయణము నందంతటను ఈపెయొక్క మహిమ చెప్పఁబడినదనెడి యంశమును "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" (కావ్యమైన శ్రీరామాయణమందంతటను ప్రధానముగా జెప్పఁబడినది సీతాదేవియొక్క చరిత్రము) అనుటవలన శ్రీవాల్మీకులవారు స్వయముగానే తెలిపియున్నారు. "శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే" (నీచరిత్రముండుటంజేసియే శ్రీమద్రామాయణము జీవముగలదియగుచున్నది) అనుటచే నీవిషయమును భట్టరును ప్రతిపాదించి యున్నారు.

## మూ॥ మహాభారతత్తాల్ తూతుపోనవనేఱ్ఱమ్ శొల్లుకిఱతు.

అనన్తరమ్ మహాభారత ప్రతిపాద్యత్తై యరుళిచ్చెయ్‌కిఱార్ (మహాభారతత్తాలెన్ఱుతుడఙ్గి). ‟కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్। కోహ్యన్యో భువి మైత్రేయ మహాభారతకృద్భవేత్” ‟ఏవం విధం భారతంతు ప్రోక్తం యేన మహాత్మనా। సోఽయం నారాయణస్సాక్షా ద్వ్యాసరూపీ మహామునిః” ఎన్ఱు భగవదావేశావతారమాయ్, ‟సహోవాచ వ్యాసః పారాశర్యః” ఎన్ఱు ఆప్తతమనాక ప్రసిద్ధనాయిరున్ఱుళ్ళ శ్రీవేదవ్యాస భగవానాలే ‟వేదానధ్యాపయామాస మహాభారతపఞ్చమాన్” ఎన్గిఱపడియే పఞ్చమవేదమాక ప్రణీతమాయ్, అనేక పురాణ ప్రశస్తమాయిరున్ఱుళ్ళ మహాభారతముమ్, శ్రీరామాయణత్తోపాతి ప్రబలప్రమాణమ్. ఇతువుమ్ నడువిల్ తిరువీతిప్పిళ్ళైభట్టర్ తామే యరుళిచ్చెయ్‌తార్; పెరియభట్టరుమ్ శ్రీసహస్రనామ భాష్యోద్ఘాతత్తిలే, ‟శ్రీరామాయణవన్మహాభారతం శరణమ్” ఎన్ఱరుళిచ్చెయ్‌తారిఱే.

సర్వేశ్వరనానాతే ‟తూతుపోనవన్” ఎన్ఱతు-అవనుడైయ ఆశ్రితపారతన్త్ర్యత్తై ప్రకాశిప్పిక్కైక్కాక. దేవదేవనాన తన్ పెరుమైయైయుమ్ శెయ్‌కిఱతొழிలిన్ తణ్మైయైయుమ్ పారాతే, పాణ్డవర్కళుక్కాక క్కழுత్తిలే ఓలైకట్టి తూతుపోయిన్ఱతు ప్రణతపారతన్త్ర్య

## మూ॥ శ్రీమహాభారతమున దూత్యమునకుఁబోయినవాని మహిమ చెప్పఁబడినది.

అవతారిక:—తరువాత మహాభారతమునందుఁ బ్రతిపాదింపఁబడు విషయమును ప్రసాదించుచున్నారు.

‟కృష్ణద్వైపాయనంవ్యాసం విద్ధినారాయణంప్రభుం। కోహ్యన్యోభువిమైత్రేయ మహాభారతకృద్భవేత్”(ఓమైత్రేయుఁడా వ్యాసుఁడగుకృష్ణద్వైపాయనుని శ్రీమన్నారాయణునిగా నెఱుంగుము. వేఱొక్కండెవడు మహాభారతమును రచియింపఁ గలఁడు)అనియు ‟ఏవంవిధంభారతంతు ప్రోక్తం యేన మహాత్మనా।సోఽయం నారాయణస్సాక్షా ద్వ్యాసరూపీ మహామునిః” (ఇవ్విధమగు భారతము ఏమహాత్మునిచేఁ జెప్పఁబడినదో, అతఁడు వ్యాసమహాముని రూపమునుధరించిన నారాయణుఁడే) అనియునీపైని గనఁబఱచిన ప్రకారము భగవదావేశావతారుఁడై ‟సహోవాచవ్యాసః పారాశర్యః” ( పరాశర పుత్రుఁడగు వ్యాసుఁడు చెప్పెను ) అనియిట్లు ఆప్తతముఁడుగాను ప్రసిద్ధినొందిన శ్రీవేదవ్యాసునిచే‟వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్” అన్నట్లు అయిదవ వేదముగాను రచియింపఁబడి అనేక పురాణములయందుఁ గొనియాడఁబడిన శ్రీమహాభారతమున్ను శ్రీమద్రామాయణమువలెనే ప్రబలమైన ప్రమాణము. ఈవిషయమును నడువిల్ తిరువీధిప్పిళ్ళైభట్టరున్ను ప్రసాదించియున్నారు. పెరియ భట్టరుకూడ శ్రీసహస్రనామభాష్యమున ‟శ్రీరామాయణవన్మహాభారతంశరణం” (శ్రీరామాయణమునవలెనే మహాభారతమును రక్షకము) అని ప్రసాదించియున్నారు.

మూలమున ‟సర్వేశ్వరుఁడు”అని పేర్కొనక ‟దూత్యమునకుఁ బోయినవాఁడు” అనియిట్లు పేర్కొనుట యతనికిఁగల యాశ్రిత పారతంత్ర్యమును గాన్పించుటకుగానని యెఱుంగునది. దేవదేవుండగు తనయొక్క గొప్పతనమును, తానుచేయు కార్యమువలని చిన్నతనమును గమనింపకయే పాండవులకుగాను దూత్యమును వహించిపోయినది, ఆశ్రితులయెడల తనకుఁగల పారతంత్ర్యము

రుచిపరవశనాయిత్తే. ఇతునా నివనుడైయ ఆశ్రయణసౌకర్యాపాదకమాన నీర్మైకుక్కుడలాయిరు న్దళ్ళ వాత్సల్యాదికళుక్కెల్లామ్ ప్రకాశకమాయిరుప్పతొన్ఱిత్తే. ఇన్ద గుణాధిక్యత్తిలే ఈడుపట్టిత్తే "ఇన్నార్ తూతనెననిన్ఱాన్" ఎన్ఱుమ్ "నుడైమన్నరిడై నడన్దతూతా" ఎన్ఱుమ్ తిరుమఙ్గైయాళ్వారరుళిచ్చెయ్‌తతు. అన్ద దివ్యసూక్తియిత్తే ఇవరిప్పడియరుళిచ్చెయ్‌కైక్కు మూలమ్, పేశిన్ఱ పేశుక్కైయిత్తే ఇవర్కళుక్కేఱ్ఱమ్. తూతుపోనతు తన్మైయావతు - కర్మవశ్యతైయుడైయాక వరిలిత్తే, ఇచ్ఛయాక ఆశ్రితవిషయత్తిల్ శెయ్‌కిఱతాళ్చ్చియెల్లామ్ ఏఱ్ఱత్తుక్కుడలాయిత్తే యిరుప్పతు. "సఉ శ్రేయాన్భవతి జాయమానః" ఎన్ఱు పరార్థమాక ప్పిఱక్కైయాలే నిఱమ్ పెఱుమెన్ఱు శ్రుతిశొన్నవితు, పరార్థమాక త్తన్నైచ్చెయ్యాలే శెయ్యుమవైయెల్లామివనుక్కు తేజస్కరమన్నుమితుక్కుపలక్షణమిత్తే. ఇవన్ శెయ్‌త దూత్యత్తై మాన్ద్యహేతువాక నినైప్పార్, అఱివుకేడరిల్ తలైయానవర్కళిత్తనై; అఱివిల్ తలైనిన్ఱవర్కళ్, "ఎత్తిఱమ్" ఎన్ఱు మోహిక్కుమ్పడియాయిత్తే యిరుప్పతు; ఇప్పడియిరున్దుళ్ళ ఇన్నర్మైయిలేఱ్ఱత్తై వెళియిడుకైక్కాకవాయిత్తు ఇవర్ "తూతుపోనవన్" ఎన్ఱరుళిచ్చెయ్‌తతు. మహాభారతమెల్లామ్ ఇవనుడైయ వేఱ్ఱమ్ శొల్లుకైయిలే తత్పరమాకైయాలే యిత్తే, మహాభారతత్తై శొల్లత్తుడఙ్గుకిఱవన్ "నారాయణకథామిమామ్"; ఎన్ఱతు. ఆక ఇప్పిరబన్ధవ్యాఖ్యత్తుక్కుమ్ ప్రధానప్రతిపాద్యఙ్గళ్ ఇవై ఎన్నుమిడమ్ ప్రకాశిప్పిక్కప్పట్టతు.

---

నందలి రుచిచే పరవశుండై గదా! ఇది యొక్కటియే గదా వీని నాశ్రయించు విషయమున నొక సౌకర్యమును గలుగఁజేయునట్టి కారుణ్యమునకు సహాయకములగు వాత్సల్యాది గుణంబుల నన్నింటిని ప్రకటింపఁజేయునది. ఇట్టి గుణాతిశయవిషయమునఁ గలప్రీతిచేతనే కదా! శ్రీతిరుమంగైయాళ్వారులు "ఇన్నార్ దూతనెననిన్ఱాన్" (వీరిదూతయని పిలువఁబడువాఁడు) అనియు, "నుడైమన్నరిడైనడన్దదూతా" (ఛత్రచామరాదులుగల దుర్యోధనాదులమధ్యను దూత్యమునకుఁబోయినవాఁడా) అనియును ప్రసాదించియున్నారు. వీరి దివ్యసూక్తియే గదా శ్రీపిళ్లైలోకాచార్యులవారిట్లు "దూత్యమునకుఁ బోయినవాఁడు" అని సాయించుటకు మూలము. ఒకరు సాయించినదానిని సాయించుటచే గదా! వీరికి గౌరవము. కర్మవశమున దూత్యమునకుఁ బోయినచోఁ గదా యది యొక నీచత్వముగా నెన్నఁబడును. స్వేచ్ఛాపూర్వకముగాఁ దనయాశ్రితుల విషయమునఁ జేయుకార్యములన్నియును గౌరవమునకు సహాయకములై కదా యుండును. "స ఉ శ్రేయాన్భవతి జాయమానః" (అట్టివాఁడు అవతరించి శ్రేయస్సుగలవాఁడగుచున్నాఁడు) అని యిట్లు పరులకుగాను జన్మించుటను శ్రేయస్కరముగాను శ్రుతి తెలుపుట యనునది పరులకుగాను తనయిచ్ఛచేఁజేయునవి యన్నియును యీతనికి తేజస్కరములుగా నుండుననుటకు దాఖలా గదా! ఈతఁడొనర్చిన దూత్యమును మాంద్యమునుగాఁ దలంచువారు మూర్ఖాగ్రేసరులు. జ్ఞానులో, దీనిఁదలంచి, "ఎత్తిఱం" (తి.౧.౩.౧)(ఏమాశ్చర్యమో!) అని మోహింపవలసినట్లుగానే కదా యుండును. ఇట్టి యీ కార్యముయొక్క మహిమను ప్రకాశింపఁజేయుటకై యే వీరు దూత్యమునకుఁ బోయినవాఁడు అని ప్రసాదించినారు. మహాభారతమంతయును ఈతని సమాచారముఁ దెలుపుటయే ముఖ్యవిషయముగాఁ గలదియగుటంజేసియే కదా మహాభారతకథఁ జెప్పఁబూనిన శ్రీవేదవ్యాసుఁడు "నారాయణకథామిమాం" (నారాయణుని వృత్తాంతమును చెప్పుచున్నాను) అని యారంభించినాఁడు. కావున ఈగ్రంథమునఁ బ్రతిపాదింపఁబడు విషయము లివ్వియనెడి యంశము ఈపైని చెప్పినదానిచేఁ దెలుపఁబడినది.

మూ॥ ఇవైయిరణ్డాలుమ్.

ఉపబృంహణముఖేన వేదాన్తతాత్పర్యత్తై నిష్కర్షిత్తు ఉజ్జీవనత్తుక్కుడలానవత్తై చ్చొల్లువతాకవిఱే ఉపక్రమిత్తతు; అతిలిప్పోతు శొన్నవివత్తాల్ వేదాన్తత్తిల్ వ్వర్థజ్గళ్ శొల్లిత్తో యిత్తెన్ను మాకాఙ్క్షైయిలే యరుళిచ్చెయ్‌కిఱార్ మేల్, (ఇవై) ఎన్ఱుతుడజ్గి. అతావతు, "శిఱైయిరున్దవళేత్తమ్" "తూతుపోనవనేత్తతు" ఎన్ఱ ఇవైయిరణ్డాలుమ్ అపరాధభూయిష్ఠరాన చేతనర్కాశ్రయణీయైయాయుమవిల్, అఖిలజగన్మాతావాన సమ్బన్ధత్తాలుమ్ కృపాదికళాలుమ్, నడువాఱుపురుషకారమ్ వేణ్డాతపడి తన్నాశ్రయిక్కలామ్పడియాయ్, అపరాధజ్గళైప్పార్త్తుచ్చీఱి, "క్షిపామి" "నక్షమామి" ఎన్ను మీశ్వర హృదయత్తై త్తిరుత్తి, అవర్కళై యఙ్గీకరిప్పిక్కుమ్ పురుషకారభూతైయానవళ్ వైభవముమ్, అఙ్గీకరిత్తాల్, పిన్నైయవళ్ తానే శితకురైక్కిలుమ్, "ఎన్నడియార్ అతు శెయ్యార్" ఎన్ఱు మఱుతలైత్తు త్తాణ్ణియనాయ్ నిన్ఱు రక్షిక్కు ముపాయభూతనానవన్ వైభవముమ్ శొల్లిత్తాయిత్తెన్ఱ్ "పురుషకారమ్" ఎన్ఱుమ్ "ఉపాయమ్" ఎన్ఱుమ్ ఇవత్తై నిరూపకమాకవరుళిచ్చెయ్‌తతు, పిరాట్టిక్కు ప్పురుషకారత్వముమ్, ఈశ్వరనుక్కు ఉపాయత్వముమ్ అసాధారణమెన్ఱు తోఱ్ఱుకైక్కాక. ఇతుతన్నై "మత్ప్రాప్తిం ప్రతిజన్తూనాం సంసారేపతతామధః। లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః। మమాపిచమతం హ్యేతత్ నాన్యథా

మూ॥ ఈరెంటిచేతను

ఉపబృంహణములద్వారా వేదాంతముల తాత్పర్యమును నిశ్చయించి ఉజ్జీవనమునకుఁ గావలసినవాటిని తెలియఁజేయుటకుఁగానే కదా యీగ్రంథము నారంభించినది. కావున ఈపైనిగనబఱచినదానివలన వేదాంతమునందలి రహస్యార్థములు చెప్పఁబడినవి యని యడిగితివేని యావిషయమును "ఇవై" ఇత్యాదివాక్యముచేఁ దెలుపుచున్నారు. అది యెట్లనిన, "చెరయందున్నయామె మాహాత్మ్యము" అనియు "దూత్యమునకుఁ బోయినవాని మాహాత్మ్యము" అనియు నీరెండు వాక్యములయందును ఎక్కువ అపరాధపడియుండు యీచేతనులువచ్చి యాశ్రయించునపుడు, అఖిలజగన్మాతయగు సంబంధమువలనను కృపాదులవలనను మధ్యను వేఱొక్క పురుషకార మక్కఱలేకుండవచ్చి యాశ్రయింపఁ దగినదియు, అపరాధములఁ జూచి "క్షిపామి" (త్రోసివేయుదును) "నక్షమామి" (క్షమింపను) అను వాఁడగు నీశ్వరుని హృదయమును దిద్దుపాటుచేసి అనఁగా వాని కోపముఁ బోగొట్టి వారిని యంగీకరింపఁ జేయునట్టి పురుషకారముయొక్క (పిరాట్టియొక్క) వైభవమును, ఒకవేళ సర్వేశ్వరుండు అంగీకరించినను, పిమ్మట (పరీక్షార్థము) ఈపెయే వారియెడల నెద్దియైన నొకతప్పును గానిపించినట్లయిన, "ఎన్నడియారతుశెయ్యార్" (పెరి.తి.౪౯.౨)(నాదాసులట్టిపనులఁ జేయరు)అన్నట్లు ఎదిరించి, తాను చలింపకయుండి రక్షించునట్టి యుపాయమగు వాని (సర్వేశ్వరుని) వైభవమును చెప్పఁబడినవి. మూలమున "పురుషకారమ్" అనియు "ఉపాయమ్" అనియు వీటిని నిరూపకములనుగాఁ జేర్కొనుట అనఁగా ప్రసిద్ధములగు లక్షణములనుగాఁ జేర్కొనుట యనునది పిరాట్టికి పురుషకారత్వమును సర్వేశ్వరునికి ఉపాయత్వమును అసాధారణములగుటను బట్టి (వారికిమాత్రమే యుండునవి యగుటనుబట్టి) యని యెఱుంగునది. ఈవిషయమే శ్రీపాంచరాత్రమున, "మత్ప్రాప్తిం ప్రతిజన్తూనాం సంసారే పతతామధః। లక్ష్మీః పురు

మూ॥ పురుషకారవైభవముమ్ ఉపాయవైభవముమ్ శొల్లిట్రాయిత్తు.

---

లక్షణం భవేత్" ఎన్నుమ్, "అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాల్లక్ష్మీపతిస్స్వయమ్। లక్ష్మీః పురుష
కారేణ వల్లభా ప్రాప్తియోగినీ। ఏతస్యాశ్చ విశేషోఽయం నిగమాన్తేషు శబ్ద్యతే" ఎన్నుమ్, "అకి
ఞ్చనైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః। మత్పదామ్భోరుహద్వన్ద్వం ప్రపద్య ప్రీతమానసాః।
లక్ష్మీం పురుషకారేణ వృతవన్తో వరానన। మత్క్షమాం ప్రాప్య సేనేశ ప్రాప్యం ప్రాపకమేవ మామ్
లబ్ధ్వా కృతార్థాః ప్రాప్స్యన్తే మామేవానన్యమానసాః" ఎన్ఱు భగవచ్ఛాస్త్రత్తిలే తానేయరుళిచ్చె
య్దానిఱే. మఱ్ఱై ప్పిరాట్టిమార్కళుక్కుమ్ సూరికళ్ ముతలాన తదీయర్కళుక్కుమ్, ఇవళై సమ్బన్ధ
మడియాక వన్ద పురుషకారత్వమిఱే యుళ్ళతు; ఇవళుక్కే స్వతస్సిద్ధమన్ఱే. ఆకైయిఱే
"ఏతత్సాపేక్షసమ్బన్ధాదన్యేషామమలాత్మనామ్। దేవీసూరిగురూణాఞ్చ ఘటకత్వం నతు స్వతః"
ఎన్ఱు దీపసఙ్గ్రహత్తిలే జీయరరుళిచ్చెయ్తతు. ఉపాయత్వముమ్ "కృష్ణం ధర్మం సనాతనమ్" ఎన్ఱు
సనాతన ధర్మమాక చ్చొల్లప్పడుకిఱవనుక్కు స్వతస్సిద్ధమాయ్, తదీయర్కళుక్కు తద్భక్తియాడి
యాక వన్దతిఱే యుళ్ళతు; ఆకైయాల్ పిరాట్టిక్కు పురుషకారత్వముమ్, ఈశ్వరనుక్కు

---

మూ॥ పురుషకారవైభవమును ఉపాయవైభవమును చెప్పఁబడినవి.

---

పురుషకారేణ సిద్ధాపరమర్షిభిః। మమాపి చ మతం హ్యేతన్నాన్యథా లక్షణం భవేత్" (నన్నుపొందు
టయందు వనిలోనున్న సంసారమునఁబడినట్టి జీవులకుఁగాను పురుషకారముగా లక్ష్మీ మహర్షులచే గాన్పిం
చఁబడినది. నాకును నదియిష్టము. ఆపెకు యిదియే లక్షణము తప్ప వేఱొక్కటి లక్షణము కాదు)
అనియు, "అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాల్లక్ష్మీపతిస్స్వయమ్। లక్ష్మీః పురుషకారేణ వల్ల
భా ప్రాప్తియోగినీ। ఏతస్యాశ్చ విశేషోఽయం నిగమాన్తేషు శబ్ద్యతే" (లక్ష్మీపతియగు నేనే సాక్షా
త్తుగ నన్ను పొందుటకుఁ గారణము. నాకు భార్యయగు లక్ష్మీ నన్ను పొందించును. నాకన్న
పిరాట్టికిన్ని యిదియే విశేషము. నేను ఉపాయము. ఆపె పురుషకారము.) అనియు, "అకిఞ్చ
నైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః మత్పదామ్భోరుహద్వన్ద్వం ప్రపద్య ప్రీతమానసాః లక్ష్మీం
పురుషకారేణ వృతవన్తో వరానన మత్క్షమాం ప్రాప్య సేనేశ ప్రాప్యం ప్రాపకమేవ మాం। లబ్ధ్వా
కృతార్థాః ప్రాప్స్యన్తే మామేవానన్యమానసాః (కొందఱు నిరుపేదలును మఱికొందఱు భాగ్యవం
తులు నన్నాశ్రయించి సంతోషించినవారై లక్ష్మిని పురుషకారముగా వరించుచున్నారు. ఓ సేనే
శుఁడా! వీరు నన్నే ప్రాప్యముగాను ప్రాపకముగాను కాని వేఱొక్క బుద్ధిలేనివారై కృతార్థులై
నన్ను పొందుచున్నారు.) అనియును భగవంతుఁడే చెప్పుచున్నాఁడుగదా! తక్కిన దేవులకును నిత్య
సూరులు మొదలగు భాగవతులకును ఈపె సంబంధమును బట్టియే పురుషకారత్వము గలదుగాని ఈ
పెవలెనే వారికి స్వతస్సిద్ధముగ పురుషకారత్వము లేదు. కావుననే "ఏతత్సాపేక్ష సంబంధాదన్యే
షా మమలాత్మనాం దేవీ సూరిగురూణాంచ ఘటకత్వం నతుస్వతః" (తక్కిన దేవులకును నిత్యసూరు
లకును ఆచార్యులకును ఈపెను బట్టియే పురుషకారత్వము కలదుగాని వారికి స్వతస్సిద్ధముగ లేదు) అని
తత్త్వదీపసంగ్రహమను గ్రంథమున జియ్యర్ ప్రసాదించియున్నారు, "కృష్ణం ధర్మం సనాతనం" అన్న
ట్లు సనాతన ధర్మముగాఁ జెప్పఁబడినట్టి సర్వేశ్వరునికే స్వతస్సిద్ధమగు నుపాయత్వము కలదు
తక్కినవారికది వానియెడల భక్తినిబట్టిగదా కలదు. కావున పిరాట్టికి పురుషకారత్వమున్ను ఈశ్వ

ఉపాయత్వముమ్ నిరూపకమాక త్తట్టిల్లై; ఇవ్వర్థత్తై వెళియిడుకైక్కాక వాయిన్ఱు ఇవరిప్పడి యరుళిచ్చెయ్‌తతు.

ఇప్పడి యుపబృంహణమాన ప్రబన్ధద్వయత్తాలుమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱ పురుషకారత్వము ముపాయత్వముమ్, ఉపబృంహ్యమాన వేదాన్తత్తిలుక్తమాన స్థలమేతెన్నిల్, కఠవల్ల్యుపనిషత్సిద్ధమాన ద్వయత్తిల్ పూర్వవాక్యత్తిలే ఉభయముమ్ శేరవుక్తమిఱే.

ఇచ్చేతననుక్కు ఇరువరోడుమ్ సమ్బన్ధముణ్డాయిరుక్క ఈశ్వర సమాశ్రయణత్తుక్కు ఇవళ్ పురుషకారమాక వేణ్డుకిఱతెన్నెన్నిల్, మాతృత్వప్రయుక్తమాన వాత్సల్యాతిరేకత్తాలుమ్, అవనైప్పోలే కాఠిన్యమార్దవఙ్గళ్ కలన్దిరుక్కైయన్ఱిక్కే కేవలమ్ మార్దవమేయాయ్, పిఱర్ కణ్ణుళిర్వు కాణమాట్టాత ప్రకృతియాకైయాలుమ్, విముఖరైయుమ అభిముఖరాక్కైక్కు కృషిపణ్ణుమవళాకైయాలుమ్, కుఱ్ఱవాళర్క్కుమ్ కూశాముఱ్పణ్డు కాలిలే విఴలామ్పడి యిఴుస్సాళాయ్, పుంస్త్వప్రయుక్తమాన కాఠిన్యత్తోడే పితృత్వప్రయుక్తమాన హితపరతైయై యుముడైయనాయ్, కుఱ్ఱఙ్గళై ప్పొఱుత్తుమ్ పత్తాక్కణక్కిట్టు ప్రారిదణ్డఙ్గళై ప్పణ్ణుకైయాలే, కుఱ్ఱవాళర్కు మున్ శెల్లక్కు శల్కరిక్కుమ్పడి యిరుక్కుమీశ్వరనై, ఉచితోపాయఙ్గళాలే కుఱ్ఱఙ్గళై మఱప్పిత్తు కూట్టివిడుమవళుమాయిరుక్కైయాలే, అపరాధమేవడివాన విచ్చేతనన్ అవనై యాశ్రయిక్కుమళవిల్ ఇవళ్ పురుషకారమాక వేణుమ్, ఆకైయిఱే, అవనై ఉపాయమాకవరిక్కుమ్ విఴికిఱవళవిల్ ఇవళై ప్పురుషకారమాక మున్నిడుకిఱతు.

అనన్తరమ్ పురుషకారత్వత్తై విస్తరేణ ఉపపాదిక్కిఱార్, ప్రథమత్తిలే పురుషకా

---

రునికి ఉపాయత్వమున్ను నిరూపకములగుట అనఁగా వారికవి యసాధారణములయినవగుటను భాధకము లేదు. అందువలననే మూలమున నట్లు ప్రసాదించియున్నారు.

ఇట్లు ఉపబృంహణములగు రెండు గ్రంథములయందును ప్రతిపాదింపఁబడునట్టి పురుషకారత్వమున్ను, ఉపాయత్వమున్ను ఉపబృంహ్యమగు వేదాంతమున నెచ్చట చెప్పఁబడినవిగాని యడిగితివేని, యవి కఠవల్ల్యుపనిషత్తునందుఁ జెప్పఁబడిన ద్వయముయొక్క పూర్వవాక్యమునఁ జెప్పఁబడినవిగదా! ఈశ్వరునికి చేతనులతోను సంబంధముండఁగా, వీరు ఈశ్వరునాశ్రయించుటలో పిరాట్టి పురుషకారము కావలసిన యావశ్యకమేమున్నదంటివేని, పిరాట్టి తల్లియగుటంజేసి యామె యెక్కువ వాత్సల్యమును మార్దవమును (దయార్ద్రతను) గలది. సర్వేశ్వరునివలెనే కాఠిన్యమును మార్దవమును ఈ రెండును చేరియుండునది కాక, కేవలము మార్దవము గలది. ఇతరుల దుఃఖములఁ జూచి సహింపఁజాలని స్వభావము గలది. విముఖులై పోవువారికిన్ని అభిముఖులనుగాఁ జేయుటకై ప్రయత్నించునది. పాపులగువారు మాట్లాడకుండవచ్చి యాశ్రయింపఁదగినది. సర్వేశ్వరుఁడన్ననో, పురుషుఁడగుటచే స్వతస్సిద్ధమగు కాఠిన్యముతోఁ గూడ పితయగుటచే నుండునట్టి హితదృష్టియును గలవాడు. తప్పులను పదిపదిగా గుణించి శిక్షాదండనములను విధించువాఁడు. అపరాధులు దగ్గరకుపోవలయునన్న భయపడుదురు. ఈమె యట్టియపరాధముల నన్నిఁటిని మరపించి, యీ చేతనుని సర్వేశ్వరునితోఁ జేర్చునది. కావున అపరాధభూయిష్ఠుఁడగు ఈ చేతనుఁడు సర్వేశ్వరుని యాశ్రయించునపుడు పిరాట్టియొక్క పురుషకారము అవశ్యకము. కావున సర్వేశ్వరుని యుపాయముగాను వరించునపుడు ఈమెను పురుషకారముగాను ముందుంచుకొనునది.

**అవతారిక:**—అనంతరము పురుషకారముగు విధములను విస్తరముగ నుపపాదింపఁదలంచి,

సూ॥ 8॥ పురుషకారమామ్బోతు కృపైయుమ్, పారతన్త్ర్యముమ్ అనన్యార్హత్వముమ్ వేణుమ్.

రత్వత్తుక్కు అవశ్యాపేక్షిత గుణఙ్గళై యరుళిచ్చెయ్కిఱార్. (పురుషకారమామ్బోతు) ఎన్ఱుతుడఙ్గి. (పురుషకారమామ్బోతు) ఎన్ఱతు-పురుషకారమామిడత్తిలెన్నపడి. కృపైయావతు - పరదుఃఖాసహిష్ణుత్వమ్. పారతన్త్ర్యమావతు . పరాధీనత్వమ్. అనన్యార్హత్వమావతు - తద్వ్యతిరిక్త విషయానర్హత్వమ్. ఇవై పురుషకారత్తుక్కు వశ్యాపేక్షితమానపడి యెన్నెన్నిల్, చేతనర్ సంసారత్తిల్ పడుకిఱ దుఃఖమ్ కణ్డు పొఱుక్కమాట్టామల్ ఈశ్వరనోడే ఇవర్కళై చ్చేర్క్కైక్కుడలాన యత్నమ్ పణ్ణుకైక్కు కృపై వేణుమ్; స్వతన్త్రనై వశీకరిక్కుమ్బోతు అనువర్తనత్తాలే వశీకరిక్క వేణ్డుకైయాలే పారతన్త్ర్యమ్ వేణుమ్; నమ్మ్మైయొఴిన్ద తొరువిషయత్తు క్కర్హమన్ఱియే నమక్కే యతిశయకరమాయిరుక్కుమ్ వస్తువాకైయాలే నజ్కార్యమ్నో శొల్లుకిఱతు ఎన్ఱు, శొన్నపడివర్త్తిక్కైక్కుఱుప్పాకైయాలే అనన్యార్హత్వమ్ వేణుమ్; ఆకైయాలివై మూన్ఱుమ్ పురుషకారత్వత్తుక్కు వశ్యాపేక్షితమిఱే.

ఈశ్వరకృపైయుట్కొట్కిల్ ఇవళ్ కృపైక్కు విశేషమెన్నెన్నిల్, ఈశ్వరనానాల్ నిరఙ్కుశ స్వతన్త్రనాయ్, నిగ్రహానుగ్రహసమర్థనాయ్, చేతనకర్మఙ్గళై నిఱుత్తుత్ తీర్ప్పువనాకైయాలే, అవనుడైయ కృపై స్వాతన్త్ర్యత్తాలే అముక్కుణ్డుకిడన్దు ఓరొరుదశైకళిలే

సూ॥ 8॥ పురుషకారమగునపుడు కృపయును, పారతన్త్ర్యమును అనన్యార్హత్వమును కావలయును.

ప్రథమమున పురుషకారమగుట కవశ్యముగఁ గావలశిన గుణములను "పురుషకారమామ్బోతు" ఇత్యాదివాక్యముచే ప్రతిపాదించుచున్నారు.

మూలమున "పురుషకారమామ్బోతు" అనఁగా "పురుషకారమగునపుడు" అనియర్థము. "కృపై" అనఁగా పరులదుఃఖములఁజూచి సహింపఁజాలకుండుట. పారతన్త్ర్యమనఁగా, పరాధీనము గానుండుట. అనన్యార్హత్వమనఁగా వేఱొక్క విషయమున కర్హముకానిది యగుట. ఇవి పురుషకారమగుటలో నవశ్యముగ నేల కావలయునంటివేని, చేతనులీసంసారమునఁబడుదుఃఖములఁజూచి సహింపఁజాలక యీశ్వరునితో వీరిఁజేర్చుటకుఁ దగిన ప్రయత్నముఁ జేయుటకుగాను ఈమెకు కృపయుండియుండవలయును. స్వతంత్రుని వశపరచుకొనవలయునన్న ననువర్తనమువలన నే వశపరచుకొనవలయునుగాన, అందులకై యీమెకు పారతంత్ర్యముండియుండవలయును. మనపయినుమున తప్ప వేఱొక్క విషయమున కర్హముకానిదై మనకే యొకిమంచిని గలుగఁజేయునది యగుటంజేసి యీమె చెప్పునది మనపని కాదా యని తలంచి యీమె చెప్పునట్లు చేయుట కనుకూలమగుటంజేసి యనన్యార్హత్వ మావశ్యకము. కావున ఈపైని గనఁబఱచిన మూఁడు గుణములు పురుషకారమగుట కవశ్యము కావలశినవి,

ఈశ్వరుని కృపకంటెను ఈమెయొక్క కృపకుఁగల విశేషమెద్దియనఁగా—ఈశ్వరుఁడు నిరంకుశస్వతంత్రుఁడు. నిగ్రహానుగ్రహ సమర్థుఁడు. చేతనుల కర్మములను తూచి యింతయని నిశ్చయించి యనుభవింపఁజేయువాఁడు. కావున వాని కృపయనునది వానికిఁగల స్వాతంత్ర్యము

తన్నైయొడుక్క క్కడవతాయిరుక్కుమ్; ఇవళ్ అనుగ్రహైకశీలైయాకైయాలే, ఇవళుడైయ కృపైక్కు వేఱొన్ఱాల్ ఒరభిభవమిల్లామైయాలే ఎప్పోదుమ్ మొరుపడిప్పట్టిరుక్కుమ్; అకైయాలివళుడైయ కృపై కరైయుడైన్దిరుక్కుమ్. సమ్బన్ధత్తిల్ వ్యావృత్తిపోలే యీశ్వరన్ కృపైయిల్ వ్యావృత్తియుమ్. ఇప్పడి యిరుక్కైయాలే యిఱే ఇవళైయాశ్రయిప్పార్క్కు వేఱొరు పురుషకారమ్ తేడవేణ్డాతొழிకిఱదు. ఈశ్వరవిషయత్తిల్ ఇవళుడైయ పారతన్త్ర్యానన్యార్హత్వఙ్గళుమ్ స్వరూపప్రయుక్తమాన మాత్రమన్నిక్కే, "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" ఎన్నుమ్ "విష్ణుపత్నీ" ఎన్నుమ్ శొల్లుకిఱ పత్నీత్వప్రయుక్తమానవుమ్, "అహన్తా బ్రహ్మణస్తస్య సాఽహమస్మి సనాతనీ" ఎన్నుమ్, "శ్రీవత్సవక్షా నిత్యశ్రీః" ఎన్నుమ్ శొల్లుకిఱ స్వరూపనిరూపకత్వాది సిద్ధమాన అనన్యత్వప్రయుక్తమానుమిరుక్కుమ్; ఇప్పడియిరుక్కైయాలేయిఱే అల్లాతార్క్కుడైయ మినువశేషత్వముమ్, ఇవళోడొత్తిరుక్కుమ్ తదేకశేషత్వమాయిఱ్ఱు. ఇన్ద అవ్యవధానేన పుణ్డరీకమ్బన్తత్తాలే యిఱే, ఇవళుక్కు త్వాన్ఱై విశేషణమాకిల్ పురుషకారమ్ వేణ్డాతొழிకిఱదు.

ఇమ్మూన్ఱు గుణత్తిలుమ్ వైత్తుక్కొణ్డు కృపైయావదు—"శ్రిఞ్ సేవాయామ్" ఎన్గిఱ ధాతువిలే నిష్పన్నమాన శ్రీశబ్దత్తిల్ "శ్రీయతే" ఎన్గిఱ కర్మణివ్యుత్పత్తియాలుమ్, పారతన్త్ర్యానన్యార్హత్వఙ్గళుమ్, "శ్రయతే" ఎన్గిఱ కర్తరివ్యుత్పత్తియాలుమ్ నిత్యయోగవాచియాన మతుప్పాలుమ్ సిద్ధమిఱే.

---

వలన సంకోచించినదై యొకానొక సమయమున ప్రకాశించును. ఈమెయో, అనుగ్రహైకస్వభావముగాఁగలది. ఈమె కృపకు వేఱొకదానివలన సంకోచ మెన్నడియును లేదు. కావున నది యెల్లకాలము నొక్కవిధమైనదిగానే యుండును. కావున ఈమె కృప నిండుగానుండునని యెఱుంగునది. చేతనుల కీశ్వరునితోఁగల సంబంధముకంటెను పిరాట్టితోఁగల సంబంధము విలక్షణమైనదయినట్లు పిరాట్టికిఁగల కృపయును విలక్షణమైనది. ఇట్లుండుటంజేసియే ఈమెను ఆశ్రయించువారలు అంతకంటె వేఱొక్క పురుషకారము వెదకనక్కఱలేదు. ఈశ్వరుని విషయమున ఈమెకుఁగల పారతంత్ర్యమును అనన్యార్హత్వమును నివి స్వరూపమునుబట్టియుండునవి మాత్రమే కాక, "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" (పురుషసూ) (భూమియును లక్ష్మియును నీ భార్యలు)" అనియు "విష్ణుపత్నీ" (శ్రీసూ) (విష్ణుపత్ని) అనియును చెప్పియున్నట్లు పత్నీత్వమును బట్టియును ఉండునవై "అహన్తా బ్రహ్మణస్తస్య సాహమస్మి సనాతనీ" (బ్రహ్మమునకు శక్తిగానుండి యెల్లకాలము బ్రహ్మముతో నుండినది). అనియును, "శ్రీవత్సవక్షా నిత్యశ్రీః" (శ్రీవత్సము వక్షస్థలమునఁగలవాఁడును ఎల్లకాలము లక్ష్మిగలవాఁడును) అనియును చెప్పియున్నట్లు స్వరూపమును బట్టి యుండునదియు అనన్యత్వమును బట్టియును ఉండునవి. ఇట్లుండుటంజేసియే యితరులందఱును మనవారికి శేషభూతులై ఈమె మాత్రము సర్వేశ్వరుని కొక్కనికే శేషభూతురాలు. వీరిద్దఱికిని సామీప్యముండుటంజేసియే ఈమె యీశ్వరుని విషయమునకు నాటుకగాను వేఱొక్క పురుషకారమక్కఱలేదు.

ఈపైని గనఁబఱచిన మూఁడు గుణములలో, కృపయనునది ద్వయమున "శ్రీమతే" అను తావున "శ్రిఞ్ సేవాయాం" అను ధాతువునుండి నిష్పన్నమగు "శ్రీ" శబ్దముయొక్క "శ్రీయతే = ఆశ్రయింపఁబడునది" అను కర్మణివ్యుత్పత్త్యర్థమునను, పారతంత్ర్యానన్యార్హత్వములు "శ్రయతే = ఆశ్రయించునది." అను కర్తరివ్యుత్పత్త్యర్థమునను నిత్యసంబంధమును తెలుపునది "మతుప్" ప్రత్యయమునుండియును తెలియవచ్చునవి గదా.

**మూ॥ ర॥ పిరాట్టి ముఱ్పడ ప్పిరిన్దతు-తన్నుడైయ కృపైయై వెళియిడుకైక్కాక;**

---

ఇన్ద కృపాదిత్రయత్తైయుమ్ మెల్లాయ్ మఱైయుమ్పడి తానే వెళియిట్టరుళిన వైభవత్తై, శ్రీరామాయణత్తిల్ ఇవళుక్కు వన్ద విశ్లేషత్రయత్తాలుమ్ దర్శిప్పిక్కిఱార్ మేల్, (పిరాట్టి) ఎన్ఱు తొడఙ్గి వాక్యత్రయత్తాలే.

(పిరాట్టి ఇత్యాది) అతావతు - "దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ। విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుమ్" ఎన్ఱు అపడియే నాయకనాన సర్వేశ్వరనుడైయ తత్తదవతారసజాతీయమాన విగ్రహపరిగ్రహమ్ పణ్ణి అవతరిక్కుమవళాకైయాలే, "రాఘవత్వేఽభవత్సీతా" ఎన్ఱుపడియే అవన్ చక్రవర్తి తిరుమకనానవాఱే తదనురూపమాక త్తానుమ్ జనకరాజన్ తిరుమకళాన పిరాట్టి, దణ్డకారణ్యత్తిలే ఎழுన్దరుళియిరుక్కచ్చెయ్తే, రావణన్ పిరిత్తానెన్ఱు వ్యాజత్తాలే ప్రథమమ్ పెరుమాళై ప్పిరిన్దు లఙ్కైక్కు ఎழுన్దరుళిగ్గతు, "దేవ్యా కారుణ్యరూపయా" ఎన్ఱు త్త్వమసారత్వత్తాలే కారుణ్యనాన్ ఎన్నుమ్పడియాన తన్నుడైయ పరమకృపైయై ప్రకాశిప్పిక్కైక్కాకవన్ఱే. ఎఙ్గనేయెన్నిల్, దేవస్త్రీకళై శిఱైయైవిడువిక్కైక్కాకత్తాన్ శిఱైయిరుక్కైయాలుమ్; అవ్విరుప్పిలే తన్నై ఆల్లుమ్ పకలుమ్ తర్జనభర్త్సనమ్ పణ్ణియరువిత్తిన క్రూరరాక్షసికళ్, రావణన్ పరాజితనాకవుమ్ పెరుమాళ్ విజయికళాకవుమ్ త్రిజటై స్వప్నమ్

---

మూ॥ ర॥ పిరాట్టి మొదట విశ్లేషించుట తనయొక్క కృపను బయలుపఱచుటకు గాను

---

అవతారిక:—ఈ కృపమొదలగు మూఁడు గుణములను అందఱికిని తెలియునట్లు తానే బయలుపఱచినట్టి వైభవమును శ్రీరామాయణమున ఈమెను గూర్చి చెప్పఁబడిన మూఁడు విశ్లేషములను బట్టి, "పిరాట్టి" ఇత్యాది వాక్యత్రయముచే గాన్పింపఁబోవుచున్నారు.

("పిరాట్టి" ఇత్యాది) "దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ। విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాత్మనస్తనుం" (వి. పు. ౧. ౯. ౧౪౫.) (దేవతగా నవతరించినప్పుడు దేవశరీరిగాను మనుష్యుఁడుగా నవతరించినప్పుడు మనుష్యశరీరిగాను నివ్విధమున విష్ణువుయొక్క దేహమున కనుగుణమగు శరీరమును ధరించునది) అని చెప్పఁబడియున్నట్లు నాయకుఁడగు సర్వేశ్వరునియొక్క యాయా యవతారములతో సజాతీయమగు శరీరమును ధరించి యవతరించునదైయుండుటవలన "రాఘవత్వేఽభవత్సీతా" అన్నట్లు సర్వేశ్వరుండు శ్రీరాముఁడుగా నవతరించిన తోడనే తానును అందుల కనుగుణముగ శ్రీజనకచక్రవర్తి కుమార్తెగా నవతరించినట్టి యీమె దండకారణ్యమున వేంచేసినప్పుడు రావణుండు పట్టికొని పోయినాఁడనెడి యొక మిషతో మొదట పెరుమాళ్ళనువదలి లంకకుఁబోయి యుండుటయనునది "దేవ్యా కారుణ్యరూపయా" (లక్ష్మీతం. ౫౦-౧౪.) (కారుణ్యస్వరూపియగు దేవితో) అన్నట్లు కారుణ్యమే యని పిలువఁదగినట్టి తనయొక్క పరమకృపను ప్రకాశింపఁజేయుటకు గానని యెఱుంగునది.

అదియెట్లనిన, దేవస్త్రీలను చెఱనుండి విడిపించుటకుగాను తాను చెఱలోనుండుటవలనను, అట్టి సమయమున తనను రేయుంబగళ్లు తర్జన భర్జనములచే నెక్కువ శ్రమపెట్టిన క్రూరులగు రాక్షసస్త్రీలు, రావణుఁడు పరాజయమును బొంది పెరుమాళ్లు జయమును బొందినట్లు త్రిజటయను

మూ॥ నడువిల్ పిరిన్దతు

కణ్ణత్తాలే భీతభీతైకళాయ్ నడుఙ్గుకిఱపడియిలే, "భవేయం శరణం హి వః" ఎన్ఱు - శీఘ్రం నోవు పడుమ్ సమయత్తుక్కు నానిరుక్కనే శిఙ్గళ్ ఇవేణ్డా ఎన్ఱు అభయప్రదానమ్ పణ్ణుకైయాలుమ్; అతు ఉక్తిమాత్రమాయ్ప్పోకామే, రావణవధానన్తరమ్ తనక్కు శోభనమ్ శొల్ల వన్ద తిరువడి, "ఇవర్కళై చిత్రవధమ్ పణ్ణుమ్పడి కాట్టిత్తరవేణుమ్" ఎన్న, అవనోడే మల్లాడి "రాజసంశ్రయవశ్యానామ్" ఇత్యాదియాలే-అవర్కళ్ కుఱ్ఱత్తై గుణమాక ఉపపాదిత్తుమ్ "మర్షయామీహ దుర్బలాః" ఎన్ఱు పిఱర్ నోవుకణ్డు పొఱుక్కమాట్టాత నెఞ్జురమ్ తనక్కుణ్డాయిరున్నపడియుమ్, "కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి" ఎన్ఱు అవనుక్కు మిరక్కియుణ్డాక నిఱ్కుమ్పడి ఉపదేశిత్తుమ్, ఇప్పడి యిరునిలైనిన్ఱు తానడియిట్టుప్పోన ప్రతిజ్ఞానుగుణమాక, ఆర్ద్రాపరాధైకళానవర్కళై రక్షిక్కైయాలుమ్ తన్నుడైయ కృపైయై వెళియిట్టాళిఱే.

(నడువిల్ తిరువ్యాకి) నడువిల్ పెరుమాళోడేకూడి తిరువయోధ్యైయిలే ఇరున్దరుళి తిరువయిఱువాయ్త్తిరుక్కుమ్ కాలత్తిలే, "అపత్యలాభో వైదేహి మమాయం సముపస్థితః । కిమిచ్ఛసి సకామా త్వం బ్రూహి సర్వం వరాననే" ఎన్ఱు - ఉనక్కు ప్పేక్షితమేతెన్ఱు కేట్టరుళ, "తపోవనాని పుణ్యాని ద్రష్టుమిచ్ఛామి రాఘవ। గఙ్గాతీరనివిష్టాని ఋషీణాం పుణ్యకర్మణామ్ ( ఫల

మూ॥ మధ్యను విశ్లేషించుట

రాక్షసస్త్రీ) కలగపడగా, మిక్కిలి భయపడి నిగులుపడియుండు సమయమున, "భవేయం శరణం హి వః" (రా. సు. ౫౮-౯౩.) (మిమ్ముల నేను కాపాడుదును) అన్నట్లు, "మీరు కష్టపడవలసిన సమయమున కాపాడుటకు నేనుంటినిగదా! మీరు భయపడవద్దు" అని యిట్లు అభయప్రదానము చేసినందువలనను, ఆ మాటమాత్రమే కాకుండ, రావణవధానంతరము తనకు శుభవార్తంగొని వచ్చిన యాంజనేయుండు వారలను చిత్రవధఁజేయుట కనుమతినియ్యమని యడుగఁగా వానితో నెదిరించి "రాజసంశ్రయవశ్యానాం" (ఒకరాజు నాశ్రయించి వాని వశమున నుండువారు) ఇత్యాది శ్లోకములఁ జెప్పియున్నట్లు వారల యపరాధములను గుణములనుగా నుపపాదించి "మర్షయామీహ దుర్బలాః" (వారి కష్టములఁజూచి సహింపఁజాలని మనస్సుగలదానను) అన్నట్లు ఇతరులు దుఃఖపడుచుండగాఁజూచి నామనస్సు సహింపఁజాలదే యనుచు "కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి" (తప్పక కరుణించవలసినది లోకమున నపరాధపడనివాడెవ్వఁడును లేడు.) అనుచు అతనికిని తప్పక రక్షించియే తీరవలెనట్లు ఉపదేశించి, ఈ మనస్సుతోనే నిలిచియుండి తానుపూర్వమొనర్చిన ప్రతిజ్ఞానుగుణముగ ఆర్ద్రాపరాధులైనను వారిని రక్షించి తనకృపను బయలుపఱిచినదాయెను.

(నడువిల్) ఇత్యాది. మధ్యను విశ్లేషించుటయనఁగా, పెరుమాళ్ళతోఁగూడ అయోధ్యాపట్టమున కాపురముచేయు సమయమున గర్భిణిగానుండగా "అపత్యలాభో వైదేహి మమాయం సముపస్థితః । కిమిచ్ఛసి సకామా త్వం బ్రూహి సర్వం వరాననే" (ఓ జానకి! నాకు సంతానము కలుగుకాలము తటస్థించినది. నీవు దేనియందిచ్ఛయున్నదో దానినంతయును తెలుపుమా!) అన్నట్లు నీకేమియపేక్షయున్నది యని యడుగగా, ఆమె "తపోవనాని పుణ్యాని ద్రష్టుమిచ్ఛామి రాఘవ।

మూ॥ పారతన్త్ర్యత్తై వెళియిడుకైక్కాక;

మూలాశినాం వీర పాదమూలేషువర్తితుమ్। ఏష మే పరమః కామో యన్మూలఫలభోజిషు ॥ అప్యేకరాత్రం కాకుత్స్థ వసేయం పుణ్యకీర్తిషు” ఎన్ఱు, తనక్కుణ్డాన వనవాసవాఞ్ఛయై విణ్ణప్పమ్ శెయ్య, అత్తైప్పఱ్ఱ పోక విడువార్ పోలే లోకాపవాద పరిహారార్థమాక ప్పెరుమాళ్ కాట్టిలే పోకవిడప్పోనతు. ఇప్పిరివుక్కు ప్రయోజనమ్- పెరుమాళ్ కట్టిలే వైత్తపోతోడు కాట్టిలే విట్టపోతోడు వాశియఱ అవరుడైయ నినైవై ప్పిఱశెల్ల వేణ్డుమ్పడియాన తన్నుడైయ పత్నీత్వప్రయుక్తమాన పారతన్త్ర్యత్తై ప్రకాశిప్పిక్కై. గర్భైక్కు ఱైయోలనవనన్తరమ్ ఇళైయ పెరుమాళ్ కనకక్లేశప్పట్టుక్కొణ్డు పెరుమాళ్ తిరువళ్ళమాయ్ విట్టరుళిన కార్యత్తై విణ్ణప్పమ్ శెయ్య, అత్తైక్కేట్టు మికవుమ్ ప్రలాపిత్తు “నఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే। త్యజేయం రాఘవం వంశే భర్తుర్మా పరిహాస్యతి” ఎన్ఱాళిఱే. ఇత్తాల్-అఱ్ఱామైయిఱ్ కనత్తాలె ముడిన్దు విళైక్కు త్తేట్టమాక నిఱ్కచ్చెయ్ తేయుమ్ అతు శెయ్యామాట్టాతే పెరుమాళ్ నినైవై ప్పఱ్ఱి శెన్ఱు, తన్ ప్రాణనై నోక్కిక్కొణ్డ

మూ॥ పారతంత్ర్యమును బయలుపఱచుటకుగాను

గంగాతీరనివిష్టాని ఋషీణాం పుణ్యకర్మణాం। ఫలమూలాశినాం వీర పాదమూలేషువర్తితుం। ఏష మే పరమః కామో యన్మూలఫలభోజిషు అప్యేకరాత్రం కాకుత్స్థ వసేయం పుణ్యకర్మసు” (ఓరామచంద్రా! గంగాతీరముననుండు పుణ్యాత్ములగు మహర్షులయాశ్రమములఁ జూడవలయునని కోరిక గలదు. ఫలమూలాశనులగు మహర్షుల శ్రీపాదముల సన్నిధిని నసింపవలయునని కోరికగానున్నది. మరియు పుణ్యవంతులగువారి మధ్యను ఒక్కరాత్రియయినను నివసింపవలయుననియున్నది. యిదియే నాముఖ్యమైన కోరిక,) అని తనకుఁగల వనవాసేచ్ఛను విన్నవింపఁగా, అందులకుఁగాను పంపువానివలెనె పెరుమాళ్లును *లోకాపవాదను పోఁగొట్టుకొనుటకుగాను ఆమెను అరణ్యమునకుఁ బంపెను ఈ విశ్లేషమువలని ప్రయోజనమేమనఁగా, పెరుమాళ్లు అంతఃపురమున నుంచినను, అరణ్యమున నుంచినను ఎల్లకాలము నొక్క విధముగనే సదా పెరుమాళ్ళనే ధ్యానించుచు తాను పత్నియగుటంజేసి తనకుండవలసిన పారతంత్ర్యమును బయలు పరచినదాయెను. గంగాతీరముఁ జేరిన పిమ్మట లక్ష్మణస్వామి మిక్కిలి చింతపడ శ్రీరాములవారు సంకల్పించుకొనినదానిని ( అడవిలో విడిచిరమ్మన్న విషయమును ) విన్నవింపఁగా విని మిక్కిలి దుఃఖించి “నఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే। త్యజేయం రాఘువంశే భర్తుర్మా పరిహాస్యతి” (ఓలక్ష్మణా! నాభర్తయగు శ్రీరామచంద్రునినుండివచ్చిన రఘుసంతానము నాభర్తవంశము జరుగుచుండగనే ముగియకూడదను అభిప్రాయములో నేను ఇప్పుడే గంగలోపడి ప్రాణములను విడనాడకుంటిని) అన్నట్లు నదిలోఁబడి ప్రాణములవిడనాడవలయునని కోరికయున్నప్పటికిని, అట్లుచేయక పెరుమాళ్ళయొక్క +యభిప్రాయప్రకారము జీవించి సహింపవలసినట్టి పారతంత్ర్యమును బయలుపఱచి

*రావణుఁడు తీసికొనిపోయిన సీతను తిరుగ శ్రీరామచంద్రుండు గొనివచ్చినాడను అపవాదమును.

+ భర్తయొక్క యభిప్రాయమనఁగా—“అపత్యలాభస్సంప్రాప్తః” అనుశ్లోకమున శ్రీరాములవారు పుత్రసంతానము లభింపవలయుననెడి యాశగలవారుగఁ దెలుపఁబడిరి. అట్టియభిప్రాయమును నెరవేర్పవలయుననెడి యుద్దేశముతో సీతాపిరాట్టి ప్రాణముల నెడబాయకుండెననియెఱుంగునది.

మూ॥ అనన్తరమ్ పిరిన్దతు.

తుక్కు వేణ్డుమ్పడియాన పారతన్త్ర్యత్తై యిత్తై ప్రకాశిప్పిత్తతు. పిఱర్ క్కాకజీవిక్క వేణ్డుమ్ పరతన్త్రర్కట్కు ముడివుత్తేట్టమానాలుమ్ ముడియప్పోకాతే, "మాయుమ్వకై యఱియేన్ వల్వినైయేన్ పెణ్పిఱన్దే" ఎన్నారిఱే యాళ్వార్. ప్రథమవిశ్లేషత్తిల్ పత్తుమాసత్తుక్కళ్ పడువ తెల్లామ్ పట్టాళ్ "పతిర్హి దైవతం నార్యాః పతిర్బన్ధుః పతిర్గతిః । ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః" ఎన్ఱు తానరుళిచ్చెయ్తపడియే పతిచిత్తానువిధానమే నమక్కు స్వరూపమెన్నుమ్ పారతన్త్ర్యబుద్ధియాలేయిఱే అనేకసంవత్సరమ్ పాడాఱ్ఱియిరున్దతు; ఆక ఇప్పడి యిప్పిరివిలే తన్నుడైయ పారతన్త్ర్యత్తై వెళియిట్టాళిఱే.

[అనన్తర మిత్యాది) అనన్తరత్తిల్ పిరివానతు - మీణ్డు పెరుమాళ్ సన్నిధియిలే వన్దిరుక్కచ్చెయ్తే పిరిన్దు పిఱన్దకత్తిలే పుకుక్కిట్టతు. ఇప్పిరివుక్కు ప్రయోజనమ్ - "అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా" "అనన్యా హి మయా సీతా" ఎన్ఱు ఉభయసమ్మతమాన తన్నుడైయ అనన్యత్వప్రయుక్తమాన వనన్యార్హత్వత్తై సర్వసంమతమామ్పడి ప్రకాశిప్పిక్కై. ఎజ్జనేయెన్నిల్; పెరుమాళ్ అశ్వమేధమ్పణ్ణియరుళానిఱ్కచ్చెయ్తే శ్రీవాల్మీకిభగవానుడైయ నియోగత్తాలే కుశలవర్కళ్ వన్దు శ్రీరామాయణత్తై ప్పాడికొణ్డు నిఱ్ఱియానిఱ్క, అత్తై ప్పెరుమాళ్ తిరు

మూ॥ తరువాత విశ్లేషించుట

దాయెను. ఇతరులవలెగాను జీవించియుండవలసినవారలగు పరతంత్రులగు ప్రాణములను విడనాడుట యపేక్షితమె యయినను, అట్లుచేయక, "మాయుమ్వకై యఱియేన్ వల్వినైయేన్ పెణ్పిఱన్దే" (తి. వా, ౫. ౪. ౩.) (క్రూరములగు పాపములు గలనేను స్త్రీయై పుట్టి మరణమును బొందునట్టి యుపాయము నెఱుంగనే?) అనియిట్లు శ్రీనమ్మాళ్వారులు ప్రసాదించియున్నారు, మొదటి వియోగమున పదిమాసములలోఁగా పడవలసినపాట్లు పడినట్టియీపె "పతిర్హి దైవతం నార్యాః పతిర్బన్ధుః పతిర్గతిః ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః" (స్త్రీలకు పతియే దైవము, పతియే బంధువు పతియె గతి ప్రాణంబులఁగొనియైనను పతికిష్టమైన కార్యమునే చేయవలయును) అని యిట్లు తాను చెప్పినరీతినే పతియొక్క ఇచ్ఛకనుగుణముగ ప్రవర్తించుటయే తనయొక్క స్వరూపమనెడి పారతంత్ర్య బుద్ధిచేతనే కదా ఈపె అనేకసంవత్సరములు సహించియుండెను. కావున ఈపె యీ వియోగసమయమున తనపారతంత్ర్యమును బయలు పఱచినదాయెను.

తరువాతి విశ్లేషమెద్దియనఁగా—మరల పెరుమాళ్ళ యొద్దకి వచ్చినప్పుడు తాను జన్మించినభూమిలోఁ బ్రవేశించుట. ఈవిశ్లేషమునకుఁ బ్రయోజన మెద్దియనిన, "అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా" (ప్రకాశము సూర్యునివిడిచియుండనట్లు నేనున్ను శ్రీరామచంద్రుని యెన్నఁడును విడిచియుండను) అని యీపెయును "అనన్యా హి మయా సీతా" (సీత యెన్నఁడు నన్నువిడిచి యుండునదికాదు) అనియిట్లు పెరుమాళ్లును వీరుభయులు సమ్మతించినరీతిని తానెన్నఁడను పెరుమాళ్ళను విడనాడియుండుటయును అనన్యార్హత్వమును సర్వసమ్మతముగా బ్రకాశింపఁజేయుట.

అది యెట్లనిన, పెరుమాళ్లు అశ్వమేధయాగముఁజేయు సమయమున శ్రీవాల్మీకిమహర్షియాజ్ఞ వలన కుశలవులు వచ్చి శ్రీమద్రామాయణమును పాడుచు తిరుగుచుండగా, దానిని పెరుమాళ్లు అల

మూ॥ అనన్యార్హత్వత్తై వెళియిడుకైక్కాక.

చ్చెవిశాత్తి సన్నిధియిలే యవర్కళైయుం త్తు విశేషజ్ఞర్గళ్లారైయుమ్కూట్టి అవర్కళ్ పాట్టుక్కేళా
నిఱ్కుమళవిలే, అవర్కళై ప్పిరాట్టియినుడైయ పిళ్ళైకళెన్ఱఱిన్ద వనన్తరమ్, పిరాట్టియళవిలే
తిరువుళ్ళమ్ శెన్ఱు, "తనక్కు అశుద్ధియాకిల్ కశుకవిన్తిగళిలే నాళైవన్దు ప్రత్యయముఖేన తన్ శు
ద్ధియై ప్రకాశిప్పిప్పాళాక" ఎన్ఱు. దూతముఖేన పెరుమాళ్ మహర్షిక్కుమ్ పిరాట్టిక్కుమ్ అఱివి
త్తువిడ, అప్పడియే శ్రీవాల్మీకిభగవానైమున్నిట్టుక్కొణ్డు అన్దమహాపరిషత్తిలే పెరుమాళ్ సన్నిధి
యిలేవన్దు ఒడుఙ్గి నిఱ్కచ్చెయ్తే, శ్రీవాల్మీకిభగవాన్ ఇవళ్ శుద్ధైయెన్ఱు మికవుమ్ పలముకత్తాలుమ్
శొల్ల, పెరుమాళుమ్ "ఇవళ్ శుద్ధైయెన్ఱు మిదమ్ నానుమఱివన్, మహర్షి శొన్నతువే పోరుమ్; ఆనా
లుమ్ లోకాపవాద పరిహారార్థమాక ఒరుప్రత్యయమిత్తిరళిలే పణ్ణవేణుమ్" ఎన్ఱు తిరువుళ్ళమానపడి
యాలే, "సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతా కాషాయవాసినీ। అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యమధో
దృష్టిరవాఙ్ముఖీ" ఎన్గిఱపడియే కైయుమఞ్జలియుమాయ్క్కవిழ్న్ద తలైయుమాయ్ క్కొణ్డు నిన్ఱు, "యథా
హం రాఘవాదన్యం మనసాపి న చిన్తయే। తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి। మనసా కర్మణా
వాచా యథా రామం సమర్చయే। తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి। యథైతత్సత్యముక్తం మే
వేద్మి రామాత్పరం న చ। తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి" ఎన్ఱు శపథమ్పణ్ణి; "తథా శ

మూ॥ అనన్యార్హత్వమును బయలుపఱచుటకుగాను.

కించి వారిని తనసన్నిధికిరప్పించి గానరసమును గుర్తెఱింగిన పండితులతోఁగూడి వారు
పాడుచున్న పాటలను వినుచుండగా, వారు శ్రీసీతాపిరాట్టియొక్క పుత్రులని తెలియఁగానే పిరాట్టి
వైపు మనస్సుపోయి "ఆత్మసాక్షిగ తాను పరిశుద్ధురాలయినట్లయినచో, వెంటనే రఘునన్దుని ఈ సభ
యందు తన పరిశుద్ధతను నిదర్శన పూర్వకముగఁ దెలుపవలయును" అని పెరుమాళ్లు దూతద్వారా శ్రీ
వాల్మీకిమహర్షికిని శ్రీసీతాపిరాట్టికిని తెలియఁజేయఁగా, అంతట నాపె యామహర్షిఁదోడ్కొని
యాసనకేగి పెరుమాళ్ల సన్నిధిని కూర్చుండ, ఆమహర్షియును ఆపె పరిశుద్ధురాలను విషయ
మును అనేకవిధములఁ జెప్పఁగా, నంతట పెరుమాళ్లు "ఆపె పరిశుద్ధురాలని నాకును తెలుసును మహ
ర్షులగు మీరు చెప్పినదే చాలును అయితే లోకాపవాదము పోఁగొట్టుకొనుటకుగాను ఈ సభయం
దొకనిదర్శనమును గావింపవలయును" అని యానతియ్యఁగా, సీతాపిరాట్టియును, "సర్వాన్ సమాగ
తాన్ దృష్ట్వా సీతా కాషాయవాసినీ అబ్రవీత్ప్రాఞ్జలిర్వాక్యమధోదృష్టిరవాఙ్ముఖీ।" (కాషాయ
వస్త్రమును ధరించియున్నట్టి సీతాదేవి యాసభకు వచ్చినవారి నందఱినిజూచి చేతులు జోడించికొని,
తలవంచుకొని భూమివంకఁ జూచుచు నిట్లు చెప్పెను" అని చెప్పినట్లు చేతులు జోడించుకొని,
తలవంచుకొని నిలిచియుండి "యథాహం రాఘవాదన్యం మనసాపి న చిన్తయే। తథా మే మాధవీ దేవీ
వివరం దాతుమర్హతి" (శ్రీరామచంద్రునికంటెను వేఱొక్కపురుషుని నేను మనస్సునను తలంపక
యుంటినట్లయిన, యీ భూదేవి నాకు జాగానిచ్చుగాక!) అనియు "మనసా కర్మణా వాచా యథా
రామం సమర్చయే తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి" (నేను మనోవాక్కాయములను శ్రీరామ
చంద్రునివిషయముననే వినియోగపఱచుచుంటినేని, భూదేవి నాకు జాగానిచ్చుగాక!" అనియు
"యథైతత్సత్యముక్తం మే వేద్మి రామాత్పరం న చ తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హతి" (శ్రీరామ
చంద్రునికంటెను వేఱొక్కని నెఱుంగనని నేను చెప్పినది నిజమే యగునట్లయినచో, భూదేవి

పస్త్యాంతస్తే దేహ్యాం ప్రాదురా సీన్మహాద్భుతమ్ । భూతలాదుత్థితందివ్యంసింహాసనమనుత్తమమ్; ధ్రియమాణం శిరోభిస్తు నాగైరమితవిక్రమైః । దివ్యందివ్యేనవపుషా సర్వరత్నవిభూషితమ్, తస్మింస్తుధరణీదేవీ బాహుభ్యాంగృహ్యమైథిలీమ్ । స్వాగతేనాభినన్ద్యైనామాసనేచోపవేశయత్। తామాసనగతాం దృష్ట్వా ప్రవిశన్తీంరసాతలమ్ । పుష్పవృష్టిరవిచ్ఛిన్నా దివ్యాసీతామవాకిరత్ ” ఎన్ఱు, అవ్వళవిలే భూమియిల్ నిన్ఱుమ్ ఒరుదివ్య సింహాసనమ్ వన్దుతోన్ఱ, అతిలే శ్రీభూమిపిరాట్టి ఇవళై స్వాగత ప్రశ్నపూర్వకమాక ఎడుత్తుక్కొణ్డుపోయ్వైక్క, ఆసనగతైయాయ్ క్కొణ్డు రసాతలత్తై ప్రవేశియానిఱ్క దివ్యపుష్పవృష్టి యిడైవిడామల్ ఇవళ్ మేలేవిழున్దతెన్ఱైయాలే, ఇప్పిరవిలే తన్నుడైయ అనన్యార్హత్వత్తై ప్రకాశిప్పిత్తాళిఱే.

ఆక, ఇవ్వవతారత్తిలివళుక్కు చొల్లప్పట్ట విశ్లేషత్రయత్తుక్కుమ్ హేతు, ఇగ్గుణఙ్గళై యిప్పడి వెళియిడుకైయాయిఱ్ఱు. ఇజ్జనన్తాకిల్, అనపాయినియాయ్, అకర్మవశ్యైయాయిరుక్కిఱ ఇవళుక్కు కర్మవశ్యరైప్పోలే ఇప్పడి పిరివువరుకైక్కు యోగ్యతైయిల్లైయిఱే. తన్నుడైయ పురుషకారత్తోపయోగియాన గుణఙ్గళైయుమ్ పురుషకారత్వత్తైయుమ్ ప్రకాశిప్పిక్కైక్కాక వన్దవవతారమిఱే యిదు. ఆకైయిఱే “యదుతాన్యదుదాహరన్తి సీతావతారముఖమేతదముష్యయోగ్యమ్”

---

నాకుజాగానిచ్చుగాక! అని శపథముచేయఁగా, “తథాశపన్త్యామ్వైదేహ్యాం ప్రాదురాసీన్మహాద్భుతం । భూతలాదుత్థితందివ్యం సింహాసనమనుత్తమం । ధ్రియమాణంశిరోభిస్తునాగైరమితవిక్రమైః। దివ్యందివ్యేనవపుషా సర్వరత్నవిభూషితం । తస్మింస్తుధరణీదేవీ బాహుభ్యాంగృహ్యమైథిలీం స్వాగతేనాభినన్ద్యైనామాసనేచోపవేశయత్ । తామాసనగతాందృష్ట్వా ప్రవిశన్తీమ్రసాతలం పుష్పవృష్టిరవిచ్ఛిన్నా దివ్యాసీతామవాకిరత్” (ఇవ్విధమున సీతాపిరాట్టి శపించుచుండఁగా, నచట నొక యొక్కువయద్భుతమును, దివ్యమును నగు సింహాసనము భూమిలోనుండి పైకివచ్చెను. అది యతి పరాక్రమముగల నాగుబాములచే శిరస్సున ధరింపఁబడినదై, దివ్యస్వరూపముతో రత్నాలంకృతమైనది. అంతట భూదేవి సీతాపిరాట్టిని కౌఁగలించుకొని స్వాగతమునిచ్చి యాసింహాసనముపై గూర్చుండబెట్టుకొనఁగా నే యది భూమిలోనికిఁ జొచ్చు సమయమున నామెపై యాకాశమునుండి యవిచ్ఛిన్నమగు పుష్పవర్షము కురిసెను) అన్నట్లు, ఆసమయమున భూమిలోనుండి యొక సింహాసనముపైకిరాఁగా శ్రీభూమి పిరాట్టి యీమెను స్వాగత పూర్వకముగా కౌఁగలించుకొని తీసికొని పోయి దానిపై గూర్చుండపెట్టగా నంతట యీమె దానిపై గూర్చుండిపెట్టే యది భూమిలోనికిఁ జొచ్చుసమయమున నీమెపై విడువనుండ దివ్యపుష్పవర్షము కురిసెనని చెప్పియుండుటచే ఈ విశ్లేషసమయమున ఈమె తనయొక్క యనన్యార్హత్వమును బయలుపఱచినట్లు తెలియుచున్నది గదా!

కావున ఈయవతారమున ఈమె మూఁడు పర్యాయములు వియోగమును బొందుటకు హేతువు యీ గుణములను ప్రకాశింపఁజేయుటయేయాయెను. అట్లుకానున్న, ఎన్నఁడును విడిచియుండనిదియును, కర్మవశ్యరాలుకానిదియునగు ఈమెకు కర్మవశ్యులగు నితరులకువలెనే యిట్లు వియోగము సంప్రాప్తించుట తగదు గదా! తనయొక్క పురుషకారమున కుపయుక్తములగు గుణములను పురుషకారత్వమునున్ను ప్రకాశింపఁజేయుటకు గాను నవతరించిన యవతారము గదా యిది! కావున నే “యదుతాన్యదుదాహరన్తి సీతావతారముఖమేతదముష్యయోగ్యం”(కారుణ్యాదిగుణంబు

**మూ॥ ౯॥ సంశ్లేషవిశ్లేషఙ్గళిరణ్డిలుమ్ పురుషకారత్వమ్ తోన్ఱుమ్.**

---

ఎన్ఱు భట్టరు మరుళిచ్చెయ్‌తతు. ఇప్పడి చేతనర్ పక్కలనుగ్రహత్తుక్కుడలాన కృపైయైయుమ్, ఈశ్వరన్ పక్కలులుకి వశీకరిక్కైక్కుడలాన పారతన్త్ర్యాదికళైయుమ్ తానే వెళియిట్టతు శాస్త్రఙ్గళిలే కేట్కుమాత్రమన్ఱిక్కే అనుష్ఠానపర్యన్తమాక క్కాణ్గైయాలే ఇవళై పురుషకారమాకప్పఱ్ఱుమవర్కళుక్కు రుచివిశ్వాసఙ్గళ్ పిఱక్కైక్కుడలుప్పాక.

ఏవమ్భూతగుణవిశిష్టైయాన వివళుడైయ పురుషకారత్వమ్ తోన్ఱువతెఙ్గేయెన్న వరుళిచ్చెయ్‌కిన్ఱార్ మేల్, (సంశ్లేషవిశ్లేషఙ్గళిరణ్డిలుమ్) పురుషకారత్వమావతు-ఘటకత్వమ్, అతు ఇవళుక్కు అవనోడుకూడియిరుక్కుమ్ దశైయిలుమ్, పిరిన్దిరుక్కుమ్ దశైయిలుమ్ ప్రకాశిక్కుమెన్నై. సంశ్లేషదశైయిలే ఇళైయపెరుమాళ్ కాట్టుక్కు ఎళున్దరుళుకిఱపోతు పెరుమాళ్ నియోగిప్పవ తాన్ తొడినవళవిలే, ఎన్నై కూడక్కొణ్డుపోకవేణుమెన్ఱు "సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః। సీతామువాచాతియశా రాఘవఞ్చ మహావ్రతమ్" ఎన్గిఱపడియే శరణమ్ పుకుకిఱవళవిలుమ్; పఞ్చవటియిలే ఎళున్దరుళినపోతు, నీరుమ్ నిళలుమ్ వాయ్త్తిరుప్పతోర్ ప్రదేశత్తైప్పార్త్తు పర్ణశాలైయమైక్కుమెన్ఱు పెరుమాళరుళిచ్చెయ్య, నమ్ తలైయిలే స్వాతన్త్ర్యత్తైవైత్తపోతే

---

**మూ॥ ౯॥ పిరాట్టి ఈశ్వరునితో సంశ్లేషించియున్నదశయందున్ను విశ్లేషించియున్నదశయందున్ను ఈమెచేయు పురుషకారకృత్యము ప్రకాశింపుచున్నది.**

---

లన్నియును శ్రీరంగనాచ్చియారునందుం గలవు సీతాద్యవతారమున ఈమెకుఁగలదు) అని యిట్లు శ్రీరంగరాజస్తవమున భట్టరును ప్రసాదించియున్నారు. ఇట్లు చేతనుల ననుగ్రహించుటకుఁ గావలసిన కృపయును, ఈశ్వరుని కనికరించుటకుఁ గావలసిన పారతంత్ర్యాదులనున్ను ఈమెయే బయలుపఱచుటకుఁ బ్రయోజనమెద్దియనఁగా, శాస్త్రములయందు వినియుండుట మాత్రమేకాక, అనుష్ఠానపర్యంతము చూపించుచు నందుమూలముగ నీ చేతనులకు తనను పురుషకారముగాఁగొను విషయమున విశ్వాసముఁ గలుగఁజేయుటయని యెఱుంగునది.

అవతారిక:— ఇట్టి గుణములుగల యీమెయొక్క పురుషకారత్వము తెలియవచ్చునట్టి తావు లెవ్వియనిన "సంశ్లేషవిశ్లేషఙ్గళ్" ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

పురుషకారత్వమనఁగా ఘటింపఁజేయునది యగుట. అది యీమె పెరుమాళ్లతోఁ జేరియుండునప్పుడును, వానిని విడిచియుండునప్పుడును ప్రకాశించును. అది యెట్లనిన, పెరుమాళ్లతోఁ జేరియుండునప్పుడు, పెరుమాళ్లు అరణ్యమునకు వేంచేయు సమయమున శ్రీలక్ష్మణపెరుమాళ్లను గృహమునుండి పోవుటకై తలంచఁగా, లక్ష్మణపెరుమాళ్లు తనను కూడ తీసికొనిపోవలయునని తలంచి "స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః। సీతామువాచాతియశా రాఘవంచ మహావ్రతం" (యశోవంతుఁడగు లక్ష్మణపెరుమాళ్లు భ్రాతయగు శ్రీరామచంద్రుని పాదములను గట్టిగ పట్టుకొని సీతాపిరాట్టితోను శ్రీరామచంద్రునితోను నిట్లుపలికెను) అన్నట్లు శరణుజొచ్చిన సమయమునను, తరువాత పెరుమాళ్లు పంచవటికి వేంచేసినపుడు "మీరుపోయి మంచి నీటివసతిగల చల్లని ప్రదేశముఁజూచి యచట నొక పర్ణశాలను నిర్మింపుము" అని యానతియ్యఁగా, నాపై యీ

పెరుమాళ్ నమ్మైక్కైవిట్టారెన్ఱు వెఱుత్తిరాయ్ “ఏవముక్తస్తు రామేణ లక్ష్మణస్సంయతాఞ్జలిః। సీతాసమక్షం కాకుత్స్థమిదం వచనమబ్రవీత్ । పరవానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే। స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద” ఎన్ఱపడియే తమ్ముడైయ పారతన్త్ర్యత్తై ప్పెఱుకైక్కాకక్కైయుమఞ్జలియుమాయ్ నిన్ఱు పేక్షిక్కుమ్ పడియిలుమ్ పిరాట్టియై ప్పురుషకారమాక మున్నిట్టుత్తమ్మపేక్షితమ్ పెఱుకైయాలుమ్; అసురప్రకృతియాన జయన్తన్ కాకరూపత్తైక్కొణ్డువన్దు జననిపక్కలిలే అకృత్య ప్రవృత్తనాక, “కిం క్రీడతి సరోషేణ పఞ్చవక్త్రేణ భోగినా” ఎన్ఱు పెరుమాళ్ వర్ణమేలే సీఱ్ఱత్తైయుడైయరాయ్ ప్పొనాక బ్రహ్మాస్త్రత్తై ప్రయోగిక్క, “స పిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః। త్రీన్ లోకాన్ సమ్పరిక్రమ్య తమేవ శరణం గతః” ఎన్ఱపడియే ఎఙ్గుమ్ తిరిన్దువిడప్పట్టిలుమ్ ఒరుపుకలిల్లామైయాలే పోక్కఱ్ఱు శరణమ్పుక, “స తం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతమ్ । వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్” ఎన్ఱుమ్, “పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తదా । తచ్ఛిరః పాదయోస్తస్య యోజయామాస జానకీ ॥ తముత్థాప్య కరేణాథ కృపాపీయూషసాగరః । రరక్ష రామో గుణవాన్ వాయసం దయయేక్షత” ఎన్ఱుమ్, శ్రీరామా

---

స్వాతంత్ర్యము నుంచినతోడనే పెరుమాళ్లు నన్నువిడిచివేసినారని తలంచి దుఃఖితుఁడైన లక్ష్మణ పెరుమాళ్లు “ఏవముక్తస్తు రామేణ లక్ష్మణస్సంయతాఞ్జలిః । సీతాసమక్షం కాకుత్స్థమిదం వచనమబ్రవీత్ ॥ పరవానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే । స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద” (ఇట్లు శ్రీరామచంద్రుఁడానతియ్యఁగా, లక్ష్మణపెరుమాళ్లు చేతులు జోడించుకొని శ్రీసీతాపిరాట్టి సాన్నిధ్యమున శ్రీరామచంద్రునితో నిట్లు పలికెను. ఓ కాకుత్స్థ నేను పరతంత్రుఁడను నీవు నూఱు వత్సరములున్నను స్వయముగ నీకు మనోహరమగు ప్రదేశమునుఁ జూచి యచ్చట నిర్మింపుమని యాజ్ఞాపింపుము) అన్నట్లు తనయొక్క పారతంత్ర్యము లభించుకొనుటకై సాంజలియై నిలిచి ప్రార్థించినప్పుడును సీతాపిరాట్టిని పురుషకారముగాను ముందుంచుకొని తన కోరికను నెరవేర్చుకొనుటవలనను, మహాక్రూరుఁడగు జయంతుఁడు కాకిరూపముఁదాల్చివచ్చి సీతాపిరాట్టి విషయమున అకృత్యముఁ జేయుటకు ప్రయత్నింపఁగా, “కిం క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా” (కోపముతో నుండు అయిదుతలలుగల పాముతో నెవ్వఁడు ఆటలాడ గలఁడు) అన్నట్లు పెరుమాళ్లు వానియెడల కోపించి తలను నఱుకుటకై బ్రహ్మాస్త్రమును ప్రయోగింపఁగా, “స పిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః । త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః” (అంతట వాఁడు తండ్రిచేతను దేవతలచేతను మహర్షులచేతనున్ను రక్షింప శక్యముకాక విడువఁబడినవాఁడై మూఁడులోకములకుఁ బోయి తుదకు శ్రీరామచంద్రునినే శరణుఁజొచ్చెను) అన్నట్లు ఎచ్చట తిరిగినను రక్షకుఁడు లేమియును దొరకనందున తిరిగి పెరుమాళ్లను శరణుజొచ్చఁగా “స తం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతం । వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్” (శరణాగతరక్షకుండగు శ్రీరామచంద్రుండు వధార్హుండైనను శరణుజొచ్చి భూమిమీఁదపడియుండు కాకాసురుని దయతోఁ బాలించెను) అనియు, “పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తదా తచ్ఛిరః పాదయోస్తస్య యోజయామాస జానకీ॥ తముత్థాప్య కరేణాథ కృపాపీయూషసాగరః రరక్ష రామో గుణవాన్ వాయసం దయయేక్షత” (ఇట్లు కాకాసురుండు పెరుమాళ్లసన్నిధిని భూమిమీఁదపడఁగా శ్రీసీతాపిరాట్టి వాని శిరస్సును శ్రీరామచంద్రుని శ్రీపాదములమీఁదనుంచెను. దయామృతసముద్రుండగు శ్రీరామచంద్రుండు చేతితో వానిని లేవ రక్షించి దయతోఁ జూచినవాఁడాయెను) అనియు నిట్లు శ్రీమద్రామాయణము పాద్మపురాణము

యుణపాదమ్రపురాణజ్గళిల్ శొల్లుకిఱపడియే, ఇవళ్ పురుషకారమాక ప్పెరుమాళ్ రక్షిక్కైయా
లుమ్; విశ్లేషదశైయిలే ‹‹ఇహసన్తోసవాసన్తిసతోవానానువర్తసే। తథాహివిపరీతాతేబుద్ధిరాచార
వర్జితా›› ఇత్యాదియాలే విపరీతబుద్ధియాన రావణనై ప్పెరుమాళ్ తిరువడికళిలే శేర్క్కైక్కు
విరకుపార్క్కైయాలుమ్; రావణవధానన్తరమ్ రాక్షసికళై చిత్రవధమ్ పణ్ణవతాక ఉద్యుక్తనాయ్
నిన్ఱ తిరువడిస్సుక్కుత్తు, ‹‹పాపానాంవా శుభానాంవా వధార్హాణాంప్లవఙ్గమ। కార్యంకరు
ణమార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి›› ఎన్ఱు అవనిరఙ్గత్తక్క వార్త్తైకళైచ్చొల్లి అవర్కళపరాధఙ్గళై
పొఱుప్పిక్కైయాలుమ్; ఉభయదశైయిలుమ్ ఇవళ్ పురుషకారత్వమ్ తోఱ్ఱానిన్ఱతిఱే.

తిరువడి రాక్షసికళై అపరాధానుగుణమ్ దణ్డిక్కుమ్పడి కాట్టిత్తరవేణుమెన్ఱవళవిల్,
పిరాట్టి అవనువనే మన్నాడిరక్షిత్త వితనైయన్ఱో? ‹‹మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తథైవార్ద్రాపరా
ధాంస్త్వయారక్షన్త్యా పవనాత్మజాల్లఘుతరా రామస్యగోష్ఠీకృతా। కాకం తంచవిభీషణం శరణ
మిత్యుక్తిక్షమౌరక్షత స్సానస్సాన్ద్రమహాగసస్సుఖయతు క్షాన్తిస్తవాకస్మికీ›› ఎన్ఱు పవనాత్మజనై
నిమిత్తమాకరక్షిత్తాళెన్ఱన్ఱో భట్టరరుళిచ్చెయ్దతు, అవ్విడత్తిల్ పురుషీకరిత్తమై యొజ్జనేయొన్నిల్;
బలాత్కారత్తాలన్ఱిక్కే అనుసారత్తాలే యపరాధఙ్గళైప్పొఱుప్పిక్కైయాలే పురుషకారత్వమెన్గిఱతు
‹‹తిరువడిదను పొఱుప్పుక్కుమవళ్ తణ్ శోల్వళ్ వరుమవనై పొఱుప్పిక్కచ్చొల్లవేణ్డావిఱే››

---

లయందుఁ జెప్పియున్న ప్రకారము ఈపె పురుషకారముకాఁగా పెరుమాళ్ళు రక్షించుటవలనను,
పెరుమాళ్లను విడిచియుండు సమయమున ‹‹ఇహసన్తోనవాసన్తి సతోవానానువర్తసే। తథాహి
విపరీతాతే బుద్ధిరాచారవర్జితా›› (ఓరావణా! ఈలంకాపట్టమున సత్పురుషులులేరా? వారిని సేవా
శ్రయింపవు నీబుద్ధివిపరీతమైనదై మంచివడవడికలేనిది) అన్నట్లు విపరీతబుద్ధిగల రావణుని పెరు
మాళ్ల శ్రీపాదములనాశ్రయింపఁజేయుటకై ప్రయత్నించినందునను, రావణవధానంతరము రాక్ష
సులను చిత్రవధఁజేయుటకై సన్నద్ధుడైన శ్రీయాంజనేయునితో ‹‹పాపానాంవా శుభానాంవా
వధార్హాణాం ప్లవంగమ కార్యంకరుణమార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి›› (పాపాత్ములుగాని, పుణ్యా
త్ములుగాని వధార్హులగువారి యెడల దయ మాడవలసినది. లోకమున అపరాధపడనివాఁడెవ్వఁడును
లేడు) అన్నట్లు అతనిమనసునుకరిగించునట్టివార్తలఁజెప్ప వారియపరాధములను క్షమింపఁజేసినందు
నను ఈపైనిగనఁబఱచిన రెండు సమయములయందును ఈపెయొక్క పురుషకారము స్పష్టముగాఁ
దెలియుచున్నది. అయితే శ్రీయాంజనేయుడు రాక్షసస్త్రీలను అపరాధానుగుణముగ దండించుటకు
గాను నాస్వాధీనము చేయుమని యడుగఁగా, పిరాట్టి వానిని నివారించి రక్షించినది యింతియె కదా!
మరియు భట్టరును ‹‹మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తథైవార్ద్రాపరాధాంస్త్వయారక్షన్త్యాపవనా
త్మజాల్లఘుతరా రామస్యగోష్ఠీకృతా కాకంతంచ విభీషణం శరణమిత్యుక్తిక్షమౌరక్షతః సాన
స్సాన్ద్రమహాగసస్సుఖయతు క్షాన్తిస్తవాకస్మికీ›› ‹‹ఓతల్లీ జానకీ నీవిషయమున నిప్పుడే యపరాధ
ములనొనర్చినవారలగు రాక్షసస్త్రీలను శ్రీయాంజనేయునినుండి రక్షించుటచే నీ చరిత్రము ముందటి
శ్రీరామునిచరిత్ర బహుచిన్నదిగా చేయఁబడినది. కాకాసురుని శ్రీవిభీషణాళ్వానునిన్ని శరణాఁజొచ్చి
నంతమాత్రమున రక్షించునట్టి నీయొక్క నిర్హేతుకమగు శాంతియనునది మహాపరాధులగు మమ్ములను
సుఖముగానుంచుగాక!) అనుతావున ఆంజనేయుని నిమిత్తమున రక్షించినదియని గదా ప్రసాదించి
నారు. ఇట్లుండ, యీతావున పురుషకారమేమున్నదంటివేని, యిచట బలాత్కారమునఁగాక, అను
సరణమువలన నపరాధములను సహింపఁజేయుటయే పురుషకారము. దీని తాత్పర్యమేమనఁగా,

మూ॥ ౧౦॥ సంశ్లేషదశైయిల్ ఈశ్వరనై త్తిరుత్తుమ్; విశ్లేషదశైయిల్ చేతననై త్తిరుత్తుమ్.

ఎన్ఱు తిరువడి విషయమాకవుమ్ పురుషకారత్తై యనుష్ఠిచ్చెయ్ తారిత్తో ఇవర్ తామో? అన్ఱియాల్ ఇరణ్డుదశైయిలుమ్ ఇవళ్ పురుషకారత్వమ్ తోన్ఱుమెన్నుమాత్రత్తై చొల్లుకిఱ ఇవ్వాక్యత్తిలే ఇతువుమ్ కూట్టక్కడైయిత్తై.

ఇవ్వుభయదశైయిలుమివళ్ పురుషకారిక్కుమ్ ప్రకారమెన్నెన్న అరుళిచ్చెయ్కిఱార్, (సంశ్లేషదశైయిలెన్ఱుతొడఙ్గి). ఈశ్వరనై త్తిరుత్తుకైయావతు - అపరాధత్తైయే పార్త్తు “క్షిపామి” “నక్షమామి” ఎన్నిరుక్కుమవన్ప్రవృత్తియై అఙ్గీకారోన్ముఖనాక్కుకై. చేతననై త్తిరుత్తుకైయావతు-అకృత్యకరణాదిశీలనాయ్ భగవద్విషయ విముఖనాయ్ త్తిరికిఱవాకారత్తైయుడైయనై ఆశ్రయణోన్ముఖనాక్కుకై.

సంశ్లేషదశైయిల్ ఇవళ్ పెరుమాళుక్కాక ఈశ్వరవిషయత్తిలుమ్, విశ్లేషదశైయిల్ రాక్షసికళుక్కాక త్తిరువడివిషయత్తిలుమ్ పురుషకరిత్తమై, ఉభయదశైయిలుమ్ పురుషకారత్వమ్ తోన్ఱుమెన్నుమాత్రత్తుక్కు కూట్టిక్కొళ్ళలాయిరున్దాలుమ్, ప్రాకరణికమానవర్థమ్ సంసారిచేతననైయుమ్ ఈశ్వరనైయుమ్ శేరవిడుకైయాకైయాలే, ఇవ్వాక్యత్తుక్కు ప్పడియే యర్థమాక

---

మూ॥ ౧౦॥ సంశ్లేషదశయందు ఈశ్వరుని దిద్దుబాటుచేయును. విశ్లేషదశయందు చేతనుని దిద్దుబాటుచేయును.

ఆంజనేయునే సహింపఁజేసి యొప్పించునట్టి యీపె యీశ్వరుని యొప్పింపగలదని వేరుచెప్ప నక్కఱలేదను విషయమును తెలుపుటకై శ్రీయాంజనేయుని నిమిత్తమునను ఈపె పురుషకార మొనర్చినసంగతిని వీరే తెలియఁజేసియున్నారు. కావున రెండు సమయములయందును పురుషకారము తెలియవచ్చునని తెలుపునట్టి యీ వాక్యమున నీవిషయమునుగూడ జేర్చుకొనవచ్చును.

అవతారిక;—ఈరెండు సమయములయందును ఈపె పురుషకారము చేయువిధము రెవ్విధమనఁగా తెలుపుచున్నారు.

(సంశ్లేషదశయు ఇత్యాది) ఈశ్వరుని దిద్దుపాటు చేయుటయనఁగా, అపరాధములనే చూచి “క్షిపామి” (త్రోసివేయుదును) “నక్షమామి” (క్షమింపను) అనెడి యధ్యవసాయమును తొలఁగించి అంగీకరించుటకు సన్నద్ధునిగాఁజేయుట. చేతనుని దిద్దుపాటు చేయుటయనఁగా, అకృత్యములఁజేయు స్వభావముగలవాఁడై భగవంతుఁడనేమాటయే లేని యధ్యవసాయమును తొలఁగించి భగవంతుని యాశ్రయించుటకు సన్నద్ధునిగాఁజేయుట. ఈపె పెరుమాళ్ళతోఁగూడియుండునప్పుడు లక్ష్మణస్వామికిగాను పెరుమాళ్ళవిషయమునను, పెరుమాళ్ళనువిడిచియుండు సమయమున, రాక్షసస్త్రీలకుగాను ఆంజనేయుని విషయమునను, పురుషకారమొనర్చుటను ఉభయవేళలయందును పురుషకారము తెలియవచ్చుననుటకైమాత్రము ఉదాహరణముగాఁ గొనవచ్చునదిగానుండినను, ప్రకరణప్రసిద్ధమగు విషయము, ఈపె చేతనునిని యీశ్వరునిని వీరిద్దఱిని నొకరితో నొకరిని చేర్చునది యనుటయేగాన, ఈవాక్యమున కిదియే యర్థముగాఁ గొనవచ్చును.

**మూ॥ ౧౧॥ ఇరువరైయుమ్ తిరుత్తువతు ముపదేశత్తాలే.**

(ఇరువరైయుమిత్యాది). ఈశ్వరనై త్తిరుత్తువతు-“ఇచ్చేతననుడైయ యపరాధఙ్గళై క్కణక్కిట్టు సిరిప్పడి తళ్ళిక్కతవఙ్దైత్తాల్ ఇవనుక్కు వేఱోరు పుకలుణ్డో? ఉమక్కుమివనుక్కుముణ్డాన సంబన్ధ విశేషత్తైప్పార్త్తాల్ “ఉఱవేల్ నమక్కిఙ్గొళిక్క వొళియాతు” ఎన్గిఱపడియే కుడనీర్ వళ్ళిత్తాలుమ్ పోకాతతొన్ఱన్ఱో? స్వామ్యత్తినాలే లభిక్క ప్రాప్తమానవుమ్ముడైయ లాభత్తై యిన్ఱోవిరుప్పతు, “ఎతిర్ సూఴల్ పుక్కు త్తిరికిఱ ఉమక్కు నాన్ శొల్లవేణుమో? రక్షణాపేక్షనాయ్ వన్దవినై రక్షియాతపోతు ఉమ్ముడైయ సర్వరక్షకత్వమ్ విశలమాకాతో? “అనాదికాలమ్ నమ్ముడైయ ఆజ్ఞాతిలఙ్ఘనమ్ పణ్ణి నమ్ముడైయ నిగ్రహత్తుక్కిలక్కాయ్ పోన్దవినై అపరాధోచితదణ్డమ్ పణ్ణాతే అత్తైప్పొఱుత్తఙ్గీకరిత్తాల్ శాస్త్రమర్యాదైకులైయాతో” ఎన్ఱెన్ఱో తిరువుళ్ళత్తిలోడు కిఱతు, ఇవనై రక్షియాతే అపరాధానుగుణమాక నియమిత్తాల్ ఉమ్ముడైయ కృపాదిగుణఙ్గళ్ జీవిక్కుమ్పడియెఙ్ఙనే? అవై జీవిత్తనాకిల్ ఇవనై రక్షిత్తాలన్ఱో? “నియమియాతపోతు శాస్త్రమ్ జీవియాతు, రక్షియాతపోతు కృపాదికళ్ జీవియాతు, ఎన్శెయ్వోమ్” ఎన్నవేణ్డా, శాస్త్రత్తై విముఖర్ విషయమాక్కి కృపాదికళై అభిముఖర్ విషయమాక్కినాల్ ఇరణ్డుమ్ జీవిక్కుమ్, ఆవ

---

**మూ॥ ౧౧॥ ఇద్దఱిని దిద్దుబాటుచేయుట యుపదేశముచేతనే.**

(ఇరువరైయుమిత్యాది) ఈశ్వరుని దిద్దుబాటుచేయుట యెవ్విధముననఁగా— ఈచేతనుని యపరాధములను గుణించి మీరట్లు త్రోసివేసితిరేని, వీనికవేఱొక్కయాశ్రయము కద్దా? మీకును వీనికిఁగల (శరీరశరీరిభావ) సంబంధమును జూచినట్లయిన, “ఉఱవేల్ నమక్కిఙ్గొళిక్క వొళియాతు”(తిరుప్పా.౨౮.)(నీతో మాకుఁగల సంబంధము తొలఁగింప శక్యమైనది కాదు) అన్నట్లు * నీటికుండను పగలఁగొట్టినను పోనిదికదా! సాత్త్విక వీనిని లభించుటయనునది స్వామియగు మీయొక్క పనికాదా? (చేతనులను రక్షించుటకై) వారి వెనుకొన్నిపోవునట్టి మీకు నేను చెప్పవలయునా? రక్షింపుమని వచ్చినట్టి యీతనిని రక్షింపక పోతివేని మీయొక్క సర్వరక్షకత్వమునకు భంగము కలుగదా? నాయొక్క యాజ్ఞనతిక్రమించినా నిగ్రహమునకు విషయమైనట్టి యీతనిని యీతని యపరాధానుగుణముగ దండింపక, సహించి యంగీకరించితినేని, శాస్త్రీయమగు కట్టుబాటు తప్పిపోదా? అని కదా మీయభిప్రాయము! అట్లగునేని, ఈతనిని రక్షింపక, అపరాధాను గుణముగ నియమించితివేని, నీయొక్క కృపాదిగుణంబులెట్లు జీవింపఁగలవు? ఈతనిని రక్షించితే కదా యవి జీవించును? యీతనిని అపరాధానుగుణముగ నియమింపకపోతివేని శాస్త్రము జీవించదే? ఈతని రక్షింపకపోతివేని కృపాది గుణంబులు జీవింపవే? యేమిచేయఁగలనని భయపడవలదు శాస్త్రమును విముఖుల విషయమున నుపయోగింపుము. కృపాది గుణంబులను అభిముఖుల విషయమున నుపయోగింపుము. ఇట్లుచేసితివేని రెండును జీవింపఁగలవు. కావున దయచేసి యీతనిని రక్షింపుము. ఇవ్విధమున నుపదేశించుటచే పిరాట్టి పెరుమాళ్ళను దిద్దుబాటు చేయును.

---

* సంబంధము విడిపోయినదని తెలుపుటకుగాను ఒకఘటమునిండా నీళ్లుపోసి దానినియెత్తి పగలవేయుట యాచారము గలదు. ఈ యాచారము ఇప్పటికిని శవమును కొట్టముపై నుంచిన తరువాత కర్త యొక నీటికుండనుయెత్తి పగలవేయుచున్నాడు. ఈతావుననుగూడ యీకర్మ యిట్టి సంబంధరాహిత్యమును తెలుపునదియేయని యెఱుంగునది.“స్వదాసమిచ్ఛేద్యః కర్తుమదాసం ప్రీతమానసః । స్కన్ధాదాదాయ తస్యాసౌ భిన్ద్యాత్కుంభం సహాంభసా” ఇత్యాది ప్రమాణము గలదు.

పిస్సు ఇవన్నై రక్షిత్తరుళిగ” ఎన్నుముపదేశత్తాలే, ఇవ్వుపదేశక్రమమ్, ఇవర్ తామరుళిచ్చెయ్త పరన్దపడియిలుమ్, అచ్చాన్పిళ్ళైయరుళిచ్చెయ్త పరన్దరహస్యత్తిలుమ్ విస్తరేణ కాణలామ్.

“పితేవత్వత్ప్రియాః జనని పరిపూర్ణాగసి జనే హితస్రోతో వృత్త్యాభవతిచ కదాచిత్కలుషధీః । కిమేతన్నిర్దోషః క ఇహజగతీతిత్వముచితై రుపాయైర్విస్మార్య స్వజనయసిమాతాతదసినః” ఎన్ఱు అపరాధ పరిపూర్ణచేతన విషయమాక హితపరనాన సర్వేశ్వరన్ తిరువుళ్ళమ్ శీఱుమ్బడియాయ్, అద్దశైయిల్ “ఇచ్చీర్ గైత్తుక్కడియెన్?” ఎన్బతు, “ఇవన్ తీరక్కళియచ్చెయ్తవపరాధమ్” ఎన్ఱు అవన్ శొన్నాల్, “మణల్ శోఱ్ఱిలే కల్ ఆయ్వారుణ్డో? ఇన్దజగత్తిల్ అపరాధమఱ్ఱిరుప్పారార్?” ఎన్బతాయ్ ఉచితోపాయఙ్గళాలే అపరాధఙ్గళై మఱప్పిత్తు పిరాట్టిశేర్క్క మ్బడియైయుమ్ మరుళిచ్చెయ్కైయాలే, ఉపదేశత్తాలే ఈశ్వరనై త్తిరుత్తుమ్బడియై సఙ్గ్రహేణ భట్టరు మరుళిచ్చెయ్దారిఱే.

అవతారదశైయిలుమ్, “ప్రాణసంశయమాపన్నం దృష్ట్వాసీతాథవాయసమ్ । త్రాహిత్రాహీతిభర్తారమువాచదయయావిభుమ్” ఎన్ఱు వాచామగోచరమాన మహాపరాధత్తైప్పణ్ణిన కాకత్తై తలైయఱుప్పతాకవిట్ట బ్రహ్మాస్త్రత్తుక్కు ... ణ్ణాక్కివు ... ప్పిత్తు ప్పెరుమాళ్ రక్షిత్తరుళిగైయుమ్ ఇవళుపదేశత్తాలే యెన్నుమిడమ్ పాద్మత్తిల్ శొల్లప్పట్టతిఱే.

ఇట్టి యుపదేశక్రమమును వీరు(శ్రీపిళ్లైలోకాచార్యులవారు)ప్రసాదించిన “పరన్దపడి” అను గ్రంథమునను, అచ్చాన్పిళ్లై ప్రసాదించిన “పరన్దరహస్యము” అను గ్రంథమునను విస్తృతముగఁ జెప్పఁబడినదానిని జూచుకొనవచ్చును.

“పితేవత్వత్ప్రేయాన్ జనని పరిపూర్ణాగసిజనే హితస్రోతో వృత్త్యాభవతిచ కదాచిత్కలుషధీః । కిమేతన్నిర్దోషః క ఇహజగతీతిత్వముచితైః । ఉపాయైర్విస్మార్యస్వజనయసి మాతాతదసినః” (శ్రీగుణ ౫౨) (ఓతల్లీ! నీభర్తయగు సర్వేశ్వరుఁడు తండ్రివలెనే పరిపూర్ణపాపముగల యీ చేతనుని విషయమున హితముఁ గోరువాఁడగుటంజేసి ఒకానొకప్పుడు కోపదృష్టి గలవాఁడగును. నీవో, “ఇదియేమి? ఈలోకమున దోషములు లేనివాఁడెవ్వఁడు?” ఇవ్విధమున నుచితములగు నుపాయములచే మఱపించి రక్షింపఁజేయుచున్నావు. కావున నీవు మాతల్లివి.) అన్నట్లు అపరాధ పరిపూర్ణుఁడగు చేతనుని విషయమున హితపరుఁడగు సర్వేశ్వరుని తిరువుళ్ళము భారమగుటయు ఇట్లు కోపము వచ్చుటకుఁ గారణమేమి? అని యడుగఁగా “ఈతని తీరని పాపమే” అని బదులుచెప్పఁగా ఇసుకలో అన్నముతింటూ రాయివచ్చినదని చెప్పువారున్నారా? ఈలోకమున నపరాధపడని వారెవ్వరు? అని యిట్లు ఉచితోపాయములతో నపరాధములను మఱపించి పిరాట్టి యీచేతనుని పెరుమాళ్లతోఁ జేర్చునట్టి పద్ధతిని తెలుపుటచే ఈశ్లోకమున భట్టరును ఉపదేశముచే పిరాట్టి పెరుమాళ్లను దిద్దుబాటు చేయునట్టి విధమును సంగ్రహముగఁ బ్రసాదించినారు.

అవతార సమయమునను, “ప్రాణసంశయమాపన్నం దృష్ట్వాసీతాథవాయసం । త్రాహి త్రాహీతి భర్తారం ఉవాచదయయావిభుం” (పాద్మ) (ప్రాణములఁగోలుపోవునట్టి యవస్థలోనుండు కాకాసురుని చూచినదై శ్రీసీతాపిరాట్టి “రక్షింపుమా! రక్షింపుమా” అని యిట్లుదయతో భర్తకుపదేశించినదాయెను) అన్నట్లు వాచామగోచరమగు మహాపరాధంబొనర్చిన కాకాసురుని తల నరుకుటకై వదలిన బ్రహ్మాస్త్రమునకు సాఫల్యముగాను వాని యొక్క కంటిని గుడ్డిచేసి పెరుమాళ్లు యీతనిని రక్షించుటయును ఈపె యుపదేశమువలననే యనెడి విషయము శ్రీపాద్మపురాణమునఁ జెప్పఁబడినది కదా!

ఇని చేశిననై త్తిరుత్తువతు-ఉన్నపరాధత్తిన్ కనత్తైప్పార్త్తాల్ ఉనక్కొరిడత్తిలుమ్ కాలూన్ఱ విడమిల్లై, ఈశ్వరనానవన్ నిరఙ్కుశస్వతన్త్రనాకైయాలే అపరాధఙ్గళై ప్పత్తుమ్ పత్తాక క్కణక్కిట్టు అఱుత్తు ఈఙ్గ్రానిఱ్కుమ్, ఇవ్వనర్థత్తై త్తప్పవేణ్డిల్ అవన్ఱ్నువడికళిలే తలైశాయ్క్కైయొழியవేఱువழியిల్లై; అపరాధపరిపూర్ణనాన వెన్నై యవనఙ్గీకరిక్కుమో? దణ్డియానో? ఎన్ఱఞ్జవేణ్డా' అభిముఖ్యమాత్రత్తిలే అఖిలాపరాధఙ్గళైయుమ్ పొఱుక్కైక్కుమ్ భోగ్యమాగక్కొళ్ళైక్కుమ్ ఈడానగుణఙ్గళాల్ పూర్ణనెన్ఱు లోకప్రసిద్ధనాయిరుప్పానొరువన్, ఆనపిన్బు నీసుఖమే యిరుక్కవేణుమాకిల్ అవనై యాశ్రయిక్కప్పార్" ఎన్ఱుమ్ పరమహితోపదేశత్తాలే,

అప్పడి యొన్ఱైక్కేట్టోమెన్నిల్, పాపిష్ఠనాయ్ వழிకెడనడన్ద తిరికిఱరావణనైక్కుఱిత్తు. “మిత్రమౌపయికంకర్తుం రామఃస్థానంపరీప్సతా । వధంచానిచ్ఛతా ఘోరం త్వయాఽసౌ పురుషర్షభః ॥ విదితస్సహిధర్మజ్ఞశ్శరణాగతవత్సలః । తేన మైత్రీభవతు తే యదిజీవితుమిచ్ఛసి” ఎన్ఱు-పెరుమాళోడుణ్డాన పఙ్గుక్కైకొణ్డు ఉనక్కు ప్రాప్తమ్ శత్రువెయ్ప్పార్త్తిలైయాకిల్ వழியడిప్పాన్క్కుమ్ తరైయిలే కాల్పావినిన్ఱు వழியడిక్కకేన్, ఉనక్కొరికుప్పిడమ్ వేణ్డియిరున్దాయాకిలు మవనైప్పఱ్ఱావేణుమ్, అవరతల్లాతొరు స్థలముణ్డుకాణ్, ఎతిమైయాక ఎతిరకాలిలేకునిన్ఱ ఇవ్వుకుప్పిరుప్పతిట్టుట్టిల్ పట్టుపోకవమైయుమెన్ఱిరున్దాయో ఉన్నై మిత్రవధమ్ పణ్ణామల్

---

ఇఁకమీఁదు యీచేతనుని ఉద్ధారముచేయుట యెట్టిధమున ననఁగా, — నీయపరాధములఁ జూచినట్లయిన, నీకీలోకమున నెచ్చటను కాలుపెట్టుటకును జాగాలేదు. (గత్యంతరమెద్దియు గావఁబడదు) ఈశ్వరుఁడన్ననో, నిరంకుశ స్వతంత్రుం డగుటంజేసి యపరాధములను పదిపదిగా (ఒక్కటిన్ని తప్పకుండ) లెక్కపెట్టి అనుభవింపఁజేసి నశింపఁజేయువాఁడు. ఈయనర్థమును తప్పించుకొనఁగోరితివేని వానిని శరణుజొచ్చుటకన్న వేఱొక్క యుపాయములేదు. అపరాధ భూయిష్ఠుండగునన్ను వాడు రక్షించునా? దండింపఁడా? అని భయపడవద్దు. అభిముఖుఁడైనయినంతమాత్రమున నఖిలాపరాధములను సహించుటకును వాటిని భోగ్యములనుగాఁ గొనుటకును కావలసిన గుణములు సంపూర్ణము గాఁగలవాఁడుగా నతఁడు లోకప్రసిద్ధుండు. కావున నీవు సుఖపడ కోరితివేని, యతని నాశ్రయించుటకై ప్రయత్నింపుము. ఇట్టి యుపదేశములచే నీవె యీచేతనుని ఉద్ధారము చేయును.

ఇట్టివని విషయమునఁ దెలియవచ్చు నంటివేని—పాపిష్ఠుండై తప్పుదారిన పోవునట్టి రావణాసురునితో, “మిత్రమౌపయికంకర్తుమ్ రామఃస్థానం పరీప్సతా । వధంచానిచ్ఛతా ఘోరం త్వయాఽసౌ పురుషర్షభః । విదితస్సహిధర్మజ్ఞశ్శరణాగతవత్సలః । తేన మైత్రీభవతు తే యదిజీవితుమిచ్ఛసి” (స్థానమునుగోరునట్టి నీకు శ్రీరామచంద్రునితో స్నేహముఁజేయుట యుచితము. మఱియు ఘోరమగు వధను కోరకపోతివేని నీవు శ్రీరామచంద్రునితో మైత్రిని చేసికొనుట యుచితము. ఈ పురుషోత్తముఁడగు శ్రీరామచంద్రుఁడు ధర్మజ్ఞుఁడుగాను, శరణాగతవత్సలుండుగాను ప్రసిద్ధిఁబొందినవాఁడు. కావున బ్రతుకఁగోరితివేని వానితో స్నేహముఁ జేయుదువుగాక) అన్నట్లు పెరుమాళ్లతో స్నేహము జేసికొనుటయే నీకు మంచిది. అట్లు చేయవా? దారిగొట్టు దొంగలును తామొక తావున నిలిచియుండి గదా దారి కొట్టవలెను; నీకుండుట కొకజాగా కావలసియున్నను వానినాశ్రయింప వలయును. వానిదికాని ప్రదేశమెద్దియును లేదుసుమీ! దీనుఁడుగా శత్రువుకాళ్ల మీదపడితే లభించునట్టి స్థితికంటెను వాఁడు పట్టుకొని పోవుటయే మంచిది యని తలంచెదవా?

నల్లోర్కళైయాక క్కొళ్ళుమ్బోతు మవర్కళ్ శెయ్ద పిఴైకళైప్ పార్క్కవేణ్డా, నాన్ పణ్ణిన వపరాధత్తుక్కు ఎన్నై నియవర్ కైక్కొళ్వరో వెన్ఱిరుక్కవేణ్డా. ఆభిముఖ్యమ్పణ్ణినాల్ మున్పు శెయ్ద వపరాధత్తై ప్పార్త్తు చ్చీఱుమ్ నీచస్వభావమ్ అవర్ పక్కలిల్లైకాణ్, అవర్ పురుషోత్తమర్ కాణ్, శరణాగతి పరమధర్మమెన్ఱఱియుమవరాయ్, శరణాగతదోషమ్ పారాత వత్సలరాక ఎల్లారుమఱియుమ్పడి కాణ్ పెరుమాళిరుప్పతు, నీ జీవిక్కవేణుమెన్ఱిరుత్తాయాకిల్ అవరోడు ఉనక్కు ఉఱవుణ్డాక వేణుమ్” ఎన్ఱు ఇప్పడి అచ్చముఱుత్తి ఉపదేశిత్తాళిఱే. అఙ్ఙే తిరున్దాతొழிన్దతు ఇవళుడైయ ఉపదేశక్కుఱైయన్ఱే, అవనుడైయ పాప ప్రాచుర్యమిఱే. ఇప్పడి ఉభయరైయుమ్ (ఉపదేశిత్తాలే తిరుత్తుమ్) ఎన్నైయాలే, “శ్రుఞ్ శ్రవణే” ఎన్గిఱ ధాతువిలే నిష్పన్నమాన శ్రీశబ్దత్తిల్ “శృణోతి” “శ్రావయతి” ఎన్గిఱ వ్యుత్పత్తికళిల్ వైత్తుక్కొణ్డు “శ్రావయతి” ఎన్గిఱ వ్యుత్పత్త్యర్థమ్ శొల్లప్పటుకిఱతు. “శ్రావయతి” ఎన్గిఱ ఇతు ఈశ్వరవిషయమాకవే పూర్వర్కళ్ గ్రన్థఙ్గళిల్ పలవిడఙ్గళిలుమ్ కాణప్పట్టాలుమ్ “అథవా విముఖానామపి భగవదాశ్రయణోపదేశః శ్రావయితృత్వమ్, శ్లో॥ విదితస్సహి ధర్మజ్ఞశ్శరణాగతవత్సలః। తేన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి॥ ఇతి రావణం ప్రత్యుపదేశాత్” ఎన్ఱు తత్త్వదీపత్తిలే చేతనవిషయమాకవుమ్ జీయరరుళిచ్చెయ్కైయాలే, ఇవ్విడత్తిలుమ్ చేతనవిషయమాకవుమ్ శొల్లక్కుఱైయిల్లై.

---

నిన్ను చిత్రవధఁజేయక మంచిగానే చంపునన్న ... వాని నాశ్రయింప వలయును సుమీ! నే నొనర్చిన యపరాధములఁజూచి వారునన్నంగీకరింతురో! యని తలంపవద్దు. నీ వభిముఖుఁడవై వారివద్దకుఁ బోతివేని (నీవాడననుచు నాశ్రయించితివే) పూర్వమొనర్చిన యపరాధములఁజూచి కోపించునట్టి నీచస్వభావము వారికిలేము స... ఆతఁడు పురుషోత్తముండు. శరణాగతి పరమ ధర్మమని తెలిసినవాఁడు. శరణుజొచ్చినవారి ... లఁగమనింపనట్టి వాత్సల్యగుణము వారికున్న సంగతి యందఱు నెఱింగినదియే కదా! నీవు ... బ్రతుకందలఁచితివేని, వారితో నీకు స్నేహముండవలయును. అని యిట్లు లజ్జవిడిచిచెప్పి యుపదేశించినది గదా!

రావణుండు దిద్దుపాటు కాకపోవుట యనునది యీమె యుపదేశముయొక్క లోపముకాదు అందులకుఁ గారణము అతని పాపప్రాచుర్యమే. మూలమున “ఇద్దఱిని యుపదేశముచే దిద్దుబాటు చేయును” అనుటచే “శ్రుఞ్=శ్రవణే” అను ధాతువునుండి నిష్పన్నమైన “శ్రీ” శబ్దముయొక్క “శృణోతీతి శ్రీః=వినునదిగనుక శ్రీ యనిపేరు” అనియు, “శ్రావయతీతి శ్రీః=వినిపించునదిగనుక శ్రీ అనిపేరు” అనియు నిట్లు రెండువిధములగు వ్యుత్పత్త్యర్థములలో “శ్రావయతీతి శ్రీః” అను వ్యుత్పత్త్యర్థము చెప్పఁబడినది. “శ్రావయతీతి శ్రీః” అను వ్యుత్పత్త్యర్థము ఈశ్వరవిషయమున (ఈశ్వరుని కుపదేశించు విషయమున) పూర్వుల గ్రంథములలో ననేకములలోఁ గానఁబడియున్నను, (అథవా విముఖానామపి భగవదాశ్రయణోపదేశః శ్రావయితృత్వం శ్లో॥ విదితస్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః। తేన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి”) (అథవా విముఖులగువారిని భగవంతుని నాశ్రయింపుమని యుపదేశించుటయును శ్రావయితృత్వము కావచ్చును ఏలననఁగా “విదితస్సహి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః। తేన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి” ఇత్యాదితావుల నట్టి యుపదేశము గానఁబడుచున్నది) అనుచు రావణుని కుపదేశించుటనుబట్టి “తత్త్వదీపము” అను గ్రంథమున నంజీయర్ దీనిని చేతనవిషయముననుఅంగీకరించుటంజేసి యీతావున దీనిఁ జేతన విషయముననుచెప్పవచ్చును.

**మూ॥౧౨॥ ఉపదేశత్తాలే యిరువరుడైయవుమ్ కర్మపారతన్త్ర్యమ్ కులైయుమ్.**
**మూ॥౧౩॥ఉపదేశత్తాలే మీళాతపోతు, చేతననై యరుళాలే తిరుత్తుమ్;**

---

ఇవ్వుపదేశత్తాల్ ఇరణ్డుకులైయిలుమ్ ఫలిక్కుమతేతెన్న వరుళిచ్చెయ్ కిఱార్, (ఉపదేశత్తాలే ఎన్ఱుతుడఙ్గి) అతావతు-ఇప్పడి యిరణ్డు తలైక్కుమ్ తత్తదనుగుణమాక ఇవళ్ పణ్ణుముపదేశత్తాలే పుణ్యపాపఙ్గళాలే వశత్తిలే యిరుప్పణ్ణు భగవద్విముఖనాయ్ త్తిరికైయాలే చేతననుడైయ కర్మపారతన్త్ర్యముమ్, "ఇవనోపణ్ణిన కర్మత్తై ప్రధానమాక్కి అతుక్కీడాక వే శిక్షిక్కైయై" ఎన్ఱు ఇవనైడైయ రక్షణత్తిల్ విముఖనాయిరుక్కైయాలే ఈశ్వరనుడైయ కర్మపారతన్త్ర్యముమ్ నివృత్తమామెన్నై. చేతననుడైయ కర్మపారతన్త్ర్యమ అనాద్యచిత్సమ్బన్ధకార్యమాన అవిద్యానిబన్ధనమ్, ఈశ్వరనుడైయ కర్మపారతన్త్ర్యమ నిరఙ్కుశస్వాతన్త్ర్యకార్యమాన స్వసఙ్కల్ప నిబన్ధనమ్; ఇవై యిరణ్డు మనాదిసిద్ధమాయ్ పోన్దనవైయాకిలుమ, మాతృత్వసమ్బన్ధత్తాలే చేతననుక్కు ఆప్తైయాయ్, మహిషీత్వసమ్బన్ధత్తాలే ఈశ్వరనుక్కు అభిమతైయుమానవివళ్, ఇరణ్డుకులైయుమ్ నెఞ్జిళకి ఆశ్రయణాఙ్గీకారాభిముఖ ర్పడియాక పణ్ణుముపదేశత్తాలే నివృత్తమాకక్కడవతిఱే.

ఇవ్వుపదేశత్తాలివర్కళ్ మీళాతపోతు ఇవళ్ శెయ్వతెన్నన్న, అరుళిచ్చెయ్ కిఱార్, (ఉపదేశత్తాలే మీళాతపోతెన్ఱుతుడఙ్గి), చేతనన్ మీళామైక్కుడి-అనాదికాలమ "యానాసుమ్ పత్తర్గ్గుమ్" ఎన్గిఱపడియే భగవద్విముఖనాయ్ విషయప్రవణనాయ్ పోన్దకైయాల్ వన్ద

---

**మూ॥ ౧౨॥ ఉపదేశముచే నిద్దఱియొక్కయును కర్మపారతంత్ర్యము నశించును.**
**మూ॥౧౩॥ఉపదేశముచే దిద్దుబాటుకానప్పుడు చేతనుని కృపచే దిద్దుబాటుచేయును.**

---

అవతారిక: — ఇట్లు ఉపదేశించుటవలన వీరిద్దఱికిని ఫలించునది యెద్దియనిన "ఉపదేశత్తాలే" ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

వీరిద్దఱికి వారివారికిఁ దగినట్లు యీపె చేయునట్టి యుపదేశమువలన, పుణ్యపాపవశమున భగవద్విముఖుండై పోవునట్టి యీజీవుని కర్మపారతంత్ర్యమును, ఈతఁడొనర్చిన కర్మమునే ప్రధానముగాఁగొని దానికిఁదగినట్లుగా శిక్షించుటకై ఈతనిని రక్షించువిషయమున విముఖుండైయుండు ఈశ్వరునియొక్క కర్మపారతంత్ర్యమును ఈరెండును నివర్తించును. చేతనుని కర్మపారతంత్ర్యమనునది అనాదికాలము అచేతనపదార్థ సంబంధమువలనఁ గలుగు నవిద్యను బట్టియుండునది. ఈశ్వరుని కర్మపారతంత్ర్యమనునది నిరంకుశ స్వాతంత్ర్యమూలకమగు స్వసంకల్పమును బట్టియుండునది. ఈ రెండును అనాదిగనుండునట్టివియేయైనను తల్లియగుటంజేసి యీచేతనుని కెక్కుడాప్తయురాలును, భార్యయగుటంజేసి యీశ్వరుని కెక్కుడ ప్రియురాలునగు ఈపె వీరిద్దఱి మనస్సును తిరుగదీసి వీరిలో చేతనుని యాశ్రయణోన్ముఖునిగాను ఈశ్వరుని యంగీకారోన్ముఖునిగానును తనయుపదేశముచేఁ జేయఁగలదు.

ఉపదేశమువలన వీరు స్వాధీనపడనియెడల ఈపె చేయునది యెద్దియనిన "ఉపదేశత్తాల్" ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు. యీజీవుఁడు వశపడకపోవుటకు హేతువు "యానాసుమ్ పత్తర్గ్గుమ్" (దేనినైన నవలంబించి భగవద్విముఖుండగువాఁడు) అని నమ్మాళ్వారు లానతిచ్చినట్లు

**మూ॥ ౮౪॥ అఱియాత్తవర్థఙ్గళై అఱివిత్తు ఆచార్యకృత్యత్తైయుమ్,**

కృపాదికళై వెళియిట్టమై సొన్నపోతే శ్రీరామాయణత్తిల్ పురుషకారవైభవముక్తమాన పడియై యుపపాదిత్తారాయ్, మహాభారతత్తిల్ ఉపాయవైభవ ముక్తమానపడియై యుపపాదిక్కిఱార్ మేల్, (అఱియాత అన్తుతుడఙ్గి) అజ్ఞాత జ్ఞాపన మాచార్య కృత్యమిఱే, శరణ్య కృత్యమన్ఱే, అఙ్గియిఱే "ఎన్నైప్పెత్త తాయాయ్ తన్దైయాయ్" ఎన్ఱు ప్రియకరత్వ హితకరత్వఙ్గళాకిఱ మాతాపితృకృత్యఙ్గళై స్వయమేవ తమక్కుచ్చెయ్త ఉపకారత్తై యరుళిచ్చెయ్త వనన్తరమ్, ఆచార్యన్ శెయ్యుమ్ విశేషోపకారత్తైయుమ్ తానే తమక్కుచ్చెయ్తమైయై యరుళిచ్చెకిఱ వాழ్వార్ "అఱియాతనవఱివిత్త" ఎన్ఱరుళిచ్చెయ్తతు. ఇవ్విడత్తిల్ ఇవరరుళిచ్చెయ్కిఱవాక్యన్దాన్ అవ్వ దివ్యసూక్తిక్కు సూచకమాయిఱే యిరుక్కిఱతు.

అఱియాతవర్థఙ్గళైయవైన్దు వఱివిక్కైయావతు- తత్త్వవివేకమ్ తుడఙ్గి ప్రపత్తిపర్యన్తమాక అర్జుననుక్కు మున్బు అజ్ఞాతమాయిరున్ద వర్థఙ్గళైయెల్లా మఱివిక్కై. దేహాత్మాభిమానియాయ్ దేహానుబన్ధికళాన బన్ధుక్కళ్ పక్కలిలే స్థానే స్నేహత్తైప్పణ్ణి నిన్ఱవివనై ప్రకృత్యాత్మవివేకాదికళాలే తెళివిక్క వేణ్డుకైయాలే, "నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః। నచైవన భవిష్యామ స్సర్వేవయమతః పరమ్ ॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా। తథా

**మూ॥ ౮౪॥ తెలియని యర్థములను లెస్సగాఁ దెలుపునట్టి యాచార్యునికృత్యమును**

## ఉపాయవైభవమ్.

అవతారిక:—పిరాట్టి కి [illegible] లను బయలుపఱచిన విషయమును తెలుపునప్పుడు శ్రీరామాయణమున పురుషకారవైభవము [illegible] డినదని యుపపాదించి తరువాత యిప్పుడు శ్రీమహాభారతమున ఉపాయవైభవము చెప్పఁబడిన [illegible] అఱియాత"ఇత్యాది వాక్యముచే నుపపాదించుచున్నారు

తెలియఁదానిఁ దెలుపుట యాచ [illegible] ని పని కదా! అది శరణ్యుండగువాని పనికాదే! కావున నే శ్రీనమ్మాళ్వారులు "ఎన్నైప్పెత్త [illegible] తాయాయ్ తన్దైయాయ్" (నన్నుకనిన తల్లియును తండ్రియును) అనుచు నిట్లు [illegible] యుట హితముఁజేయుట యను ని మాతాపితృ కృత్యంబులఁజేయుట యను [illegible] యుఁ [illegible] సర్వేశ్వరుఁ డొనర్చినాఁడని చెప్పినపిమ్మట [illegible] నుపకారముఁ తమ [illegible] స్వయముగ జేసినాడని తెలుపునట్టి వీరు ఆచార్యుఁడు చేయు [illegible] టి విశేషోపకారమునున్న [illegible] ప్రసాదించి యున్నారు. ఈతావున శ్రీ "అఱియాతన వఱివిత్త" (తెలియనివాటిఁ దెలిపిన) ఆళ్వారి దివ్యసూక్తికి సూచకముగానే కదా పిళ్లైలోకాచార్యులవారు సాయించినవాక్యము శ్రీనమ్మా [illegible] యుండగలదు. తెలియని యర్థములను లెస్సగాఁ దెలుపుటయనఁ [illegible] గా — తత్త్వవివేకము మొదలు కొని ప్రపత్తిపర్యంతము అర్జునునికి ముందు తెలియని యర్థంబుల [illegible] ధువులయెడల అనుచితమగు వన్నింటిని తెలియఁజేయుట. అది యెట్లనిన, దేహాత్మాభిమానియై, దేహమును బట్టియుండు [illegible] బడప్పుడు "నత్వేవాహం జాతు ప్రీతితో నుండు సమయమున ప్రకృత్యాత్మవివేకముఁ గలుగఁజేయవలసిన ॥ దేహినోఽస్మిన్ యథా నాసం నత్వం నేమేజనాధిపాః। నచైవనభవిష్యామ స్సర్వేవయమతః పరం ।" (భ.గీ. ౨ అ.౧౨) దేహే కౌమారం యౌవనం జరా। తథాదేహాన్తరప్రాప్తిః ధీర స్తత్రనముహ్యతి.

దేహాన్తరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి" ఇత్యాదిశ్లోకై ప్రకృత్యాత్మవివేకమ్ ఆత్మపరమాత్మ వివేకమాంకిఙ తత్త్వవివేకత్రైయమ్, "అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః। అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత" "న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా వా న భూయః। అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి। తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ" ఇత్యాదిశ్లోకై ఆత్మనిత్యత్వ దేహాఽనిత్యత్వజ్ఞైయమ్ ప్రథమ ముపదేశిత్తు, అవనాద్వైయ స్వాతన్త్ర్యభ్రమత్తై తవిర్క్కైక్కాక, "భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ। అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్। జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" ఎన్గిఱపడియే చేతనాచేతన శరీరియాయ్, "సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనఞ్చ" ఎన్ఱుమ్,

---

౧౨ శ్లో) (ఓ అర్జునా! నేను మున్దొకప్పుడుండకపోయినదిలేదు. నీవును ఈ వచ్చినరాజులును అట్లే ముందుండియుండకపోలేదు. ఇంకమీఁదను వుండకపోము. ఈ యాత్మకు తన శరీరమున కౌమార యౌవన వార్ధక్యాద్యవస్థలుగలుగునట్లు దేహాంతరప్రాప్తియును గలుగుచున్నది. బుద్ధిమంతుఁడగువాఁడావిషయమున భ్రమఁజెందఁడు) అని యివ్విధముగ ప్రకృత్యాత్మ వివేకము (దేహాత్మలకుఁగల వైలక్షణ్యము) ఆత్మ పరమాత్మ వివేకమును తత్త్వవివేకమును "అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః। అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ న జాయతే మ్రియతే వా కదాచిన్నాయంభూత్వా భవితా వా న భూయః। అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో। న హన్యతే హన్యమానే శరీరే। వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి। తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ" (భ. గీ. ౨. అ. ౧౮. ౨౦. ౨౧) (నిత్యుఁడును, నాశరహితుఁడును, చక్షురాదీంద్రియములకుఁ దెలియనివాఁడునునగు నీజీవునికిఁగల శరీరములు నాశయుక్తములు. ఈ జీవుఁడు పుట్టువాఁడుగాని నశించువాఁడుగాని కాఁడు. ఇంతకుముందుండియిప్పుడు లేకుండగాని యింకమీఁద వుండబోవువాఁడుగాని కాఁడు. ఈతఁడు జన్మరహితుండు, నిత్యుండు శాశ్వతముగా నుండువాఁడు, చాలాకాలమునుండి యుండువాఁడు. ఈ శరీరము నశించినను ఈతఁడు నశింపఁడు. మనుష్యుఁడు చినిగిన వస్త్రములను తీసివేసి క్రొత్తవస్త్రములను ధరించుచందంబున ఈ జీవుండును జీర్ణములయిన శరీరములను విడిచిపెట్టి క్రొత్తశరీరములలోఁ బ్రవేశించుచున్నాఁడు," ఇత్యాదులచే నాత్మ నిత్యుఁడనియు దేహాదులనిత్యములనియును ప్రథమమున నుపదేశించి, స్వతంత్రుండనను యీతని భ్రాంతిని తొలంగించుటకుగాను "భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ। అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా। అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం। జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" (భ. గీ. ౭. అ. ౪. ౫) (ఓ అర్జునా! పృథివీ, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అనునవి నాయొక్క ఎనిమిది విధములుగల భిన్నమగు శరీరము. దేనిచే నీజగత్తు ధరింపఁబడుచున్నదో, అదియును నాయొక్క జీవభూతమగు శరీరము) అనియు నిట్లు చేతనాచేతన శరీరియై "సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ" (ఓ యర్జునా నేనందఱియొక్క హృదయమున నుండువాఁడను. స్మరణమును, జ్ఞానమును, జ్ఞానసంకోచమును నావలననే

**మూ॥ ప్రకారనియమముమ్, అధికారినియమముమ్, ఫలనియమముమిల్లై.**

**మూ॥ ౨౮॥ విషయనియమమే యుళ్ళతు.**

---

ప్రపత్తిక్కు— స్వరూపానురూపమా యిరుప్పతొన్ఱాకైయాలుమ్, చేతనర్గళుడైయ రుచ్యనుగుణమాన ఫలవిశేషఙ్గళుక్కు— సాధనమావతొన్ఱాకైయాలుమ్, ఇన్నియమఙ్గళొన్ఱుమితుక్కిల్లైయెన్గిఱతు. ‘‘నజాతిభేదం నకులం నలిఙ్గం నగుణక్రియాః। నదేశకాలౌ నావస్థాం యోగోహ్యయమపేక్షతే॥ బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాః స్త్రియశ్చాన్తరజాతయః। సర్వఏవప్రపద్యేరన్ సర్వధాతారమచ్యుతమ్’’ ఎన్ఱు ప్రపత్తిక్కు దేశకాలప్రకారాధికారినియమాభావమ్ భారద్వాజసంహితైయిలుమ్, ‘‘ ప్రపత్తేః క్వచిదప్యేవం పరాపేక్షానవిద్యతే। సాహిసర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా’’ ఎన్ఱు ఫలనియమాభావమ్ సనత్కుమార సంహితైయిలుమ్ శొల్లప్పట్టతిఱే.

ఇవైయిల్లైయాకిల్ మఱ్ఱుమ్ శిలనియమఙ్గళ్ తానితుక్కుణ్డోవెన్న అరుళిచ్చెయ్కిఱార్, (విషయనియమమేయుళ్ళతు) ఎన్ఱు. అతావతు—ఇన్నవిషయత్తిలే శెయ్యవేణుమెన్గిఱ నియమమే యితుక్కుళ్ళతెన్ఱపడి; ఇవైయెల్లామ్ తామే మేలే ఉపపాదిత్తరుళుకిఱారిఱే.

---

మూ॥ ప్రకారనియమమును, అధికారినియమమును, ఫలనియమమును లేవు.

మూ॥ ౨౮॥ విషయనియమమే కావలసినది.

---

వర్ణాదుల కనుగుణమైనదై యుండునట్టిది కాకుండ స్వరూపమున కనుగుణముగా నుండునదియైనందునను చేతనుల రుచికనుగుణముగ నానావిధఫలములకు సాధనభూతమైనందునను ఈ నియమము లేనియును దీనికి లేవు. అదియెట్లనిన, ‘‘నజాతిభేదం నకులం నలింగం నగుణక్రియాః నదేశకాలౌ నావస్థాం యోగోహ్యయమపేక్షతే। బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాః స్త్రియశ్చాంతరజాతయః సర్వఏవప్రపద్యేరన్ సర్వధాతారమచ్యుతం’’ (సర్వమును ధరించియుండువాడగు శ్రీమన్నారాయణుని శరణుజొచ్చువిషయమున జాతిభేదము గాని కులభేదము గాని లింగభేదము గాని, గుణములు గాని క్రియ గాని దేశకాలావస్థలు గాని యావశ్యకములు గావు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర జాతులవారందరును స్త్రీలును వీరిలో నంతర్గతములగు నితరజాతులవారును వీరు వారనక అందరును శరణుజొచ్చవచ్చును) అని యిట్లు ప్రపత్తికి దేశకాలాధికారి నియమములు లేకుండుటనుగురించి భారద్వాజసంహితయందుఁ జెప్పఁబడినది మఱియు ‘‘ప్రపత్తేః క్వచిదప్యేవం పరాపేక్షా నవిద్యతే సాహి సర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా’’ (ప్రపత్తికి వేఱొక్కదాని యపేక్షలేదు. అది సర్వకాలసర్వావస్థలయందును అందఱికిని అన్నికోరికలను నెరవేర్చునది అన్నిఫలముల నిచ్చునది) అని ప్రపత్తికి ఫలనియమము లేకుండుటను గుఱించి సనత్కుమార సంహితయందును చెప్పఁబడినది.

అవతారిక:—ఇవి లేకపోయినను ఇంకను ఏవియయిన కొన్ని నియమములు ప్రపత్తికి గలవా? యని యంటివేని యందులకు సమాధానమును తెలుపుచున్నారు.

ప్రపత్తికి విషయనియమమే కావలసినది. అనఁగా ఈవిషయమునఁ జేయవలశినది యనెడి విషయనియమమే కావలశినది.

మూ॥ ౨౫॥ కర్మత్తుక్కు పుణ్యక్షేత్రమ్, వసన్తాదికాలమ్, శాస్త్రోక్తఙ్గళాన తత్తత్ప్రకారఙ్గళ్. త్రైవర్ణికర్ ఎన్ఱివైయెల్లామ్ వ్యవస్థితఙ్గళాయిరుక్కుమ్.

---

ఇతు కీழ్చ్చొన్నవైయొన్ఱుమిల్లైయాకిల్ పిన్నై యెతుక్కుత్తానివైయెల్లాముళ్ళతెన్న అరుళిచ్చెయ్కిఱార్ (కర్మత్తుక్కెన్ఱుతుడఙ్గి). కర్మమావతు - జ్యోతిష్టోమాదికళ్. పుణ్యక్షేత్రఙ్గళావన-శాస్త్రఙ్గళిల్ పావనతయాఽభిహితఙ్గళాన దేశఙ్గళ్. (వసన్తాది) ఎన్ఱవిడత్తిల్ ఆదిశబ్దత్తాలే-గ్రీష్మశరచ్ఛుక్ల కృష్ణపక్ష పూర్వాహ్ణాఽపరాహ్ణాదికాలఙ్గళైచ్చొల్లుకిఱతు"వసన్తేవసన్తే జ్యోతిషా యజేత"ఇత్యాదికళాలే కాలనియమమ్ శొల్లప్పడానిన్ఱతిఱే. శాస్త్రోక్తఙ్గళాన తత్తత్ప్రకారఙ్గళావన శౌచాచమనస్నానవ్రతజపాదిరూపేణ అవ్వవకర్మఙ్గళుక్కను గుణమాక శాస్త్రవిహితఙ్గళాన అవ్వవప్రకారఙ్గళ్; (త్రైవర్ణికర్) ఎన్ఱతు ఉపనయనసంస్కార పూర్వకమాక వేదాధికారికళానవర్కళుక్కే వైదిక కర్మాధికారముళ్ళతాకైయాలే; ఇతు తాన్ గృహమేధిత్వ కృష్ణకేశిత్వ వేదవేదాఙ్గయుక్తత్వాదికళుక్కు ముపలక్షణమ్. (వ్యవస్థితఙ్గళా యిరుక్కుమ్) ఎన్ఱతు - నియతఙ్గళాయిరుక్కుమెన్ఱపడి.

ప్రసక్తిక్కైవైయొన్ఱుమిల్లై ఎన్ఱు కీழ్ప్పణ్ణిన ప్రతిజ్ఞైయై ఉపపాదిక్కైయిలే ప్రవృత్తరాయ్, ప్రథమమ్ దేశకాలనియమరాహిత్యత్తై ఉపపాదిక్కిఱార్,

---

మూ ॥ ౨౫ ॥ కర్మముకు పుణ్యక్షేత్రము, వసంతాదికాలము, శాస్త్రోక్తములగు నాయావిధంబులు త్రైవర్ణికులు అను నివి యన్నియును వ్యవస్థితములుగా నుండును.

---

దీనికి వీటిలో నెద్దియును లేకుండినట్లయిన దేనికిగా నివి యేర్పడినవని యంటివేని తెలుపుచున్నారు:—

(కర్మత్తుక్కు ఇత్యాది) కర్మము లనునవి జ్యోతిష్టోమాదులు. పుణ్యక్షేత్రంబు లనునవి శాస్త్రమునందు పావనము లయినవిగాను ప్రేమింపఁబడిన దేశములు. "వసన్తాది" అను తావునందు "ఆది" శబ్దముచే గ్రీష్మశరచ్ఛుక్ల కృష్ణపక్ష పూర్వాహ్ణ పరాహ్ణాదికాలములు తెలుపఁబడుచున్నవి."వసన్తే వసన్తే జ్యోతిషా యజేత" (ప్రతివసంతకాలమునను జ్యోతిష్టోమయాగముఁ జేయునది) ఇత్యాదితావుల కాలనియమము చెప్పఁబడినది గదా శాస్త్రమునందుఁ జెప్పఁబడినట్టి యాయావిధంబులనఁగా, శౌచాచమనస్నాన వ్రతజపాది రూపముగ ఆయాకర్మంబుల కనుగుణముగ శాస్త్రమునందు నియమింపఁబడిన ఆయావిధములు. త్రైవర్ణికులనునది — ఉపనయన సంస్కార పూర్వకముగ వేదాధికారము గలవారికే వైదికకర్మములయం దధికారముండుటచుబట్టి యట్లు చెప్పఁబడినది. ఇది గృహమేధిత్వ, కృష్ణకేశిత్వ, వేదవేదాంగ యుక్తత్వాదుల కన్నింటికిని యుపలక్షణము. వ్యవస్థితములుగా నున్నవి యనఁగా నియతములుగా నున్నవనుట.

అవతారిక:—ప్రసక్తికి యివి యేవియును లేవని యింతకుముందు చేసిన ప్రతిజ్ఞను ఉపపాదించువిషయమున ప్రవృత్తులై మొట్టమొదట దేశకాల రాహిత్యమును ఉపపాదించుచున్నారు.

**మూ॥ ౨౬॥ "సఏషదేశః కాలః" ఎన్గైయాలే ఇతుక్కు దేశకాల నియమమిల్లై.**

---

( సఏషః ఎన్ఱతుడక్కి ). (రా. యు. ౧౭. ౪౬)। "బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేన్ద్రాద్విభీషణః । అదేశకాలే సమ్ప్రాప్తస్సర్వథా శఙ్క్యతా మయమ్" ఎన్ఱు మున్బు శ్రీజామ్బవాన్ మహారాజర్ పెరుమాళుక్కు విణ్ణప్పమ్ శెయ్తపక్షత్తై దూషిక్కిఱ తిరువడి, "అదేశకాలే సమ్ప్రాప్త ఇత్యయం స విభీషణః । వివక్షా చాత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి । సఏష దేశః కాలశ్చ భవతీహ యథాతథా । పురుషాత్పురుషమ్ప్రాప్య తథా దోషగుణావపి దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమఞ్చ తథా త్వయి । యుక్తమాగమనం తస్య సదృశం తస్య బుద్ధితః" ఎన్ఱు - రావణనాల్ అవమానితనాయ్ స్వనికర్షత్తై మున్నిట్టుక్కొణ్డు శరణమెన్ఱువన్ద శ్రీవిభీషణాழ్వాన్, అదేశత్తిలే అకాలత్తిలేవన్దానెన్ఱు దేవరీరుడైయ మన్త్రికళాలే యాతొన్ఱు శొల్లప్పట్టతు, ఇన్దపక్షత్తిల్ విశేషిత్తు ఎనక్కొన్ఱు వివక్షైయుణ్డాకానిన్ఱతు అవన్ వరుకిఱవళవిల్ యాతొరుదేశత్తిలే యాతొరుకాలత్తిలేవన్దాన్, అవన్ వరవుక్కు అన్ద ఇతువే దేశముమ్, అన్ద ఇతువే కాలముమ్. యాతొరుపడి అప్పడిప్పట్టవివక్షైయై నానఱిన్దవళవుమ్ విణ్ణప్పమ్ శెయ్యక్కేట్టరుళవేణుమ్; ఎజ్ఞనేయెన్నిల్, తమఃప్రకృతియాకైయాలే పరహింసైయేయాత్రైయాన రావణనిట్టిల్, సత్త్వోత్తరరాకైయాలే పరరక్షణమే యాత్రైయాయిరుక్కిఱ దేవరీరై ప్రాప్యరాక బుద్ధిపణ్ణి, అప్పడియే రావణనైవిట్టుపోకాతొழిన్దాల్ అవనుడైయ అకృత్యత్తుక్కు సహకారియాయ్ అన్ద ప్రాతికూల్య

---

**మూ॥ ౨౬॥ "స ఏష దేశః కాలః" అన్నందున దీనికి దేశకాల నియమములు లేవు.**

---

(సఏష) ఇత్యాది "బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేంద్రాద్విభీషణః । అదేశకాలే సంప్రాప్తః సర్వథా శంక్యతామయం" ( రా. యు. ౧౭. ౪౬ ) ( బద్ధవైరుండును పాపియును నగు రావణాసురునివద్దనుండి విభీషణుండు కాలముగాని కాలమునను తావుకాని తావునను మీవద్దకు వచ్చియున్నాడు. కావున నితని రాకనుగురించి యనుమానించ వలసియున్నది ) అని యిట్లు జాంబవంతుండు శ్రీరామచంద్రునితో విన్నవించగా, దానిని దూషించుచు శ్రీయాంజనేయుఁడు "అదేశకాలే సంప్రాప్త ఇత్యయం స విభీషణః । వివక్షా చాత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి । స ఏష దేశః కాలశ్చ భవతీహ యథాతథ। పురుషాత్పురుషం ప్రాప్య తథా దోషగుణావపి । దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమంచ తథా త్వయి। యుక్తమాగమనం తస్య సదృశం తస్య బుద్ధితః" (రావణునిచే నవమానింపఁబడి నైచ్యమును తలంచుచు శరణుజొచ్చిన శ్రీవిభీషణాళ్వారులు కాలముగాని కాలమునను తావుగాని తావునను వచ్చినారని దేవరవారి మంత్రులు యేదో చెప్పియుండిరి. ఈవిషయమునుగురించి నేనొక్కటి విన్నవించవలసి యున్నది వారు యేకాలమున ఏదేశమున దేవరవారిని శరణుజొచ్చిరో అందుల కదియేదేశము అందుల కది యేకాలమని యేదోకవిధమున నాకు తెలిసినంతవరకు నేను విన్నవించుదానిని కృపతో నాలకించుదురుగాక అది యెట్లనిన, తమోగుణ స్వభావుండగుటచే పరహింసయే వృత్తినిగాఁగలిగియుండు రావణుని కంటెనున్న సత్త్వగుణ ప్రధానులగుటచే పరరక్షణమే వృత్తిగాగలిగియుండునట్టి దేవరవారిని ప్రాప్యులనుగాఁ దలంచియు, రావణుని విడిచిపోకపోయినట్లయిన వాని యకృత్యములకుఁ దోడ్పడివానికిఁగల ప్రాతికూల్యముతోఁగూడ నశించిపోవుటయనెడి దోషమునున్న ధార్మికులగు

**మూ॥ ౨౨॥ ఇవ్వర్థమ్ మన్త్రరత్నత్తిల్ ప్రథమపదత్తిలే సుస్పష్టమ్.**

త్తోడే ముడిన్దుపోకైయాకిలు దోషత్తైయుమ్, ధార్మికరాన దేవరీగుడనే కూడప్పెఱ్ఱాల్ తత్ఫలమానదేవరీర్ తిరువడికళిల్ కైఙ్కర్యత్తై లభిత్తు వాழ్కైయాకిలు నన్మైయైయుమ్ బుద్ధిపణ్ణి, అప్పడియే దేవరీర్ తిరువుళ్ళత్తిలే పుణ్ పడుమ్పడి నన్ఱాత్తైకిరక్కుమీయెచ్చెయ్తు నిఱ్కుమ రావణన్ దౌరాత్మ్యత్తైయుమ్, దురాత్మాక్కళై అనాయాసేన అழிక్కవల్ల దేవరాణ్పిళ్ళత్తనత్తైయుమ్ కణ్డాల్, విశేషజ్ఞనానవనుక్కు ఇవ్వరవు ప్రాప్తమ్, న్యాయత్తిలే సఞ్చరిక్కుమవనుడైయ బుద్ధిక్కు మితు సద్భతమెన్ఱానిరే. ఆక, ఇప్పడి భావశుద్ధియైయుడైయ నాన శ్రీవిభీషణాழ்వాన్ శరణమెన్నువన్ద దేశకాలఙ్గళిల్ కురైసొల్గెక్కు క్కడవతల్ల, అవన్ వన్దదువే దేశముమ్ కాలము మెన్ను, శరణాగతిధర్మజ్ఞనానతిరువడినర్ణయిక్కైయాలే, ప్రపత్తిక్కు దేశకాలనియమమిల్లైయెన్నై,

ఇతు తాన్ ప్రపత్త్యనుష్ఠానరూపమాన ద్వయత్తిల్ ప్రథమపదత్తిలే కాణలామెన్గిఱార్, (ఇవ్వర్థ మెన్ఱుతుడఙ్గి) సకలోపనిషత్సారమాయ్ సర్వాధికారమాయ్ అవిలమ్బఫలప్రదమాయ్ సర్వేశ్వరనుక్కత్యన్తాభిమతమాయిరుక్కైయాలే సర్వమన్త్రోత్కృష్టతయా "ద్వయేన మన్త్రరత్నేన" ఎన్ఱురపడియే మన్త్రరత్నాఖ్యమాయిరే ద్వయమిరుప్పతు, అన్వైభవమ్తోన్ఱ కైక్కైక్కి ద్వయమెన్నాతే (మన్త్రరత్నమ్) ఎన్గిఱార్. అతిల్ ప్రథమపదత్తిలే మతుపర్థమాన

**మూ॥ ౨౨॥ ఈయర్థము మంత్రరత్నమందలి మొదటి పదమందు స్పష్టపడును**

దేవరవారితోఁగూడ యుండుట లభించినట్లయిన, అందువలన ఫలముగా దేవరవారి శ్రీపాదముల సన్నిధిని కైంకర్యమును లభించి సుఖించుటయను సుగుణమునున్న యోచించి దేవరవారిహృదయమునకు ఎక్కువ కష్టమును గలుగఁజేయునట్టి పాపంబులను లెస్సగాఁజేసియున్నట్టి రావణుని దుష్టస్వభావమునున్న దుష్టులను అనాయాసముగ దండింపఁగల దేవరవారియొక్క పౌరుషమునున్న యోచించినట్లయిన, విశేషజ్ఞుఁడగువాని కిట్లుచేయుటయే యుక్తము. న్యాయమార్గమున సంచరించునట్టివానిబుద్ధికిని యిది సరియయినదియని కదా చెప్పియున్నాఁడు. కావున నిట్టి భావశుద్ధిగల శ్రీవిభీషణులవారు శరణుజొచ్చునట్టి దేశకాలముల మంచిచెడ్డలనుగురించి విచారింప నక్కఱ లేదు. ఆయనవచ్చిన కాలమే యందులకుఁ దగినకాలమనియు ఆయనవచ్చినతావే యందులకుఁ దగిన తావనియునిట్లు శరణాగతి ధర్మమును గుర్తెఱింగినట్టి శ్రీయాంజనేయులవారు నిర్ణయించుటంజేసి ప్రపత్తికి దేశకాల నియమములు లేవని యెఱుంగునది.

అవతారిక:— ఈవిషయమునుగురించి ప్రపత్త్యనుష్ఠానరూపమగు ద్వయమందలి మొదటిపదమునఁ జూడవచ్చునని తెలుపుచున్నారు.

(ఇవ్వర్థమ్)ఇత్యాది. సకలోపనిషత్సారమును, సర్వాధికారమును, విళంబము లేకుండఫలము నిచ్చునదై సర్వేశ్వరునికి యెక్కువ యిష్టమైన దగుటంజేసి మంత్రాంతరము లన్నింటికంటెను ఎక్కువశ్రేష్ఠమైనట్టి దయినందున "ద్వయేనమంత్రరత్నేన" (మంత్రశ్రేష్ఠమగు ద్వయముతో) అని సాయించినట్లు మంత్రరత్నమని పిలువఁదగినది గాను గదా ద్వయముండును. అట్టి వైభవము తెలియవచ్చుటకుగాను శ్రీపిళ్లై లోకాచార్యులవారును మూలమున దీనిని ద్వయమని పేర్కొనక "మంత్రరత్న" మని పేర్కొనియున్నారు.

మూ॥ ౨౮॥ ప్రకారనియతియిల్లై యెన్నుమిడ మెఙ్గుమ్ కాణలామ్.

మూ॥ ౨౯॥ ద్రౌపది స్నానశుద్ధైయాయన్రే ప్రపత్తి పణ్ణిర్రు;

---

పురుషకారోపాయ నిత్యయోగత్తుక్కు ప్రయోజనమ్, ఏతేనుమొరుదేశత్తిలే ఏతేనుమొరుకాలత్తిలే ఒరుసంసారిచేతననుక్కు భగవత్సమాశ్రయణరుచి పిఱన్దాల్, “చఞ్చలం హి మనః” “నిన్ఱవా నిల్లానెఞ్జు” ఎన్గిఱపడియే శూఱావళి కాత్తుప్పోలే శుళన్తువరుకిఱ నెఞ్జుతళర్మాఱ అఙ్కూరిత్తు క్షణభఙ్గురైయాన రుచి తీరువతుక్కుమున్నే, అదత్తత్క్షణత్తిలే ఆశ్రయిక్కలాయిరుక్కైయిఱే; ఆకైయాలే ప్రపత్తియినుడైయ దేశకాలనియమరాహిత్య మన్దపదత్తిలే నన్ఱాక తోత్తిఱ్ఱు మెన్గిఱార్.

ప్రకార నియమరాహిత్యత్తై దర్శిప్పిక్కిఱార్ మేల్ (ప్రకారనియతి ఎన్తుశుడఙ్గి). (ఎఙ్గుమ్ కాణలామ్) ఎన్ఱతు – ఇత్తై యనుష్ఠిప్పార్ శ్రవిప్పార్ ఎల్లార్పక్కలిలుమ్ కాణలామెన్ఱపడి,

అతెఙ్గేకణ్డతెన్న; పూర్వప్రకృత విషయఙ్గళిలే దర్శిప్పిక్కిఱార్, (ద్రౌపది) ఇత్యాదివాక్య ద్వయత్తాలే). (స్నానశుద్ధైయాయన్రే ప్రపత్తి పణ్ణిర్రు) ఎన్ఱతు – దుశ్శాసనాకృష్టైయాయ్ సభైయిల్ వరుకిఱపోతు “రజస్వలైకవస్త్రాహమ్ నతుమాం నేతుమర్హసి। గురూణాఞ్చపురస్థాతుం సభాయాం నాహముత్సహే” ఎన్నుమ్పడి అశుద్ధైయాయిరుక్కిఱవళ్ స్నానంపణ్ణియన్రే ప్రపత్తిపణ్ణి

---

మూ॥ ౨౮॥ ప్రకారనియమము లేదను విషయము నెచ్చటపడితే యచ్చట చూడ వచ్చును

మూ॥ ౨౯॥ ద్రౌపది బహిష్టయియుండి కదా ప్రపత్తిచేసినది

---

ద్వయమందు మొదటిపదమున (శ్రీమతే) అనుదాని యర్థమగు పురుషకారోపాయముల నిత్యసంబంధమునకు ప్రయోజనము, ఏదైన నొక దేశమునందు ఏదైన నొక కాలమునందు ఒక సంసారియగు చేతనునికి భగవత్సమాశ్రయణమునందు రుచిగలిగినట్లయిన “చంచలంహిమనః” అనియు “నిన్ఱవా నిల్లానెఞ్జు” అన్నట్లు సుడులు సుడులుగా తిరుగు గాలివలెనే శుడిచుట్టి తిరుగు మనస్సు ధృఢముగానిలిచి, క్షణభంగురమగు రుచి పోవుటకు ముందుగనే అనఁగానది యుత్పన్నమైనప్పుడే యాశ్రయింపవలసినదిగా నుండును గదా! కావున ప్రపత్తికి దేశకాల నియమము లేదను విషయము ఆ పదమున బాగుగా ప్రకాశించును.

అవతారిక:—ప్రకార నియమము ప్రపత్తికి లేదను విషయమును తెలుపుచున్నారు:—

(ప్రకారనియతి)ఇత్యాది. ప్రపత్తికి ఇవ్విధముగఁ జేయవలయునని యెడి నియమము లేకుండుటను ఈప్రపత్తిని యనుష్ఠించువారి విషయమునను వినువారివిషయమునను అందఱియెడలను చూడవచ్చును.

అవతారిక:—ఈవిషయమును యెవ్వరియెడల చూడవచ్చునంటివేని పూర్వము గాన్పించిన వారియెడలనే యీయనుష్ఠానముఁ జూపించుచున్నారు.

(ద్రౌపది) ఇత్యాది. ద్రౌపది దుశ్శాసనునిచే సభకు ఈడ్చుకొని రాబడినప్పుడు “రజస్వలైక వస్త్రాహం నతుమాం నేతుమర్హసి। గురూణాంచ పురస్థాతుం సభాయాంనాహముత్సహే” (నేను బహిష్టయియుండి యేకవస్త్రమును ధరించియుండుదానను కావున పూజ్యులగు మన పెద్దల

మూ॥ అర్జునన్ నీశర్ నడువేయిఱే యివ్వర్థమ్ కేట్టతు.
మూ॥ ౩౦॥ ఆకైయాల్ శుద్ధ్యశుద్ధికళిరణ్డుమ్ తేడవేణ్డా;

శ్రైన్దపడి. ఇత్తాల్, ప్రపత్తిపణ్ణువార్ ప్రయతరాయ్ప్పణ్ణవేణు మెన్నుమ్ నియతియిల్లామై కాట్టప్పట్టతు. (నీశర్ నడువేయిఱే ఇవ్వర్థమ్కేట్టతు) ఎన్తవిడత్తిల్ (నీశర్) ఎన్గిరతు “నెడున్దకైస్సై నినైయాతార్ నీశర్” ఎన్టాళ్వారరుళిచ్చెయ్త శౌరిచిన్తావిముఖరానహేయరై. “విష్ణుభక్తివిహీనస్తుయతిశ్చశ్వపచాధమః” “విప్రాద్ద్విషడ్గుణయుతా దరవిన్దనాభపాదారవిన్దవిముఖాచ్ఛ్వపచంవరిష్ఠమ్” ఎన్ఱు భగవద్విముఖరై శ్వపచాధమరాకచ్చొల్లిర్ఱిఱే. అతుక్కుమేలే శరణాగతరైస్సై ప్పరిభవిత్తుక్కు శరణాగతరానపాణ్డవర్కళ్ తిఱత్తిలే తీఙ్గుకళై చ్చెయ్తుమ్ పోరుకైయాలే సద్యశ్చణ్డాలతాంవ్రజేత్” ఎన్గిఱ క్రూరచణ్డాలరిఱే కైకలన్దు నిర్కిఱతు. (నీశర్ నడువే) ఎన్గైయాలే నీచస్పృష్టియాలివనుక్కుణ్డాన అశుద్ధియుమ్ నీచసకాశత్తిలే యిరున్నమిడముమ్ తోన్ఱుకిఱతు. ఇత్తాల్ ప్రపత్తిశ్రవణమ్పణ్ణుమ్పోతు నీచమధ్యత్తిలాకాతెన్నుమ్ నియతియిల్లామై కాట్టప్పట్టతు.
ఇత్తాల్ ఫలితత్తైచ్చొల్లానిన్ఱుకొణ్డు ఇవ్వర్థత్తైనిగమిక్కిఱార్, (ఆకైయా లెన్ఱుతుడఙ్గి). (ఆకై

మూ॥ అర్జునుండు నీచులమధ్యను గదా యీ యర్థమును వినినది
మూ॥ ౩౦॥ కావున పరిశుద్ధినిగాని యపరిశుద్ధినిగాని రెంటిని సంపాదించుకొన నక్కఱ లేదు. ఉన్నట్టుగానే యధికారియగు నింతియే

యొక్క యెదుటవచ్చి నిలుచుటకును అందులోను సభలోవచ్చి నిలువబడుటకును నాకిష్టములేదు) అన్నట్లు అపరిశుద్ధురాలగు నీమె స్నానము చేయకయే ప్రపత్తిని జేసినదాయెను. ఇందువలన ప్రపత్తిని జేయువారివ్విధమునఁ జేయవలయుననెడి నియమములేదని తెలుపఁబడినది.

“నీచులమధ్యనుగదా యర్జునుండు ఈయర్థమును వినినది” అనుతావున నీచులనఁగా “నెడున్దకైస్సై నినైయాతార్ నీశర్” (తి. మొ. ౧౧. ౬. ౧.) (గొప్పతేజస్సుగల సర్వేశ్వరుని తలంపనివారు నీచులు) అని తిరుమంగైయాళ్వారానతిచ్చినట్లు సర్వేశ్వరుని ధ్యానింపకయుండు హేయులనుట “విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః” (విష్ణుభక్తిలేని యతియైనను ఛండాలునికన్న నీచుండు) అనియు, “విప్రాద్ద్విషడ్గుణయుతా దరవిన్దనాభ పాదారవిన్ద విముఖాచ్ఛ్వపచంవరిష్ఠం” (గుణవంతుఁడగు బ్రాహ్మణుండైనను విష్ణుభక్తి విహీనుండగు పక్షమున వానికంటెను నున్న ఛండాలుండే శ్రేష్ఠుండు)అనియు నిట్లు భగవద్విముఖులు ఛండాలులకంటె నధములుగాను కదా శాస్త్రమునందు చెప్పఁబడినది. దానికిపైని శరణుజొచ్చినట్టి ద్రౌపదిని పరిభవించినదియు, శరణుజొచ్చినట్టి పాండవుల విషయమున దుష్కృత్యముల నొనర్చినదియును చాలును గదా! కావున “సద్యశ్చండాలతాంవ్రజేత్” అన్నట్లు స్వకృత్యములనుబట్టి ఛండాలురుగాఁ జెప్పఁబడువారు కదా యచట కలసి మెలసియుండువారు. (నీచులమధ్యను) అనుటచే నీచస్పృష్టివలన నీతనికిఁగల యశుద్ధియును, నీచుల మధ్యనుండుటంజేసి యట్టితావును సూచితములు, కావున ప్రపత్తినిగుఱించి తెలుసుకొను విషయమున నీచుల సామీప్యమునఁ గూడదనెడి నియమములేదని యిందువలన నేర్పడుచున్నది.

అవతారిక:—ఈపైని చెప్పినదానివలని ఫలితమును దెలిపి యీవిషయమును ముగించుచున్నారు.

(ఆకైయాల్) ఇత్యాది. అనుష్ఠానదశయందును శ్రవణదశయందును వీరిద్దఱు నిట్లుచేసియు

మూ॥ ఇరున్దపడియే యధికారియామిత్తనై.

మూ॥ ౩౦॥ ఇవ్విడత్తిలే వేల్వెట్టిపిళ్ళైక్కు పిళ్ళై అరుళిచ్చెయ్‌త వార్త్తైయై స్మరిప్పతు

---

యాల్) ఎన్గిఱతు అనుష్ఠానదశైయిలుమ్ శ్రవణదశైయిలుమ్ అవర్కళిరువరుమిప్పడి శెయ్‌కైయాలె
న్ఱపడి. (శుద్ధ్యశుద్ధికళిరణ్డుమ్ తేడవేణ్డా) ఎన్గిఱతు-ప్రపత్తియిల్ అన్వయిక్కుమళవిల్ అశుద్ధనాయి
రుక్కుమవనుక్కు శుద్ధిసమ్పాదిక్క వేణ్డా, శుద్ధనాయిరుక్కుమవనుక్కు అశుద్ధిసమ్పాదిక్క
క్కవేణ్డావెన్ఱపడి. అశుద్ధి తేడవేణ్డావెన్గిఱతు - కీళ్ చొన్నవర్కళిరువరుమశుద్ధరాన దశైయిలే ప్రపత్తి
యిలన్వయిత్తమై శొల్లుకైయాలే, అశుద్ధి తానితుక్కు వేణుమో వెన్ఱు శఙ్కియామైక్కాక. (ఇరున్ద
పడియే యధికారియామిత్తనై) ఎన్గిఱతు. ప్రపదనకాలత్తిల్ శుద్ధనాయాతల్ అశుద్ధనాయాతల్ యా
తొరుపడి యిరున్దాన్, ఇరున్దప్రకారత్తిలే ఇతుక్కధికారియామిత్తనై యెన్ఱపడి. ద్రౌపదియుమ్
అర్జుననుమ్ ప్రపత్త్యనుష్ఠానతచ్ఛ్రవణదశైకళిల్ తదఙ్గమాక శుద్ధి సమ్పాదియాతవోపాతి అశుద్ధియుమ్
సమ్పాదిత్తుక్కొణ్డమైయిల్లైయిఱే, ఇరున్దపడియే అధికారికళాన విత్తనైయిఱే.

ఇవ్వర్థవిషయమాక ఆప్తవచనత్తై స్మరిప్పిక్కిఱార్ మేల్. (ఇవ్విడత్తిలే ఎన్ఱుతుడఙ్గి). అతావతు-
వేల్వెట్టిప్పిళ్ళై "పెరుమాళ్ కడలై శరణమ్ పుకుకిఱవిడత్తిల్ ప్రాఙ్ముఖాదినియమోపేతరాయ్
శరణమ్ పుకుకైయాల్ ఇతరోపాయఙ్గళ్ పోలే ప్రపత్తిక్కుమిలనియమఙ్గళ్ వేణ్డియిరుక్కుమో?"
ఎన్ఱు నమ్బిళ్ళైయైక్కేట్క, "పెరుమాళ్ పక్కల్ కణ్డనియమమ్ ఇవ్వుపాయత్తుక్కు డన్ఱు యా

---

మూ॥ ౩౦॥ ఈవిషయమున వేల్వెట్టిపిళ్ళైక్కు నంబిళ్ళై సాయించినవార్త నిదర్శనము

---

న్నందున ప్రపత్తితో నన్వయించు సమయమున నపరిశుద్ధుఁడుగా నుండువాఁడొక పరిశుద్ధిని సంపా
దించుకొననక్కఱలేదనియు, పరిశుద్ధుండుగానుండువాఁడొక యపరిశుద్ధిని సంపాదించుకొననక్కఱ
లేదనియును ఏర్పడుచున్నది.

అవతారిక:—ఇంతకుముందు నిదర్శనముగాఁ జేర్కొనఁబడినట్టి యిద్దరును అపరిశుద్ధులుగా
నుండియే ప్రపత్తిచేసియుండుటనుబట్టి యపరిశుద్ధియే దీనికిఁ గావలసినదియా? యని శంకింపకుండు
టకై.

ప్రపత్తిని జేయుసమయమున పరిశుద్ధుండుగానుండని, అపరిశుద్ధుండుగానుండని యెట్లు
న్నాఁడో అట్లే యిందుల కధికారి యగును. ఇంతియే. ఏలననఁగా, ద్రౌపది ప్రపత్తిని జేయు
సమయమునను, అర్జునుండు ప్రపత్తినిగురించి విను సమయమునను అంగముగా నొక పరిశుద్ధతను
సంపాదించుకొనవట్లు, అపరిశుద్ధిని సంపాదించుకొని యుండలేదు గదా! కావున వారువారు
వారువారున్నట్టుగానే యధికారులు.

అవతారిక:—ఈయర్థము విషయమున నాప్తవాక్యమును జూపించుచున్నారు.

(ఇవ్విడత్తిల్) ఇత్యాది. ఒకదినమున వేల్వెట్టిపిళ్ళైయను స్వామివారు "శ్రీరామచంద్రుం
డు సముద్రమును శరణుజొచ్చినప్పుడు ప్రాఙ్ముఖాది నియమములతో శరణుజొచ్చియుండుటనుబట్టి
యితరోపాయములకువలెనే, ప్రపత్తికిని కొన్ని నియమములు కావలసియున్నవా?" అని నంబిళ్ళైగా
రిని యడుగఁగా, అంతట వారు "శ్రీరామచంద్రుని విషయమున మీరు గాన్పించిన నియమము ఈ

**మూ॥ 3౨॥ అధికారినియమమిన్ఱిక్కే యొఴిన్దపడియెన్నెన్నిల్; ధర్మపుత్రాదికళుమ్ ద్రౌపదియుమ్,**

---

యిరుప్పతొన్ఱు, ఉపాయపరిగ్రహమ్ పణ్ణినవరుడైయ స్వభావత్తాలే వన్దతిత్తనై; పెరుమాళ్ తమక్కు «సముద్రం రాఘవో రాజా శరణం గన్తుమర్హతి» ఎన్ఱుపదేశిత్తాన్ శ్రీవిభీషణాఴ్వానే, అవన్దాన్ పెరుమాళై శరణమ్పుకుకిఱవిడత్తిల్, కడలిలే యొరుముఴుక్కిట్టువన్దానెన్ఱిల్లైయే; ఇత్తాల్ శొల్లిఱ్ఱాయిఱ్ఱు-పెరుమాళ్ ఇక్ష్వాకు వంశ్యరాయ్ ఆచారప్రధానరాయిరుక్కైయాలే తమ్ముడైయ నియమఙ్గళోడే శరణమ్ పుక్కార్, ఇవన్ రాక్షసజాతీయనాకైయాలే నిన్ఱనిలయిలే శరణమ్పుక్కాన్, ఆకైయాల్ యోగ్యనుక్కు అయోగ్యతై సమ్పాదిక్క వేణ్డా, అయోగ్యనుక్కు యోగ్యతై సమ్పాదిక్క వేణ్డామ్, నిన్ఱనిలైకళిలే అధికారికళామిత్తనై యెన్నుమతు" ఎన్ఱిచ్చెయ్త, వాఱ్ఱై.

అనన్తరమధికారినియమాభావత్తై యుపపాదిప్పతాక తజ్జిజ్ఞాసుప్రశ్నత్తై అనువదిక్కిఱార్, (అధికారినియమమిన్ఱిక్కే యొఴిన్దపడియెన్నెన్నిల్) ఎన్ఱు. అతుక్కుత్తరమరుళిచ్చెయ్కిఱార్, (ధర్మపుత్రాదికళుమెన్ఱుతుడఙ్గి) అతావతు «ద్రౌపద్యాసహితాస్సర్వే నమశ్చక్రుర్జనార్దనమ్» ఎన్ఱు క్షత్రియరాన ధర్మపుత్రాదికళుమ్, «శఙ్ఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత। గోవిన్దపుణ్డరీకాక్ష రక్ష మాం శరణాగతామ్» ఎన్ఱు స్త్రీయాన ద్రౌపదియుమ్; «సపిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ

---

**మూ॥ 3౨॥ అధికారినియమము లేకపోవుట యెట్లనఁగా:— ధర్మపుత్రాదులును, ద్రౌపదియును**

---

యుపాయముతోఁ జేరియుండునది కాదు. అది యుపాయ పరిగ్రహముచేసిన వారి స్వభావమును బట్టి వచ్చినది ఇంతియే. ఎట్లనిన, శ్రీరామచంద్రునికి «సముద్రం రాఘవో రాజా శరణం గన్తుమర్హతి» అన్నట్లు సముద్రమును శరణుజొచ్చుమని యుపదేశించినవారు శ్రీవిభీషణులవారు గదా! వారే శ్రీరామచంద్రుని శరణుజొచ్చినప్పుడు సముద్రములో ఒక మునక వేసి వచ్చినారని లేదు గదా! శ్రీరామచంద్రుఁడు ఇక్ష్వాకువంశమున నవతరించి యాచార ప్రధానులగుటచే తమయొక్క నియమముతోఁగూడ శరణుజొచ్చినారు. ఈతఁడు రాక్షసజాతి వాఁడగుటచే నున్నట్టుగనే శరణుజొచ్చినవాఁడాయెను. కావున యోగ్యుఁడు అయోగ్యతను సంపాదించుకొన నక్కఱ లేదు. అయోగ్యుఁడు యోగ్యతను సంపాదించుకొన నక్కఱ లేదు. వారువారు వారువారున్నట్టి స్థితిలోనే యధికారులు కాగలరు" అని సాయించి యుండిరి.

అవతారిక:— తరువాత అధికారి నియమము లేదను విషయము నుపపాదించుటకై దానిని గుఱించి యడుగువారి ప్రశ్నను అనువదించుచున్నారు.

(అధికారి) ఇత్యాది «ద్రౌపద్యా సహితాస్సర్వే నమశ్చక్రుర్జనార్దనం» ద్రౌపదితోఁగూడ అందఱును శ్రీకృష్ణునికి దండము సమర్పించిరి) అన్నట్లు క్షత్రియులగు పాండవాదులును «శంఖచక్ర గదాపాణే ద్వారకా నిలయాచ్యుత । గోవింద పుండరీకాక్ష రక్షమాం శరణాగతాం» (భా. సభా. ౬౬. ౮౧) (శంఖచక్రాద్యాయుధములను హస్తమునందుంచుకొనినవాఁడా! ఓద్వారకావాస, ఓఅచ్యుత, ఓగోవింద! ఓపుండరీకాక్ష శరణుజొచ్చినట్టి నన్ను రక్షింపుమా!" అన్నట్లు స్త్రీయగు ద్రౌపదియును «సపిత్రా చ పరిత్యక్తః సురైశ్చ స మహర్షిభిః । త్రీన్ లోకాన్ సమ్పరి

**మూ॥** కాకముమ్, కాళియనుమ్, శ్రీగజేన్ద్రాళ్వానుమ్, శ్రీవిభీషణాళ్వానుమ్, పెరుమాళుమ్ ఇళైయపెరుమాళుమ్

---

సమహర్షిభిః । త్రీన్ లోకాన్ సమ్పరిక్రమ్య తమేవశరణఙ్గతః” ఎన్ఱు దేవరూపత్తైప్పణ్ణినకాకముమ్ “సోఽహన్తే దేవదేవేశ నార్చనాదౌ స్తుతౌ నచ । సామర్థ్యవాన్ కృపామాత్రమనోవృత్తిః ప్రసీద మే” ఎన్ఱు తిర్యగ్యోనిజనాయ్ ప్రతికూలనుమాన కాళియనుమ్; “పరమాపదమాపన్నో మనసాచిన్తయద్ధరిమ్। సతు నాగవరశ్శ్రీమాన్ నారాయణపరాయణః” ఎన్ఱు తిర్యగ్యోనిజన్మావాయ్ అనుకూలనుమాయిరుక్కిఱ శ్రీగజేన్ద్రాళ్వానుమ్; “సోఽహం పరుషితస్తేన దాసవచ్చావమానితః। త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణఙ్గతః” ఎన్ఱు రాక్షసజాతీయనాన శ్రీవిభీషణాళ్వానుమ్; “బాహుం భుజగభోగాభ ముపధాయారిసూదనః । అంజలిం ప్రాఙ్ముఖం కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః” ఎన్ఱు సర్వశరణ్యరాన పెరుమాళుమ్; “స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః । సీతాముహాచాతియశా రాఘవఞ్చ మహావ్రతమ్” ఎన్ఱు అక్కరైయరాయ్ తుడర్న్దడిమైశెయ్యానిన్ఱ ఇళైయపెరుమాళుమ్; (తుడక్కమానవర్కళ్) ఎన్నైయాళె “సోఽహన్త్వాం శరణ మపారమప్రమేయం సమ్ప్రాప్త

---

**మూ॥** కాకాసురుండును, కాళియును, శ్రీగజేంద్రాళ్వారును, శ్రీవిభీషణులవారును, శ్రీరామచంద్రుండును, శ్రీలక్ష్మణస్వామియును

---

క్రమ్య తమేవ శరణంగతః” అన్నట్లు దేవరూపముతోవచ్చి మహాపరాధముఁజేసినట్టి కాకాసురుఁడును “సోఽహన్తే దేవదేవేశ నార్చనాదౌ స్తుతౌనచ । సామర్థ్యవాన్ కృపామాత్ర మనోవృత్తిః ప్రసీదమే” (వి. పు. ౫. ౭. ౭౦) (ఓభగవంతుఁడా! నిన్ను పూజించుటకుగాని స్తుతించుటకుగాని నేను సమర్థుండనుకాను. నీయొక్క కృపచే నన్ను రక్షింపుమా!) అన్నట్లు తిర్యగ్యోనిజుఁడును ప్రతికూలుఁడునైన కాళియును “పరమాపదమాపన్నో మనసాచింతయద్ధరిం సతునాగవరశ్శ్రీమాన్ నారాయణ పరాయణః” (వి. ధ. ౬౯. ౪౭) (గజేంద్రుఁడు గొప్ప యాపత్తునుబొంది మనస్సున శ్రీహరిని ధ్యానించి భగవద్భక్తుండుగా నుండెను) అన్నట్లు తిర్యగ్యోనిజుండై యనుకూలుండగు గజేంద్రుండును “సోహం పరుషితస్తేన దాసవచ్చావమానితః । త్యక్త్వాపుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః” (రా. యు. ౧౭. ౧౬.) (రావణుండు పరుషభాషణములతో నన్ను కింకరునివలెఁజూచి యవమానించినందున శ్రీరామచంద్రుని శరణుజొచ్చినాడను) అన్నట్లు రాక్షసుండగు శ్రీవిభీషణులవారును “బాహుం భుజగభోగాభముపధాయారిసూదనః। అఞ్జలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః” (శ్రీరామచంద్రుండు సర్పము పడిగెవలెనుండు అంజలిజోడించి తూర్పుముఖమునఁ గూర్చుండి సముద్రమునుశరణుజొచ్చెను) అన్నట్లు సర్వశరణ్యుండగు శ్రీరామచంద్రుండును “సభ్రాతుశ్చరణౌగాఢం నిపీడ్య రఘునందనః । సీతాముహాచాతియశాః రాఘవంచ మహావ్రతం” (రా. అ. ౩౧. ౨) (లక్ష్మణుండు శ్రీరామచంద్రునికి దండముసమర్పించి సీతాదేవి సమక్షమున శ్రీరామచంద్రుని శరణుజొచ్చెను) అన్నట్లు శ్రీవైకుంఠమునుండెడువారై భగవంతుఁడు అవతరించినతావున వచ్చి కైంకర్యముచేయఁదలంచిన శ్రీలక్ష్మణస్వామియును మొదలగువారు. అదిశబ్దముచే “సోహంత్వాంశరణ మపార మప్ర

మూ॥ తుడక్కమానవర్కళ్ శరణమ్ పుకురుకైయాలే అధికారినియమమిల్లై.

---

పరమపదంయతోనకిఞ్చిత్ । సంసారశ్రమపరితాపతప్తచేతా నిర్వాణే పరిణతధామ్నిసాభిలాషః” ఎన్ఱు ముచుకున్దనుమ్, “మూర్ఖోఽయమల్పమతిరల్పవిచేష్టితోఽయంక్లిష్టం మనోఽస్యవిషయైర్నమయిప్రసక్తి । ఇత్థం కృపాంకురుమయిప్రణతేఽఖిలేశ త్వాంస్తోతుమమ్బుజభవోఽపిహిదేవనేశః” ఎన్ఱు క్షత్రబన్ధువుమ్; “భగవన్తంప్రపన్నాసాభగవన్తమవాపహ” ఎన్ఱు మాధవియుమ్; “తంప్రభిన్నశిరోగ్రీవమాస్యేభ్యః స్రుతశోణితమ్ । విలోక్యశరణంజగ్ముస్తత్పత్న్యో మధుసూదనమ్” ఎన్ఱు కాళియపత్నికళుమ్; “ప్రణామప్రవణా నాథ దైత్యసైన్యపరాజితాః । శరణంత్వామనుప్రాప్తాస్సమస్తాదేవతాగణాః” ఎన్ఱు, ఇన్ద్రాదిదేవతైగళుమ్; “రాక్షసైర్మధ్యమానానాం వానరాణాం మహాచమూః । శరణ్యంశరణంయాతా రామందశరథాత్మజమ్” ఎన్ఱు శ్రీ వానరసేనైయుమ్, ముతలాన వర్గళెల్లారుమ్ శరణమ్పుకురుకైయాలే ప్రపత్తిక్కు ఇన్నారధికారికళెన్ఱోరు నియతియిల్లై; రుచియుడైయారెల్లారుమధికారికళేనై.

---

మూ॥ మొదలగువారు శరణుజొచ్చినందున అధికారినియమము లేదు.

---

మేయం సంప్రాప్తః పరమపదం యతోనకిఞ్చిత్ సంసారశ్రమ పరితాపతప్తచేతా నిర్వాణేపరిణతధామ్ని సాభిలాషః” (ఎవ్వారినాశ్రయించినను ఎట్టిఫలమును లభింపక సంసారమువలన తపించిన మనస్సుగలవాఁడనై యనంతుండును అప్రమేయుండునగుటచే పరిపక్వమైన తేజస్సుగల పరమపదమును బొందుటకై నిన్ను శరణుజొచ్చినాఁడను) అన్నట్లు ముచుకుందుఁడును, “మూర్ఖోయమల్పమతిరల్ప విచేష్టితోయం క్లిష్టంమనోస్యవిషయై ర్నమయి ప్రసక్తి। ఇత్థంకృపాం కురుమయిప్రణతేఽఖిలేశ త్వాం స్తోతుమమ్బుజ భవోపిహిదేవనేశః”(వీఁడుమూఢుండు, స్వల్పబుద్ధిగలవాఁడు స్వల్పచేష్టలుగలవాఁడు. ఈతనిమనస్సు శబ్దాదివిషయములలో మునింగియున్నదై నావైపుతిరుగకయున్నది అని తలంచి శరణుజొచ్చినట్టి నన్ను పాలించుము) అన్నట్లు క్షత్రబంధువును “భగవంతంప్రపన్నాసాభగవంత మవాపహ” (భగవంతుని శరణుజొచ్చి భగవంతునిపొందిన దాయెను” అన్నట్లు మాధవియును, “తంప్రభిన్నశిరోగ్రీవ మాస్యేభ్యః స్రుతశోణితం। విలోక్య శరణంజగ్ముస్తత్పత్న్యో మధుసూదనం” (తల నరకబడగా రక్తము స్రవించునట్టి కాళియునిజూచి వానిభార్యలు భగవంతుని శరణుజొచ్చిరి) అన్నట్లు కాళియపత్నులును “ప్రణామ ప్రవణా నాథ దైత్యసైన్యపరాజితాః శరణంత్వా మనుప్రాప్తాః సమస్తా దేవతాగణాః) (దైత్యులచే జయింపఁబడి దేవతలందరును దండము సమర్పించుచువచ్చి నిన్ను శరణుజొచ్చిన వారయిరి) అన్నట్లు ఇంద్రాదిదేవతలును, “రాక్షసైర్మథ్యమానానాం వానరాణాం మహాచమూః। శరణ్యంశరణంయాతా రామందశరథాత్మజం) (రాక్షసులచే ధ్వంసము చేయఁబడునట్టి వానరసైన్యము శ్రీరామచంద్రుని శరణుకొచ్చెను)అన్నట్లు వానరసేనయును, యీ మొదలగు వారందఱును శరణుజొచ్చినందున ప్రపత్తికి యిట్టి వారధికారులనెడి నియమము లేదు. రుచిగలవారందఱును అధికారులని యెఱుంగునది.

అవతారిక: — తరువాత ఫలనియమము లేకుండుటనుగుఱించిన ప్రశ్నను అనువదించుచున్నారు. ఫలనియమము లేకపోవుటకుఁ గారణమేమనఁగా నందులకు సమాధానమును “ధర్మపుత్రాదిగళుక్కు” ఇత్యాది వాక్యముచే సాధించుచున్నారు.

మూ॥ 33॥ ఫలనియమమిన్రిక్కే యెన్నిన్నపడి యెన్నెన్నిల్; ధర్మపుత్రాదికళుక్కు ఫలమ్ రాజ్యమ్, ద్రౌపదిక్కు ఫలమ్ వస్త్రమ్, కాకత్తుక్కుమ్ కాళియను క్కుమ్ ఫలమ్ ప్రాణమ్, శ్రీగజేన్ద్రాళ్వానుక్కు ఫలమ్ కైఙ్కర్యమ్, శ్రీవిభీష ణాళ్వానుక్కు ఫలమ్ రామప్రాప్తి, పెరుమాళుక్కు ఫలమ్, సముద్రతరణమ్ ఇళైయపెరుమాళుక్కు ఫలమ్ రామానువృత్తి.

మూ॥3౪॥ విషయనియమమావతు—గుణపూర్తియుళ్ళవిడమే విషయమాకై;

---

అనన్తరమ్ ఫలనియమాభావ ప్రశ్నత్తై యనువదిక్కిఱార్, (ఫలనియమమిన్రిక్కే యెన్నిన్న పడి యెన్నెన్నిల్) ఎన్రు. అతుక్కు త్తరమరుళిచ్చెయ్కిఱార్, (ధర్మపుత్రాదికళుక్కుఫలమ్) ఎన్రు తుడఙ్గి. ఇత్తాల్-కీழ் అధికారి నియమాభావత్తుక్కుడలాక క్కాట్టప్పట్ట ధర్మపుత్రాదికళ్ తుడ క్కమాన ప్రపత్తాక్కళానవర్కళ్, రాజ్యార్థమాకవుమ్, వస్త్రార్థమాకవుమ్, ప్రాణార్థమాక వుమ్, కైఙ్కర్యార్థమాకవుమ్, రామప్రాప్త్యర్థమాకవుమ్, సముద్రతరణార్థమాకవుమ్, రామాను వృత్త్యర్థమాకవుమ్, ప్రపత్తిపణ్ణుకైయాలే ప్రపత్తిక్కు ఫలనియమమిల్లైయెన్రు తాయిற்று.

ఆక, ప్రపత్తిక్కు దేశకాలాది నియమాపేక్షైయిల్లైయెన్ర ప్రతిజ్ఞైయై ఉపపాదిత్తార్ కీழ், ‹‹విషనియమమేయుళ్ళతు›› ఎన్రప్రతిజ్ఞైయై ఉపపాదిక్కిఱార్ మేల్, (విషయనియమమావతు) ఎన్రు తుడఙ్గి. (గుణపూర్తియుళ్ళవిడమే విషయమాకై) ఎన్రతు-పరత్వాదికళిల్ వైత్తుక్కొణ్డు సౌలభ్యాదిగుణపూర్తియుళ్ళవిడమే విషయమాకైయెన్రపడి. అన్దగుణపూర్తితానుళ్ళ తెఙ్గేయెన్న,

---

మూ॥ 33॥ ఫలనియమము లేకపోవుట యెట్లనఁగా:—ధర్మపుత్రాదులకు ఫలము రాజ్యము. ద్రౌపదికి ఫలము వస్త్రము. కాకాసురునికిన్ని కాళియునికిన్ని ఫలము ప్రాణము. శ్రీగజేంద్రాళ్వానుకి ఫలము కైంకర్యము. శ్రీ విభీషణుల వారికి ఫలము శ్రీరామప్రాప్తి. శ్రీరామచంద్రునికి ఫలము సముద్రతర ణము. శ్రీలక్ష్మణస్వామికి ఫలము రామానుసరణము.

మూ॥ 3౪॥ విషయనియమమనఁగా—గుణపూర్తిగలతావే విషయమగుట

---

ఇంతకుముందు అధికారినియమము లేకపోవుటకు నిదర్శనముగాఁ జేర్కొనంబడినట్టి ధర్మ పుత్రులు మొదలుగాఁగల ప్రపన్నులు రాజ్యార్థముగాను, వస్త్రార్థముగాను, ప్రాణార్థముగాను కైంకర్యార్థముగాను రామప్రాప్త్యర్థముగాను, సముద్రతరణార్థముగాను, రామానువృత్త్యర్థముగా నను ప్రపత్తిచేయుటంజేసి ప్రపత్తికి ఫలనియమములేదని యేర్పడు చున్నది.

అవతారిక:—కావున నింతకుముందు ప్రపత్తికి దేశకాలాదినియమములు లేవను ప్రతిజ్ఞను ఉపపాదించి యిప్పుడు విషయనియమమే కావలశినదను ప్రతిజ్ఞను ఉపపాదించు చున్నారు.

(విషయనియమమ్) ఇత్యాది. గుణములు పూర్తిగానుండునదియేవిషయ మగును అనఁగా పర త్వాదులన్నింటిలోను సౌలభ్యాదిగుణములు పూర్తిగాగలదియే విషయమనుట.

అవతారిక:—అట్టిగుణపూర్తియున్నది యెచటననఁగా నది యర్చావతారమునఁగలదని ‹‹పూ ర్తియుళ్లతు›› ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

మూ॥ పూర్త్తియుళ్ళతు మర్చ్చావతారత్తిలే.

మూ॥ ౩౬॥ ఆళ్వార్కళ్ పలవిడత్తిలుమ్ ప్రపత్తిపణ్ణిర్ఱు మర్చ్చావతారత్తిలే.

---

(పూర్త్తియుళ్ళతు మర్చ్చావతారత్తిలే) ఎన్గిఱాన్. ‘‘అర్చ్చావతారవిషయే మయాప్యుద్దేశతస్తథా। ఉక్తాగుణానశక్యన్తే వక్తుంవర్షశతైరపి’’ ఎన్ఱు స్వతస్సర్వజ్ఞనానతానే శొల్లప్పుక్కాలుమ్ శొల్లి త్తలైక్కట్ట వరితామ్పడి యిఱే అర్చ్చావతారగుణపూర్త్తి యిరుప్పతు.

ఇగ్గుణపూర్త్తియుళ్ళ అర్చ్చావతారమే ప్రపత్తిక్కుడైత్త విషయమెన్నుమత్తై, ప్రపన్నజనకూటస్థరుడైయ అనుష్ఠానత్తాలుమ్ ప్రకాశిప్పిక్కిఱాన్ మేల్, (ఆళ్వార్కళ్) ఎన్ఱుతుడఙ్గి. మయర్వఱమతినలమరుళప్పెఱ్ఱైయాలే పరత్వాదికళై యెల్లామ్ కరతలామలకమాక క్కణ్డిరుక్కుమవర్కళిఱే ఆళ్వార్కళ్, ఇప్పడియిరుక్కుమవర్కళ్, ప్రాప్యత్వరాతిశయత్తాలే పలకాలుమ్ ప్రపత్తిపణ్ణుకిఱవళవిల్, పలవిడఙ్గళిలు మర్చ్చావతారత్తిలేయిఱే ప్రపత్తిపణ్ణిర్ఱు, స్థలాన్తరత్తిల్ క్వాచిత్కమిత్తనైయిఱే. ఎఙ్ఙనేయెన్నిల్; ఆళ్వార్కళుక్కెల్లామ్ తలైవరాన నమ్మాళ్వార్, ‘‘అకలకిల్లేన్’’ ‘‘ఆఱెనక్కు నిన్పాతమే శరణాక త్తన్దొழిన్దాయ్’’ ‘‘కழల్కళవైయే శరణాకక్కొణ్డ’’ ‘‘నమ్పెరుమాన్ అడిమేల్ శేమఙ్గొళ్ తెన్కురుకూర్చ్చడకోపన్’’ ‘‘ఉన్నడిక్కీழమర్న్దుపుకున్దేన్’’ ఎన్ఱిప్పడి

---

మూ॥ పూర్త్తియుండినది యర్చ్చావతారమున

మూ॥ ౩౬॥ ఆళ్వారులు పలుతావులఁ బ్రపత్తిచేసినదియును అర్చ్చావతారముననే.

---

‘‘అర్చ్చావతారవిషయే మయాప్యుద్దేశతస్తథా। ఉక్తాగుణానశక్యన్తే వక్తుంవర్షశతైరపి’’ (అర్చ్చావతారమునఁగల గుణములను నాచేఁ జెప్పనలవికాదు నూఱులకొలది సంవత్సరములును చాలవు) అని సర్వజ్ఞుఁడగు తానే యానతిచ్చియున్నాఁడు గదా! కావున నర్చ్చావతారమునఁగల గుణములు చెప్పి ముగించుట కశక్యములుగాను గదా యుండును

అవతారిక:—ఇట్టి గుణపూర్త్తిగల యర్చ్చావతారమే ప్రపత్తికిఁ దగినవిషయమనుదానిని ప్రపన్నజన కూటస్థులగు నాళ్వారుల యనుష్ఠానమును బట్టియును తెలుపుచున్నారు.

(ఆళ్వార్కళ్) ఇత్యాది. భ్రమరహితమగు జ్ఞానానందమును లభించినవారగుటంజేసి పరత్వాదుల నన్నింటిని కరతలామలకముగాను సేవించియున్నట్టివారుగదా ఆళ్వారులు. ఇట్టివారగు వీరు ప్రాప్యవస్తువును బొందుటకుగాను త్వరాతిశయమువలన అనేక పర్యాయములు ప్రపత్తిజేయునప్పుడు అనేకతావుల నర్చ్చావతారమునఁ గదా వీరు ప్రపత్తిచేసినది. వేఱొకచోట నరుదుగాను గదా వీరు ప్రపత్తి చేసియున్నారు.

అది యెట్లనిన, ఆళ్వారులందఱిలో ప్రధానులగు నమ్మాళ్వారులు ‘‘ఆఱెనక్కు నిన్పాదమే శరణాక త్తన్దొழిన్దాయ్’’ (తి. వా. ౫. ౭. ౧౦) (నాకు ఉపాయము నొసంగునప్పుడు నీ శ్రీపాదములనే యుపాయముగా నొసంగినాడవు) అనియు. ‘‘కழల్ కళవైయే శరణాకక్కొణ్డ’’ (తి. వా. ౫. ౮. ౧౧) (శ్రీపాదములనే శరణుజొచ్చిన) అనియు, ‘‘నమ్పెరుమాన్ అడిమేల్ శేమఙ్గొళ్ తెన్కురుకూర్ చ్చడగోపన్’’ (తి. వా. ౫. ౯. ౧౧) (సర్వేశ్వరుని శ్రీపాదములమీఁద క్షేమకరత్వబుద్ధిని స్వీకరించినవారును. సుందరంబైన తిరునగరికి స్వామియైన నమ్మాళ్వారులు) అనియు, ‘‘ఉన్నడిక్కీழమర్న్దు పుకున్దేన్’’ (తి. వా. ౬. ౧౦. ౧౦) (నీ శ్రీపాదములక్రింద

పలవిడఙ్గళిలుమ్ ప్రపత్తిపణ్ణిన్నదు అర్చావతారత్తిలేయిఱే; *పిఱన్దవాఱు ఒన్ఱిలుమిఱే అవతారత్తిలే శరణమ్పుక్కతు. తిరుమఙ్గైయాళ్వారుమ్, ""నన్దన్ తిరువడియడైన్దేన్ నైమిశారణియత్తుళెన్దాయ్"" ""విణ్ణైయార్ తిరువేఙ్గడవా నాయేన్ వన్దడైన్దేన్"" ""కావళమ్పాడిమేయకణ్ణనే కళైకణీయే"" ""అణివణ్ణానిన్నడియిణై యడైన్దేన్ అణిపొழிల్ తిరువరఙ్గత్తమ్మానే"" ఎన్ఱిప్పడి అర్చావతారత్తిలే

ఆమూరియున్నవాఁడనై ప్రవేశించితిని) అనియు నిట్లు అనేకతావుల ప్రపత్తిచేసినది యర్చావతారమునఁ గదా! *""పిఱన్ద వాఱుమ్"" (తి. వా. ౫. ౧౦. ౧) అను పాసురమున నొక్కతావునఁ గదా వీరు అవతార విషయమునఁ బ్రపత్తిచేసియున్నారు.

తిరుమఙ్గైయాళ్వారును ""నన్దన్ తిరువడి యడైన్దేన్ నైమిశారణియత్తెన్దాయ్"" (తి. మొ. ౧. ౬. ౧) (నాస్వామీ నైమిశారణ్యమునకు వచ్చి నీ శ్రీపాదము నాశ్రయించితిని) అనియు ""విణ్ణైయార్ తిరువేఙ్గడవా నాయేన్ వన్దడైన్దేన్"" (తి. మొ. ౧. ౯. ౧) (నిత్యసూరులకు సేవ సాయించువాఁడవయిన వేఁకటాచలమున వేంచేసియుండు నీ శ్రీపాదముల నాశ్రయించితిని) అనియు, ""కావళమ్పాడిమేయ కణ్ణనే కళైకణీయే"" (తి. మొ. ౪. ౬. ౧) (తిరుక్కావళమ్పాడి యను దివ్యదేశమున వేంచేసియుండు శ్రీకృష్ణా! ఆశ్రితులను విడువనట్టి నీవే నాకు రక్షకుండవు.) అనియు, ""అణివణ్ణా నిన్నడియిణై యడైన్దేన్ అణిపొழிల్ తిరువరఙ్గత్తమ్మానే"" (తి. మొ. ౪. ౯. ౧)

*అవతారిక.—తిరుపల్లవాఴి నెడు దివ్యదేశమునుజేరి సర్వేశ్వరుని యనుసంధించుటకు శక్తిలే నివారైన నమ్మాళ్వార్లు భగవద్గుణానుభవము జేయుటకుఁగూడ శక్తిలేనివారై, గుణానుభవము జేయునట్లు నన్ననుగ్రహింపుమాయని ప్రార్థించుచున్నారు.

పిఱన్దవాఱుమ్వళర్న్దవాఱుమ్ పెరియపారతమ్కైశెయ్తు, ఐవర్క్కు
త్తిఱఙ్గళ్ కాట్టియిట్టు చ్చెయ్తుపోనమాయఙ్గళుమ్,
నిఱన్దనూడుపుక్కెనతావియై నిన్ఱునిన్ఱురుక్కియుణ్గిన్ఱ, ఇ
చ్చిఱన్దవాన్ శుడరే యున్నైయెన్ఱుకొల్ శేర్వతువే.

అ॥ పిఱన్దవాఱుమ్ - అవతరించినప్రకారమును, వళర్న్దవాఱుమ్ - పెరిగినప్రకారమును, పెరియ - గొప్ప, పారతమ్ - భారతయుద్ధమందు, కైశెయ్తు - (సేనలను) వ్యూహముగా నేర్పరచి. ఐవర్క్కు - పఞ్చపాణ్డవులకు, తిఱఙ్గళ్ - ఉపాయములను, కాట్టియిట్టు - నేర్పించి, శెయ్తు - (ఆశ్రితులయందు) ఆదరించి, పోన - (పరమపదమునకు) వేంచేసిన, మాయఙ్గళుమ్ - ఆశ్చర్యచేష్టితములును, నిఱన్దు - మర్మమైన (నాహృదయముయొక్క), ఊడుపుక్కు - లోపల ప్రవేశించి, ఎనతావియై - నాయాత్మను, నిన్ఱు నిన్ఱు - విడువకుండనుంచి, ఉరుక్కి - కరఁగించి, ఉణ్గిన్ఱ - నశింపఁజేయుచున్నవి. ఇచ్చిఱన్ద - ఇట్టిశ్లాఘ్యమైన, వాన్ - అపరిచ్ఛిన్నమైన, శుడరే - తేజోమయస్వరూపుఁడా ఉన్నై - నిన్ను, శేర్వతు - చేరుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో

తా॥ ఓ శ్రియఃపతీ! ఈలోకమునందు జన్మించుటకుఁ గారణమైన పుణ్యపాపములేమియు లేని నీవు తనసఙ్కల్పముచే నప్రాకృతదివ్యమఙ్గళ విగ్రహముతోఁగూడ ఆశ్రిత సంరక్షణార్థమై యవతరించినవిధంబును, తరువాత పూతనా శకటాసురుఁడు మొదలగు లెక్కలేనిశత్రువులనడుమ నుండి యశోదాదులయొక్క పాలు నెయ్యి మొదలగు పదార్థముల నారగించి పెరిగినవిధంబును, భారత యుద్ధమందు భీష్మద్రోణ కర్ణ దుర్యోధనాదులు నశించుటకుఁ దగిన ఉపాయములను నేర్పించిన విధంబులును, వెనుక శ్రీవైకుణ్ఠమునకు వేంచేసిన విధంబును నాహృదయమం దెల్లప్పుడునుండి నన్ను శిథిలపఱచుచున్నవి. ఈ వ్యసనము తీరునట్లు అపరిమిత జ్యోతిస్స్వరూపుండవైననిన్ను నేనే కాలమందు పొంది సుఖపడఁగలనో యని.

మూ॥ ౩౬॥ "పూర్ణమ్" ఎన్గైయాలే ఎల్లాగుణజ్గళుమ్ పుష్కలజ్గళ్.

---

యిత్తై పలవిడజ్గళిలుమ్ ప్రపత్తిపణ్ణిన్ఱు; మత్తైయాళ్వార్కళుక్కు మిప్పడి తత్తప్రబన్ధజ్గళిలే కణ్డుకొళ్వతు. "ప్రపత్తిపణ్ణిన్ఱుమ్" ఎన్ఱిఱ ఇన్దచశబ్దత్తాలే, "పూర్తియుళ్ళతుమ్" ఎన్ఱు కీళ్చొన్నత్తై సముచ్చయిక్కిఱతు.

ఇప్పడి ఇవ్వాళ్వార్కళ్ ప్రపత్తిపణ్ణుమిడజ్గళిల్ పరత్వాదికళెల్లామిరుక్క అర్చావతారత్తిలే పణ్ణుకైక్కుడి-ఇతిల్ గుణపూర్తియిఱే, అన్దగుణపూర్తియై సప్రమాణమాక వరుళిచ్చెయ్కిఱార్ మేల్, (పూర్ణమ్ ఎన్ఱుతుడజ్గి). (పూర్ణమెన్గైయాలే) ఎన్ఱతు. *"పూర్ణస్య పూర్ణమాదాయ

---

మూ॥ ౩౬॥ "పూర్ణం" అను శ్రుతివాక్యమునుబట్టి యన్నిగుణంబులు నిచట పుష్కలములు.

---

(సముద్రముయొక్క వర్ణముగలిగిన గంభీరస్వభావుఁడా! అమరినుండు యుద్యానవనంబులుగల శ్రీరంగంబున వేంచేసియున్నట్టి స్వామీ! నీపాదపద్మముల నాశ్రయించినవాఁడను.) అని యిట్లు అర్చావతారమునఁ గదా యనేకతావులఁ బ్రపత్తి చేసినది. తక్కినయాళ్వారులవిషయమునను వారి వారి గ్రంథములయందుఁ జూచుకొనునది "ప్రపత్తిచేశినదియును" అను తావునందు "సముచ్చయార్థము" చే నింతకుపూర్వము "పూర్తియుండినది" అని చెప్పినది సముచ్చయము చేయఁబడుచున్నది.

అవతారిక: — ఆళ్వారులు ప్రపత్తిచేయునప్పుడు పరత్వాదులన్నియునుండగా, అర్చావతారమునఁ బ్రపత్తిచేయుటకుఁ గారణము అందుండు గుణపూర్తియే గదా! అట్టి గుణపూర్తిని సప్రమాణముగఁ దెలుపుచున్నారు.

(పూర్ణమ) ఇత్యాది. "పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అని శ్రుతియం

---

"...షాభ్యుక్తా, తదేవభూతం తదుపాసితవ్యం సత్యం తద్ద్వయం" అనునది పూర్వవాక్యము "శ్రీమన్నారాయణచరణౌశరణం ప్రపద్యే ఇదం పూర్ణమదః పూర్ణం పూర్ణాత్పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే సర్వం సహోమ్" అనునది యుత్తరవాక్యము "శ్రీమత్తేనారాయణాయనమః వేదుం బ్రహ్మవిదః వేదానాం వేద వేదితవ్యం య ఏవం వేద ఇత్యుపనిషత్" అనునది కనుక్కనుక యీతావున "ఇదంపూర్ణం" అని యారంభించి "సహోమ్" అనువరకును ఈవాక్యము ద్వయముయొక్క మధ్యనుండుటంజేసి ద్వయమునఁ జెప్పఁబడినట్టి యుపాయోపేయముల గుణములఁదెలుపుచున్నది. మరియు, "ఉక్తాగుణానశక్యంతే" అన్నట్లు పూర్ణశబ్దార్థమునకు సంకోచములేకపోవుటంజేసియు, "పంచప్రకారోహం" అన్నట్లు అయిదు విధములుగా నుండును" అనెడి ప్రతిజ్ఞనుబట్టియు "పూర్వస్మాదపి పూర్వస్మాత్" అన్నట్లు ముందు ముందు దానికంటెను తరువాతిది తరువాతిది గొప్పదిగాఁ జెప్పఁబడినందునను ఈశ్రుతివాక్యము అర్చావతారవైభవముఁదెలుపునదియని యేర్పడుచున్నది. ఈపైశ్రుతియొక్క యర్థమేమనఁగా:—

(ఇదం=ఈ యంతర్యామిస్వరూపము, పూర్ణం=కల్యాణగుణములతో నిండియున్నది, అదః=నిత్యవిభూతిగైన లోకాంతరముననుండు పరరూపమునది, పూర్ణం=గుణములతో నిండియున్నది, పూర్ణాత్=షడ్గుణపూర్ణమగు పరరూపముకంటెను స్పష్టమైన, పూర్ణం=వ్యూహరూపము; ఉద్రిచ్యతే=రెండు రెండు గుణములచే బహువిధమైనది. పూర్ణస్య=అనన్తావతారకందమై క్షీరాబ్ధిశాయియగు వ్యూహవిశేషమునుండి ప్రాదుర్భవించుటచే వ్యూహాత్మకమగు పూర్ణముతో సంబంధించిన,

మూ॥ ౩౭॥ ప్రపత్తిక్కు-పేక్షితజ్గళాన సౌలభ్యాదికళ్

పూర్ణమేవావశిష్యతే । సర్వంపూర్ణంసహోమ్” ఎన్ను శ్రుతికళ్లుక్కైయాలే యెన్నపడి. (ఎల్లాగుణజ్గళుమ్ పుష్కలజ్గళ్) ఎన్నతు-ఆశ్రయణ సౌకర్యాపాదకజ్గళాన గుణజ్గళోడు ఆశ్రిత కార్యాపాదకజ్గళాన గుణజ్గళోడు వాశియఱ, సకలకల్యాణ గుణజ్గళు మివ్విషయత్తిలే సమ్పూర్ణమెన్నపడి.

ఆనాల్ “వాసుదేవోఽసిపూర్ణః”ఎన్గిఱపరత్వత్తిలుమ్కాట్టిల్ ఇజ్గుత్తైక్కుత్తు మెన్నెన్న అరుళిచ్చెయ్‌కిఱార్, (ప్రపత్తిక్కు) ఎన్నుగుడజ్గి. (ప్రపత్తిక్కు-పేక్షితజ్గళాన) ఎన్నతు-ఉపాయమాక పృత్తుమిడత్తిల్ వేణ్డునవైయాన వెన్నపడి. సౌలభ్యాదికళావన – కణ్డుపత్తుక్కైక్కు-అపేక్షిత సౌలభ్యముమ్, మేన్మైక్కణ్డుకలామైక్కు-అపేక్షిత సౌశీల్యముమ్, కార్యమ్ శెయ్యుమెన్ను విశ్వసిక్కైక్కు-అపేక్షిత స్వామిత్వముమ్, కుత్తజ్గళ్ణు వెరువామైక్కు-అపేక్షిత వాత్సల్యముమ్.

మూ॥ 32॥ ప్రపత్తికిఁ గావలసినట్టి సౌలభ్యాదులు

దుఁ జెప్పియుండుటవలననని యెఱుంగునది. (అన్నిగుణంబులు పుష్కలములు) అనఁగా నాశ్రయించువిషయమున సౌకర్యముఁ గలుగఁజేయునట్టి గుణములును ఆశ్రితులకు సౌకర్యముఁగలుగఁజేయు గుణములును ఒక్కటియైన్ను తప్పకుండ కల్యాణగుణంబులన్నియును ఈవిషయమున సంపూర్ణముగా నున్నవనుట.

అవతారిక:—అయితే “వాసుదేవోసి పూర్ణః” (వాసుదేవుండు సంపూర్ణుండు) అని చెప్పియున్నట్టి పరత్వముకంటెనున్న దీనికిఁగల యాధిక్యత యెద్దియనఁగాఁ దెలుపుచున్నారు.

(ప్రపత్తిక్కు) ఇత్యాది. (ప్రపత్తికిఁగావలశినవి) అనఁగా నుపాయముగాఁ గైకొనునప్పుడు కావలశినవనుట. సౌలభ్యాదులనఁగా చూచి యాశ్రయించుటకుఁదగిన సౌలభ్యమును, స్వామిత్వముఁ దలంచుకొని భయపడకుండుటకుఁ గావలశిన సౌశీల్యమును, కార్యసిద్ధి కాఁగలదని విశ్వసించుటకుఁ గావలసినదియగు స్వామిత్వమును, దోషంబులఁదలంచుకొని భయపడకుండుటకుఁ గావలశి

పూర్ణం=కల్యాణగుణపూర్ణమగు విభవరూపమును, ఆదాయ=స్వహేతువుగా స్వీకరించి,పూర్ణమేవ=కల్యాణగుణపూర్ణమగు అర్చావతారమే, అవశిష్యతే=నిత్యాశ్రయణీయమగుటచే నిత్యసన్నిహితమైనదిగాను, సౌలభ్యాదిగుణపూర్తి కాశ్రయముగాను పరత్వాదులలో కుత్కృష్టమైనదిగాను నుండును. ఓమ్=రక్షకత్వప్రాప్యత్వవిశిష్టమగు అర్చావతారమునందు, సర్వం=ఆశ్రయించువిషయమున సౌకర్యమును గలుగఁజేయునట్టివియు ఆశ్రితులకార్యమును సిద్ధింపఁజేయునవియు నగు నన్నిగుణములును, సహపూర్ణం=మిళితములై పుష్కలములుగానుండును. అని యర్థము. ఇందువలన పరవ్యూహాదులకుఁ గల కాలసన్నికర్షమును, అంతర్యామియందుండు దేశకాలసన్నికర్షరూపమగు సౌలభ్యమును ఈ విభవ లగు నాశ్రయణోపయుక్తములగు గుణంబులున్ను జ్ఞానశక్త్యాదిరూపముగ కార్యోపయుక్తములగు గుణములై పూర్వము పఠింపఁబడిన పూర్వవాక్యమునందలి నారాయణపదముచేఁ దెలుపఁబడినట్టియన్ని గుణములును అర్చావతారమున పుష్కలముగాఁ గలవని యేర్పడుచున్నది.

మూ॥ ఇరుట్టఱైయిల్ విళక్కుప్పోలే ప్రకాశిప్పతిజ్గే.

---

“నికరిల్ పుకழாయ్” ఇత్యాదియాలే. ఇన్నాలుగుణజ్గళైయుమిచ్చే అழ்வారరుళిచ్చెయ్తతు. (ఇరుట్టఱైయిల్ విళక్కుప్పోలే ప్రకాశిప్పతిజ్గే) ఎన్నతు-పరత్వత్తిల్ ఇగ్గుణజ్గళెల్లాముణ్డాయిరుక్కచ్చెయ్తే పరమసామ్యాపన్నర్కుక్కు ముకమ్కొడుత్తిరుక్కి అవిడమాకైయాలే, పకల్ విళక్కుప్పోలే ప్రకాశమఱ్ఱిరుక్కుమ్; అర్చావతారమాన విడత్తిల్ తన్మైక్కెల్లానిలమాన సంసారికళుక్కు ముకమ్ కొడుత్తుక్కొణ్డిరుక్కైయాలే, అన్ధకారత్తిల్ దీపమ్పోలే అత్యుజ్జ్వలమాయ్ తోన్ఱుమెన్నపడి.

---

మూ॥ చీఁకటి గదిలో దీపమువలెఁ బ్రకాశించునది యిచట.

---

నదియగు వాత్సల్యమును, ఈ నాలుగు గుణములనే కదా * “నికరిల్ పుకழாయ్” (తి. వా. ౬. ౧౦. ౧౦) అను పాశురమున నమ్మాழ்వారులు సాయించియున్నారు.

(ఇరుట్టఱైయిల్) ఇత్యాది. పరత్వమునను, (పరమపదమునసున్నప్పుడును) ఈగుణంబులన్నియునున్నను, పరమసామ్యమునుఁ బొందినవారికి సేవసాయించునట్టి తావైనందున నచట అవి పగటివేళ వెలిగించిన దీపమువలెనే ప్రకాశము తగ్గియుండును. అర్చావతారమునందో, నైచ్యమునకు పరమకాష్ఠయగు సంసారులకు సేవసాయించునట్టి తావయినందున, ఇచట అవి అంధకారముగల తావునఁ బెట్టిన దీపమువలెనే యెక్కువ ప్రకాశముగలవిగాఁ దెలియవచ్చును. విషయమున్న తావు

---

*అకలకిల్లేనిఱైయుమెన్ఱలర్మేల్ మఙ్గైయుఱైమార్పా,
నికరిల్ పుకழாయులకమూన్నుడైయా యెన్నైయాళ్వానే,
నికరిలమరర్ మునిక్కణజ్గళ్ విరుమ్పుమ్ తిరువేజ్గడత్తానే,
పుకలొన్ఱిల్లా వడియే నున్నడిక్కీழ் అమర్న్దుపుకున్దేనే.

అ॥ ఇఱైయుమ్ - ఒకక్షణముగూడ, అకల - విశ్లేషించియుండుటకు, కిల్లేన్ - సమర్థురాలుకాను; ఎన్ఱు - అని, అలర్ మేల్ - పుష్పముమీదవాసముజేయుచున్న (నిరతిశయభోగ్యురాలైన), మఙ్గై - పెరియపిరాట్టి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, మార్పా - వక్షస్థలముగలవాఁడవై, నికరిల్ - ఒప్పులేని, పుకழாయ్ - యశస్సుగలవాఁడునై, ఉలకమ్మూన్ఱు - మూడు లోకములను, ఉడైయాయ్ - (తనకురక్ష్యములై) కలవాఁడునై, ఎన్నై - నన్ను, ఆళ్వానే-పరిపాలించువాఁడవై, నికరిల్ - ఒప్పులేని, అమరర్ - నిత్యసూరులును, మునిక్కణజ్గళ్ - ఋషిసమూహములును, విరుమ్పుమ్ - ఆశపడి యాశ్రయించుచున్న, తిరువేజ్గడత్తానే - తిరుమలయందు వేంచేసియున్న ఓస్వామీ ! పుకల్ - ఉపాయము, ఒన్ఱు - ఒకటియు, ఇల్లా - లేని, అడియేన్ - దాసుఁడనైన నేను, ఉన్నడిక్కీழ் - నీశ్రీపాదములక్రింద, అమర్న్దు - అమరియున్నవాఁడనై, పుకున్దేన్ - ప్రవేశించితిని.

తా॥ సౌన్దర్యసౌగన్ధ్యమార్దవాదిగుణములచే నిరతిశయభోగ్యురాలైన పెరియపిరాట్టికూడ క్షణకాలము విశ్లేషించియుండలేక పెల్లప్పుడు నీవక్షస్థలమందు నిత్యవాసముజేయునట్లు నిరతిశయభోగ్యభూతుఁడవై, నిరుపమానంబులైన వాత్సల్యాదికల్యాణగుణములుకలవాఁడవై, సకలజగద్రక్షకుఁడవై, నిత్యసూరిసేవ్యుఁడవై, వేంకటాద్రియందత్యన్తసులభుఁడవై వేంచేసియున్న ఓశ్రీమన్నారాయణుఁడా ! నేనుసకలోపాయములను వదలి నీశ్రీపాదములనే యుపాయముగానమ్మి యాశ్రయించితినని.— ఈపాశురముద్వయార్థప్రతిపాదకమని పూర్వాచార్యులునిర్వహించుదురు.

**మూ॥ ౩౮॥** పూర్తియైయుమ్ స్వాతన్త్ర్యత్తైయుమ్ కులైత్తుక్కొణ్డు
తన్నై యనాదరిక్కుమవర్కళై త్తానాదరిత్తు నిఱ్కుమిడమ్.

---

విషయఙ్గళ్ విషత్తిలేయిఱే ఇక్కుణఙ్గళ్ ప్రకాశిప్పతు, అఙ్గుళ్ళారుమ్ శీలాదిగుణానుభవమ్ పణ్ణుకైక్కు వరువతిఙ్గేయిఱే; సౌలభ్యమ్ మున్నాక వగుళిన్నియెత్తతు-కణ్డుపత్రుకైక్కుఱుప్పాన సౌలభ్యమే ప్రపత్తిక్కు ప్రధానాపేక్షితమెన్నుమ్ తోన్ఱుకైక్కాక.

"ఇగ్గుణఙ్గళ్ ప్రకాశిప్పతిఙ్గే" ఎన్ఱతై యుపపాదిక్కిఱార్ (పూర్త్తియైయుమ్) ఎన్ఱుతుడఙ్గి. పూర్త్తియావతు - అవాప్తసమస్తకామత్వమ్, అత్తైక్కులైత్తుక్కొళ్ళుకైయావతు-ఇవనిట్టతుకొణ్డు తృప్తనాక వేణ్డుమ్పడి సాపేక్షనాయిరుక్కై. స్వాతన్త్ర్యమావతు-స్వాధీనస్వరూపాదిమత్త్వమ్; అత్తైక్కులైత్తుక్కొళ్ళుకై యావతు-ఆశ్రితాధీనస్వరూపస్థిత్యాదికనైయుడైయనాకై. "తదిచ్ఛయా మహాతేజా భుఙ్క్తే వై భక్తవత్సలః। స్నానంపానం తథాయాత్రాం కురుతేవై జగత్పతిః। స్వతన్త్రస్స జగన్నాథో ఽప్యస్వతన్త్రో యథాతథా। సర్వశక్తిర్జగద్ధాతా ప్యశక్త ఇవచేష్టతే" ఎన్నక్కడవతిఱే. "అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః" ఎన్ఱరుళిచ్చెయ్తారిఱే భట్టర్. తన్నిచ్ఛై యొழియ ఇవన్ రుచిక్కులైక్కు హేతు విల్లామైయాలే (కులైత్తుక్కొణ్డు) ఎన్గిఱార్. (తన్నై

---

**మూ॥ ౩౮॥** సంపూర్తినిన్ని స్వాతంత్ర్యమునున్ను సంక్షేపించుకొనియుండి తన్ను
అనాదరించినవారలనుగూడ ఆదరించుట యుచట.

---

నంగవా గుణములు ప్రకాశించును. ఆచట (పరమపదమున) నుండువారు సర్వేశ్వరుని శీలాది గుణముల ననుభవించుటకైవచ్చునది యిచ్చటికేగదా! వీటిలో సౌలభ్యము ముందుగాఁ బేర్కొనుటకు హేతు వేమనఁగా, కండ్లారఁజూచి యాశ్రయించుటకుఁ గావలశినదియగు సౌలభ్యమే ప్రపత్తికి ముఖ్యముగాఁ గావలశినదియని తెలుపుటకుగావని యెఱుంగునది.

అవతారిక:—"ఈగుణములు ప్రకాశించునది యిచట (అర్చావతారమున) అనుదానిని యుపపాదించుచున్నారు:—

(పూర్తియైయుమ్) ఇత్యాది. పూర్తియనఁగా అవాప్తసమస్తకామత్వము. దానిని సంక్షేపించుకొనియుండుట యనఁగా—ఈతండు ఇచ్చినది తీసికొని (నివేదనముచేసినది యారగించి) తృప్తిపొంది యుండవలశినంత యొక్క దాని యాపేక్షగలవాఁడుగానుండుట. స్వాతంత్ర్యమనఁగా—తన యధీనములోనుండు స్వరూపాదులఁ గలిగియుండుట. దానినిసంక్షేపించుకొని యుండుటయనఁగా, ఆశ్రితుల యధీనములగు స్వరూపస్థిత్యాదులఁ గలిగియుండుట. అదియెట్లనిన "తదిచ్ఛయా మహాతేజా భుఙ్క్తే వై భక్తవత్సలః। స్నానంపానం తథాయాత్రాం కురుతే వై జగత్పతిః। స్వతన్త్రస్స జగన్నాథో ప్యస్వతంత్రో యథాతథా సర్వశక్తిః జగద్ధాతా ప్యశక్త ఇవచేష్టతే" (భక్తవత్సలుండగు సర్వేశ్వరుండు భక్తులయిచ్ఛకధీనముగ భుజించుచున్నాడు. అట్లే జగత్పతియగు నీతండు స్నానపానాదులంగూడ యొనర్చుచున్నాడు. జగన్నాథుఁడగు నీతండు స్వతంత్రుఁడైనను స్వతంత్రుండు కాని వానివలెనున్న సర్వశక్తిగ్మైనను అశక్తునివలెనున్న ఆచరించుచున్నాడు) అని విష్వక్సేన సంహిత యందుఁ జెప్పఁబడినదికదా! మఱియు భట్టరును "అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః" (రం. స్త.) (అర్చకులకు పరాధీనములగు తన స్థితిగతులుగలవాఁడు) అనిగదా ప్రసాదించియున్నారు. ఇట్లు వీటిని సంక్షేపించుకొనుటకు తనయిచ్ఛనేతప్ప వేఱొక్క హేతువు లేకపోవుటంజేసి మూలమున

యనాదరిక్కుమ్ అవర్కళై త్తానాదరిత్తు నిఱ్కుమవిడమ్) ఎన్గతు—తానిప్పడి సులభనాయ్ వన్దునిన్రాల్ అరియాద వెళియవనాయ్ నిఱ్కుమ్బ్రోతు మెన్ఱు విరుమ్బి మేల్ విழுకైయన్రిక్కే, అవ్వళవిల్ తానే హేతువాక ఉపేక్షిక్కుమ్ సంసారికళై త్తాన్ విడమాట్టాతపడి యన్రిక్కే, అవర్కళై యొழிయచ్చెల్లామై తోన్ఱుమ్బడి నిఱ్కుమ్ స్థలమ్ అర్చ్చావతారమెన్గై. పూర్ణమ్మైయుమ్ స్వాతన్త్ర్యత్తైయుమ్ సుఱుక్కిక్కొణ్డు నిఱ్కైయాలే సౌలభ్య సౌశీల్యజ్గళుమ్, తన్నైయనాదరిక్కుమ్ అవర్కళై త్తానాదరిత్తు నిఱ్కైయాలే స్వామిత్వ వాత్సల్యజ్గళు మిజ్గేతోన్ఱానిన్ఱతిఱే.

అన్రిక్కే, (పూర్ణమ్మైయుమ్) ఎన్గతుడజ్గ ఇవ్వాక్యమెల్లావత్తాలుమ్ గుణచతుష్టయత్తిలుమ్ ప్రధానమాన సౌలభ్యత్తైయే ఓడవైత్తారాకవుమామ్; అప్పోతు, ఇవ్విషయత్తినుడైయ సౌలభ్యాతిశయత్తై దర్శిప్పిక్కిఱారెన్ఱు వాక్యసజ్గతియాకక్కడవతు. కణ్ణుక్కు విషయమామ్బడి నిత్యసన్నిధి పణ్ణికొణ్డిరుక్కైయన్రిక్కే, సర్వప్రకారపరిపూర్ణనాయ్ నిరఙ్కుశస్వతన్త్రనాయిరుక్కుమ్ తన్నై, సాపేక్షనుమ్ పరతన్త్రనుమాక్కిక్కొణ్డు, తన్నైయనాదరిక్కుమ్ సంసారికళై త్తానాదరిత్తు నిఱ్కైక్కు మేఱ్పట్ట సౌలభ్యమిల్లైయిఱే. "ఏవం పఞ్చప్రకారో౽హం ఆత్మనాంపతతామధః । పూర్వస్మాదపి పూర్వస్మాజ్జ్యాయాంశ్చైవోత్తరోత్తరః । సౌలభ్యతో జగత్స్వామీ సులభో హ్యుత్తరోత్తరః" ఎన్ఱు పరత్వాదికళైన్దిలుమ్ సౌలభ్యముణ్డాయిరుక్కచ్చెయ్తే, పూర్వపూర్వత్తైక్కాట్టిల్ ఉత్తరోత్తరత్తుక్కు సౌలభ్యమతిశయిత్తిరుక్కుమెన్ఱు తానే యరుళిచ్చెయ్కైయాలే సౌలభ్యత్తుక్కెల్లై నిలమ్ అర్చ్చావతారమిఱే.

పరత్వాదికళిలుణ్డాన దౌర్లభ్యత్తైయుమ్ అర్చ్చావతార సౌలభ్యత్తైయుమ్ దృష్టాన్తముఖేన దర్శి

---

(సంక్షేపించుకొని) అని చెప్పఁబడినది. (తనను అనాదరించినవారిని తానాదరించుచుట్టితావు) అనఁగా—తానిట్లు సులభుండుగావచ్చి నిలిచినట్లయిన సర్వజ్ఞుండగువాఁడు మూఢుఁడుగావచ్చి లభించినాఁడేయని ప్రేమించి పైపైబడి యాశ్రయింపక, ఆట్టిమూఢత్వమునే నిమిత్తీకరించుకొని యుపేక్షించునట్టి సంసారులను తాను వదలిపెట్టకుండ వారలను విడిచితే జరుగకుండునట్లు ఉండునది యర్చ్చావతారమే కదా! పూర్తినిన్ని స్వాతంత్ర్యమునున్న సంక్షేపించుకొని నిలిచియుండుటచే సౌశీల్య సౌలభ్యములును, తన్ను అనాదరణచేసినవారి నాదరించి యుండువాఁడగుటంజేసి స్వామిత్వ వాత్సల్యములు ఈతావునఁ దేటపడుచున్నవి.

ఇంతేకాక, (పూర్ణమ్మైయుమ్) అను వాక్యము మొదలుకొని యీ వాక్యముచే నంతటను గుణచతుష్టయములో ప్రధానమగు సౌలభ్యమును గురించియె చెప్పుచున్నారనియును చెప్పవచ్చును. అట్లైనచో, అర్చ్చావతారముయొక్క సౌలభ్యాతిశయముఁ దెలుపుచున్నారనుట యీవాక్యసందర్భము. కంటికిఁ దెలియునట్లు ఎదురుగానుండుటయే కాక, అన్నివిధములను పరిపూర్ణుండై నిరంకుశ స్వతంత్రుండగు తనను ఒకరియపేక్ష కలవానినిగాను పరతంత్రునిగానును చేసికొని తనను అనాదరించునట్టి సంసారుల నాదరించియుండుటకు మించిన సౌలభ్యమే లేదుగదా. "ఏవం పంచప్రకారో౽హ మాత్మనాం పతతామధః పూర్వస్మాదపి పూర్వస్మాజ్జ్యాయాంశ్చైవోత్తరోత్తరః. సౌలభ్యతో జగత్స్వామీ సులభో హ్యుత్తరోత్తరః" (నరకమునఁబడునట్టి యాత్మలను రక్షించుటకై నేను అయిదువిధములుగ నుండువాఁడను. వాటిలో ముందు ముందు వాటికంటెను తరువాతి తరువాతిది శ్రేష్ఠము. జగత్స్వామియగు నేను సౌలభ్యముచేతను తరువాతి తరువాతి స్వరూపమున నెక్కువ సులభుండుగానుందును) అనుతావున పరత్వాదులయందును సౌలభ్యమున్నను వాటిలో ముందు ముందుండువాటికంటెను తరువాతి తరువాతి వాటియందు సౌలభ్య మెక్కువగానుండునని భగవంతుఁడే స్వయముగ చెప్పియున్నాఁడు కదా!

అవతారిక:—పరత్వాదులయందుఁగల దౌర్లభ్యమును నర్చ్చావతారమునందుఁగల సౌలభ్యమును దృష్టాంతపూర్వకముగఁ గానిపించుచున్నారు.

మూ॥ ౩౯॥ భూగతజలమ్పోలే అన్తర్యామిత్వమ్;
ఆవరణజలమ్పోలే పరత్వమ్; పాఱ్కడల్ పోలే వ్యూహమ్;
పెరుక్కాఱుపోలే విభవఙ్గళ్;

---

పిపాసితాన్ మేల్ (భూగతజలమ్) ఎన్ఱుతుడఙ్గి. తృషార్తనుక్కు దేశాన్తరత్తిల్ పోక వేణ్డాతపడి నిన్ఱవిడత్తిలే యుణ్డాయిరుక్కచ్చెయ్తేయుమ్, కొట్టుమ కున్దాలియుమ్కొణ్డు కల్లినాలల్లతు కుడిక్కక్కిడైయాత భూగతజలమ్పోలే యాయిత్తు, కణ్డుపక్క వేణుమెన్ఱాశైప్పట్టవనుక్కు హృదయత్తిలే యిరుక్కచ్చెయ్తేయుమ్, "కట్కిలీ" ఎన్ఱపడియే కణ్ణుక్కు విషయమన్ఱిక్కే, అష్టాఙ్గయోగరూపయత్నత్తాలే కాణవేణ్డుమ్పడియాన అన్తర్యామిత్వమ్. అవనుక్కు, అణ్డత్తుక్కప్పుఱత్తే పెరుకిక్కిడక్కుమ్ ఆవరణజలమ్పోలే యాయిత్తు, ఇవనుక్కుమ్, "అప్పాల్ ముతలాయ్ నిన్ఱ వళప్పరియవారముతు" ఎన్ఱపడియే లీలావిభూతిక్కప్పుఱప్పట్టిరుక్కుమ్ పరత్వమ్, అప్పడి అతివిప్రకృష్టమన్ఱియే అణ్డాన్తర్గతమాయిరుక్కచ్చెయ్తేయుమ్, అవనుక్కు దుష్ప్రాపమాన పాఱ్కడల్ పోలేయాయిత్తు, ఇవనుక్కుమ్, "పాలాழினில் కిడన్తు పణ్పైయామ్ కేట్టయుమ్" ఎన్ఱపడియే కేట్టిరుక్కుమిత్తనైయల్లతు సెన్ఱు కాణవరితామ్పడియిరుక్కుమ్ వ్యూహమ్. ప్రత్యాసన్నమాయుమ్ తాత్కాలికర్క్కుపజీవ్యమాయ్ పాశ్చాత్యనానవనుక్కు దుర్లభమాన పెరుక్కాఱుపోలే యాయిత్తు, "మణ్మిసైత్తోన్ఱినాయ్" ఎన్ఱపడియే భూమియిలే యవతరిత్తు సఞ్చరిత్తుమ్, తత్కాలవర్తికళుక్కాశ్రయణీయమాయ్, పిఱ్కాలత్తిలుళ్ళవానవనుక్కు కిట్టా

---

మూ॥ ౩౯॥ భూమిలోనుండు జలమువంటిది యంతర్యామిత్వము. ఆవరణ (బ్రహ్మాండమునకు పైగానుండు) జలమువంటిది పరమపదము. క్షీరసముద్రము వంటిది వ్యూహము. నదీప్రవాహములవంటివి యవతారములు.

---

(భూగతజలం) ఇత్యాది. దప్పికగొనినవానికి వేఱొకచోటికి పోవనక్కఱలేకుండ తానున్నచోటనే యున్ననూ పార, గడ్డపలుగు, తీసికొనివచ్చి త్రవ్వితే, తప్ప త్రాగుటకు వలులేనట్టిదియగు భూమిలోనుండు జలమువంటిదిగదా? చూచి యాశ్రయింపవలయునని యాశపడినవానికి తన హృదయముననే యున్ననూ, "కట్కిలీ" (తి. వా. ౭. ౫. ౩) (కంటికిఁగానరానివాఁడా) అన్నట్లు కంటికిఁగానఁబడక అష్టాంగయోగరూపమగు ప్రయత్నముచేఁ జూడవలసినదియగు నంతర్యామిత్వము. అట్టివానికి అండమునకు బయటనుండు సముద్రజలమెట్టిదియో, అట్టిదియే వీనికిని "అప్పాల్ ముతలాయ్నిన్ఱ వళప్పరియవారముతు" (తి. సె. ౧౪) (అండమునకు వెలుపల కారణభూతముగానుండినదై యపరిచ్ఛేద్యమగు గొప్పయమృతము) అని తిరుమంగైయాళ్వారు లానతిచ్చినట్లు, లీలావిభూతికావలనుండు పరమపదమును. అట్లు అత్యంతదూరమున నుండక, అండము లోపలనే యుండినను, వానికి దుష్ప్రాప్యమగు పాలసముద్రమువంటిది గదా! వీనికిని "పాలాழினி కిడన్తుమ్ పణ్పైయామ్ కేట్టేయుమ్" (పె. తి. అ. ౩౪) (పాలసముద్రమున నీవు నిద్రించు సౌందర్యమును నేను వినియున్నమాత్రమున) అని శ్రీనమ్మాళ్వారు లానతిచ్చినట్లు, వినియుండుటతప్ప, దగ్గిరకుపోయి సేవించుట కశక్యమగు వ్యూహము. సమీపముననుండునదియై యేదొక కాలవిశేషమున నుండువారి కాధారభూతమై తరువాతి వారికి దుర్లభంబైనట్టి నదీప్రవాహమువంటిదిగదా! "మణ్మిసైత్తోన్ఱినాయ్" (తి. వా. ౬. ౯. ౫) అని యిట్లు శ్రీనమ్మాళ్వారు లానతిచ్చినట్లు యీ భూలోకమున నవతరించి సంచరించినను ఆకాలముననుండి యుండినవారి కాశ్రయణీయమై తద

మూ॥ ౮౦॥ అతిలే తేఙ్గిన మడుక్కళ్ పోలే అర్చావతారమ్.
మూ॥ ౮౧॥ ఇతుతాన్ శాస్త్రఙ్గళాలే తిరుత్తవొణ్ణాతే

తపడియాన విభవమ్ మున్బుళ్ళోర్క్కువైపోలన్ఱిక్కే అవనుక్కు విడాయ్ కెడప్పరుకలామ్బడి పెరుక్కాఱ్ఱిలే తేఙ్గినమడుక్కళ్ పోలే యాయిఱ్ఱు, ఇవనుక్కున్ దేశకాలకరణ విప్రకృష్టమన్ఱిక్కే కోయిల్కళిలుమ్ గృహఙ్గళిలుమ్ ఏఙ్గుమొక్క ఎల్లార్క్కుమ్ కణ్ణుక్కిలక్కామ్బడి నిఱ్కుఅ పిన్నానార్ వణఙ్గుమ్ శోతియాన అర్చావతారమ్ "ధామనికేతనేష్వపి కుటీకుఞ్జేషు" ఎన్గిఱపడియే పలవిడఙ్గళిలుమ్ సన్నిధిపణ్ణి నిఱ్కుమ్బడియై నినైత్తిత్తే (మడుక్కళ్ పోలే) ఎన్ఱు బహువచనత్తాలే యరుళిచ్చెయ్తతు. అవతారగుణఙ్గళెల్లా మర్చావతారస్థలఙ్గళిలే పరిపూర్ణమా యిరుక్కైయాలుమ్, అవతార విగ్రహఙ్గళై అర్చారూపేణ పలవిడఙ్గళిలుమ్ పరిగ్రహిత్తుక్కొణ్డిరుక్కైయాలుమ్ (అతిలే తేఙ్గినమడుక్కళ్ పోలే) ఎన్గిఱతు.

ఇప్పడి ఆశ్రయణరుచి పిఱన్దార్క్కు ఆశ్రయణీయత్వే సులభమాయిరుక్కు మళవేయన్ఱు, రుచిజనకత్వాదికళు మివ్వర్చావతారత్తుక్కున్డెన్ఱు ఇతిన్ వైభవత్తై యరుళిచ్చెయ్కిఱార్ మేల్.

(ఇతుతాన్) ఎన్ఱుతుడఙ్గి. ప్రకృతమాన సౌలభ్యాది గుణయోగత్తై యుట్కొణ్డు 'ఇతుతాన్' ఎన్ఱు పరామర్శిక్కిఱాన్, (శాస్త్రఙ్గళాల్ తిరుత్తవొణ్ణామై) యావదు హితానుశాసనమ్ పణ్ణుకిఱ

మూ॥ ౮౦॥ దానిలోనిలిచిన మడుగులవంటిది యర్చావతారము.
మూ॥ ౮౧॥ ఇదియో శాస్త్రములచే దిద్దుపాటుచేయ శక్యముకాక

నంతరకాలమున నుండియుండుటవలన యీతనికి దుష్ప్రాప్యమైనట్టిదిగదా విభవము. ఇట్లు దప్పికగొనిన వానికి విశ్రాంతిని గలుగఁజేయునట్లు నదిలో నచ్చటచ్చట నిలిచియుండిన మడుగులవంటిది గదా యీతనికి దేశమునుబట్టిగాని కాలమునుబట్టిగాని దూరముగా నుండనిదై కోవిలలోను గృహములలోను అంతట నందరికిని కంటికి తెలియవచ్చునట్లు అవతారకాలమున కనంతరముండునదియు ఆశ్రయించుట కనుకూలమైనదియునుగదా జ్యోతిర్మయమగు నర్చావతారము. "ధామని కేతనేష్వపి కుటీకుఞ్జేషు" (రం. స్త. ౨. ౭౮) (గృహములయందును పొదరిండ్లయందును) అని భట్టర్ సాయించినట్లు అనేకతావుల వేంచేశియుండుటనుబట్టియే మూలమున శ్రీపిళ్లైలోకాచార్యులవారు (మడుగులవలెనే) అని బహువచనమున సాయించియున్నారు. అవతారమునందు గుణంబులన్నియును అర్చావతారమున సంపూర్ణముగా నుండుటనుబట్టియు అవతారవిగ్రహములను అనేకతావుల నంగీకరించి యుండుటంజేసియును యీయర్చావిగ్రహములను నదిలోనిల్చిన మడుగులతోఁబోల్చియున్నారు.

అవతారిక:—ఇట్లు ఆశ్రయించుటకై యాశగలవారికి ఆశ్రయించుటకు సులభముగా నుండుటయే కాక, అందులకై రుచిని గలుగఁజేయుట మొదలగు గుణములును ఈ యర్చావతారమునకుఁ గలవని తెలుపుచు దీని వైభవమును గురించి తెలుపుచున్నారు.

(ఇతుతాన్) ఇత్యాది—ప్రస్తుతము చెప్పఁబడిన సౌలభ్యాది గుణసంబంధమును మనస్సున నుంచుకొని పూర్వము చెప్పబడినదానినే యిప్పుడు ఇదియని పరామర్శించుచున్నారు.

(శాస్త్రములచే దిద్దుపాటుచేయ శక్యముకాకపోవుట) అనఁగా, హితమును బోధించునవియగు శ్రుతిస్మృత్యాదిశాస్త్రము లీతనికి యితరవిషయములయెడల వైరాగ్యముగలుగునట్లు వాటి

మూ॥ అడైవుకెడక్కొండుక్కిల్ కళవు వెళిప్పడుమ్.

౧౨౬॥ మూ॥ భర్తృభోగత్తై వయిఱువళర్క్కైక్కు ఉఱుప్పాక్కుమాపోలే ఇరువర్క్కుమవద్యమ్.

ఇప్పడిక్కొండుక్కిల్ (అనుపాయమామ్) ఎన్నదు - అవనత్తై యవనుక్కుక్కొడుత్త విత్తైయిద్ధీయతానాన్ఱు కొడుత్త తాకామైయాలే, అదు పేర్జ్ఞానుక్కు సాధనమాకాతెన్నపడి. (అడైవుకెడక్కొండుక్కైయావదు) - మదీయమెన్ఱుమ్ బుద్ధియాలే సమర్పిక్కై, ఇప్పడిక్కొయ్యిల్ (కళవు వెళిప్పడుమ్) ఎన్నదు - భగవద్ద్రవ్యాపహారమ్ ప్రకాశిక్కుమెన్నపడి. రాజమహేన్ద్రన్ పడిరై రహస్యత్తిలే కళవుకణ్డు ఓలక్కత్తిలే కొడుక్కుమాపోలే యిఱే ఇవఱ్ఱై.

ఇన్నముమ్ ఉపాయాన్తరత్తుక్కు దూషణమ్ శొల్లుకిఱార్, (భర్తృభోగ)ఇత్యాదియాలే. అతావదు - భార్యయానవళ్ స్వయమ్ ప్రయోజనమాన భర్తృభోగత్తై స్వోదరపోషణత్తుక్కు సాధనమాక్కిక్కొళ్ళుమళవిల్, తన్నై భార్యయాక విరుమ్బిన భర్తావుక్కుమ్, తద్భార్యయెన్ఱు పేరిట్టిరుక్కుమ తనక్కుమవద్యమామాపోలే, భగవద్వైలక్షణ్యానుభవత్తాలేవిళైన్ద భోగరూపైయాన భక్తియై మోక్షసాధనమాక్కుమళవిల్, తన్నై శేషభూతనాక విరుమ్బి తన్నోడే కలన్ద పరిమాఱిన ఈశ్వరనుక్కుమ్, తచ్ఛేషభూతనెన్ఱు పేరిట్టిరుక్కుమ తనక్కుమవద్యమాయ్ త్తలైక్కట్టుమెన్నై. ‘‘రాత్రి భర్తావోడే సంశ్లేషిత్తు విడివోడే ‘కైక్కూలితరవేణుమ్’ ఎన్ఱు వక్కైక్కుమాపోలే, భక్తియై ఉపాయమాకక్కొళ్ళుకై’’ ఎన్ఱిఱే పిళ్ళైను వఱుళిచ్చేయ్దదు.

మూ॥ క్రమముతప్పి యిచ్చినట్లయిన (తనదియనుతలంపుతో నిచ్చినట్లయిన) దొంగతనము బయటపడును.

మూ॥ ౧౨౬॥ భర్తయొక్కభోగమును కడుపునింపుకొనుట కనుకూలముగాఁ జేసికొనునట్లు, ఉభయులకును నిందాపాదకము.

(క్రమముతప్పి) అనఁగా, తనది యనెడి తలంపుతో సమర్పించుట. అట్లు చేసినట్లయినచో భగవంతుని ద్రవ్యమును అపహరించుట బయలుపడును. ఒకరాజు సమర్పించినట్టి తిరువాభరణమును యెవ్వరు లేకుండచూచి దొంగిలించి దానిని గోష్ఠిలో భగవంతునికి సమర్పించునట్లే యీయుపాయంతరానుష్ఠానపరుండు చేయునది యంతయును.

అవతారిక:—ఉపాయాంతరమునకు వేఱొక్క దూషణమున్న కలదని తెలుపుచున్నారు.

(భర్తృభోగ) ఇత్యాది. భార్యయయినది స్వయంప్రయోజనమగు భర్తృభోగమును స్వోదరపోషణమునకు సాధనముగాఁ గొనినట్లయిన, తనను భార్యనుగాఁ బ్రేమించియుండునట్టి భర్తకున్ను ఫలానివాని భార్యయని పిలువఁబడు తనకున్ను అవమానకరమగునట్లు, విలక్షణమైన భగవత్స్వరూపమును అనుభవించుటచే వృద్ధిబొందినట్టి భోగరూపమగు భక్తిని మోక్షసాధనముగాఁ గొనుపక్షమున, తనను శేషభూతునిగాఁగొని ప్రేమించి తనతోఁజేరియుండునట్టి సర్వేశ్వరునికిన్ని వానికి శేషభూతుఁడనని పేరుపెట్టుకొనిన తనకున్ను అవమానకరమగును.

‘‘రాత్రి భర్తవద్దపరుండి తెల్లవారగానే అందులకుగాను కూలియివ్వవలయునని నిర్బంధించునట్లే భక్తిని ఉపాయముగాఁ గొనుట’’ అని కదా తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అను పెద్దలును సెలవిచ్చియున్నారు.

౧౨౭॥ మూ॥ వేదాన్తజ్గళ్ ఉపాయమాక విధిక్కిఱపడి యెన్నెన్నిల్;

౧౨౮॥ మూ॥ ఔషధసేవై పణ్ణాతవర్కళుక్కు అభిమత వస్తుక్కళిలే అత్తైక్కలశి యిడువారైప్పోలే, ఈశ్వరనైక్కలన్దు విధిక్కిఱవిత్తనై

ఇప్పడి స్వరూప విరోధాది దోషగ్రస్తమాన త్తై, హితానుశాసనమ్ పణ్ణుకిఱ వేదాన్తజ్గళ్ "ఓమిత్యాత్మానంధ్యాయథ" "ఆత్మానమేవలోక ముపాసీత" "ఆత్మావా ఉరేద్రష్టవ్య శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఎన్రు ఇచ్చేతననుక్కు మోక్షోపాయమాక విధిక్కిఱదుక్కు నిదానమరుళిచ్చెయ్వనాక, జిజ్ఞాసుప్రశ్నత్తై యనువదిక్కిఱార్, (వేదాన్తజ్గళ్) ఎన్రు తుడజ్గి.

తన్నిదానత్తై అరుళిచ్చెయ్కిఱార్, (ఔషధసేవై) ఇత్యాదియాలే, అతావతు - అత్యన్తరుగ్ణరాయ్ త్తిరియానిఱ్కచ్చెయ్తే, అత్తై అఱివిచ్చునపోదు మాత్తమాన మహౌషధత్తై సేవిక్కచ్చొన్నాల్, అతుక్కిశైయాత బాలపుత్రాదికళుక్కు, అవర్కళోడైప్పట్టు వినియోగమ్ కొళ్ళుమ్ వస్తుక్కళిలే అన్ధౌషధత్తై క్కలశియిడుమ్ వత్సలరాన మాత్రాదికళైప్పోలే, శీఘ్రమాక సంసారవ్యాధియై త్తీర్క్కుమ్ సిద్ధోపాయమాకిఱ "నమ్బుమామరున్దై" స్వప్రవృత్తి నివృత్తిపూర్వకమాక సేవిక్కచ్చొల్లి, ముతలిలే ఉపదేశిత్తాల్ అనాదియాయ్ వరుకిఱ స్వయత్నవాసనై

మూ॥ ౧౨౭॥ వేదాంతములు ఉపాయముగా నేల విధించుచున్నవంటి వేని,

మూ॥ ౧౨౮॥ ఔషధమును సేవించుటకిష్టపడనివారికి దానిని వారుప్రేమించు వస్తువులతో జేర్చి యిచ్చునట్లు,యీశ్వరునికూడచేర్చి విధించుచున్నవి. ఇంతియే.

అవతారిక:—ఇట్లు స్వరూప విరోధాది దోషములతోఁ గూడియుండునట్టి దీనిని హితమును బోధించునట్టి యుపనిషత్తులు "ఓమిత్యాత్మానం ధ్యాయథ" (ముండ. ౨. ౨. ౬) (ఓమ్ అని పరమాత్మను ధ్యానించునది) అనియు, "ఆత్మానమేవలోక ముపాసీత" (బృ. ఉ. ౪. ౪. ౫) (లోకమును పరమాత్మనుగా భావించి యుపాసించునది) అనియు, "ఆత్మావా ఉరేద్రష్టవ్యశ్శ్రోతవ్యోమన్తవ్యోనిదిధ్యాసితవ్యః" (బృ. ఉ. ౪. ౪. ౫) (పరమాత్మ శాస్త్రద్వారా తెలియవలసినది వినవలసినది మననము చేయవలసినది ధ్యానింపవలసినది) అను తావుల యీ చేతనునికి మోక్షోపాయముగా విధించుటకుఁ గారణమేదియంటివేని యీవిషయమగు ప్రశ్నను అనువదించుచున్నారు.

(వేదాంతములు) ఇత్యాది.

అవతారిక:—అందులకుఁ గారణముఁ దెలుపుచున్నారు.

(ఔషధసేవ)ఇత్యాది ఎక్కువ రోగపీడితులైయున్నప్పటికిన్ని అట్టిరోగమును శీఘ్రముగా నివర్తింపఁజేయుటకుఁగాను ఘనమైన యౌషధమును సేవింపమని చెప్పినచో, అందుల కిష్టపడని బాలురు పుత్రులు మొదలగువారికి వారు ఎక్కువప్రీతితో భుజించునట్టి పదార్థములతో నట్టియౌషధముఁజేర్చి యిచ్చునట్టి దయాళువులగు తల్లితండ్రులవలెనే శీఘ్రముగా సంసారరూపమగు వ్యాధిని నివర్తింపఁజేయునట్టి సిద్ధోపాయమగు "నచ్చుమామరున్దై" (తి. వా. 3. ౪. ౫) (విశ్వసనీయమగు గొప్పయౌషధమైనవాఁడు) అని శ్రీనమ్మాళ్వారు లానతిచ్చినట్లు సర్వేశ్వరుని స్వప్రయత్నము నెడ్డియుఁజేయక సేవింపమని (శరణుజొచ్చుమని) మొట్టమొదటనే యుపదేశించినట్లయిన, అనాదిగా వచ్చునట్టిస్వయత్నరూపమగు వాసనచే నందుల కిష్టపడని చేతనులనున్న విడిచిపెట్టుట

**౧౭౯॥ మూ॥ ఇత్తై ప్రవర్త్తిప్పిత్తతు పరహింసైయై నివర్త్తిప్పిక్కైక్కాగ.**

యాలే అతుక్కు నైయాత చేతనరైయుమ్ విడమాట్టామైయాలే, అవర్కళుక్కు భిమతమాన స్వయాత్న రూపమాయిరుక్కిఱ ఉపాసనత్తిలే తదఙ్గత్వేన సిద్ధోపాయమాన ఈశ్వరనైక్కలన్దు తాదృశమాన ఉపాసనత్తై అవర్కళుక్కు మోక్షోపాయమాక విధిక్కిఱ విత్తనైయెన్ఱు. దృష్టాన్తత్తిలభిమతవస్తు వ్యాధిహారియన్ఱియే, తన్మిశ్రమాక ప్రయోగిత్త ఔషధమే వ్యాధిహారమాకఱాప్పోలే, దార్ష్టాన్తికత్తిలుమ్ ఉపాసనమన్ఱిక్కే తన్మిశ్రనాన ఈశ్వరనే ఉపాయమెన్నుమిడమ్ సంప్రతిపన్నమ్. అవ్యవధానేన సేవిక్కుమళవిల్ అవిశమ్యాన వ్యాధిక్కైయాప్పోక్కుమౌషధమ్ అభిమతవస్తు మిశ్రమానపోతు విశమ్యక్క కార్యకరమాకఱాప్పోలే యాయిఱ్ఱు, ఉపాసనమిశ్రనానపోతు ఈశ్వరన్ విశమ్యక్క ఫలప్రదనాకిఱతుమ్.

ఇని ఇప్పడి ఇతుతన్నై విధిత్తతు, కీழ్ నిన్ఱనిలైయైక్కాట్టిల్ మేల్ కొణ్డుపోకైక్కాక విత్తనైయెన్ఱితార్, ( ఇత్తై ) ఎన్ఱుతుడఙ్గి అతావతు - శాస్త్రమాకిఱతు - “త్రైగుణ్యవిషయా వేదాః” ఎన్గిఱపడియే పెరునిరాయ్ అనాదికాలకళాన విసలకరణఙ్గళుడైయ సటతరకరణఙ్గళుడైయవాళియాల సత్వైయాయిరుక్కుమాపోలే. మూనాపిన్న సఙ్ప్రజ్ఞికాక్కట్టిలుమ్ వత్సలతరమాకైయాలే తమఃప్రచురరోడు రజఃప్రచురరోడు సత్త్వప్రచురరోడు వాశియఱ, అవర్కళ్ ఉపదేప్రవృత్త

---

**మూ॥ ౧౭౯॥ దీనిని ప్రవర్తింపఁజేసినది పరహింసను తొలఁగింపుటకుగాను.**

క్షిప్తులేనందువారి క్షిప్తమైనట్టి స్వయత్నరూపమగు నుపాసనమునందట్టియుపాసనమున కంగముగాను సిద్ధోపాయమగు సర్వేశ్వరుని గూడఁజేర్చి యట్టి యుపాసనమును వారలకు మోక్షోపాయముగాను విధించుచున్న వింతియే.

దృష్టాంతమున వాఁడు ప్రీతితో భుజించునట్టి పదార్థము వ్యాధిని బోఁగొట్టునట్టిదికాక దానితోఁ గలిపియిచ్చినట్టి యౌషధముమాత్రమే యట్టి వ్యాధిని పోఁగొట్టునట్టిదియగు చందంబున, దార్ష్టాంతికమునను సంసారమును నివర్తింపఁజేయునట్టి యుపాయము ఉపాసనముకాక దానితోఁ గూడఁజేర్చి పేర్కొనఁబడినట్టి సర్వేశ్వరుండుమాత్రమే యుపాయమని యేర్పడుచున్నది.

విడువకుండ సేవించినట్లయిన శీఘ్రముగా రోగమును నివర్తింపఁజేయునట్టి యౌషధము ఇష్టమైన పదార్థముతోఁ గూడఁచేర్చి సేవించినచో, మెల్లగా గుణము నిచ్చునట్లు సర్వేశ్వరుఁడును ఉపాసనముతోఁ జేర్పఁబడినప్పుడు నిదానముగా ఫలమునిచ్చునని తెలియుంగునది.

అవతారిక:—ఇట్లు దీనిని విధించినది యింతకుముందుండుస్థితిని బోఁగొట్టి పైరలను పైపైగా గొనిపోవుటకుగానని తెలుపుచున్నారు.

(దీనిని) ఇత్యాది.

అదియెట్లనిన, “త్రైగుణ్య విషయా వేదాః” (వేదములు సత్త్వ రజస్తమోగుణముల కనుగుణములుగా నేర్పడినవి) అన్నట్లు కన్నతల్లియయినది గ్రుడ్డివారును చెవిటివారునగు బిల్లలయందట్టివారగుగాక ఇంద్రియపటుత్వము గల బిల్లలయందు పక్షపాతములేకుండ అందఱిని సమానముగా దయతోఁజూచునట్లు వేయిమంది తల్లిదండ్రులకంటెను నెక్కువదయగలది యగుటచే తమోగుణముగలవారినిన్ని రజోగుణముగలవారినిన్ని సత్త్వగుణముగలవారినిన్ని పక్షపాతములేకుండ సమా

రాయ్ నశిక్కవిడ క్షమమల్లామైయాలే, అవ్వోరుడైయ గుణానుగుణమాక ప్పురుషార్థఙ్గళైయుమ్ తత్సాధనఙ్గళైయుముపదేశిత్తు, కొళ్ కొమ్బిలే యేఱ్ఱుకైక్కు చ్చుళ్ళిక్కాల్ నాట్టువారోపాతి, ఇవ్వోముఖఙ్గళాల్ తన్నుడైయ తాత్పర్యాంశత్తిలే ఆరోపిక్కైక్కాక ప్రవర్తిప్పిక్కిఱతాకైయాలే, శ్యేనవిధితుడఙ్గి ప్రపత్తిపర్యన్తమాక వరుమళవుమ్ చేతనర్ నిష్ఠైక్కు వళవుక్కీడాక, ఉత్తరోత్తర పురుషార్థసాధనఙ్గళై ప్రవర్తిప్పిత్తు, పూర్వపూర్వఙ్గళై నివర్తిప్పిక్కక్కడవతాయిరుక్కుమ్; అకైయాలే. ఇవ్వుపాసనత్తై ప్రవర్తిప్పిత్తతు పరహింసైయై నివర్తిప్పిక్కైక్కాక. (పరహింసై) ఎన్తతు -. మేలానహింసై యెన్ఱపడి; ‘‘పరదేవతై, పరగతిః’’ ఎన్గిఱవిడఙ్గళిల్ - మేలాన దేవతై, మేలానగతి ఎన్నర్థమాకిఱాప్పోలే. అనావతు- శ్యేనవిధిక్కు మేలాకవిధిక్కప్పట్ట పశ్వాలమ్భనాదికళై చ్చొన్నపడి. అత్తై హింసై యెన్నలామో వెన్నిల్, విహితహింసై యెన్నక్కడవతిఱే. ‘‘అగ్నీషోమీయం పశుమాలభేత’’ ఎన్గిఱవిడత్తిల్, ఆలమ్భశబ్దమ్ ‘‘ఆలమ్భః- స్పర్శహింసయోః’’ ఎన్గైయాలే హింసావాచియిఱే. ఇత్తాల్ కామ్యకర్మత్తై చ్చొన్నపడి. ‘‘పూర్వవిహితహింసై’’ ఎన్ఱు శ్యేనవిధియైచ్చొల్లుకైయాలుమ్, తదుపరివిహితమాన కామ్యమే ఇవ్విడత్తిల్ వివక్షితమ్. అన్ఱిక్కే, విహితమేయాకిలుమ్, 'భగవచ్ఛేషత్వ జ్ఞానపూర్వకమాక అనన్యప్రయోజననాయ్క్కొణ్డు, అగ్నీన్ద్రాది దేవతాన్తర్యామి సమారాధనమాక వేపణ్ణుమ్ పశ్వాలమ్భనాది యుక్తయాగాది కర్మత్తైప్పోలన్ఱు, స్వతన్త్రనాయ్క్కొణ్డు స్వర్గాదిఫలసాధనమాక అగ్నీన్ద్రాది దేవతామాత్ర

---

నముగా నాచుచు వారు మంచిదారితప్పి చెడిపోవునప్పుడు వారిని విడువఁజాలక వారివారి గుణముల కనుగుణముగ పురుషార్థములను తత్సాధనములను ఉపదేశించుచు, చెట్లపాదుతీగ పందిలిపై యల్లుకొనుటకుగాను దానిప్రక్కన ఒక చిన మండను పాతువారివలెనే, ఈయావిధములఁ దనయొక్క తాత్పర్యార్థమును తెలియఁజేయుటకుఁగాను ప్రవర్తింపఁజేయునట్టిదియగుటచే శ్యేన విధి మొదలుకొని ప్రపత్తిపర్యంతము చేతనుల స్థితిగతుల కనుగుణముగ పైపైని పురుషార్థములను తత్సాధనములనున్ను ప్రవర్తింపఁజేసి ముందు ముందున్నట్టివాటిని నివర్తింపఁజేయఁగలదు. కావున యీయుపాసనమును ప్రవర్తింపఁజేయుటయనునది పరహింసను నివర్తింపఁజేయుటకుగానని యెఱుంగునది. ఈ తావునపరహింసయనఁగా నిఁకమీఁదు పైపైగాఁజెప్పఁబోవునట్టి హింసయనియర్థము. దృష్టాంతము— ‘‘పరదేవత’’ ‘పరగతి’ అనుశబ్దములకు ‘‘పైగానుండుదేవత’’ ‘‘పైగానుండుసాధనము’’ అనియర్థముచేసికొనునట్లు యీతావునను అర్థము చేసికొనునది. అదియెట్లనిన, శాస్త్రమున, శ్యేనవిధిని చెప్పినపిమ్మట పశుహింసాదులను చెప్పినట్లు. అయితే దానిని హింసయని చెప్పవచ్చునా? యనియెదవా? శాస్త్రమునందేయది ‘‘విహితహింస=విధింపఁబడినట్టి హింస’’ అని చెప్పఁబడినదే? మరియు ‘‘అగ్నీషోమీయం పశుమాలభేత’’ అను శ్రుతియందుండు ‘‘ఆలమ్భ’’ శబ్దమును ‘‘ఆలమ్భస్=స్పర్శహింసయోః’’ అని ఆలమ్భస్ధాతువు స్పర్శనున్ను హింసనున్ను తెలుపునదిగాను కదా చెప్పఁబడినది. ఇందువలన కామ్యకర్మము చెప్పఁబడినది. ‘‘పూర్వము విధింపఁబడిన హింస’’ అని యిట్లు శ్యేనవిధిని పేర్కొనుటంజేసియును దానికిపిమ్మట విధింపఁబడినట్టి కామ్యకర్మమే యిచటయుద్దేశింపఁబడినది

ఇంతియెకాక, శాస్త్రమునందు విధింపఁబడినదియేయైనను, భగవచ్ఛేషత్వ జ్ఞానపూర్వకముగ అనన్యప్రయోజనుండై అగ్నీంద్రాదిదేవతలలో నంతరాత్మగానుండు సర్వేశ్వరుని యారాధించుటకుఁగా నే చేయునట్టి పశుహింసాయుక్తమగు యాగాది కర్మమునుబట్టి మాడఁగా, స్వతంత్రుఁడవను జ్ఞానముగలవాడై స్వర్గాది ఫలసాధనముగాను అగ్నీంద్రాది దేవతలనుమాత్రము ఉద్దేశించి యొనర్చు

మూ॥ ౧౩౦ ॥ ఇదుతాన్ పూర్వవిహిత హింసైపోలే
విధినిషేధఙ్గళిరణ్డుక్కుమ్ కుత్తై యిల్లై.

---

జ్ఞర్కు యుద్దేశిత్తుప్పణ్ణుమ్ పశ్వాలమ్భనాదియుక్త కామ్యకర్మమ్, విశేషజ్ఞర్క్కు పరహింసా ప్రాయమెన్నలామ్పడి అత్యన్తనికృష్టమాయిరుక్కైయాలే, ఇవ్వాకారత్తైయిట్టు అతుతన్నై పరహింసై యెన్ఱరుళిచ్చెయ్తారాకవుమామ్. శాస్త్రవిహితముమాయ్, భగవదేకవిషయముమాయిరుక్కిఱ ప్రాపకాన్తరత్తై, "జ్ఞానికళుక్కు పాపమ్" ఎన్ఱు వోపాతి, ఇతువు మధికారివిశేషత్తైయిట్టు చ్చొల్లలామిఱే. "అథపాతకభీతస్త్వమ్" ఎన్ఱు ఉపాయాన్తరత్తై ప్పాతకమాకచ్చొల్లిర్ఱిఱే ధర్మదేవతైయుమ్. బుభుక్షువుక్కు ఉపాదేయమాన పుణ్యన్దానే ముముక్షువుక్కు పాపశబ్దవాచ్యమాకానిన్ఱతిఱే; ఆక ఎల్లావర్ఱాలుమ్ ఇవ్విడత్తిల్ కామ్యకర్మత్తై చ్చొల్లుకిఱతు. ఇప్పడితాన్ రోజిక్కిఱతు ఉపాసనవిధిక్కు నివర్త్యమ్ కామ్యకర్మమాక ఇవర్ తామే పరన్దరహస్యత్తిలే యరుళిచ్చెయ్కైయాలే.

ఆనాల్ ఇప్పడివిధిత్తత్తై పిన్నై నిషేధిక్కిఱతెన్నెన్న అరుళిచ్చెయ్కిరార్ (ఇదుతాన్) ఎన్ఱు తుడఙ్గి (ఇదుతాన్) ఎన్గిఱతు-కీళ్చ్చొన్న ఉపాసనత్తై (పూర్వవిహితహింసై యావతు) "శ్యేనేనాభిచరన్ యజేత" ఎన్ఱు ప్రథమత్తిలే విధిక్కప్పట్ట అభిచారకర్మమ్. అతు తమఃప్రచురరాయ్ నాస్తి

---

మూ॥ ౧౩౦॥ ఇది మొట్టమొదట విధింపఁబడినట్టి యభిచారకర్మము (మారణ హోమము) వంటిది.

కావున విధించు విషయమునను నిషేధించువిషయమునను బాధకము లేదు

---

పశుహింసా యుక్తమగు కామ్యకర్మము విశేషజ్ఞులయినవారికి పరహింసవంటిదియని చెప్పఁదగినంత నికృష్టమైనదిగా నుండుటంజేసి దానియొక్క యిట్టిస్థితినిబట్టి దానిని పరహింసయని మూలమున గ్రంథకర్త పాయించి యుండవచ్చును.

శాస్త్రమున విధింపఁబడినదియు, భగవంతునిగుఱించినదిమాత్రమేయై యుండునట్టి ఉపాయాంతరమును జ్ఞానుల విషయమున అపాయముగాఁ జెప్పినట్లు, దీనినిన్ని యొకవిధమైన యధికారియెడల ఇట్టిదియని చెప్పవచ్చును కదా! "అథపాతకభీతస్త్వం" (భా. విష్ణుధర్మ) (నీవుపాతకమునుండి భయపడితివి) అను తావున ధర్మదేవతయును ఉపాయాంతరమును పాతకమునుగాఁ జెప్పి యున్నది కదా! బుభుక్షువులకు (సంసారభోగకాములకు) గ్రాహ్యమైనట్టి పుణ్యమనునది ముముక్షువులయెడల పాపమని కదా పేర్కొనఁబడుచున్నది. కావున అన్నివిధములను ఈతావున కామ్యకర్మమే చెప్పఁబడినది. ఇట్లు అర్థము జేసికొనుటకుఁ గారణమేమనఁగా, ఉపాసనమునను ష్ఠించువానిచే కామ్యకర్మము త్యజింపవలసినదియని వీరే పరందపడియును రహస్యమున సాధించి యున్నారు గదా!

అవతారిక:—ఇట్లు విధించినదానినే పిమ్మట నిషేధించుచున్నారేల? యని యడిగితివేని, తెలుపుచున్నారు.

(ఇది) ఇత్యాది. "ఇది" యనఁగా పూర్వముచెప్పిన యుపాసనము. (పూర్వవిహితహింస) యనఁగా "శ్యేనేనాభి చరన్ యజేత" (శ్యేనపశువుతో నభిచారకర్మము నాచరించునది) అని

**మూ॥ ౧౩౧॥ అత్తై శాస్త్రవిశ్వాసత్తుక్కాక విధిత్తతు;**
**ఇత్తై స్వరూపవిశ్వాసత్తుక్కాక విధిత్తతు.**

కరా యిరుప్పారైప్పఱ్ఱి విధిక్కప్పట్టు ఆస్తికరాయ్ కారీర్యాదికామ్యకర్మఙ్గళిలే యిழிకైక్కు యోగ్యరాన రజః ప్రచురరైప్పఱ్ఱి నిషేధిక్కప్పడుకిఱాప్పోలే, ఉపాసనముమ్ స్వాతన్త్ర్యాన్యశేషత్వనివృత్తిపూర్వకమాక భగవచ్ఛేషత్వత్తిలే యూన్ఱుకైక్కు యోగ్యరాన సత్త్వప్రచురరైప్పఱ్ఱి విధిక్కప్పట్టు పారతన్త్ర్యజ్ఞానమ్పిఱన్దు భగవదేకోపాయత్వత్తిలే యూన్ఱుకైక్కు యోగ్యరాన పరమసత్త్వనిష్ఠరైప్పఱ్ఱి నిషేధిక్కప్పడవుమ్ కుఱైయిల్లై.

ఇప్పడి నిషేధిక్కప్పడువనవైయాన ఇవైతన్నై ఆడియిలే ఏతుక్కాక విధిత్తతెన్న అరుళిచ్చెయ్కిఱార్ (అత్తై) ఎన్ఱుతొడఙ్గి. అతావతు "శతచిత్తశాస్త్రవశతోపాయోఽభిచారశ్రుతిః" ఎన్గిఱపడియే అభిచారకర్మత్తై విధిత్తతు, శాస్త్రత్తై ఇల్లైయెన్ఱిరుక్కుమ్ నాస్తికరుక్కు శాస్త్రవిశ్వాసమ్ పిఱక్కైక్కాక; ఉపాసనత్తై విధిత్తతు, తన్నై స్వతన్త్రనెన్ఱు భ్రమిత్తుప్పోన్ద చేతననుక్కు అవై యిరణ్డుమ్ వన్దేఱి భగవచ్ఛేషత్వమే నిలైనిన్ఱ వేషమ్ ఎన్ఱు తన్ స్వరూపత్తిల్ విశ్వాసమ్ పిఱక్కైక్కాక వెన్గై.

ఇప్పడి ఓరోవిశ్వాసత్తుక్కాక విధిత్తుమై ఒత్తిరున్దాకిలుమ్ ఇవ్వుపాసనత్తై ః డామల్

**మూ॥ ౧౩౧॥ దానిని శాస్త్రముయెడల విశ్వాసమును గలుగఁజేయుటకై విధించిరి.**
**దీనిని స్వరూపమువిషయమున విశ్వాసమును గలుగఁజేయుటకై విధించిరి.**

మొదట విధింపఁబడినట్టి యాభిచారకర్మము తమఃప్రచురులై నాస్తికులగువారినిగుఱించి విధింపఁబడినదై, ఆస్తికులై కారీర్యాది కామ్యకర్మముల ననుష్ఠించుటకు యోగ్యులగు రజోగుణవంతులగు వారియెడల నిషేధింపఁబడు చందంబున, ఉపాసనమున్ను స్వాతంత్ర్యాన్య శేషత్వములను వదలుకొని భగవచ్ఛేషత్వము నపేక్షించుటకుఁ దగినవారలగు సత్వగుణవంతులకుఁగాను విధింపఁబడి, పారతంత్ర్యజ్ఞానముగలిగి భగవంతుండొక్కఁడే యుపాయమనెడి నిశ్చయము గలిగియుండుటకుఁ దగినవారలగు పరమ సత్వగుణవంతులయెడల నిషేధింపఁబడవచ్చును. బాధకమెద్దియును లేదు.

అవతారిక:—ఇట్లు నిషేధింపఁబడునవియగు వీటిని మొదట యేల విధించి యుండవలయు నంటివేని తెలుపుచున్నారు.

(దానిని) ఇత్యాది. "శతచిత్తశాస్త్రవశతోపాయోఽభిచారశ్రుతిః" అన్నట్లు అభిచారకర్మమును విధించుటకుఁ గారణము శాస్త్రమే లేదనునట్టి నాస్తికునికి శాస్త్రమునందు విశ్వాసముఁ గలుగఁజేయుటకై యని యెఱుంగునది.

ఉపాసనమును విధించుటకుఁ గారణము. "తాను స్వతంత్రుఁడు" అనియు "దేవతాంతర శేషభూతుఁడు" అనియును భ్రమించియున్నట్టి చేతనునికి ఆరెండును ఆగంతుకములనియు, భగవంతునికి శేషభూతుఁడుగానుండుటయే యథార్థమైన స్వరూపమని యిట్లు తనస్వరూపము విషయమున విశ్వాసముఁ గలుగఁజేయుటకుగానని యెఱుంగునది.

అవతారిక:—ఇట్లు ఒక్కొక్క దాని విషయమున విశ్వాసముఁగలుగఁ జేయుటకుగాను మొదట విధించినదానిని పిమ్మట నిషేధించుట యుక్తమేయైనను, ఈయుపాసనమును విడువకుండ అను

**మూ॥ ౧౩౨॥ అతు తోల్ పురైయేపోమ్; ఇతు మర్మస్పర్శి.**

**మూ॥ ౧౩౩॥ ఇతుతాన్ కర్మసాధ్యమాకైయాలే దుష్కరముమాయిరుక్కుమ్.**

---

పరహింసైనినైత్తాల్ అభిచారకర్మమ్పోలే క్రూరమన్రోయితువెన్న అతిలుఙ్కాట్టిల్ క్రూరమెన్గిఱార్ (అతు)ఎన్ఱుతుడఙ్గి పరహింసారూపమాన అన్దఅభిచారకర్మ దేహాత్మాభిమానిశెయలాయ్, విశిష్టవేష విరోధియాయ్ అత్తాల్ వరుమ్ ఫలముమ్ శిలదుఃఖానుభవమాత్రమాయ్క్కొణ్డు మేలెழప్పోవతాకైయాలే (తోల్ పురైయేపోమ్) ఎన్గిఱతు అహఙ్కారగర్భమాన ఇన్దవుపాసనమ్ ఆత్మజ్ఞానమ్పిఱన్దవన్ శెయలామ్ నిష్కృష్టవేష విరోధియాయ్ భగవదేకపారత స్వరూపనాశకమాకైయాలే (మర్మస్పర్శి) ఎన్గిఱతు.

ఇవ్వళవేయన్ఱు. ఇతుతాన్ దుష్కరముమెన్గిఱార్ (ఇతుతాన్) ఇత్యాదియాలే ఇప్పడి స్వరూపవిరోధియాయిరుక్కిఱ ఇవ్వుపాసనన్దాన్ “యజ్ఞేనదానేనతపసానాశకేన బ్రాహ్మణావివిదిషన్తి” “అవిద్యయామృత్యుంతీర్త్వావిద్యయామృతమశ్నుతే” “సర్వాపేక్షాచయజ్ఞాది శ్రుతేరశ్వవత్”

---

**మూ॥ ౧౩౨॥ అది చర్మగతమై శరీరముతోఁపోవును. ఇదియో మర్మస్పర్శి.**

**మూ॥ ౧౩౩॥ ఇది కర్మానుష్ఠానముచే సాధింపవలసినది యగుటచే దుష్కరము గాను నుండును.**

---

క్షించినట్లయిన నది యభిచార కర్మమువలెనే క్రూరమైనది కాదే? యంటివేని, దానికంటెనున్ను యిది యెక్కువ క్రూరమైనది యని తెలుపుచున్నారు.

(అది) ఇత్యాది. పరహింసారూపమగు నభిచారకర్మము దేహాత్మాభిమానియగువాఁడు చేయునదియై, స్వరూపవిశేషమునకు విరుద్ధమైనదై దానివలనఁ గలుగునట్టి ఫలమున్ను కొంచము దుఃఖానుభవమాత్రమై పైపైని స్పృశించునది. అనఁగా చర్మగతమై శరీరముతో పోవును.

అహంకారగర్భమగునట్టి యీయుపాసనము ఆత్మజ్ఞానముగలవాఁడు చేయునదియై నిష్కృష్టపగు స్వరూపముతో విరోధించునదియై భగవదేక పారతన్త్ర్య రూపమగు స్వరూపమును నశింపఁజేయునది యగుటంజేసి మర్మస్పర్శియని అనఁగా నస్థిగమైనట్లుండి యాత్మస్వరూపమును నశింపఁజేయునదిగాఁ జెప్పఁబడుచున్నది.

అవతారిక:—ఇంతమాత్రమే కాకుండ, ఇది దుష్కరమనియును తెలుపుచున్నారు.

(ఇది) ఇత్యాది. ఇట్లు స్వరూపవిరుద్ధమగునట్టి యీయుపాసనము “యజ్ఞేనదానేన తపసానాశకేన బ్రాహ్మణావివిదిషన్తి” (బృ. ఉ. ౪. ౪. ౨౨) (యజ్ఞముల నొనర్చుటచేతను, దానముల నొసంగుటచేతను, ఆహారనియమముతో నొనర్పఁబడు తపస్సుచేతనున్ను బ్రాహ్మణులు పరమాత్మ నుపాసింప యిచ్ఛయించుచున్నారు) అనియు, “అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయామృతమశ్నుతే” (మైత్రేయ. ౭. ౯) (ఫలాపేక్ష రహితముగ కర్మముల నాచరించుటచే జ్ఞానోత్పత్తికి విరుద్ధములగు కర్మములను నశింపఁజేసి భగవంతుని యుపాసించుటచే మోక్షమును బొందుచున్నారు) అనియు, “సర్వాపేక్షాచయజ్ఞాది శ్రుతేరశ్వవత్” (బ్ర. సూ. ౩. అ. ౪. పా. ౨౬. సూ) (యజ్ఞేనదానేనేత్యాది శ్రుతినిబట్టి ప్రయాణసాధనమగు నశ్వము పల్లము మొదలగు నుపకరణముల సహాయము నపేక్షించుచందంబున, మోక్షసాధనమగు నుపాసనమున్ను కర్మానుష్ఠానాదుల నపేక్షించును) అనియు, “కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః” (కర్మములు రజస్తమోగుణమూలకములు జ్ఞానమే ముఖ్యసాధనము) అనియు, “కషాయే కర్మభిః పక్వే తతోజ్ఞానం ప్రవ

**మూ॥ ౧౩౪॥ ప్రపత్త్యుపాయత్తుక్కు ఇక్కుఱ్ఱజ్గళొన్నుమిల్లై.**

కషాయపక్తిః కర్మాణి జ్ఞానన్తు పరమాగతిః । కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" "జన్మాన్తరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" ఇత్యాదికళిల్ శొల్లుకిఱపడియే కాయక్లేశకరమాన కర్మానుష్ఠానత్తాలే సాధిక్కప్పడుమతాకైయాలే అశక్తనాన ఇవనాల్ శెయ్ తుతలైకట్టవుమ్ అరితాయిరుక్కుమెన్నై.

ఆక ప్రాపకాన్తరపరిత్యాగత్తుక్కు ఎన్ఱు తుడజ్గి ఇవ్వళవాక ఉపాయాన్తరదోషమ్ విస్తరేణ ప్రతిపాదిక్కపట్టతు,

ఉపాయాంతరదోష ప్రకరణమ్ సమాప్తమ్,

---

## అథ సిద్ధోపాయాధికార ప్రకరణమ్.

ఇప్పడి ప్రాపకాన్తరత్తుక్కు అనేక దోషజ్గళ్ ప్రతిపాదిత్తీర్, ప్రపత్త్యుపాయత్తుక్కు ఏదుమ్ దోషజ్గళిల్లైయోవెన్న, అరుళిచ్చెయ్ కిరార్ (ప్రపత్త్యుపాయత్తుక్కు) ఎన్ఱు తుడజ్గి (ఇక్కుఱ్ఱజ్గళ్) ఎన్ఱు స్వరూపవిరోధమ్ ముతలాక దుష్కరత్వపర్యంతమాక చొన్న వైయెల్లావఱ్ఱైయుమ్ పరామర్శిక్కిఱతు. (ఒన్ఱుమిల్లై) ఎన్నతు, ఒరుదోషము మితిన్పక్కలిల్లై ఎన్నపడి. "ఇక్కు

**మూ॥ ౧౩౪॥ ప్రపత్త్యుపాయమున కిట్టి దోషము లెవ్వియును లేవు.**

ర్తతే" (కర్మములు మూలముగ రజస్తమో గుణములు నశించినచో జ్ఞానము ఉత్పన్నమగుచున్నది) అనియు, "జన్మాంతర సహస్రేషు తపోజ్ఞాన సమాధిభిః। నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" (వేలకొలది జన్మములు జరుగఁగా తపస్సుచేతను జ్ఞానముచేతను సమాధిచేతనున్న పాపములు నశించినవారికి శ్రీకృష్ణుని విషయమున భక్తి గలుగుచున్నది) అనియు నీ మొదలగు తావులఁ జెప్పియున్నట్లు కాయక్లేశమును గలుగఁజేయునట్టి కర్మానుష్ఠానముచే సాధింపఁబడునదియగుటం జేసి యశక్తుఁడగువట్టి యీ చేతనునిచే నది సంపూర్ణముగా ననుష్ఠింపఁబడుటయును దుర్లభము. కావున "(ప్రాపకాన్తర పరిత్యాగమునకు) అనువాక్యము మొదలుకొని యింతవరకును ఉపాయాంతరానుష్ఠానమునకుఁ గల దోషములు విపులముగాఁ బ్రతిపాదింపఁబడినవి.

ఉపాయాంతరదోష ప్రకరణమ్ సమాప్తమ్.

---

## సిద్ధోపాయాధికారప్రకరణమ్.

అవతారిక:—ఇంతకు ముందు చెప్పిన ప్రకారము ఉపాయాంతరమునకు అనేక దోషంబులు గలవని ప్రతిపాదించియుంటిరి. అయితే ప్రపత్త్యుపాయమునకు ఒక్క దోషమున్న లేదా? యంటి వేని తెలుపుచున్నారు.

(ప్రపత్త్యు పాయమునకు) ఇత్యాది (ఈ దోషములు) అనఁగా స్వరూప విరోధము మొదలుకొని దుష్కరత్వమువరకును పేర్కొనఁబడినట్టి యన్ని దోషములనుట.

(ఒక్కటియును లేదు) అనఁగా ఒక్క దోషమును దీనికి లేదనుట.

**మూ॥ ౧౩౫॥ ఆత్మయథాత్మ్య జ్ఞానకార్యమాకైయాలే స్వరూపత్తుక్కు ఉచితము మాయ్, “శిఙ్ఙ్ఱవేణ్డా” ఎన్గిఱపడియే నివృత్తిసాధ్యమాకైయాలే సుకరముమా యిరుక్కుమ్.**

---

శ్ఙ్ఱజ్గళోట్టుమిల్లై” ఎన్గైయాలే మఱ్ఱొరు కుఱ్ఱముమిల్లై ఎన్నుమిడమ్ తోఱ్ఱుకిఱదు. అతావదు-వస్తుతః ఉపాయత్వమ్ తనక్కిన్ఱిక్కే యిరుక్కచ్చెయ్తే, ఆపాతప్రతీతియిలే ఉపాయత్వ ప్రతిపత్తి యుణ్డాకుమ్బడి యిరుక్కై.

ఇక్కుఱ్ఱజ్గళిల్లైయెన్ను మత్తై ప్రకాశిప్పిక్కైక్కాక, ఇతినుడైయ స్వరూపోచితత్వ సుకరత్వజ్గళై యరుళిచ్చెయ్కిఱార్, (ఆత్మయాథాత్మ్య) ఇత్యాదియాలే. ఇప్ప్రపత్తి (ఆత్మయాథాత్మ్యజ్ఞాన కార్యమాకైయావదు)- తిరుమన్త్రత్తిల్ మధ్యమపదత్తిల్ శొల్లుకిఱపడియే, ఆత్మావినుడైయ యథావస్థిత వేషమాన భగవదత్యన్త పారతన్త్ర్య మాకిఱత్తై ఉణర్కైయాలే వన్దతాయిరుక్కై. (స్వరూపత్తుక్కు ఉచితమాకైయావదు) -అన్దపారతన్త్ర్యస్వరూపత్తుక్కనురూపమా యిరుక్కై (శిఙ్ఙ్ఱవేణ్డా) ఎన్గిఱదు - శిఙ్ఙ్ఱుదల్ - శిదఱుదలాయ్, పరక్కవేణ్డావెన్గై. అతావదు - ఒరువ్యాపారముమ్ పణ్ణవేణ్డా వెన్ఱపడి. (నివృత్తిసాధ్యమాకైయాలే సుకరముమా యిరుక్కుమ్) ఎన్ఱదు. “భగవత్ప్రవృత్తి విరోధిస్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః” ఎన్గిఱపడియే స్వప్రవృత్తి నివృత్తియాలే సాధిక్కప్పడుమతాకైయాలే ఎళితాకచ్చెయ్యలుమా యిరుక్కుమెన్గై.

---

**మూ॥ ౧౩౫॥ ఆత్మయాథాత్మ్యజ్ఞానమువలనఁ గలిగినదియగుటచే స్వరూపముతో ననుకూలించినదియై, “శిఙ్ఙ్ఱవేణ్డా” అని సూచించినట్లు స్వప్రయత్నమును వదలుకొనుటచే సాధింపవలసినదియగుటవలన సులభమైనదిగా నుండును.**

---

ఈ దోషములలో నొక్కటియును దీనికి లేదనుటచే వేఱొక్క దోషముండవచ్చునని తోచుచున్నది. అదియెట్లనిన, వాస్తవముగ ప్రపత్తి యుపాయము కాకున్నను, చూచాయగాఁ దెలియునప్పుడు ఉపాయముగాఁ దెలియవచ్చునదిగా నుండుట.

అవతారిక:— ఈ దోషములు దీనికి లేవని తెలుపుటకుగాను ఇది స్వరూపమునకు అనుగుణముగానుండుటను, అనుష్ఠించుటకు సులభముగా నుండుటనున్ను (ఆత్మయాథాత్మ్య) ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

ఈ ప్రపత్తి యాత్మ స్వరూపమును గుఱించిన యథార్థజ్ఞానముయొక్క ఫలితమైనది యనఁగా తిరుమంత్రముయొక్క మధ్యమ పదముచే అనఁగా “నమః” అనుదానిచేఁ దెలుపఁబడిన ప్రకారము ఆత్మయొక్క యథార్థ స్వరూపమగు భగవదత్యంతపారతంత్ర్యమును మనస్సున స్థిరముగా నుంచుకొనుటచే సంప్రాప్తమైన దగుట.

స్వరూపము కనుగుణమైనది యగుట యనఁగా—అట్టి పారతంత్ర్యరూపమగు స్వరూపమునకుఁ దగినట్టిదిగా నుండుట.

“శిఙ్ఙ్ఱవేణ్డా” (తి. వా. ౯-౧-౭) (శ్రమపడవద్దు) అనుతావున శ్రీనమ్మాళ్వారులును ఏమియును చేయనక్కఱలేదని సూచించియున్నారు. అనఁగా ఒక వ్యాపారమును చేయవద్దనుట.

నివృత్తి సాధ్యమగుటచే సులభముగా నుండుననఁగా, “భగవత్ప్రయత్నమునకు విరుద్ధమగు స్వప్రయత్నమును వదలుకొనుట ప్రపత్తి” అని చెప్పియున్నందున, స్వప్రయత్నమును వదలుకొనుటచే సాధింపఁబడునది యైనందున ననుష్ఠించుటకు సులభముగా నుండునదియనుట.

మూ॥ ౧౩౬॥ పూర్ణవిషయ మాకైయాలే పెరుమైక్కీడాక పచ్చైయిడ వొణ్ణాతు.

---

ఇవైయిరణ్డైయుమ్ శొల్లవే కీழ్చ్చొన్నదోషఙ్గళొన్ఱుమ్ ఇతుక్కిల్లై యెన్నుమిడమ్ సిద్ధిత్తపడియెన్నిల్; అపాయత్వ భయజనకత్వశోకజనకత్వ అహఙ్కారమిశ్రతయా నిషిద్ధత్వావద్యకరత్వఙ్గళ్, స్వరూపవిరోధిత్వత్తై ప్పత్తి వరుకిఱవైయాకైయాలుమ్, ఫలవిసదృశత్వమ్, ఇతు ఫలసాధనమన్ఱిక్కే సిద్ధోపాయమే ఫలసాధనమాయ్ ఇతు తద్వరణమాత్రమాయ్ అధికారివిశేషమాయిరుప్పతొన్ఱాకైయాలే ఇతిల్ప్పక్కల్ వరుకైక్కు అవకాశమిల్లామైయాలుమ్, ఇవ్వాఱుదోషము మితుక్కిల్లామై (స్వరూపత్తుక్కుచితమ్) ఎన్ఱతిలే సిద్ధమామిఱే. కర్మసాధ్యతయావరుమ్ దుష్కరత్వ మిల్లై యెన్నుమిడమ్ (నివృత్తిసాధ్యమాకైయాలే సుకరమ్)ఎన్ఱతిలే సుస్పష్టమిఱే. ఆకైయాలే స్వరూపౌచిత్య సుకరత్వఙ్గళాకిఱ ఇవైయిరణ్డు మితుక్కుణ్డెన్నవే, కీழ్చ్చొన్న దోషఙ్గళొన్ఱుమ్ మితుక్కిల్లై యెన్నుమిడమ్ ప్రకాశితమాయిత్తు.

ఇప్పడి ఉపాయమవనెన్ఱధ్యవసిత్తు స్వప్రవృత్తియిల్ నివృత్తనాయిరున్ద విడనమైయుమొ తత్సన్తోషార్థమాక ఇవన్ శిలపచ్చైయిడ వేణ్డావోవెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (పూర్ణవిషయమ్) ఎన్ఱు తుడఙ్గి. అతావతు – లోకత్తిల్ పచ్చైయిడువార్ అవ్వోవిషయఙ్గళిన్ తరత్తుక్కీడాకవిఱే

---

మూ॥ ౧౩౬॥ సర్వేశ్వరుండు సర్వసంపత్పరిపూర్ణుండగుటచే ఆయనపూర్తికి తగిన
టుల చేతనుండు కానుకను సమర్పింపఁ జాలడు.

---

అవతారిక:—ఈ రెంటిని చెప్పినందున ముందు పేర్కొనఁబడిన దోషంబులలో నొక్కటియును దీనికి లేనట్లు యెట్లు సిద్ధించునంటివేని తెలుపుచున్నారు.

అపాయత్వము,భయజనకత్వము,శోకజనకత్వము,అహంకారమిశ్రితమగుటచే సంభవించునిషిద్ధత్వము,నిందా స్పదత్వము ఇవిస్వరూపవిరోధమునుబట్టి సంభవించునవి యగుటంజేసియు,మఱియు ప్రపత్తి ఫలసాధనము కాకుండ,సిద్ధోపాయమే (సర్వేశ్వరుండే) ఫలసాధనమై, ఈ ప్రపత్తికావాని నందులకై వరించుట మాత్రమేయై యధికారియుండవలెని యొక విధమైన యోగ్యతగా నుండునది యైనందున, ఫలవిసదృశత్వ రూపదోషము (ఫలముకు సమానమైనది కాక పోవుట) దీనియెడల ప్రవర్తించుట కెంత మాత్రము అవకాశము లేకపోవుటం జేసియును యీ యాఱు దోషములును దీనికి లేవను విషయము ఇది స్వరూపము కనుగుణమైనది యన్నంత మాత్రముననే సిద్ధమగుచున్నది గదా?

కర్మానుష్ఠాన మూలమున సాధింపబడునది యగుటచే సంభవించునట్టి దుష్కరత్వరూపమగు దోషము దీనికి లేదను విషయము ఇది సర్వప్రయత్నములను వదలుకొనుటచే సాధింపఁబడినదైనందున సుకరము అన్నందున సుస్పష్టము కదా!

కావున స్వరూపానుగుణ్యమును సుకరత్వమును ఈ రెండును దీనికిఁగలవని చెప్పినలోఁడనే ముందు పేర్కొనఁబడి నట్టి దోషంబు లెవ్వియును దీనికిలేవనెడి యంశము ప్రకటితమగుచున్నది.

అవతారిక:—ఇట్లు ఉపాయము సర్వేశ్వరుఁడు అని నిశ్చయించుకొని స్వప్రయత్నముఁ దేనిఁ జేయకయున్నచో చాలునా? వానికి సంతోషముఁ గలుగఁజేయుటకుగాను ఈతఁడు అట్టి వానిని దేనినైనను చేయవద్దా? యంటివేని తెలుపుచున్నారు.

( పూర్ణవిషయమ్ ) ఇత్యాది లోకమున కానుకను సమర్పించువారు ఆయా విషయ

మూ॥ ౧౩౭॥ ఆభిముఖ్య సూచకమాత్రత్తిలే సన్తోషమ్ విళైయుమ్.

మూ॥ ౧౩౮॥ పూర్త్తి కైవాఙ్గాతే మేల్ విఴుకైక్కు హేతువిత్తనే.

యిడువతు, ఇఙ్గుమ్ పచ్చైయిడప్పార్క్కిల్ అప్పడి యిడవేణుమిత్తే; అవన్ అవాప్తసమస్తకామతయా పరిపూర్ణనాయిరుక్క మవనాకైయాలే, అవనుడైయ వైభవత్తుక్కనుగుణమాక ఇవనాలొరు పచ్చైయిడప్పోకాతెన్నై.

అనాల్, అవనుక్కివన్ విషయత్తిల్ సన్తోషమ్ విళైయుమ్పడి యెన్నెన్న, అరుళిచ్చెయ్కిఱార్ (అభిముఖ్య) ఇత్యాదియాలే అతావతు అనాదికాలమ్ యాతానుమ్పఱ్ఱై నీఙ్గుమ్ విరతత్తై యేఱిట్టుక్కొణ్డు తన్పక్కల్ విముఖనాయ్పోన్దవివన్, అన్నైవు కులైన్దు తన్పక్కలభిముఖనాన మైక్కు సూచకమాన తొరువ్యాపారమ్ పణ్ణవళవిలే, ఇత్తనైకాలమ్ విముఖనాయ్ పోన్దవ నిన్ఱభిముఖనాక ప్పెఱువతే" ఎన్ఱు అవన్ తిరువుళ్ళమ్ మికవుముకక్కు మెన్నపడి.

అవనప్పడి యిరున్దాలుమ్ అవన్ పూర్త్తియాలనకు "అకిఞ్చనరాన సమ్మాలవనైయుకప్పిత్తుకపోకాతు" ఎన్ఱు ఇవన్ కైవాఙ్గుమ్పడి పణ్ణాతోవెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (పూర్త్తి) ఎన్ఱు తుడఙ్గి. అతావతు - అవనుడైయ అవాప్తసమస్త కామత్వమ్, ఆశ్రయణోన్ముఖనాన ఇవన్, నమ్మ

మూ॥ ౧౩౭॥ అభిముఖ్యమును సూచింపునట్టి యొక్కస్వల్పవ్యాపారము మాత్రము చేతనే ఈశ్వరునికి వీనియెడల సంతోషము కలుగును.

మూ॥ ౧౩౮॥ ఈశ్వరునియందుండు పూర్త్తి యీచేతనుండు ఆశ్రయించునప్పుడు వెనుకతీయకుండ యభిముఖుండై యాశ్రయించుటకే హేతువగును.

మఱియొక్క గౌరవమున కనుగుణముగాను కదా! సమర్పించుదురు. ఈ విషయమున కానుక నియ్య ప్రయత్నించితిమేని, అవ్విధముననే కదా యీయవలయును? సర్వేశ్వరుఁడు అవాప్త సమస్తకాముఁడగుటచే పరిపూర్ణుఁడయినందున వాని వైభవమునకుఁ దగినట్లు ఈ చేతనుఁడు ఒక్క కానుకనైనను ఈయఁజాలఁడు.

అవతారిక:—అయితే వానికి యీతని విషయమున సంతోషము గలుగుట యెట్లంటవేని తెలుపుచున్నారు.

(అభిముఖ్య) ఇత్యాది. అనాదికాలముగ దేనినైన నొక వ్రతము నవలంబించి వెడిపోవుచు తనయెడల విముఖుండైనట్టి యీతఁడు అట్టి తలంపు పోయి తనవిషయమున నభిముఖుఁడగుటకు సూచకముగా నెద్దియైన నొక్కదానిఁ జేయునప్పుడు, ఇంతకాలముగ విముఖుఁడై పోయినట్టి యీతఁడు నేటికి యభిముఖుఁడై వచ్చినాడే? యని వాని మనస్సున నెక్కువ సంతోషము గలుగును.

అవతారిక:—వాఁడు అట్టివాఁడెయైనను, వానికిఁగల పరిపూర్ణత్వమనునది యకించనుఁడగు వాచే వానిని సంతోషింపఁ జేయుటకుఁ జేయఁదగినది యెద్దియును లేదనుకొని యీతఁడు వెనుదీయునట్లు చేయదా? యంటివేని తెలుపుచున్నారు.

(పూర్త్తి) ఇత్యాది వాని యవాప్తసమస్తకామత్వమనునది యాశ్రయించుట కుద్యుక్తుఁడగు

మూ॥ ౧౩౯ ॥ ‹‹పత్రం పుష్పమ్,,

---

లవనై యొరుపడియాలుమ్ సన్తోషిప్పిక్క—ప్పోకాదు ఎన్ఱు తదాశ్రయణత్తిల్ నిన్ఱుమ్ మీళుకైయన్ఱిక్కే, ‹‹నామిట్టదుకొణ్డు తృప్తనాకవేణ్డాత పరిపూర్ణనాకైయాలే, నమ్ముకైయిల్ పెఱ్ఱదుకొణ్డు సన్తోషిక్కుమ్'' ఎన్ఱభినివేశిత్తు పుఱ్ఱుకైక్కుడలామిత్తనై యెనై—అన్నిక్కే, అవన్ పూర్తి అవనై ఇప్పడి సన్తోషిక్కవొట్టుమో, ఉపేక్షిత్తు కైక్కవాఙ్గప్పణ్ణాతో వెన్న, (పూర్తి) ఇత్యాదియాలే యరుళిచ్చెయ్కిఱారాకవుమామ్. అతావదు - అవనుడైయ పూర్తియానదు, ‹‹ఇవన్ పచ్చై యిట్టిలన్'' ఎన్ఱనాదరిత్తు అఙ్గీకారత్తిల్ నిన్ఱుమ్ కైవాఙ్గాతే, ‹‹అభిముఖ్య సూచకమాత్రత్తుక్కు మేల్పడ నమక్కివన్ శిలశెయ్య వేణ్డువదుణ్డో?'' ఎన్ఱు విరుమ్బికైక్కొళ్ళు కైక్కుడలామిత్తనై యెన్గై.

ఇప్పడి ఇవనల్పసన్తుష్టనెన్న మతుక్కు ప్రమాణముణ్డోవెన్న, అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (పత్రంపుష్పమ్) ఎన్ఱు తుడఙ్గి. ‹‹పత్రంపుష్పంఫలంతోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి । తదహం భక్త్యుపహృతం అశ్నామిప్రయతాత్మనః'' ఎన్ఱు పత్రత్తైయాకవుమామ్, పుష్పత్తైయాకవుమామ్, ఫలత్తైయాకవుమామ్, జలత్తైయాకవుమామ్, యావనొరువన్ ఎనక్కు భక్తియాలే తరుకిఱాన్; అనన్యప్రయోజనత్తైయాకిఱ శుద్ధిగోడేకూడిన మనస్సైయుడైయనానవనుడైయ అప్పడిప్పట్టభక్తి

---

మూ॥౧౩౯॥ ఇందులకుఁ బ్రమాణములు ‹‹పత్రమ్ పుష్పమ్›,

---

నీతఁడు నాచే నెవ్విధమునను వానిని సంతోషింపఁజేయ శక్యముకాదనుకొని యట్లు ఆశ్రయించుటనుండి వెనుదీయునట్లు చేయుట సరియే కదా! మన మిచ్చినదానిచేతనే తృప్తిపడనక్కరలేనంత పరిపూర్ణుఁడగుటంజేసి।మనమిచ్చిన దానిఁగొని సంతోషించునని తలంచుకొని వాని నాశ్రయించుటకు ఉపోద్బలకము కావచ్చుననుట.

☞ ఈ వాక్యమునకు వేఱొక్క విధమునను అర్థము చేసికొనవచ్చును.

అవతారిక:—వాని యవాప్త సమస్తకామత్వము వాని నిట్లు సంతోషించునట్లు చేయునా? ఉపేక్షించి విడిచి పెట్టునట్లు చేయదా? యంటివేని (పూర్తి) ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

వానియొక్క యవాప్తసమస్తకామత్వమనునది యీతఁడు తనకుకానుక నీయలేదని యనాదరణచేసి వీని నంగీకరించుటలో వెనుదీయునట్లు చేయక, అభిముఖ్యమును సూచింపునటిదిమాత్రమే తప్ప దానికి పైని యీతండు చేయవలసినది మరియేమున్నది యనుకొని ప్రేమించి యంగీకరించుటకు ఉపోద్బలకము కాఁగలదింతియే.

**అవతారిక:**—ఇట్లు అతఁడు అల్పసంతోషియనుటకుఁ బ్రమాణమెద్దియయిన కలదా? యంటివేని తెలుపుచున్నారు.

(పత్రంపుష్పం) ఇత్యాది ‹‹పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి।తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః'' అనఁగా పత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, ఉదకమునుగాని యెవ్వఁడు నాకు భక్తితోనిచ్చునో, అనన్యప్రయోజనరూపమగు శుద్ధితోఁగూడి యుండునట్టి మనస్సుగల యాతండు అట్టి భక్తితో నిచ్చిన దానిని అవాప్త సమస్తకాముఁడ

మూ॥ “అన్యత్పూర్ణాత్„ “పురివతువుమ్ పుకైపూవే„

యాలే తరప్పట్టవత్తై, అవాప్తసమస్తకామనాన నాన్, అవన్ ప్రేమత్తాలే కలఙ్గిత్తిరుమాపోలే, వ్యామోహత్తాలేకలఙ్గి అడైవుకెడ వినియోగమ్ కొళ్ళుదనెన్ఱు తానే యరుళిచ్చెయ్తానిఱే. “అన్యత్పూర్ణాదపాం కుమ్భాదన్యత్పాదావనేజనాత్। అన్యత్కుశలసమ్ప్రశ్నాన్నచేచ్ఛతి జనార్దనః” ఎన్ఱాన్ఱు - శ్రీతూతెళున్దరుళుకిఱపోతు, ధృతరాష్ట్రన్ “పాణ్డవపక్షపాతియాయిరుక్కుమ్ కృష్ణన్ వారానిన్ఱాన్, అవనుక్కుచ్చిలనాట్టైయుమ్ పొన్నైయుమ్ కొడుత్తు నమక్కాక్కిక్కొళ్ళుకిఱోమ్” ఎన్ఱాన్ఱు శిలవఙ్గళైచ్చొల్ల, నిన్నైవుమ్ కొలవుమొత్తిరాత వఞ్చకనావన్ కరుత్తై యఱిన్ద సఞ్జయన్, “నరుకిఱవన్ అజ్ఞనాత్తవనల్లకాణ్, అవనుక్కు వేణ్డువతివ్వళవు” ఎన్గిరాన్, అతావతు - తాన్ కుడిక్కుమ్ తణ్ణీరై ఒరుకుడత్తిలే నిఱైత్తుక్కుళిర్న్దిరుక్కక్కడవనే, అత్తై అవన్ వరుకిఱ వళియిలే వాశలిలే వైక్కవమైయుమ్, అతుక్కుమేలొన్ఱుమ్ వేణ్డా; తన్ గృహత్తిలే అతిథివన్దు పుకున్దాల్ కాలైక్కళువవతాకసామాన్యశాస్త్రమ్ విధిత్తుత్తిత్తిఱే, అవ్వోపాతి అవన్తిరువడికళై విళక్కవమైయుమ్, అననావాళిక్కు విశేషిత్తొన్ఱుమ్ శెయ్యవేణ్డా; నెడున్దూరమ్ వన్దవర్కై కుశలప్రశ్నమ్ పణ్ణక్కడవతిఱే, అవ్వోపాతి నీఙ్గళ్ శౌఖ్యమాయిరుక్కిఱీరో ఎన్ఱుమ్ వేణ్డా; ఇవ్వళవుకళై యొఴియ మఱ్ఱొన్ఱై ఇచ్ఛియాన్ కొణ్ణవనెన్గై. ఇత్తాల్, నీకొడుక్క నినైక్కిఱ నాట్టైయుమ్ పొన్నైయుమ్ అవనొరుశరక్కాక నినైత్తిరుక్కుమోవెన్గై.

మూ॥ “అన్యత్ పూర్ణాత్„ “ పురివతుమ్ పుకైపూవే„ ఇత్యాదులు.

గు నేను వాఁడు ప్రీతి పరవశుఁడైయున్నట్లు, వ్యామోహపరవశుఁడనై క్రమమునుస్న గమనింపక వినియోగపరచుకొనెదనని భగవంతుఁడు స్వయముగనే చెప్పియున్నాఁడుగదా!

“అన్యత్ పూర్ణాదపాం కుమ్భాత్ అన్యత్పాదావనేజనాత్। అన్యత్ కుశల సంప్రశ్నాత్ నచేచ్ఛతి జనార్దనః” అనఁగా దూత్యమునకు వేంచేయునప్పుడు ధృతరాష్ట్రుఁడు “పాండవ పక్షపాతియగు శ్రీకృష్ణుఁడు రాబోవుచున్నాఁడు వానికి కొన్ని యాభరణములను సువర్ణమును ఇచ్చి వానిని మన ప్రక్కకు తీసికొనెదను” అని యివ్విధమున కొన్ని సంగతులు చెప్పఁగా, ఒక్కటితలంచి వేఱొక్కఁడాఁ జెప్పనట్టి వంచకుఁడగు ధృతరాష్ట్రుని యభిప్రాయము నెఱింగినవాఁడగు సంజయుండు “రాబోవువాఁడు వాటి నపేక్షించునట్టి వాఁడు కాఁడు సుమీ? అతనికిఁ గావలసినది యింతియే.—తాను త్రాగునట్టి తీర్థమును ఒక బుంగలో పోసి చల్లగానగునట్లు చేసి వాఁడువచ్చుదారిన వాకిటిలో నెదురుగ నుంచినట్లయిన చాలును. అంతకు పైని వాని కేద్దియు నక్కఱలేదు.

తన గృహమున కెవ్వఁడైన యతిథి యేతెంచినట్లయిన వానికాళ్లను కడుగవది యని శాస్త్రమున సామాన్యముగ విధించియున్నది. కదా! అట్లే వాని పాదములను కడిగిననో చాలును. వాని గౌరమునకుగాను విశేషించి చేయవలసినది మఱియెద్దియును లేదు.

చాల దూరమునుండి వచ్చిన వానిని కుశల ప్రశ్నల నడుగుట వాఁడుక గదా! అవ్విధమున నీతని సౌఖ్యభోగ్యమై మాటయడిగిన చాలును. ఈతనిని గౌరవించుటకుఁగాను మఱి యెద్దియును చేయనక్కఱలేదు. వీటిని మాత్రమే తప్ప మఱియెద్దియును అతఁడు కోరఁడు సుమీ! కావున నీవు ఈయ దలంచినటి యాభరణమునుగాని యొక శ్లాఘ్యవస్తువునుగా నతఁడు తలంచునా?

మూ ॥ ౧౮౦ ॥ పుల్లైక్కాట్టి యழైత్తు ప్పుల్లై యిడువారైప్పోలే ఫలసాధనఙ్గళుక్కు భేదమిల్లై.

---

కిల్ ఉగాన్నాభిముఖ్యసూచకమాక ఇవ్వళవుకళై చ్చెయ్యప్పార్రెన్నపడి. ‹‹పరివతిలీశనై›› ఎన్నుతుడఙ్గి ‹‹పురివతువుమ్ పుకైపూవే›› ఎన్ను హేయప్రత్యనీకనాన సర్వేశ్వరనై, సంసారాన్న్కత్తరా యనుభవిత్తు, అవ్వనుభవజనిత ప్రీతియాలే ‹‹ఎతత్సామగాయన్నాన్తే›› ఎన్గిఱపడియే పాడివిస్తృతరాకైయై ప్పెఱవేణ్డియిరుప్పీర్! ఉపకరణఙ్గళిల్ కుఱైవుపార్త్తు అకలుకైతవిర్న్దు, అసంస్కృతమాన జలత్తై ఏతేను మొరుపడి ప్రయోగిత్తు, పిన్నై అవనుక్కురుల్ కొణ్డైయాకక్కొడుప్పతుమ్ ఏతేను మొరుపుకైయుమ్ ఏతేను మొరుపూవుమ్, ఇవ్వళవమైయుమ్ కిడికోళవనుక్కెన్ను అవనుడైయ స్వారాధత్తైయై సుస్పష్టమాక ఆழ్వార రుళిచ్చెయ్తారిఱే.

‹‹పూర్ణవిషయమ్›› ఎన్నుతుడఙ్గి, ఇవ్వళవుమ్ ప్రసక్తానుప్రసక్తమాక వన్దవిత్తనై యిఱే ప్రపత్తి వైలక్షణ్యమిఱే కీழ్చ్చొల్లప్పట్టతు; ఆకైయాలే అతుక్కిన్నముమొరు వైలక్షణ్యమ్ శొల్లుకైక్కాక, సిద్ధోపాయత్తుక్కుమ్ ఫలత్తుక్కుముణ్డాన ఐక్యత్తైమున్దుఱ వరుళిచ్చెయ్కిఱార్, (పుల్లైక్కాట్టి) ఎన్ను తుడఙ్గి. అతావతు-గోవై వరవழைత్తు ప్పిన్నైయతుక్కు-ధారకాదికళై యిట్టునోక్కు

---

మూ॥ ౧౮౦॥ గడ్డినిచూపించి పశువును స్వాధీనముచేసికొని, గడ్డిని దానికి ధారకముగా వేయునట్లు (ఈశ్వరుండు తానే చేతనుని స్వీకరించు విషయమున సాధనమై ఫలముకూడ తానే యైనందున) ఫలసాధనములకు భేదము లేదు.

---

నీవల్లనయిననట్లయితే నీయొక్కయాభిముఖ్యమును సూచింపఁజేయుటకై వీటిఁజేసిచూడుము అని సంజయుఁడు చెప్పెను.

శ్రీనమ్మాళ్వారులును ‹‹పరివతిలీశనై›› (తి. వా. ౧. ౬. ౧) అనునది మొదలుకొని ‹‹పురివతువుమ్పుకైపూవే›› అనువరకును ‹‹సంసారమునుండి ముక్తులై హేయప్రత్యనీకుఁడగు సర్వేశ్వరుని యనుభవించి యట్టి యనుభవమువలనఁగలిగినప్రీతిచే ‹‹ఎతత్సామ గాయన్నాన్తే›› (తై. ౩. ౧౦. ౫) (సామగానము చేయుచుండును) అన్నట్లు పాడి విస్తరించుటకు యాశపడుడు! ఉపకరణముల కొరతను తలంచి వెనుదీయక ఏదైన జలమును ఏదొకవిధమున నుపయోగపఱచి పిమ్మట వానికి ప్రీతిపూర్వకముగ నిచ్చుటయు, ఏదైన నొక పత్రమైనను, ఏదైన నొక పుష్పమైనను యింతమాత్రమే చాలును సుమీ!'' అనియిట్లు వాని నారాధించుటను గుఱించి తేటతెల్లముగా సాయించియున్నారు కదా!

(పూర్ణ విషయమ్) ఇత్యాది వాక్యము మొదలుకొని యింతవరకును ప్రసక్తానుప్రసక్తములగు విషయములు చెప్పఁబడినవి.

అయితే ప్రపత్తియొక్క వైలక్షణ్యముఁ దెలుపుటకై యింతకుముందు అరంభించియున్నారు కావున దానికిఁగల వేఱొక్క వైలక్షణ్యమునున్ను చెప్పఁదలంచి యందులకై సిద్ధోపాయమునకును ఫలమునకున్నుగల యైక్యమును మొట్టమొదట తెలుపుచున్నారు.

(గడ్డిని) ఇత్యాది. ఒకగోవునురప్పించి తరువాత దానికి ధారకాదులను గలుగఁజేసి దానిఁగాపాడుట కిచ్ఛయించువారు దానికి భోగ్యమగు గడ్డినే దానిని వశపరచుకొనుటకు సాధనముగాను దానిముందుంచి దానిఁబిల్చుకొనిపోయి అగడ్డినే తరువాతనున్న దానికి వేయుచుండుటంజేసి

**మూ॥ ౧౪౧॥ ఆకైయాలే సుఖరూపముమా యిరుక్కుమ్.**

నిన్నైప్పార్, తద్భోగ్యమాన పుల్లుతన్నైయే తద్వశీకారసాధనమాక మున్నిట్టుత్తుక్కొణ్డు, అతు తన్నైయే మేలుమిడుమళవిల్, ఫలసాధనఙ్గళుక్కు భేదమిల్లాతాప్పోలే, విలక్షణగుణవిగ్రహ విశిష్టనాన తానే మున్దుఱ ఇవనైచ్చేర్త్తుక్కొళ్ళుక్కైక్కు ఉపాయమాయ్, పిన్నైయెన్ఱుమిక్కు ఇవనుక్కు ఉపేయమా యిరుక్కైయాలే, ఫలసాధనఙ్గళిరణ్డు మేకవస్తువా యిరుక్కుమెన్నై.

ఇత్తాల్ ప్రపత్తిక్కు వైలక్షణ్యమ్ ఫలిత్తపడిన్ఱ యరుళిచ్చెయ్కిఱార్, (ఆకైయాలే) ఎన్ఱు తుడఙ్గి. అతావతు-సాధ్యవస్తు తానే సాధనమాకైయాలే, తద్వరణ రూపమాన ఇతు తేవైయాయి రాతే సుఖరూపమా యిరుక్కు మెన్నపడి.—అన్నిక్కే ఇన్నముమ్ ప్రపత్తిక్కొరు వైలక్షణ్య మరుళిచ్చెయ్కిఱార్, (పుల్లై) ఇత్యాదియాలే. అతావతు-పుల్లైక్కాట్టి ధేనువై యఴైత్తుక్కొణ్డుపిన్నై అప్పుల్లైయే యిడుమళవిల్ ఫలసాధనఙ్గళుక్కు భేదమిల్లాతాప్పోలే. "సకృత్కృతోఞ్జలిః" "నమశ్చక్రుర్జనార్దనమ్" ఇత్యాదికళిల్ సొల్లుకిఱపడియే అఞ్జల్యాదిరూపైయాన ప్రపత్తియైమున్నిట్టు ఈశ్వరనై వశీకరిత్తాల్, పిన్నై అవనుక్కు కప్పాక్కచ్చెయ్యు మడిమైయుమ్ "బద్ధాఞ్జలిపుటా హృష్టా నమ ఇత్యేవవాదినః" "కైకళాలారత్తొఴుతుతొఴుతున్నై" ఇత్యాదికళిల్ సొల్లుకిఱపడియే తత్స్వరూపానురూపమాన అఞ్జల్యాదివృత్తి విశేషఙ్గళాకైయాలే, ఫలసాధనఙ్గళుక్కు భేదమిల్లై. ఇప్పడి ఫలమానతు తానే సాధనమాకైయాలే, ఇప్ప్రపత్తితాన్ తేవైయాయిరాతే ఇవ

**మూ॥ ౧౪౧॥ కాబట్టి ప్రపత్తి సుఖరూపమై యుండును.**

యెప్పుడు ఫలసాధనములకు భేదములేనిచందంబున విలక్షణములైనకల్యాణగుణములును విగ్రహమును గల సర్వేశ్వరుండే మొదట యీతనిం జేర్చుకొనుటకు ఉపాయమై తరువాతనున్ను అట్లే యుపేయమునై యుండుటంజేసి ఫలమున్ను సాధనమున్ను ఈరెండును ఒక్క వస్తువుగానే యుండగలవనుట.

అవతారిక:—ఇందువలన ప్రపత్తికి సంభవించిన వైలక్షణ్యమును తెలుపుచున్నారు.

(కావున) ఇత్యాది. సాధ్యవస్తువే సాధనమగుటంజేసి దానిని వరించుట యనునట్టి యీప్రపత్తియనునది కష్టమైనదిగానుండక సుఖరూపముగా నుండుననుట.

☞ ఈ వాక్యమునకు వేఱొక్క విధమునను అర్థము చేసికొనవచ్చును.

అవతారిక:—ఇంకను ప్రపత్తియొక్క వైలక్షణ్యమును తెలుపుచున్నారు.

(గడ్డి) ఇత్యాది. గడ్డినిజూపించుచు ఆవును పిలుచుకొనిపోయి తరువాతనున్ను ఆగడ్డినే దానికి వేయునప్పుడు ఫలసాధనములకు భేదములేని చందమున, "సకృత్ కృతోఞ్జలిః" "ఒకతూరి యంజలిని జోడించి" అనియు, "నమశ్చక్రుః జనార్దనం" (సర్వేశ్వరునికి దండము సమర్పించిరి) అనియు నీతావుల చెప్పియున్నట్లు నమస్కారాది రూపమగు ప్రవృత్తిని పురస్కరించుకొని ఈశ్వరునివశపరచుకొనినట్లయిన, తరువాత వాని ముఖవిలాసమునకై చేయునట్టి కైంకర్యమును "బద్ధాంజలిపుటాః హృష్టాః నమ ఇత్యేవవాదినః" (అంజలి జోడించుకొని సంతుష్టులై నమస్కారమని చెప్పువారు) అనియు, "కైకళాలార తొఴుతుతొఴుతున్నై" (చేతులార నీకు దండము సమర్పించి) అనియు, నీతావుల చెప్పియున్నట్లు తన స్వరూపాను రూపములగు నమస్కారాది వ్యాపారము లగుటంజేసి యీనుఫలసాధనములకు భేదములేదని సిద్ధమగుచున్నది.

ఇట్లు ఫలమైనదియే సాధనమగుటంజేసి ఈప్రపత్తి కష్టమైనదిగా నుండక సుఖరూపముగా నుండునది యని యేర్పడుచున్నది.

**మూ॥ ౧౮౨॥ ఇవనవనైప్పెఱ నినైక్కుమ్పోతు ఇన్ద ప్రపత్తియు ముపాయమన్ఱు.**

---

తుక్కు సుఖరూపమా యిరుక్కుమెన్గై. ఆక «ప్రపత్త్యుపాయత్తుక్కు» ఎన్ఱుతుడఙ్గి ఇవ్వళవాక ప్రపత్తియినుడైయ దోషరాహిత్యముమ్ గుణసాహిత్యముమ్ శొల్లప్పట్టతు.

సిద్ధోపాయాధికారప్రకరణమ్ సమ్పూర్ణమ్,

అథ సిద్ధోపాయనిష్ఠర్ వైభవ ప్రకరణమ్.

ఇప్పడి ప్రస్తుతైయాన ప్రపత్తియినుడైయ అనుపాయత్వత్తైయుమ్, తత్ప్రతికోటియాన పరగతస్వీకారోపాయత్వత్తైయుమ్ «ఇతుతన్నై ప్పార్త్తాల్» ఇత్యాదియాలుమ్ «ప్రాప్తిక్కుపాయమవన్ నినైవు» ఇత్యాదియాలుమ్ కీழ్ అరుళిచ్చెయ్తపడి యన్ఱియే, సుఖాన్తరేణ అరుళిచ్చెయ్కిఱార్ మేల్.

అతిల్, ఇప్పడి స్వరూపానురూపమానవిత్తై సాధనమాక్కొణ్డు, స్వతన్త్రనానవనై ఇవన్ పెఱప్పార్క్కుమన్ఱు, అవన్ నినైవు కూడాతాకిల్ ఇతు విఫలిక్కుమెన్గిఱార్, (ఇవనవనై) ఎన్ఱుతుడఙ్గి. అతావతు-ఉడైమైయై ఉడైయవన్ శెన్ఱు కైక్కొళ్ళుమాపోలే, స్వామియాన అవన్ తానే వన్దఙ్గీకరిక్క క్కణ్డిరుక్కక్కడవ పరతన్త్రనాన ఇచ్చేతనన్, తాన్ ఫలియాయ్, తన్ స్వీకారత్తాలే, స్వతన్త్రనాన అవనైప్పెఱ నినైక్కుమళవిల్, అవన్ నినైవుకూడాతాకిల్, ఇప్పడి విలక్షణైయా యిరుక్కిఱ ప్రపత్తియుమ్ తల్లాభసాధన మాకాతెన్ఱపడి.

---

**మూ॥ ౧౮౨॥ చేతనుఁడు స్వామియైన ఈశ్వరుని పొందుటకు చేయు ప్రపత్తియును ఆయన సంకల్పము లేనప్పుడు సాధనము కాదు.**

---

కావున(ప్రపత్త్యుపాయమునకు)అను వాక్యము మొదలుకొని యింతవరకును ప్రపత్తియొక్క-దోషరాహిత్యమున్ను గుణవిశిష్టత్వమున్ను చెప్పఁబడినవి.

సిద్ధోపాయాధికారప్రకరణము సంపూర్ణము.

సిద్ధోపాయనిష్ఠవైభవ ప్రకరణమ్.

అవతారిక:—ఇట్లు ప్రస్తుతాంశమగు ప్రపత్తి యుపాయము కాకుండుటను, దానికి ప్రతికోటిగ సర్వేశ్వరుని యంగీకారమే యుపాయమగుటను «దీనిని విచారించినట్లయిన» అనియు (లభించుటకుపాయము వానితలంపు) అనియు నీమొదలగు వాక్యములచే నింతకుముందు సాయించిన ప్రకారముకాకుండ, వేఱొక్క విధమున తెలుపుచున్నారు.

అవతారిక:—అందు ఇట్లు స్వరూపానురూపమగు ప్రపత్తిని సాధనముగాఁగొని, స్వతంత్రుండగు సర్వేశ్వరుని బొందుటకు యీచేతనుఁడు తలంచునప్పుడు, సర్వేశ్వరుని తలంపు లేనిపక్షమున, ఈప్రపత్తి విఫలమగునని తెలుపుచున్నారు.

(ఈతఁడు) ఇత్యాది. ఆభరణమును సొంతగాడువచ్చి గ్రహించునట్లు, స్వామియగు సర్వేశ్వరుఁడే స్వయముగవచ్చి యంగీకరించుమండఁగాఁజూచియూరకయుండవలసినంత పరతంత్రుండగునటియీచేతనుండు తానే ఫలమును బొందువాఁడై తనయొక్క స్వీకారముచే స్వతంత్రుఁడగు సర్వేశ్వరునిబొందుటకు తలంచునప్పుడు,అట్లు సర్వేశ్వరునితలంపు లేనిదగు పక్షమున,ఇట్లు విలక్షణమగుప్రపత్తియును సర్వేశ్వరుని బొందుటకు సాధనము కాఁజాలదు అనుట.

మూ॥ ౧౮౩॥ అవనివనై ప్పెఱ నినైక్కుమ్బోతు పాతకముమ్ విలక్కన్ఱు.

మూ॥ ౧౮౪॥ ఇవై యిరణ్డుమ్ శ్రీభరతాళ్వాన్ పక్కలిలుమ్

శ్రీగుహప్పెరుమాళ్ పక్కలిలుమ్ కాణలామ్.

మూ॥ ౧౮౫॥ శ్రీభరతాళ్వానుక్కు నన్మైతానే తీమైయాయిఱ్ ఱు.

---

ఇని, అవనే స్వీకరిక్కుమళవిల్ ఉళ్ళవాశి శొల్లుకిఱార్, (అవనివనై) ఎన్ఱుతుడఙ్గి. అతావతు-స్వామియాయ్ స్వతన్త్రనానవన్ స్వమ్మాయ్ పరతన్త్రనాయిరుక్కుమ ఇవనై స్వేచ్ఛయాలే పెఱనినైక్కుమళవిల్. పాపఙ్గళిల్ ప్రధానమాక ఎణ్ణప్పడుమ్ పాతకముమ్ ప్రతిబన్ధకమాకమాట్టాతెన్నై. ఇవైయిరణ్డాలుమ్, స్వగతస్వీకారానుపాయత్వముమ్ పరగతస్వీకారోపాయత్వముమ్ కాట్టప్పట్టతు. "చితః పరమచిల్లాభే ప్రపత్తిరపినోపధః। విపర్యయేతునైవాస్య ప్రతిషేధాయపాతకమ్" ఎన్నక్కడవతిఱే.

ఇప్పడి యివైయిరణ్డుమ్ కాణలామిడమున్డోవెన్న అరుళిచ్చెయ్కిఱార్, (ఇవై) ఎన్ఱుతుడఙ్గి. అవర్కళ్ తఙ్గళ్ పక్కలవైకణ్డపడి యెన్నెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (శ్రీధరతాళ్వానుక్కు) ఇత్యాదివాక్యద్వయత్తాలే. అతావతు-పెరుమాళైమీట్కైక్కాణువన్దుతిరువభిషేకమ్ పణ్ణువి

---

మూ॥ ౧౮౩॥ సర్వేశ్వరుండు ఈచేతనుని స్వీకరింపఁదలంచినప్పుడు పాతకమున్ను

ఆటంకము కాఁజాలదు.

మూ॥ ౧౮౪॥ ఈరెంటిని భరతుని విషయమునను గుహుని విషయమునను చూడ

వచ్చును

మూ॥ ౧౮౫॥ భరతునికి మంచియే చెడుపైనది

---

అవతారిక—ఇఁక, సర్వేశ్వరుండే స్వీకరించు పక్షమునఁగల తారతమ్యముఁదెలుపుచున్నారు (సర్వేశ్వరుండు) ఇత్యాది

స్వామియును, స్వతంత్రుండు నగుసర్వేశ్వరుఁడు సొత్తువంటి వాఁడును, పరతంత్రుండును నగు ఈచేతనుని స్వేచ్ఛచే స్వీకరించుటకిచ్ఛయించినట్లయిన, పాపంబులలోఁ బ్రధానమైనదిగా నెన్నఁబడునట్టి పాతకంబును అందులకు ప్రతిబంధకము కాఁజాలదు.

కావున ముందుజెప్పిన రెండు వాక్యములచేతనున్ను స్వగత స్వీకారము ఉపాయము కాకపోవుటయు, పరగత స్వీకారముపాయమగుటయును చెప్పఁబడినది. అదిఁయెట్లనిన. "చితః పరమచిల్లాభే ప్రపత్తి రపినోపధః। విపర్యయేతునైవాస్య ప్రతిషేధాయ పాతకం" (ఈజీవుండుసర్వేశ్వరుని లభింపగోరుపక్షమున ప్రపత్తి హేతువుకాఁజాలదు, సర్వేశ్వరుండే యీచేతనుని లభింపగోరునప్పుడు పాతకమున్ను ఆటంకముకాఁజాలదు" అనిశాస్త్రమునఁ జెప్పియున్నది కదా।

అవతారిక— ఇవ్విధములగు రీతినిగురించి చూడఁదగిన స్థలములుండునా యంటివేని తెలుపుచున్నారు.(ఈ రెంటిని) ఇత్యాది.

అవతారిక—వారియెడలనివి యెవ్విధమునఁగానఁబడుచున్నవి యనఁగా "శ్రీధరవాళ్వానుకు" ఇత్యాది వాక్యముచేఁదెలుపుచున్నారు.

భరతుఁడు శ్రీరామచంద్రుని దోడకొని వచ్చి పట్టాభిషేకము జేయించి తన స్వరూపమును

మూ॥ శ్రీగుహప్పెరుమాళుక్కు తీమైతానే నన్మైయాయిఱ్ఱు.

మూ॥ ౧౪౬॥ సర్వాపరాధఙ్గళుక్కుమ్ ప్రాయశ్చిత్తమాన ప్రపత్తి తానుమ్

త్తు తఱ్స్వరూపానురూపమాన వడిమైయై ప్పెఱ్ఱు వాళ్కైక్కాక, ‘‘ఏభిశ్చ సచివైస్సార్ధమ్’’ ఇత్యాదిప్పడియే వఴియేపిడిత్తు మనోరథిత్తుక్కొణ్డు శెన్ఱు పెరియవార్తియోడే అవర్ తిరువడికళిలే ప్రపత్తి పణ్ణిన భరతాళ్వానుక్కు అప్పడిపణ్ణిన ప్రపత్తియాకిర నన్మైతానే, శరణ్యరాన పెరుమాళ్ తిరువుళ్ళత్తుక్కు అనిష్టమాకైయాలే తీమైయాయ్విట్టతు. ‘‘ఏழై యేతలన్’’ ఇత్యాదిప్పడియే పెరుమాళ్ తామే వన్దంగీకరిక్కప్పెఱ్ఱ శ్రీగుహప్పెరుమాళుక్కు, దోషమే పచ్చైయాకవఙ్గీకరిక్కైయాలే పాతకమాకిఱ తీమైతానే నన్మైయాయ్ విట్టతెన్నై, ‘‘యత్త్వత్ప్రియంతదిహ పుణ్యమపుణ్యమన్యత్’’ ఎన్ఱిఱే పుణ్యపాపలక్షణమ్ ఆకైయాల్ ఇవన్కళ్ పక్కలిలే కాణలామిఱే.

ఇవన్ పణ్ణుమ్ ప్రపదనమ్, శరణ్యహృదయానుసారియల్లాతపోతు, అపరాధకోటి ఘటితమామెన్నుమిడ మరుళిచ్చెయ్తార్ కీழ் ఇతుతాన్, ఇవనుడైయ పూర్వవృత్తత్తై ప్పార్త్తాలుమ్ అపరాధకోటియిలేయాయిరుక్కుమెన్నుమిడత్తై ప్రకాశిప్పిక్కైక్కాక భాష్యకారరుడైయ అనుష్ఠాన ప్రకారత్తైయరుళిచ్చెయ్కిఱార్ మేల్, (సర్వాపరాధఙ్గళుక్కుమ్) ఎన్ఱుతొడఙ్గి. అతావతు ‘‘అహమస్మ్యపరాధానామాలయః’’ ఎన్గిఱపడియే, అపరాధఙ్గళుక్కెల్లామ్ కొళ్కలమాయిరు

---

మూ॥ గుహునికి చెడుపే మంచియైనది

మూ॥ ౧౪౬॥ సకలాపరాధములకున్ను ప్రాయశ్చిత్తమైన ప్రపత్తియును

అనుగుణమగు కైంకర్యమును లభించి సుఖపడుటకుగాను ‘‘ఏభిశ్చ సచివైస్సార్ధం’’ (శ్రీ-రా-అ ౧౦౪-౧౫) (మంత్రులతోఁగూడ) అని చెప్పియున్నట్లు దారిపట్టుకొని మనోరథముతో పోయి చేరి గొప్ప ఆర్తితో వారి శ్రీపాదములసన్నిధిని ప్రపత్తిచేయగా (శరణుజొచ్చగా) అట్టి భరతునికి అట్లొనర్చిన ప్రపత్తిరూపమగు మంచియే గదా శరణ్యుండగు శ్రీరామచంద్రుని మనస్సునకు ఇష్టము కానందున చెడుపయినది.

అయితే ‘‘ఏழై యేతలన్’’ (పె. తి. ౫. ౮. ౧) (జ్ఞానహీనుడు సత్తై లేని వాఁడు) అన్నట్లు శ్రీరామచంద్రుండు తానే స్వయముగ వచ్చి యంగీకరించునప్పుడు శ్రీగుహదేవునికిఁగల దోషమే భోగ్యముగా నంగీకరింపఁబడుటచేతను ఈతావున పాతకరూపమగు చెడుపే గదా మంచియయినది. ‘‘యత్ త్వత్ప్రియంతదిహ పుణ్యం అపుణ్యమన్యత్’’ (ఆళమా. శ్లో. ౫౩) (ఏది సర్వేశ్వరునికి ఇష్టమైనదియో యది పుణ్యము తక్కినది పాపము) అని గదా పుణ్యపాపముల లక్షణములు చెప్పఁబడినవి. కావున నీపై విషయమును వీరియెడల జూడవచ్చును.

అవతారిక:—ఈతండు చేయునట్టి ప్రపత్తి శరణ్యుఁడగు సర్వేశ్వరుని హృదయమున కనుగుణము కానప్పుడు అది అపరాధకోటిలోఁ జేరును అను విషయమును ఇంతకుముందు ప్రతిపాదించియున్నారు. మరియు ఇది యీతని పూర్వపు నడవడికనుబట్టి చూచినను అపరాధకోటిలో చేరియుండునది యగునను విషయమును తెలుపుటకుగాను శ్రీభాష్యకారుల యనుష్ఠానపద్ధతిని తెలుపుచున్నారు.

(సర్వాపరాధములకు) ఇత్యాది ‘‘అహమస్మ్యపరాధానా మాలయః’’ (నేను అపరాధము

సూ॥ అపరాధకోటియిలేయాయ్ క్షామణమ్ పణ్ణవేణ్డుమ్బడి నిఱ్ఱినిఱ్ఱతితే.

క్కు—అఇచ్చేతనన్ ప్రపత్తిపణ్ణవే, "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" ఎన్నుమ్బడి ఇవనళవిల్ సర్వేశ్వరన్ తిరువుళ్ళమ్ ప్రసన్నమాయ్ విడుకైయాలే, సర్వాపరాధఙ్గళుక్కుమ్ ప్రాయశ్చిత్తమాయిఱే ప్రపత్తి తానిరుప్పతు. ఇప్పడి యిరుక్కుళ్ళ ప్రపత్తిగాయ "త్వత్పాదారవిన్దయుగళం శరణమహం ప్రపద్యే" ఎన్ఱు పణ్ణియరుళిన భాష్యకారర్క్కు స్వపూర్వవృత్తత్తై యనుసన్ధిత్తవాఱే అతుతాను మపరాధకోటియిలేయాయ్, "త్వమేవమాతా చ" ఎన్ఱుతుడఙ్గి ఇత్తలైయిలపరాధత్తై పొఱుక్కైక్కుఱుప్పాన సమ్బన్ధవిశేషఙ్గళైయుమ్ విణ్ణప్పఞ్జెయ్దరుళి, "తస్మాత్ప్రణమ్య" ఇత్యాదియాలే, ఇప్పడి తిరుమున్బే కూశామల్ వన్దునిన్ఱు ప్రపత్తిపణ్ణిన ఇవ్వపరాధత్తై పొఱుత్తరుళవేణుమెన్ఱు క్షామణమ్పణ్ణవేణ్డుమ్బడి నిఱ్ఱినిఱ్ఱతిఱే యున్గై. ఆకైయాల్, ఇవ్వధికారియాలుమ్ ఇతు అపరాధకోటిఘటితమాయిరుక్కుమెన్గై. అనాదికాలమపరాధత్తైప్పణ్ణి పిన్బురునాళిలే అభిముఖ్యత్తైప్పణ్ణినానేయాకిలుమ్, "రిపూణామపివత్సలః" "యదివా రావణస్స్వయమ్" ఎన్ఱిరుక్కుమీశ్వరహృదయత్తైప్పార్త్తాల్ అవనుక్కై క్కొళ్ళ ఒరుకుఱైయిల్లై, ఇవనప్పడి యిరున్దానేయాకిలుమ్, తన్ పూర్వవృత్తత్తై యుణర్న్దాల్ ఇతనైయుమపరాధమాక నినైత్తు క్షామణమ్పణ్ణవేణ్డుమ్బడియాయిఱే యిరుప్పతు.

సూ॥ మహాపరాధములోనే చేరినదై క్షమాపణము గోరవలసినదిగానుండును కదా

లకుపుట్టిల్లయితిని) అని సాయించినట్లు అపరాధములన్నింటికిని స్థానభూతుండగు ఈచేతనుండు ప్రపత్తిని చేసినతోడనే "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (భ. గీ) (సమస్తపాపములనుండి విడిపించెదను) అన్నట్లు ఈతనియెడల సర్వేశ్వరుండు ప్రసన్నుండగుటంజేసి ప్రపత్తి సమస్తాపరాధములకును ప్రాయశ్చిత్తముగాను కదా యుండును.

ఇట్టి ప్రపత్తి "త్వత్పాదారవిందయుగళం శరణం ప్రపద్యే" (శ. గ. ౧) (నీపాదద్వంద్వమును శరణముజొచ్చుచున్నాడను) అన్నట్లు ప్రపత్తిచేసిన శ్రీభాష్యకారులవారికి తన పూర్వవృత్తాంతము మనస్సునకు వచ్చినతోడనే యిదియు అపరాధకోటిలోఁ జేరినదై "త్వమేవమాతా చ" (గద్య ౧) (నీవే తల్లివి) అని యారంభించి ఈతనికిఁగల యపరాధంబులన్నింటిని సహించుటకుఁగావలసిన సంబంధవిశేషంబులను విన్నవించి "తస్మాత్ ప్రణమ్య" (కావున దండముసమర్పించి) ఇవ్విధమునఁ జెప్పుటచే "ఇట్లు నీవద్ద సాట్లాడకుండ వచ్చి నిలువబడి ప్రపత్తిచేసిన యీ యపరాధమును క్షమించి కృపచేయవలయును" అని యిట్లు క్షమాపణము చేయవలసినదిగాను ఉండియున్నది గదా! కావున నిది యివ్విధమునను అపరాధకోటిలో చేరినదై యుండును.

అనాదికాలముగ అపరాధములనొనర్చి తుదవాత ఒకనాఁడు, సర్వేశ్వరునిదగ్గర రక్షింపమనివచ్చి నిలిచినను. "రిపూణామపివత్సలః" (శత్రువుల విషయమునను దయాళువైనవాఁడు) అనియు, "యదివా రావణస్స్వయమ్" (రావణుండు స్వయముగావచ్చి శరణుజొచ్చినను) ఇత్యాది తావులఁ దెలుపఁబడిన సర్వేశ్వరుని హృదయమును తలంచినట్లయిన అతండు రక్షించువిషయమున సందియ ముండదు.

సర్వేశ్వరుండట్టివాఁడైనను చేతనుండు తనపూర్వ వృత్తాంతమును తలంచుకొనినట్లయిన, దీనిని అపరాధముగా నెతలంచి, క్షమాపణముకై ప్రార్థించవలసి యుండియుండును.

సూ॥ ౧౯౬॥ నెడునాళన్యపరైయాయ్ పోన్న భార్యై లజ్జాభయఙ్గళిన్రిక్కే భర్తృసకాశత్తిలేనిన్రు "ఎన్నై యఙ్గీకరిక్కవేణుమ్" ఎన్రపేక్షిక్కుమాపోలే యిరుప్పతొన్రిరే ఇవన్ పణ్ణుమ్ ప్రపత్తి.

ఇవన్ పణ్ణుమ్ ప్రపత్తి స్వపూర్వవృత్తత్తైయనుసన్ధిత్తాల్ అపరాధకోటియిలేయాయిరుక్కుమెన్నుమత్తై దృష్టాన్తముఖేన దర్శిప్పిక్కిఱార్ మేల్, (నెడునాళ్) ఎన్రుతుడఙ్గి. అతావతు-నెడుఙ్గాలమ్ భర్తావోడొట్టఱ్ఱు, పరపురుషకామినియాయ్ తన్నిగ్రహపాత్రమాయ్ పోన్నాళొరు భార్యై. "ఇప్పడిప్పట్ట నామ్ అవన్ సన్నిధియిలే కూశామల్ శెన్రు నిఱ్కుమ్పడి యెన్?" ఎన్గిఱ లజ్జైయుమ్, "ఇత్తనై కాలముమ్ నామ్ శెయ్తు తిరిన్దతెల్లామ్ కణ్డిరుక్కిఱవన్, 'ఇప్పోదు నమ్మై వన్దిప్పడి యపేక్షిప్పదే' ఎన్రు దణ్డిక్కిల్ శెయ్వతెన్నెన్నుమ్ భయముమిన్రిక్కే- అవన్ మున్నే శెన్రునిన్రు "ఎన్నై యఙ్గీకరిక్కవేణుమ్" ఎన్రపేక్షిక్కుమళవిల్ ఎత్తనై యపరాధయుణ్డు, అప్పడియే యిరుప్పతొన్రిరే, భగవదనన్యార్హమాయ్ వైత్తు అనాదికాలమవనుడన్ పఱ్ఱిన్రిక్కే అన్యపరనాయ్ పోన్నవన్ స్వపూర్వవృత్తాంతానుసంధానత్తాల్ వరుమ్ లజ్జైయుమ్ స్వతంత్రనాన అవన్ దణ్డిక్కిల్ శెయ్వతెన్' ఎన్నుమ్ భయముమిన్రిక్కే, తత్సన్నిధియిలే శెన్రు నిన్రు తన్నై యఙ్గీకరిక్కవేణుమెన్రు పణ్ణుకిఱ శరణవరణమెన్గై-ఆక, ఇవ్వళవుమ్ స్వగతస్వీకారానుపాయత్వముమ్ పరగతస్వీకారోపాయత్వముమ్ ప్రతిపాదిక్కప్పట్టతు.

మూ॥౧౯౭॥ భార్య భర్తనువిడిచి చాలాకాలము అన్యపురుష కామినియై పిమ్మట లజ్జాభయములనువిడిచి భర్త సమీపమునందు నిలిచి తన్నునేలుకొమ్మని ప్రార్థించినట్లు చేతనులు చేయు ప్రపత్తియునుఅపరాధరూపమైయుండును

అవతారిక:—ఈతండొనర్చిన ప్రపత్తి, యీతండు తన పూర్వపు నడతను మనస్సునకుఁ దెచ్చుకొనినట్లయిన, అది యపరాధకోటిలోఁ జేరినదిగాను తెలియవచ్చునను విషయమును దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుచున్నారు.

(చాలాకాలముగ) ఇత్యాది. చాలాకాలముగ భర్తనువదలి పరపురుషునితోఁ జేరి భర్తకయిష్టురాలైయున్నట్టి భార్య "ఇంతకాలముగ చెడ్డదారినపోయిన నేను ఇప్పుడు మాట్లాడకుండ నా భర్తవద్దకుపోయి నిలుచుటయెట్లు?" అనెడి లజ్జయును ఇంతకాలము మన నడవడికను చూచియున్నట్టి యీతండు ఇప్పుడువచ్చి నన్ను ఇట్లు అపేక్షించుచున్నదేయని దండించినచో నేమి చేయగలననెడి భయమున్ను లేక భర్తవద్దకుపోయి నన్ను అంగీకరించవలయునని నిలువబడుటయెంతఅపరాధము?

భగవంతునికిమాత్రము శేషభూతుండై వానినాశ్రయింపక అన్యపరుడైపోయినట్టి యీతండు తన పూర్వవృత్తాంతమును మనస్సునకుఁ దెచ్చుకొనుటచేఁ గలుగునట్టి లజ్జయున్ను స్వతంత్రుడగు సర్వేశ్వరుండు దండించినచో నేమిచేయగలననెడి భయమున్ను లేనివాఁడై భగవంతుని సన్నిధికి పోయి తనను అంగీకరింపవలయునని చేయునట్టి ప్రపత్తియును అట్టిదియే కదా! కావున నింతవరకును స్వగత స్వీకారము (తాను స్వయముగ నంగీకరించుట) ఉపాయము కాదనియు పరగత స్వీకారము (సర్వేశ్వరుండు స్వయముగా నంగీకరించుట)ఉపాయమనియును తెలుపఁబడినది.

**మూ ॥౧౮౮॥ కృపైయాలేవరుమ్ పారతన్త్ర్యత్తిఱ్కాట్టిల్ స్వాతన్త్ర్యత్తాలేవరుమ్ పారతన్త్ర్యమ్ ప్రబలమ్**

మూ ॥౧౮౯॥ ఇవ్వర్థత్తై వేదపురుషన పేక్షిత్తాన్

---

ఇని ఇవన్ స్వీకారమ్ కణ్డిరఙ్గి అవనివనుక్కు ప్పరతన్త్రనావతిలుమ్, తన్ స్వాతన్త్ర్యత్తాల్ వన్ద పరతన్త్రనావతే ప్రబలమెన్గిఱాన్, (కృపైయాలే) ఇత్యాది. ఆతురరాయ్, అనన్యశరణరాయ్ అన్ తిరువడికళిలేవన్దు శరణమ్ పుకున్దవర్కళ్ అళవిల్ తనక్కుణ్డాన కృపయాలే అవర్కళ్ శొన్న తేశెయ్యుమ్పడి పరతన్త్రనాకైయుమ్, పట్టాభిషేకత్తుక్కు-రియవానైయుమరశుమ్మాలే తన్నిరఙ్కుశ స్వాతన్త్ర్యత్తాలే నిర్హేతుకమాక చ్చిలరై యఙ్గీకరిత్తు తన్నై యవర్కళిటతు వైక్కాక్కి వైక్కైయుమ్, ఇరణ్డు మీశ్వరనుక్కు-శ్శతోన్ఱు; ఇతిల్ మున్బట్టతు ఓరోదనైకళిలే స్వాతన్త్ర్య నిరుద్ధమాయ్ విఫలిక్కవుమ్ కూడుమ్; పిన్బట్టతు అప్రతిహతమాకైయాలే ఒరుకాలుమ్ కణ్ణఴివిల్లై. ఆకైయాలే ఇతిలుమ్ కాట్టిలితు ప్రబలమెన్నై.

ఇవ్వర్థత్తై వేదాభిమతి మెన్గిఱార్ మేల్, (ఇవ్వర్థత్తై) ఎన్ఱు తుడఙ్గి. (ఇవ్వర్థమ్) ఎన్ఱతు - కీఴ్ ప్రబలమాక చ్చొల్లప్పట్ట పరగత స్వీకారత్తై. (వేదపురుష నపేక్షిత్తాన్) ఎన్నతు "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తే

---

**మూ ॥ ౧౮౮ ॥ కృపవలనఁ గలుగు పారతంత్ర్యముకంటెను స్వాతంత్ర్యమువలనఁ గలుగు పారతంత్ర్యము ప్రబలము.**

**మూ॥౧౮౯॥ ఈ విషయమును వేదశాస్త్రమున్ను తెలుపుచున్నది.**

---

అవతారిక:—ఇఁక ఈతని స్వీకారమునకు అనఁగా ఈచేతనుఁడు తనను స్వీకరించుటంజూచి మనన్నుకరిగి యతండు ఈతనియెడల పరతంత్రుండగుటకంటెను తనస్వాతంత్ర్యము మూలమున పరతంత్రుండగుటయే యెక్కువయని తెలుపుచున్నారు.

(కృపచే) ఇత్యాది. ఆతురులై, వేఱొక్కగతిలేనివారై, తనను శరణుజొచ్చినవారి విషయమున తనకుఁగలిగినకృపచే వారుచెప్పినట్లు చేయునట్టి పరతంత్రుండగుటయు, పట్టాభిషేకమునకుఁదగినట్టి ఏనుగుపట్టెనురాజువలెనున్న తనయొక్క నిరంకుశస్వాతంత్ర్యమువలన నిర్హేతుకముగ కొందఱి నంగీకరించి వారుంచినరీతిని తానుండుటయు. ఈరెండును సర్వేశ్వరునికిఁగలవు. ఈరెంటిలో మొదటిదియొకప్పుడు స్వాతంత్ర్యముచే నిర్బంధింపఁబడి విఫలమైపోయినను పోవచ్చును. రెండవదానికో, యెట్టి నిర్బంధమున్ను లేకపోవుటంజేసి దానికెన్నటికిని కొఱవలేదు. కావున దానికంటెనిది యెక్కువప్రబలమైనది.

అవతారిక:—ఈయర్థము వేదసమ్మతమైనదను విషయమును ఇఁకమీఁద తెలుపుచున్నారు.

(ఈయర్థమును) ఈయర్థమనఁగా నింతకుముందు ప్రబలమైనదిగాఁ జెప్పఁబడినట్టి పరగత స్వీకారమనుట. వేదపురుషుఁ డపేక్షించినవాఁడనఁగా "నాయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయా న బహునా శ్రుతేన । యమేవైషవృణుతేతేనలభ్యః తస్యైష ఆత్మావివృణుతేతనూంస్వామ్" "ఈపరమాత్మ వేదాధ్యయనముచేతనుగాని, బుద్ధిబలముచేతనుగాని, ఎక్కువ వినికిడిచేతఁగాని పొందబడఁడు. అయితే పరమాత్మ యెవనిని ప్రేమించుచున్నాఁడో వానికే యీతండు తనస్వరూపమును తెలియపఱచుచున్నాఁడు" అని కఠోపనిషత్తునందును ముండకోపనిషత్తునందును చెప్పియుండుటంజేసి

**మూ॥ ఆచార్యనైక్కణ్డాల్ పశియర్ శోఱ్ఱైక్కణ్డాప్పోలేయుమ్, శిష్యనైక్కణ్డాల్ అభిమతవిషయత్తైక్కణ్డాప్పోలేయుమ్ నినైత్తు,**

---

నాయ్ ఆపత్ప్రవృత్తినా కౌతపడి నియమిత్తు నడత్తిక్కొణ్డుపోరుమ్ హితైషియాన పితావైక్కణ్డాప్పోలే స్నేహ సాధ్వస వినయఙ్గళై యుడైయనాయ్క్కొణ్డు ‘‘నమక్కు హితపరన్’’ ఎన్ఱు నినైత్తుమ్,

అనాదికాలమ్ ‘‘అసన్నేవ’’ ఎన్నుమ్పడి కిడన్ద తన్నై భగవత్సమ్బన్ధత్తైయఱివిత్తు సత్తావానాక్కి మేన్మేలుమ్ తన్నుపదేశత్తాలే జ్ఞానవైరాగ్యభక్తికళైప్పిఱప్పిత్తు కైయిలఙ్గనియెన్న భగవద్విషయత్తైక్కాట్టిత్తరుమ్ మహోపకారకనాయ్ ‘‘ఉన్ శీరేయుయిర్క్కుయిరాయ్’’ ఎన్ఱుమ్ ‘‘ఉన్ఱన్ మెయ్యిల్ పిఱఙ్గియశీరన్ఱి వేణ్డిలేన్’’ ఎన్ఱుమ్ శొల్లుమ్పడి గుణవిగ్రహఙ్గళాలే తనక్కు ధారకభోగ్యనాయిరుక్కుమాచార్యనై క్కణ్ణుక్కిలక్కామ్పడికణ్డాల్, కణ్డవిడత్తిలే యిడుమ్ పెరుమ్పశియన్ ధారకముమాయ్ భోగ్యముమాన శోఱ్ఱైక్కణ్డాప్పోలే అత్యభినివేశత్తోడే అనుభవిత్తు ‘‘నమక్కు ధారకభోగ్యవిషయమ్’’ ఎన్ఱు నినైత్తుమ్.

సాధ్యాన్తరనివృత్త్యాది సమస్తస్వభావ సమ్పన్నతయా సమ్యక్ జ్ఞాన ప్రేమవానాయిరుక్కుమ్ సచ్ఛిష్యనైక్కణ్డాల్, తనక్కానన్దావహమాన అభిమతవిషయత్తైక్కణ్డాప్పోలే ‘‘భగవద్గుణానుసన్ధానదశైయిల్ నామ్ శొల్లుకిఱ భగవద్గుణఙ్గళై యాదరిత్తు క్కేట్పతు అనుభావిప్పతు విధ్యనాపతామాకారఙ్గళినాలే నమక్కానన్దావహన్’’ ఎన్ఱు నినైత్తుమ్.

---

**మూ॥ ఆచార్యుని జూచినట్లయిన ఆకలిగొన్నవాఁడన్నమును, జూచినట్లును శిష్యునిజూచినట్లయిన, ప్రియమైనవస్తువును జూచినట్లును తలంచి,**

---

మించుకొని వచ్చినవాఁడును, హితమునుగోరువాడునునగు తండ్రినిజూచినట్లు స్నేహము, భయము. వినయము వీటితో ‘‘మనకు హితమునుగోరువాఁడు’’ అని తలంచుటయు,

అనాదికాలముగ ‘‘అసన్నేవ’’ (లేనివాఁడుగాను) అన్నట్లు పడియుండు తనకు భగవత్సంబంధమును తెలియచేయుటచే ఉన్నట్టివానినిగాఁజేసి, పైపైగా తన యుపదేశముచే జ్ఞాన వైరాగ్యభక్తులను గలుగఁజేసి కరతలామలకముగ భగవద్విషయమును తెలియఁజేసిన మహోపకారకుండై ‘‘ఉన్ శీరేయుయిర్క్కుయిరాయి’’ (నీయొక్క కల్యాణగుణము లాత్మకుధారకములై) అనియు, ‘‘ఉన్దన్ మెయియిల్ పిఱఙ్గియ శీరన్ఱి వేణ్డిలేన్’’ (నీయొక్క శరీరమున వ్యాపించియుండు సౌందర్యాదులను కోరను) అనియును చెప్పియున్నట్లు గుణవిగ్రహములచే తనకు ధారకుండుగాను భోగ్యముగానునుండు ఆచార్యుని సేవించినట్లయిన, కన్నిరుకార్చుచు మిక్కుట యాకలిగొన్నవాఁడు ధారకమును భోగ్యమునునగు అన్నమును గనినట్లు ఎక్కువప్రీతితోననుభవించి ‘‘మనకు ధారకమును భోగ్యమునునైన విషయము’’ అనియే తలంచుటయు,

సాధ్యాంతరనివృత్తి మొదలుగాగల సమస్త స్వభావములతోఁగూడియుండుటచే ఎక్కువ జ్ఞానమునున్ను ప్రీతినిన్ని గలిగియుండు మంచిశిష్యునిజూచినట్లయిన, తనకు ఆనందమును గలుగఁజేయునట్టి యిష్టమైన వస్తువునుజూచినట్లు, భగవద్గుణానుసంధానదశయందు భగవద్గుణములను ఆదరముతో వినుచు వాటినిగుణించి తానును మాట్లాడుచు ఆనందపరవశుఁడగు నాకారములతో ఆనందమును గలుగఁజేయువాఁడు అని తలంచుటయు,

**మూ॥ అహఙ్కారార్థకామఙ్గళ్ మూన్ఱుమ్, అనుకూలర్ పక్కలనాదరత్తైయుమ్, ప్రతికూలర్పక్కల్ ప్రావణ్యత్తైయుమ్,**

---

(అహఙ్కారార్థకామఙ్గళ్ మూన్ఱుమ్) ఇత్యాది. ఇవై మూన్ఱిలుమ్ వైత్తుక్కొణ్డు (అహఙ్కారమనుకూలర్ పక్కల్ అనాదరత్తైప్పిఱప్పిక్కుమ్) ఎన్ఱావదు-శేషత్వత్తైక్కాసన్నిధియిల్ జీవిక్కవొట్టాతపడియిఱే అహఙ్కారత్తుక్కు బలమిరుప్పదు. అహఙ్కారియానవన్ ‘‘నన మేయమ్’’ ఎన్ఱిరుక్కుమత్తొழియ ఒరువిషయత్తిలుమ్ తలైతాழ్క్కవిడైయానే; ఆకైయాలే అహఙ్కారమ్ మేలిడుమాకిల్, స్వరూపవర్ధకరాయ్క్కొణ్డు అనుకూలరాయిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళైక్కణ్డాల్ నమ్ముడైయ శేషికళెన్ఱు తుడైనడుఙ్గి యెழున్దిరున్దు ప్రణామాది పూర్వకమాన అనువర్తనఙ్గళై ప్పణ్ణవొట్టాతే, తన్నై అవర్కళిలధికనాకవాతల్ అవర్కళైత్తన్నోడు సమరాకవాతల్ బుద్ధిపణ్ణి అనాదరిత్తిరుక్కుమ్పడి పణ్ణుమెన్గై,

(అర్థమ్ ప్రతికూలర్ పక్కల్ ప్రావణ్యత్తైప్పిఱప్పిక్కుమ్) ఎన్ఱావదు—‘‘అర్థయాశైయుమ్ శెత్తను వర్తిత్తు ఒరుకాశుపెఱ్ఱతాయ్ విడవేణుమ్’’ ఎన్నుమ్పడియిఱే అర్థరాగమిరుక్కుమ్పడి. ఆకైయాలే, అతు స్వరూపనాశకత్వేన ప్రతికూలరాన సంసారికళైక్కణ్డాల్ వెరుణ్డోడిప్పోకవేణ్డియిరుక్క, ఉరుకాశైనచ్చి అవర్కళోడే ఉఱవుపణ్ణి అవర్కళిరున్దవిడఙ్గళిలే పలకాలుమ్ శెల్లువదు, అవర్కళై యழైత్తు విరున్దిడువదు, అవర్కళ్ గుణకీర్తనమ్ పణ్ణువదామ్పడి అవర్కళ్ విషయత్తిలే ప్రావణ్యత్తై యుణ్డాక్కుమెన్గై.

---

**మూ॥ అహంకారార్థకామములు మూఁడును అనుకూలురయిన వారి విషయమున అనాదరమును, ప్రతికూలురగు వారి విషయమునఁ బ్రీతిని**

---

అహంకారార్థకామంబుల మూడింటిలో నహంకారమనునది యనుకూలురవిషయమున ననాదరమును గలుగఁజేయును. అది యెట్లనఁగా, తానున్నప్పుడు శేషత్వము నెంతమాత్ర ముండనీయకుండ చేయునట్టి బలముకలది గదా అహంకారము! అహంకారముగలవాడు ‘నేను నమ్రుడను కాను’ అని యుండునే తప్ప యొకవిషయముననూ లొంగి ప్రవర్తింపడు గదా!

కావుననే అహంకారము పైబడినట్లయిన, స్వరూపజ్ఞానమును వృద్ధిపొందించువారై యనుకూలులుగానుండు శ్రీవైష్ణవులను జూచినట్లయిన, మనకు శేషియయినవారనుకొని వినయముతో నిలువంబడి దండప్రణామంబు లాచరించుచు వారి ననువర్తించునట్లు చేయక, తనను వారికంటెను గొప్పవానినిగాఁదలంచి గాని, లేక వారు తనతో సమానులని తలంచికొని అనాదరణచేయునట్లొనర్చును.

ద్రవ్యము ప్రతికూలురవిషయమున బ్రీతిఁగలుగఁజేయును. అనఁగా ‘‘ఎవరినైన నాశ్రయించి ఒకకానిడబ్బయినను సంపాదింపవలయును’’ అని కదా ద్రవ్యాశయుండును. కావున నది స్వరూపమును నశింపఁజేయువారగుటచే ప్రతికూలురగు సంసారులను చూచినట్లయిన, అచటినుండి భయపడి పరుగెత్తిపోవలసియుండ, ఒకడబ్బుకాశపడి వారితో పరిచయముచేసికొని వారి యిండ్లకు పలుమారుపోయి వారిని పిలిచి విందుచేసి, వారిని స్తోత్రముచేయుటచే వారియెడల బ్రీతిఁ గలుగఁజేయుననుట.

**మూ॥ ఉపేక్షిక్కు మవర్కళ్ పక్కలపేక్షైయైయుమ్ పిఱప్పిక్కు మెన్ఱుమ్, ఆత్మగుణఙ్గళ్ నమ్మాలుమ్ పిఱరాలుమ్ పిఱప్పిత్తుక్కొళ్ళవొణ్ణాతు,**

---

(కామమ్ ఉపేక్షిక్కుమవర్కళ్ పక్కలపేక్షైయైప్పిఱప్పిక్కుమ్) ‹‹కామ్యత ఇతి కామః›› ఎన్గిఱపడియే కామశబ్దత్తాలే విషయసమ్భోగసుఖత్తైచ్చొల్లుకిఱతు. అతు— ‹‹ఈశిపోమిన్›› ఇత్యాదిప్పడియే దారిద్ర్యవార్ధకాదికళడియాక తన్నై ముఖమ్పారామల్ తళ్ళిక్కతవడైత్తు ఉపేక్షావాదమ్పణ్ణుమ్ స్త్రీకళ్ పక్కలిలే ‹‹ఎప్పైయర్ తామిఴిప్పచ్చెల్వర్›› ఎన్గిఱపడియే అవర్కళుపేక్షావాదమ్ ముతలానవైతన్నైయే ఉద్దేశ్యమాకక్కొణ్డు శొల్లుమ్పడి విలక్షణర్ కేట్టాల్ శిరిక్కుమ్పడియాన హేయాపేక్షైయై విళైక్కుమెన్నై.

ఆక, ఇప్పడి అహఙ్కారాదికళ్ మూన్ఱుమ్ స్వరూపవర్ధకరై అనాదరిక్కుమ్పడియుమ్ స్వరూపనాశకరై ఆదరిక్కుమ్పడియుమ్ స్వరూపనాశకతైయన్ఱే ఉపేక్షకరుమాయిరుక్కుమివర్కళై అపేక్షిక్కుమ్పడియుమ్ పణ్ణుమెన్ఱు అవర్ గళై కొడుమైకళై యనుసన్ధిత్తు ‹‹ఎన్ శెయ్యత్తేడుకిఱతో?›› ఎన్ఱబడి.—(అర్థకామాభిమానఙ్గళ్ మూన్ఱుమ్) ఎన్ఱ పాఠమానాలుమ్ ‹‹గర్వోఽభిమానోఽహఙ్కారః›› ఎన్గిఱపడియే అభిమానశబ్దత్తాలే అహఙ్కారత్తైచ్చొల్లుకిఱతాకైయాలే (అనుకూలర్ పక్కల్) ఇత్యాదిగ్రన్థం నిరనిత్తాలాకిఱతే యథాయోగమ్ కొణ్డు కీఴ్చొన్న ప్రకారత్తిలే యోజిక్కక్కడవతు.

(ఆత్మగుణఙ్గళ్) ఇత్యాది. శమదమాద్యాత్మగుణఙ్గళ్ అనాదికాలమహఙ్కారాదికళుక్కు విళైనిలమాయ్ అనాత్మగుణఙ్గళై క్కూడుపూరిత్తుక్కొణ్డు కర్మపరతన్త్రరాయిరుక్కిఱ నమ్మ

---

**మూ॥ ఉపేక్షించువారివిషయమున అపేక్షను గలుగంజేయునని యు భయపడి. అత్మగుణములు మనచేగాని, యితరులచేగాని కలుగఁజేయబడునవి కావనియు,**

---

‹‹కామ్యత=ఇతి కామః›› అనువ్యుత్పత్తినిబట్టి కామశబ్దము ఈతావున విషయసంభోగసుఖమును తెలుపునది.

‹‹ఈశిపోమిన్›› అనుపాశురమునఁ జెప్పియున్నట్లు దారిద్ర్యము, వార్ధక్యము ఈ మొదలగు వాటిమూలమున తనముఖము చూడకుండ నెట్టి తలుపువేసి ఉపేక్షించునట్టి స్త్రీలవిషయమున ‹‹ఎప్పైయర్ తామిఴిప్పచ్చెల్వర్›› (స్త్రీలు ఉపేక్షించిమాట్లాడినను అచటికే పోవుదురు) అన్నట్లు వారు చేయునట్టి యుపేక్షావాదము మొదలగు వాటినే యుద్దేశ్యముగాఁదలంచి విలక్షణులు విన్నట్లయిన, పరిహసింపఁదగినదియు హేయమునగు ఉపేక్షను వృద్ధిపరచును

కావున నిట్లు అహంకారాదులు మూడును స్వరూపమునువృద్ధిపొందించువారిని అనాదరణచేయుటను స్వరూపమును నశింపఁజేయువారిని ఆదరించుటను స్వరూపమును నశింపఁజేయుటయే కాకుండ, యుపేక్షించువారిని యపేక్షించునట్లుచేయుటయున్ను తలంచి ‹‹ఏమిచేయుదునా›› అని భయపడి యనుట.

(అర్థకామాభిమానములు మూడును) అని పాఠముండునపుడు ‹‹గర్వోఽభిమానోఽహంకారః›› అను నిఘంటువుప్రకారము అభిమానశబ్దము అహంకారమును తెలుపునది కాన, (అనుకూలులవిషయమున) ఇత్యాదివాక్యమును యథాక్రమముగ యోజించుకొనక అర్థసంబంధానుగుణముగ యోజించునది.

(ఆత్మగుణములు) ఇత్యాది. శమదమాద్యాత్మగుణములు అనాదికాలముగ అహంకారాదులకు పుట్టిల్లై ఆత్మగుణములను కానివాటితో నిండియుండి కర్మపరతంత్రులగు మనయొక్క ప్రయత్నముచే

**మూ॥** సదాచార్య ప్రసాదమడియాకవరుకిఱ భగవత్ప్రసాదత్తాలే పిఱక్కుమత్తెన్ఱెన్ఱు తుణిన్దు, దేహ యాత్రైయిలుపేక్షైయుమ్, ఆత్మ యాత్రైయిలపేక్షైయుమ్, ప్రాకృతవస్తుక్కళిల్ భోగ్యతాబుద్ధి నివృత్తియుమ్.

---

డైయ యత్నత్తాలుమ్ ఆత్మగుణోదయవిరోధికళాన అహఙ్కారాదికళుక్కు వర్ధకరాయ్ అనాత్మగుణపరిపూర్ణరాయ్ కర్మవశ్యరాయిరుక్కుమ్ పిఱరుడైయ యత్నత్తాలుమ్ పిఱప్పిక్కక్కూడాదు, ఆత్మగుణఙ్గళుక్కెల్లామ్ కొళ్కలమాయ్ అడియిలే తన్నుడైయ నిర్హేతుకకృపైయాలే నమ్మై యఙ్గీకరిత్తరుళి 'నమక్కాత్మగుణముణ్డావదెప్పోదో?' ఎన్ఱు పలకాలుమ్ కన్ఱివరు భగవానై యప్పేక్షిత్తుక్కొణ్డుపోరుమ్ సదాచార్యనుడైయ ప్రసాదమడియాక వరుకిఱ నమ్ముడైయ ఆత్మగుణోదయత్తుక్కు సాపేక్షయమ్ పిఱక్కుమ్బడి అమలఙ్గళాకవిళుక్కుమ్ భగవానుడైయ పరిపూర్ణప్రసాదత్తాలే పిఱక్కుమత్తెన్ఱు అధ్యవసిత్తు.

(దేహయాత్రైయిలుపేక్షైయావతు)- దేహరక్షార్థమాన వ్యాపారఙ్గళిల్ విరుప్పఱ్ఱిరుక్కై.

(ఆత్మయాత్రైయిలపేక్షైయావతు)- శేషత్వమే వడివాన వాత్మావుక్కు ధారకాదికళాన గుణానుభవకైఙ్కర్యప్రవృత్తియిల్ పెరునావలాల్ తృప్తనాయిరాదే మేన్మేలుమాసైప్పడుకై.

(ప్రాకృతవస్తుక్కళిల్ భోగ్యతాబుద్ధి నివృత్తియావతు)- అశనాచ్ఛాదనఙ్గళుక్కుఉప్పాన ప్రాకృతపదార్థఙ్గళిలాదరత్తుక్కడియాన భోగ్యత్వబుద్ధి తవిరుకై.

---

**మూ॥** సదాచార్యుని యనుగ్రహమూలమునఁ గలుగునట్టి సర్వేశ్వరానుగ్రహము వలఁగలుగునవిమాత్రమే యని నిశ్చయించుకొని, దేహయాత్రయం దుపేక్షయును, ఆత్మయాత్రయం దపేక్షయును, ప్రకృతితోఁ జేరిన వస్తువులు భోగ్యము లనెడి తలంపు లేకపోవుటయును,

---

తనుగాని ఆత్మగుణములుగలుగుటకు విరోధులగు నహంకారాదులను వృద్ధిపొందించుకొనిపోవుచు ఆత్మగుణములుకానివాటితో నిండియుండునట్టివారును, కర్మవశ్యులనగు ఇతరులయొక్క ప్రయత్నముచేతనుకాని కలుగఁజేయఁ బడవు.

ఆత్మగుణములన్నిఁటికిని పుట్టిల్లై తనయొక్క నిర్హేతుక కృపచే మనలనంగీకరించి అనఁగా, శిష్యునిగాఁజేసికొని మనకు ఆత్మగుణమెప్పుడు కలుగునాయని పలుమాఱు దుఃఖించి సర్వేశ్వరునిప్రార్థించునట్టి సదాచార్యునియొక్క యనుగ్రహమూలముగ సంప్రాప్తించునట్టిదియు, మనకు ఆత్మగుణములు గలుగుటకు విరుద్ధమగు పాపము నశించువిట్లు పాపరహితమైనదియగు భగవంతుని యనుగ్రహముచే గలుగునవి యింతియేయని నిశ్చయించుకొని,

(దేహయాత్ర) ఇత్యాది. దేహరక్షార్థమగు వ్యాపారమువిషయమున నపేక్షలేకుండుటయు,

(ఆత్మయాత్ర) ఇత్యాది. ఆత్మయాత్రవిషయమున నపేక్షయుండుట! యనఁగా, శేషత్వమే స్వరూపముగాఁగలయాత్మకు ధారకాదులగు గుణానుభవ కైంకర్య వృత్తులవిషయమున లభించినంతవరకు తృప్తినొందియుండక పైపైగా నాశపడుట.

(ప్రాకృత) ఇత్యాది. ప్రాకృతవస్తువులవిషయమున భోగ్యతాబుద్ధినివర్తించుట యనఁగా—

మూ॥ "దేహధారణమ్, పరమాత్మసమారాధన సమాప్తి ప్రసాద ప్రతిపత్తి" ఎన్గిఱ బుద్ధివిశేషముమ్, తనక్కొరు క్లేశముణ్డానాల్ "కర్మఫలమ్" ఎన్ఱాతల్, "కృపాఫలమ్" ఎన్ఱాతల్ పిఱక్కుమ్ ప్రీతియుమ్,

---

(దేహధారణమ్) ఇత్యాది. అతావతు, అన్దప్రాకృతవస్తుక్కళిల్ దేహమ్ ధరిక్కైక్కు త్తక్కవళవు భుజిక్కై, పరమాత్మావాన సర్వేశ్వరనుడైయ సమారాధనత్తిఱ్ఱ సమాప్తిరూపైయాన ప్రసాద ప్రతిపత్తియెన్గిఱ బుద్ధివిశేషముమెన్గై.—అన్ఱిక్కే, (పరమాత్మసమారాధన సమాప్తి) ఎన్గిఱ బుద్ధివిశేషముమ్ (తత్ప్రసాద ప్రతిపత్తియెన్గిఱ బుద్ధివిశేషముమ్) ఎన్నవుమామ్.

(తనక్కు) ఇత్యాది. అతావతు - ముముక్షువాయ్ ప్రపన్ననానాలుమ్ ప్రారబ్ధశరీరమిరుక్కుమళవుమ్ తాపత్రయమ్ వరుకై తప్పాతిఱే; అకైయాలే, ఇశ్శరీరత్తోడే యిరుక్కిఱ తనక్కు త్తాపత్రయఙ్గళిలేతేను మొరుక్లేశముణ్డానాల్, "ఇతు అనుభవవినాశ్యమాన ప్రారబ్ధకర్మఫలమన్ఱో ఏవమ్భూతకర్మఙ్గళుళ్ళవై కళియుమళవన్ఱో ఇశ్శరీరత్తోడు నమ్మై యెమ్పెరుమాన్ వైక్కిఱతు, ప్రాప్తిప్రతిబన్ధకఙ్గళిలే యొన్ఱాకిలుమ్ కళియప్పెఱ్ఱోమే" ఎన్గిఱ వనుసన్ధానత్తాలేయాతల్, "దుర్వాసనైయాలే ఇవ్వుడమ్పై విడక్కైయామల్ ప్రాకృతపదార్థఙ్గళై యుజ్జీవిత్తుక్కొణ్డు సంసారత్తుక్కుళ్ళే పొరున్దియిరుక్కిఱ నమ్మై దుఃఖదర్శనత్తైప్పణ్ణువిత్తు ఇతిల్ పఱ్ఱఱుత్తుక్కొణ్డు

---

మూ॥ ఈ దేహమును పోషించుట పరమాత్మనారాధించుటకును, వాని యనుగ్రహము పొందుటకుగాననెడి నిశ్చయమును, తనకొకకష్టము గలిగినట్లయిన, కర్మఫలమని గాని, కృపాఫలమని గాని తలంచుటచే గలుగునట్టి ప్రీతియు,

---

భుజించుట, కప్పుకొనుట ఈ మొదలగువాటికి అనుకూలములగు ప్రాకృతపదార్థముల విషయమున నాదరణమునకు కారణమగు భోగ్యతాబుద్ధి లేకపోవుట.

(దేహధారణమ్) ఇత్యాది. ఆ ప్రాకృతపదార్థములను దేహముధరించియుండుటకు కావలసినంతమాత్రమే యనుభవించుటయు, అది పరమాత్మయగు సర్వేశ్వరుని సమారాధనముయొక్క సమాప్తిరూపము గు ప్రసాదప్రతిపత్తియనెడి బుద్ధివిశేషమనుట.

అథవా పరమాత్మసమారాధ సమాప్తియనెడి బుద్ధివిశేషమును, తత్ప్రసాద ప్రతిపత్తియనెడి బుద్ధివిశేష మనియును ఈ పైవాక్యమున కర్థము చేసికొనవచ్చును.

ముముక్షువై ప్రపన్నుండయినను, ప్రారబ్ధకర్మఫలితమగునట్టి యీశరీరమున్నంతవరకును తాపత్రయము రాకతప్పదు గదా!

కావున నీశరీరముతో నుండునట్టి తనకు తాపత్రయములలో నెద్దియయిన నొకకష్టము సంభవించినట్లయిన, ఇది యనుభవముచే నశించునదియగు ప్రారబ్ధకర్మముయొక్క ఫలము కాదా? ఇట్టి కర్మములు పొయ్యేవరకుగదా భగవంతుడు మనలను ఈశరీరముతో నుంచును. భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములగు వాటిలో నొక్క దానినైనను పోగొట్టుకొనగలిగితిమి కదా! అని తలంచుటవలనగాని, దుర్వాసనచే ఈశరీరమును విడుచుటకు మనస్సు రాకుండచేసి, ప్రాకృత పదార్థములనున్న కాపాడుకొనుచు సంసారములోపల సహించుచున్నట్టి మనకు దుఃఖములను గాన్పించి వీటితో గల

మూ॥ స్వానుష్ఠానత్తిల్ సాధనత్వబుద్ధినివృత్తియుమ్,

పోక నిషైక్కిఅ సర్వేశ్వరనుడైయ కృపైయిన్ ఫలమన్రో ఇతు" ఎన్గిఱ వనుసన్ధానత్తాలేయాతి లుండాకక్కడవ ప్రీతియు మెన్గై. పూర్వాఘమ్, ఉత్తరాఘమ్, ప్రారబ్ధమ్ ఎల్లామ్ కళి క్కిఱవనుక్కు వర్తమానశరీరత్తి లనుభావ్యకర్మనిత్తనై యుమ్ కళిక్కై అరితన్రే, కర్మఫల మాన దుఃఖపరమ్పరైగళై యనుభవియా నిన్గాలుమ్ ఇద్దేహత్తై విడవేణ్డా లిరుక్కైయాత వివనై, నిర్దుఃఖవాక్కివైప్పోమాకిల్, ఇశ్శరీరత్తోడే నెడుఙ్గాలమిరుక్కవిచ్ఛిత్తిల్, ఇన్నుమొరు శరీరమ్ తన్నై యిచ్ఛిక్కిల్ శెయ్యుమాకైయాలే ఇశ్శరీరత్తుక్కళ్ కర్మమనుభవిత్తేయిరుక్కక్కడ వనెన్ఱిరే వైక్కిఱతు, ఆనపిన్బు, మఱ్ఱుళ్ళాన కర్మఙ్గళెల్లామ్ కళిత్తతు సంసారత్తిల్ నిన్ఱుమి వనైక్కడుక త్తిరువడిగళిలే శేర్త్తుక్కొళ్ళక్కైయిలుణ్డాన కృపైయాలే యాహాప్పోలే, ఇత్తనై యుమ్ కళియామల్ వైత్తతుమ్ కృపైయాలేయిరే, అనాదికాలమ్ పరిగ్రహిత్త శరీరఙ్గళి లనుభవిత్త దుఃఖమ్ భగవన్నిగ్రహఫలమ్, ఇతు అవననుగ్రహఫలమ్, "యస్యానుగ్రహమిచ్ఛామి తస్య విత్తం హరామ్యహమ్" ఎన్ఱానిరే' ఆకైయాలే ఇత్తై (కృపాఫలమ్) ఎన్గిఱతు.

(స్వానుష్ఠానత్తిల్ సాధనత్వబుద్ధి నివృత్తియావతు)- ప్రపన్ననాన తన్నుడైయ వధికారా నుగుణమాక వనుష్ఠిత్తుక్కొణ్డు పోరుకిఱ నల్లొళుక్కఙ్గళైప్ పేఱ్ఱుక్కుసాధనమాక నినైయాతొళికై.

మూ॥ తన యనుష్ఠాన మొకసాధనమనెడి తలంపు లేకపోవుటయు,

సంబంధమును పోగొట్ట తలంచిన సర్వేశ్వరుని కృపాఫలము కాదా! యిది యని తలంచుట వలన గాని యుండనట్టి ప్రీతియుననుట. ఈ పాయమును వరించుటకు పూర్వమొనర్చినకర్మమును తదనంతర మొనర్పఁబోవునట్టి కర్మమును వేఱొక్క శరీరముతో ననుభవింపరలసినకర్మమునున్న పోగొట్టఁగల సర్వేశ్వరునికి ప్రస్తుతము జరుగుచున్నశరీరముతో ననుభవించునట్టి కర్మమునుమాత్రము పోగొట్టుట దుర్లభము కాదు గదా!

కర్మఫలమగు దుఃఖపరంపరల ననుభవించుచున్నను "ఈశరీరమును విడిచిపెట్టుము" అంటె ప్రాణమొప్పని యాతనిని దుఃఖరహితునిగాఁజేసితిమేని ఈశరీరముతో నె చాలాకాల ముండవలయు నని యిచ్ఛయించినను, యిచ్ఛయింపవచ్చును. వేఱొక్కశరీరమును కోరినను కోరవచ్చును. కావున నీశరీరముతోనుండు కర్మము ననుభవింపు మండవలయునని కదా శరీరము నుంచియుండుడు.

అయితే తక్కినకర్మములనన్నింటిని పోగొట్టుట యనునది సంసారమునుండి యాతనిని శీఘ్రముగ తన శ్రీపాదములయందుఁజేర్చుకొను విషయమునఁగల కృపచేతనయినట్లు, ఇంతమాత్రమును బోగొట్టకుండ యుంచినదియును కృపచేతనె కదా! అనాదికాలముగానుండునట్టి యాశరీరముతో ననుభవించునట్టి దుఃఖము భగవన్నిగ్రహముయొక్క ఫలము. ఇది వానియనుగ్రహముయొక్క ఫలము. "యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తం హరామ్యహం" (ఎవని ననుగ్రహింపతలంచు చున్నానో, వానిద్రవ్యము నపహరించుచున్నాను) అని కదా భగవంతుఁడు చెప్పియున్నాడు. కావున నిది కృపాఫలమని చెప్పఁబడినది.

తన యనుష్ఠానమున సాధనమనెడి బుద్ధిని నివర్తించుటయనఁగా ప్రపన్నుండగు తన యొక్క యధికారానుగుణముగ ననుష్ఠించుకొనునట్టి సదాచారమును మోక్షసాధనముగాను తలంపకుండుట.

మూ॥ విలక్షణరుడైయజ్ఞానానుష్ఠానజ్ఞళిలే వాఞ్ఛైయుమ్, ఉకన్దరుళిననిలజ్ఞళిల్ ఆదరాతిశయముమ్, మఙ్గళాశాసనముమ్, ఇతరవిషయజ్ఞళిల్ అరుచియుమ్,

---

(విలక్షణరుడైయ జ్ఞానానుష్ఠానజ్ఞళిల్ వాంఛైయావతు)- నాటాగోడియల్వొళిన్దు నారణన్నై నణ్ణియిరుక్కైయాలే, నిర్మలజ్ఞానభక్తికరాయిరుక్కుమ్ విలక్షణరాన పూర్వర్కళుడైయ విలక్షణమాన అవజ్ఞానముమ్ అనుష్ఠానముమ్ నమక్కుణ్డాకవేణుమెన్నుమాశై.

(ఉకన్దరుళిన నిలజ్ఞళిలాదరాతిశయమావతు) ‹‹తానుకన్దఊర్''ఎన్గిఱపడియే సర్వేశ్వరను కన్దువర్త్తిక్కిఱ దివ్యదేశజ్ఞళిల్ తాల్ ‹‹కణ్ణియూరరఙ్గమ్ మెయ్యమ్ కచ్చిపేర్మల్లైయెన్ఱు మణ్ణినార్'' ఎన్గిఱపడియే మనస్సు అజ్ఞే మణ్ణిప్పొరున్దుమ్పడి మేన్మేలుమ్ పెరుకుకిఱ వాదరమ్.

(మఙ్గళాశాసనమావతు)-అవ్వో దివ్యదేశజ్ఞళిలే నిత్యసన్నిధి పణ్ణివర్త్తిక్కిఱ అవనుడైయ సౌన్దర్యత్తైయుమ్, సౌకుమార్యత్తైయుమ్ వాశియఱిన్దు నోక్కుమ్ పరివరిల్లామైయైయుమ్, ప్రతికూలవర్గజ్ఞళిన్ అతిశయత్తైయుమ్ నినైత్తు, ‹‹ఎన్ ఆగుమో'' ఎన్ఱు వయిఱెరిన్దు ఇరవుమ్ పకలుమ్ తిరుప్పల్లాణ్డు పాడుకై.

(ఇతరవిషయజ్ఞళిలరుచియావతు), భగవద్వ్యతిరిక్తజ్ఞళాన హేయవిషయజ్ఞళిల్ దోషదర్శనాదికళాలే విరుప్పమఱ్ఱిరుక్కై.

(ఆర్త్తియావతు)-ఇతరవిషయప్రావణ్యహేతువాన ఇవ్వుడమ్బోడే ఇరుక్కై తరమన్ఱియాలల్లి

---

మూ॥ విలక్షణుల జ్ఞానానుష్ఠానముల విషయమున నపేక్షయు, సర్వేశ్వరుండు ప్రీతితో వేంచేసియున్నట్టి దివ్యస్థలములవిషయమునఁ బ్రీతియు, మంగళాశాసనమును, ఇతర విషయములయెడలఁ బ్రీతి లేకుండుటయు,

---

విలక్షణులయొక్క జ్ఞానానుష్ఠానములయెడలఁ గోరికయనఁగా ‹‹నాట్టారోడు ఇయలొవ్వొళిన్దు నారణనై నణ్ణి''(తి.వా.౧౦-౬-౨) అన్నట్లు లౌకికులతో సంబంధమునువిడిచిపెట్టి శ్రియఃపతి యెడలజ్ఞానభక్తులుగలవారును, విలక్షణులునగు పూర్వులయొక్క విలక్షణమగు జ్ఞానమును అనుష్ఠానమునుమన కుండవలయునని యాశపడుట.

సర్వేశ్వరుండు ప్రీతితో వేంచేసియుండుస్థలముల యెడల యాదరణయనఁగా ‹‹తాను కన్దవూర్'' (తిరుప ౬) (తాను ప్రేమించినట్టివూరు) అన్నట్లు సర్వేశ్వరుండు ప్రేమించి వేంచేసియున్న దివ్యదేశములందు ‹‹కణ్ణియూర్, ఇరంగమ్. మెయ్యమ్, కచ్చి, పేర్, మల్లైయెన్ఱు మణ్ణినార్'' (తిరుక్కుఱు ౧౯) అని సాయించినట్లు మనస్సు ఆయా దివ్యదేశములలో లగ్నమగునట్లు పైపైని వృద్ధిపొందునట్టి యాదరణయును.

మంగళాశాసనమనఁగా-ఆయా దివ్యదేశములను ప్రేమించి యచట వేంచేసియుండు సర్వేశ్వరునియొక్క సౌందర్యమును సౌకుమార్యమును తారతమ్యము నెఱింగి రక్షించునట్టి వారు లేకపోవుటను, ప్రతికూలులయొక్క యాధిక్యమునున్ను తలంచి ‹‹అయ్యో! ఏమిదేయగుదునః!) అని కడుపులో మండి రేయుంబగళ్లు తిరుపల్లాండును పాడుట.

ఇతరవిషయములయెడల వైరాగ్యమనఁగా—భగవద్విషయమునకంటెను వేఱయిన విషయములు హేయములని తలంచి దోషదర్శనాదులవలన వాటియెడల కోరికలేకుండుట.

**మూ॥ ఆర్తియుమ్, అనువర్తననియతియుమ్, ఆహారనియతియుమ్, అనుకూల సహవాసముమ్, ప్రతికూలసహవాసనివృత్తియుమ్,**

---

వుక్కుఅ వితిలడిక్కొట్టప్పాలుమ్ ప్రాప్యవైలక్షణ్యదర్శనత్తాల్ వన్ద ప్రాప్తిఫలమ్ప్పసహత్వత్తాలుమ్ పడుమ్ క్లేశమ్.

(అనువర్తననియతియావతు)—భగవద్భాగవత విషయఙ్గళిల్ స్వశేషత్వానుగుణమాక నీచోక్తి నీచవృత్తికళాలే పణ్ణు మనువర్తనత్తై ప్రాకృతవిషయఙ్గళిల్ మఱన్దుమ్ శెయ్యాతొழிకై.

(ఆహారనియతియావతు)—జాత్యాశ్రయనిమిత్తాదుష్టఙ్గళాయ్ సర్వేశ్వరనుడైయవుమ్ తదీయరుడైయవుమ్ ప్రసాదంగళాన వస్తుక్కళైయే ఆహారమాకక్కొళ్ళుమతొழிయ, తదితరఙ్గళానవై కొళ్ళక్కడవోమల్లోమెన్ఱిరుక్కై.

(అనుకూలసహవాసమావతు)—స్వసంసర్గత్తాలే జ్ఞానానుష్ఠానఙ్గళై వర్ధిప్పియానిఱ్కుమనుకూలరానవర్కళుడనే క్షణకాలముమ్ పిరియాతే కూడివర్తిక్కై.

(ప్రతికూలసహవాసనివృత్తియావతు)—స్వసంసర్గత్తాలే జ్ఞానానుష్ఠానఙ్గళై నశిప్పియానిఱ్కుమ్ ప్రతికూలరానవర్కళుడన్ క్షణకాలముమ్ కూడి వర్తియాతొழிకై. ఇప్పడిచ్చొన్న అనుకూలరుమ్ ప్రతికూలరుమ్ ఇన్నారెన్నుమిడమ్ మేలే తామే యరుళిచ్చెయ్యక్కడవరికళ్.

---

**మూ॥ ఆర్తియు, అనువర్తననియతియు, ఆహారనియతియు, అనుకూలులతో సహవాసముఁ జేయుటయు, ప్రతికూలులతో సహవాసముఁ జేయకుండుటయు,**

---

ఆర్తి యనఁగా:—విషయాంతరములయెడల ప్రీతినిగలుగఁజేయునట్టి యీశరీరముతో నుండుటచేఁగలుగునట్టిసంతాపము వలనను ప్రాప్యవస్తువు విషయమగు వైలక్షణ్యము కానఁబడుటంజేసియు, యట్టివస్తువును లభించువిషయమున నెంతమాత్రము విళంబమును సహింపఁజాలమిఁ జేసియును కలిగిన క్లేశము.

అనువర్తననియతియనఁగా—భగవద్భాగవత విషయములందు తనశేషత్వమునకుఁ దగినట్లు నైచ్యానుసంధానమును నీచవ్యాపారమును చేయుటయు, అట్టి యనువర్తనను ప్రాకృతవిషయములయెడల మరచినైనను చేయకుండుటయును.

ఆహారనియతియనఁగా—పుట్టుకచేఁగాని, స్థానమునుబట్టిగాని, యేదోకహేతువునుబట్టిగాని దూషితములుకానట్టివియు,భగవద్భాగవత ప్రసాదములగు వస్తువులనే యాహారముగాఁగొనుటతప్ప తక్కిన వాటినెన్నఁడును ఆహారముగాను గ్రహింపమని నిశ్చయముతోనుండుట.

అనుకూలసహవాసమనఁగా—తమసంబంధమువలన జ్ఞానానుష్ఠానములను వృద్ధిపొందించునట్టి యనుకూలులయినవారిని క్షణకాలమున్ను విడిచియుండకపోవుట.

ప్రతికూలసహవాస నివృత్తియనఁగా—తమసంబంధమువలన జ్ఞానానుష్ఠానములను నశింపఁజేయునట్టి ప్రతికూలులతోటి క్షణకాలమున్ను కలిసియుండకపోవుట.

ఇచట పేర్కొనఁబడినట్టి యనుకూలులును ప్రతికూలులును ఎవ్వరను విషయమునుగూర్చి వీరే యిఁకమీఁదు తెలుపఁగలరు,

మూ॥ సదాచార్య ప్రసాదత్తాలే వర్ధిక్కుమ్పడి పణ్ణిక్కొణ్డు పోరక్కడవన్,

(సదాచార్యప్రసాదత్తాలే వర్ధిక్కుమ్పడి పణ్ణిక్కొణ్డు పోరక్కడవన్) అతావతు-కీళ్ చ్చొన్నవివైయిత్తనైయుమ్ జ్ఞానానుష్ఠాన పరిపూర్ణనాన సదాచార్యనుడైయ సర్వమంగళావహమాన ప్రసాదత్తాలే తన్నుడైయ నేర్ మేలుమభివృద్ధమామ్పడి శెయ్దుకొణ్డు పోరక్కడవనెన్రపడి. సదాచార్యప్రసాదత్తాలే వర్ధిక్కుమ్పడియివర్ పణ్ణిక్కొణ్డుపోరుకైయావతు-తత్ప్రసాదకఙ్గళై చ్చెయ్దుకొణ్డుపోరుకై. తత్ప్రసాదకఙ్గళావన-ఇతినుడైయ ఉపపాదనస్థలత్తిలరుళిచ్చెయ్కిఱవై. (పోరక్కడవన్) ఎన్ఱ విధిరూపేణ వరుళిచ్చెయ్దతు-ఇతినుడైయ అవశ్యానుష్ఠేయత్వమ్ తోన్ఱుకైక్కాక.

---

మూ॥ సదాచార్యుని యనుగ్రహమువలన వృద్ధిపొందునట్లు నడచుకొనునది.

---

సదాచార్యుని యనుగ్రహమువలన వృద్ధిపొందించుకొనఁగలడు అనఁగా ఇంతకుముందు చెప్పినట్టి వీటినన్నింటినిన్ని జ్ఞానానుష్ఠానపరిపూర్ణుండగు సదాచార్యునియొక్క మంగళకరమగు అనుగ్రహముచే తనకుతానే పైపైని వృద్ధిపొందించుకొని పోఁగలఁడు:

సదాచార్యుని యనుగ్రహమువలన నీతఁడు వృద్ధిపొందించుకొని పోవుటయనఁగా అట్టి యాచార్యునికి సంతోషముఁ గలుగఁజేయువాటిని చేయుట.

వానికి సంతోషముఁ గలుగఁజేయునవి యేవియనఁగా వాటినిగుఱించి యుపపాదించు స్థలమున తెలుపఁగలరు.

"నడచుకొనునది" అని విధిగాఁ దెలుపుట అది యవశ్యముగ అనుష్ఠింపవలసినదియని తెలుపుటకుగానని యెఱుంగునది.

---

గద్య॥ ఇది, శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బన్దవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపకకైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ప్రణతార్తిహరాచార్య కృపాపాత్ర, శ్రీపేరరుళాళ రామానుజయతివర పరమానుగ్రహసమధిగత సకల విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయగ్రంథతత్త్వార్థ, వాధూల కులతిలక వేంకటాచార్య రంగమాంబాతనూజ కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీత్యాద్యనేక బిరుదాలంకృత, గీర్వాణాంగ్ల ద్రవిడాంధ్ర శుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద శ్రీమదాంధ్ర శ్రీభాష్యాది గ్రంథకర్త కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీవచనభూషణాంధ్ర వ్యాఖ్యానమున ద్వితీయప్రకరణము.

శ్రీమతేరామానుజాయనమః

    

శ్రీపిళ్ళైలోకాచార్యర్ తిరువడికళే శరణమ్.

పెరియజీయర్ తిరువడికళే శరణమ్.

# శ్రీవచన భూషణము

సాన్ధ్ర ద్రావిడ వ్యాఖ్యానమ్.

తృతీయ ప్రకరణమ్.



**మూ॥ ౨౪౪॥** మఙ్గళాశాసనమ్ స్వరూపవిరుద్ధమన్ఱో ఎన్నిల్,

ఇన్ద దినచర్యైయిల్ శొన్నవఱ్ఱిల్ వివరిక్క వేణ్డుమవఱ్ఱై వివరిప్పతాక త్తిరువుళ్ళమ్ పఱ్ఱి, ప్రథమత్తిల్ మఙ్గళాశాసనత్తై వివరిత్తరుళుకిఱార్, (మఙ్గళాశాసనమ్) ఎన్ఱుతుడఙ్గి. హేయ ప్రత్యనీకనాయ్ కల్యాణైకతాననాయ్ స్వేతరసకలరక్షకనాయిరుక్కుమ్ సర్వేశ్వరనిరుప్పతు; ఇప్పడియిరుక్కిఱ అవనై క్కొణ్డు తనక్కుణ్డాన అమఙ్గళఙ్గళై ప్పోక్కి ఇల్లాత మఙ్గళఙ్గళై యుణ్డాక్కిక్కొళ్ళక్కడవ తద్రక్ష్యభూతనాన ఇవన్ తనక్కు రక్షకనాన అవనుక్కుత్తాన్ మఙ్గళఙ్గళై యాశాసిక్కై, తదేకరక్ష్యత్వరూపమాన స్వరూపత్తుక్కు విరుద్ధమన్ఱో వెన్ఱు శఙ్కైయై యనువదిక్కిఱార్

**మూ॥ ౨౪౪॥** మంగళాశాసనము స్వరూపవిరుద్ధము కాదా? యంటివేని,

అవతారిక: — ఈ దినచర్యలోఁ జెప్పఁబడిన వాటిలో వివరింప వలసినవాటిని వివరింపఁ దలంచి మొదట మంగళాశాసనమును వివరించుచున్నారు.

(మంగళాశాసనము) ఇత్యాది. హేయపదార్థములకు విరుద్ధమైన స్వరూపముగల వాఁడును, కల్యాణమే స్వరూపముగాఁగల వాఁడును, తానుతప్ప తక్కినవాటినన్నింటిని రక్షించువాడును గదా సర్వేశ్వరుఁడు!

ఇట్టి సర్వేశ్వరుని యనుగ్రహముచే తనకుఁగల యమంగళములను పోగొట్టుకొని, లేని మంగళములను గలుగఁజేసికొనునట్టి వాడును, వానిచే రక్షింపఁ బడునట్టి వాడునునగు ఈచేతనుండు తనకు రక్షకుండగు నాసర్వేశ్వరునికి మంగళములు గలుగ వలయునని తానుకోరుట యనునది వానిచేతనే రక్షింపఁబడునట్టి స్వభావముగల తన స్వరూపమునకు విరుద్ధముకాదా? యనెడిశంకను

మూ॥ జ్ఞానదశైయిల్ రక్ష్యరక్షకభావమ్ తన్నుకప్పిలే కిడక్కుమ్,
ప్రేమదశైయిల్ తట్టుమాఱిక్కిడక్కుమ్

మూ॥ ౨౮౫॥ అవన్ స్వరూపత్తై యనుసన్ధిత్తాల్,

---

(మఙ్గళాశాసనమ్ స్వరూపవిరుద్ధమన్రో వెన్నిల్) ఎన్ను, అత్తైప్పరిహరిక్కిఱార్ (జ్ఞానదశైయిల్) ఎన్ఱుతుడఙ్గి (జ్ఞానదశైయావతు). సర్వేశ్వరనే రక్షకనాకవుమ్ తాన్ అవనుక్కు రక్ష్యభూతనాకవుమ్ ప్రణవత్తిల్ శొల్లుకిఱపడియే తెళియక్కణ్డనుసన్ధిక్కుమ్ దశై. అన్దదశైయిల్ ''కళైవాయ్ తున్బమ్ కళైయాతొழிవాయ్'' ఇత్యాదిప్పడియే తన్నుడైయ అనిష్టనివృత్త్యాదికళుక్కు అవనే కడవనెన్ఱిరుక్కైయాలే, రక్ష్యరక్షకభావమ్ తనక్కడైత్త ఆశ్రయిత్తిలేకిడక్కుమ్ (ప్రేమదశైయావతు) సర్వేశ్వరనుడైయ సౌన్దర్య సౌకుమార్యఙ్గళై యనుసన్ధిత్తు ''ఇవ్విషయత్తుక్కెన్ వరుకిఱదో?'' ఎన్ఱు అస్థానే భయశఙ్కైపణ్ణి, అవన్ స్వరూపత్తైయనుసన్ధిక్కక్షమరన్ఱిక్కె నెఞ్జు మఱుకుమ్బడియానదశై, అన్దదశైయిల్ ఈశ్వరనై రక్షిక్కవర్తేడి త్తడుమాఱుకైయాలే ఈశ్వరన్ పక్కలిలే రక్ష్యభావముమ్ చేతనన్ పక్కలిలే రక్షకభావముమాయ్, తనక్కడైత్త ఆశ్రయత్తిలన్ఱిక్కె మాఱాడి క్కిడక్కుమెన్నపడి,

ఉక్తార్థత్తై విశదీకరిక్కిఱార్, (అవన్ స్వరూపత్తై) ఎన్ఱుతుడఙ్గి, అవనావతు-ప్రథమాక్షర

---

మూ॥ జ్ఞానదశయందు ఈశ్వరుండు రక్షకుండు తాను రక్ష్యభూతుండను ప్రతిపత్తి గలిగి యుండును. ప్రేమదయందు అది మారియుండును.

మూ॥ ౨౮౫॥ వాని స్వరూపమును అనుసంధించుకొనినట్లయిన,

---

అనువదించుచున్నారు(మంగళాశాసనము స్వరూపవిరుద్ధముకాదా?) ఇత్యాది.

అవతారిక:—ఆ శంకను పరిహరించుచున్నారు.

(జ్ఞానదశయందు) ఇత్యాది. జ్ఞానదశయనఁగా సర్వేశ్వరుండు రక్షకుండనియు తాను వానిచే రక్షింపఁబడువాఁడనియు నిట్లు ప్రణవమునఁ జెప్పియున్న ప్రకారము తెలిసికొని దానిని యనుసంధించుకొను సమయము.

ఆసమయమున, ''కళైవాయ్ తున్బమ్ కళైయాతొழிవాయ్'' (తి. వా. ౫-౭-౭) అన్నట్లు తనయొక్క యనిష్టనివృత్త్యాదులకు సర్వేశ్వరుడే సమర్థుండని తలంపుతో నుండువాఁడగుటచే రక్ష్యరక్షక భావము తనకు తగినట్టి యాశ్రయమున నుండును.

ప్రేమదశ యనఁగా సర్వేశ్వరునియొక్క సౌందర్య సౌకుమార్యములను అనుసంధించుకొని ''ఈవిషయమున కేమిరానున్నదో?'' అని యట్టిదికాని విషయమున భయపడి వానిస్వరూపమును అనుసంధించుకొనుటకసమర్థులై మనస్సు సంతాపపడునట్టి యవస్థ

అట్టిసమయమున సర్వేశ్వరుని రక్షించుటకుగాను మార్గము వెదుకుచు తొట్రుపడుచుండుటంజేసి సర్వేశ్వరుని యెడల రక్ష్యవస్తువనెడి భావనయు, ఈచేతనుండు రక్షకుండనెడి భావనయును గలుగును. అనఁగా తగిన యాశ్రయమున నుండక మారిపోవుననుట

అవతారిక:—ఈపైని గనఁబఱచిన దానిని వివరించుచున్నారు(వానిస్వరూపమును)ఇత్యాది.

తిరుమంత్రమునందు మొదటి యక్షరమగు ప్రణవమునఁ జెప్పియున్నట్లు సర్వజ్ఞుండును,

మూ॥ అవనై క్కాడకాక క్కొణ్డు తన్నై నోక్కుమ్,

సౌకుమార్యత్తై యనుసన్ధిత్తాల్ తన్నై క్కాడకాకక్కొణ్డు అవనై నోక్కుమ్.

మూ॥ ౨౮౬॥ ఇవ్వర్థత్తై, చక్రవర్తి,

---

త్తిల్ శొల్లికిఱపడియే సర్వజ్ఞనాయ్ సర్వశక్తియాయ్ సర్వరక్షకనాన అవనుడైయ స్వరూపత్తై యనుసన్ధిత్తాల్, అవనై త్తనక్కు అనిష్టనివారకనాకక్కొణ్డు అజ్ఞనాయ్ అశక్తనాయ్ అప్రాప్తనాన తన్నై రక్షిత్తుక్కొళ్ళుమ్; పేశప్పుకుమ్పడియాన అవనుడైయ సౌకుమార్యత్తై యనుసన్ధిత్తాల్, అవనుడైయ సర్వశక్తిత్వాదికళై మఱన్దు కుఱిప్పరక్కాక నినైత్తు, తన్నై రక్షకనాకక్కొణ్డు మఙ్గళాశాసనమ్ పణ్ణి అవనై రక్షిక్కుమెన్గై. ఇవ్విడత్తిల్ సౌన్దర్యమ్ శొల్లిల్ నిల్లైగు యాకిలుమ్ అతువుమ్ మఙ్గళాశాసన హేతువాకైయాలుమ్, మేలే శొల్లుకైయాలుమ్ సౌకుమార్యమ్ ఇతుక్కుముపలక్షణమ్.

ఇప్పడి సౌకుమార్యాదికళైక్కణ్డు కలఙ్గి రక్షకనాన అవనుడైయ శక్తివైభవత్తై మఱన్దు, తానవనైరక్షిక్కుమెన్గిఱ ఇవ్వర్థ మెఙ్గే కాణలామెన్ను మపేక్షైయిలే, ఇతు శిష్టాచారసిద్ధమెన్నుమిడమ్ కాట్టుకిఱార్ మేల్, (ఇవ్వర్థమ్) ఎన్ఱుతుడఙ్గి. చక్రవర్తి, పెరుమాళ్ పిరాట్టియై త్తిరుమణమ్ పుణర్న్దు మీణ్డెழுన్దరుళానిఱ్క, పరశురామన్ వన్దు తోళ్ గ్గనపళవిలే, తాటకా తాటకేయ నిరసనత్తాలే ఇవరుడైయ శక్తివైభవత్తై వ్యక్తమాక వన్దిరుక్కచ్చెయ్ పోయుమ్, ఇవరుడైయ బాల్యత్తైయుమ్ సౌకుమార్యత్తైయుమే పార్త్తు ‘‘ఎన్నాకప్పుకుకిఱతో?’’ ఎన్ఱు భీతనాయ్, తానుమన్నై

---

మూ॥ వానిని అనిష్టనివారకునిగాఁ దలంచి తనను కాపాడుకొనును

సౌకుమార్యమును అనుసంధించుకొని నట్లయిన,తనను అనిష్టనివారకునిగాఁ

దలంచి వానిని కాపాడును.

మూ॥ ౨౮౬॥ ఈవిషయమును, దశరధుండు

---

సర్వజ్ఞుండును సర్వరక్షకుండును నగు వానియొక్క స్వరూపము ననుసంధించుకొనినట్లయినచో వానిని తన యనిష్టములను నివర్తించు వానినిగాఁగొని అజ్ఞుండును, అశక్తుండును అప్రాప్తయునగు తనను రక్షించుకొనును

మాటమాట్లడినంత మాత్రమున కందిపోవునట్టి యాతని సౌకుమార్యము ననుసంధించుకొని నట్లయిన, వాని సర్వశక్తిత్వాదులను మరచిపోయి నిప్పులచే రక్షింపఁదగినట్టి వస్తువునుగాఁ దలంచి తనను రక్షకునిగాఁగొని మంగళాశాసనముచేసి రక్షించును

ఈ తావున సౌందర్యమును జెప్పియుండక పోయినను, అదియును మంగళాశాసనమునకు హేతువగుటంజేసియు, ఇఁకమీఁదు చెప్పఁబోవుచున్నందునను సౌకుమార్యము దీనికిన్ని సూచకము.

అవతారిక:—ఇట్లు సౌకుమార్యాదులంజూచి మనస్సు కలవరపడి రక్షకుండగు వాని శక్తి వైభవమును మరచిపోయి తాను వానిని రక్షించునట్టి విషయము నెచట చూడవచ్చు నంటివేని యిది శిష్టాచారసిద్ధమని తెలుపుచున్నారు (ఈ విషయమును) ఇత్యాది

శ్రీరామచంద్రుండు శ్రీసీతాపిరాట్టిని కల్యాణముచేసికొని తిరిగివచ్చుచుండగా పరశురాముఁడు యుద్ధముకు వచ్చి వోడిపోయినప్పుడు తాటకా తాటకేయులను సంహరించుటచె వీరి శక్తివైభవమును స్పష్టముగా నెఱింగియున్నను, వీరి బాల్యమును సౌకుమార్యమునన్ను చూచి ‘‘ఏమిసంభవించునో?’’

**మూ॥** శ్రీజనకరాజన్ తిరుమకళ్,

---

కూడిచ్చెన్ఱు ‘‘క్షత్రరోషాత్ప్రశాన్తస్త్వం బ్రాహ్మణశ్చ మహాయశాః। బాలానాం మమపుత్రాణామభయం దాతుమర్హసి’’ ఎన్ఱు శరణాగ్నపుక్కు, పిన్నైయుమవన్ పెరుమాళ్ మేలేయడర్న్దు శెల్లుకిఱ పడియైక్కణ్డు నిష్ప్రాణనాయ్ నిన్ఱు, ‘‘గతో రామ ఇతి శ్రుత్వా హృష్టః ప్రముదితో నృపః। పునర్జాతం తదా మేనే సుతానాత్మానమేవచ’’ ఎన్గిఱపడియే అవన్ తోఱ్ఱు మీణ్డుపోనానెన్ఱు కేట్టపిన్బు తానుమ్ పిళ్ళైకళుమ్ మఱుపిఱవి పిఱన్దాగాక నినైత్తిరున్దానిఱే.

శ్రీజనకరాజన్ తిరుమకళ్, తన్నైయిర్ప్పాట్టిలే ఇవరుడైయ వైభవమెల్లామఱియుమవళాయిరుక్కచ్చెయ్తేయుమ్, తిరువభిషేకమ్పణ్ణుకైక్కాక అలఙ్కృతదివ్యగాత్రరాయ్క్కొణ్డు చక్రవర్త్తి తిరుమాళిక్కైక్కెழున్దరుళుకిఱపోతు, ఇవరழకిలే తోఱ్ఱు ‘‘ఇతుక్కెన్నాకిఱతో?’’ ఎన్ఱు ప్రేమత్తాలే కలఙ్గి, ‘‘పతిసమ్మానితా సీతా భర్తారమసితేక్షణా। ఆద్వారమనువవ్రాజ మఙ్గళాన్యభిదధ్యుషీ’’ ఎన్ఱు తిరువాశలళవుమ్ తాన్మఙ్గళాశాసనమ్ పణ్ణిక్కొణ్డు పిన్శెన్ఱు, ‘‘పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః। వరుణః పశ్చిమామాశాం ధనదస్తూత్తరాం దిశమ్’’ ఎన్ఱు దిక్పాలకర్కళై ఇవర్కు రక్షకరాక అపేక్షిత్తాళిఱే.

(శ్రీజనకరాజన్) ఎన్ఱుమ్ (తిరుమకళ్) ఎన్ఱుమ్ పిరిత్తు చొల్లవుమామ్. అప్పోతైక్కు,

---

**మూ॥** జనకమహారాజు కుమార్తె (శ్రీ సీతాపిరాట్టి,)

---

యని భయపడి దశరథ చక్రవర్తి తాను ముందుగ పరుగెత్తుకొని పోయి ‘‘క్షత్రరోషాత్ప్రశాన్తస్త్వమ్ బ్రాహ్మణశ్చమహాయశాః బాలానాం మమపుత్రాణామభయం దాతుమర్హసి’’ (రా. బా. ౭౫-౯) (క్షత్త్రియుల విషయమగు కోపముపోయి శాంతిని పొందియున్నావు. గొప్పకీర్తిగల బ్రాహ్మణుండవు. బాలురగు నాపుత్రులను రక్షించుదువు గాక’’ అనియిట్లు శరణుజొచ్చి తరువాత పరశురాముఁడు పెరుమాళ్లమీఁదికి పోవుటంజూచి ప్రాణము దిగాలపోయి నిలువబడి ‘‘గతో రామ ఇతి శ్రుత్వా హృష్టః ప్రముదితో నృపః పునర్జాతం తదా మేనే సుతానాత్మానమేవచ’’ (రా. బా. ౭౭-౫) అన్నట్లు పరశురాముఁడు వోడిపోయినాడని విన్నపిమ్మట తనయున్న పుత్రులనున్న పునర్జన్మము గలవారినిగాను తలంచినాడు గదా!

(జనక చక్రవర్తి కుమార్తె) శ్రీసీతాపురాట్టి ఆదినుండియు పెరుమాళ్ళయొక్క వైభవము నంతయు నెఱింగియున్నట్టిదియే యైనను, శ్రీరామచంద్రుఁడు పట్టాభిషేకమునకుగాను అలంకరించుకొని దశరథుని గృహంబునకు వేంచేయునప్పుడు వీరి సౌందర్యముఁజూచి ‘‘దీనికేమి రాఁగలదో?’’ అని ప్రీతి మూలమున కలవరపడి ‘‘పతిసమ్మానితా సీతా భర్తారమసితేక్షణా ఆద్వారమనువవ్రాజ మంగళాన్యభి దధ్యుషీ’’ (రా-అ ౧౬-౨౧) అన్నట్లు ఆమె ద్వారమువరకును మంగళాశాసనముఁజేయుచు కూడపోయి ‘‘పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః వరుణః పశ్చిమామాశాం ధనేశస్తూత్తరాం దిశం’’ (తూర్పున ఇంద్రుండును దక్షిణమున యముండును పడమట వరుణుండును ఉత్తరమున కుబేరుండున్ను నిన్ను రక్షించుదురుగాక) అనుటచే దిక్పాలకులను వీరిని రక్షించుటకై ప్రార్థించినది గదా?

శ్రీ, జనకచక్రవర్తియనియు కుమార్తెయనియును వీటిని వెవ్వేరుపదములనుగానును అనఁగా వ్యస్తపదములనుగానును గొనవచ్చును. అట్లు గొనినచోఁ దీనికర్థమిట్లు కాఁగలదు.

మూ॥ విశ్వామిత్రర్, శ్రీదణ్డకారణ్యవాసికళాన ఋషికళ్,

శ్రీజనకరాజర్, మహేశ్వరధనుర్భఙ్గత్తాలే పెరుమాళుడైయ శక్తి వైభవత్తైక్కణ్డిరుక్కచ్చెయ్ తేయుమ్, "ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ। ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా" ఎన్ఱు అభిజాత్యాదికళాల్ పేఱుడైయళాన ఇవళై క్కైక్కొణ్డరుళ వేణ్డుమెన్ఱుకాట్టిక్కొడుక్కు అవళవిలే, ఇవరుడైయ వడివళకైయుమ్ సౌకుమార్యత్తైయుమ్ కణ్డు కలఙ్గి ఇచ్చేర్త్తిక్కు ఎన్ఱు తీఙ్గు వారాతొళియవేణుమెన్ఱు "భద్రన్తే" ఎన్ఱు మఙ్గళాశాసనమ్ పణ్ణినానిఱే.

విశ్వామిత్రర్, తన్నుడైయ అధ్వరత్రాణార్థమాక పెరుమాళైయుమ్ కొణ్డు పోరుకిఱ పోతు, నడువే తాటకై పెరియ ఆర్ప్పరవత్తోడే ఆక్రమిత్తుక్కొణ్డు వరుకిఱపడియై క్కణ్డు, "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్" ఎన్గిఱపడియే పెరుమాళుడైయ శక్తివైభవత్తై యఱిన్దిరుక్కచ్చెయ్తేయుమ్ సౌకుమార్యత్తై ప్పార్త్తు కలఙ్గి, "విశ్వామిత్రస్తు బ్రహ్మర్షిర్హుంకారేణాభిభర్త్స్య తామ్। స్వస్తి రాఘవయోరస్తు జయంచైవాభ్యభాషత" ఎన్గిఱపడియే తానుమున్నే నిన్ఱు అహఙ్కారత్తు పెరుమాళుక్కుమ్ తిరుత్తమ్బియార్క్కుమ్ వరుతీఙ్గు వారామైక్కాక మఙ్గళాశాసనము పణ్ణినానిఱే.

శ్రీదణ్డకారణ్యవాసికళాన ఋషికళ్, "తే తం సోమమివోద్యన్తం దృష్ట్వా వై ధర్మచారిణః మఙ్గళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" ఎన్ఱు తఙ్గళోపన్నివృత్తిక్కైయుమ్ అ

మూ॥ విశ్వామిత్రుండు, దండకారణ్యమున వసించునట్టి మహర్షులు,

శ్రీజనక చక్రవర్తి మహేశ్వరధనుర్భంగమువలన పెరుమాళ్ళయొక్క శక్తి వైభవమును గనియున్నను, "ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ। ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా" (రా, బా, ౭౩-౨౭) అన్నట్లు అభిజాత్యాగుణముచే సాటిలేని వంశమువారలయిన సీతాపిరాట్టిని వివాహము జేసుకొనుమని యామెను గొనివచ్చి యొప్పగించుసమయమున, శ్రీరామచంద్రుని సౌందర్యమును సౌకుమార్యమునున్నుచూచి కలవరపడి ఏమిషమునను కొంచెమైనను కీడుకాకూడదనుకొని "భద్రంతే" (నీకు మంగళము గలుగుగాక) అనియిట్లు మంగళాశాసనము చేసినవాఁడాయెను.

విశ్వామిత్రుండు తనయొక్క యజ్ఞసంరక్షణార్థమై శ్రీరామచంద్రుని తోడుకొనిపోవునప్పుడు తాటకయను రాక్షసి వీరిమీదికి వచ్చుటఁజూచి, "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం" (రా. బా. ౧౯-౧౪-౧౫) (శ్రీరామచంద్రుని నిజమైనపరాక్రమముగలవానినిగా నేను ఎఱుంగుదును) అన్నట్లు శ్రీరామచంద్రుని శక్తివైభవము నెఱింగియున్నను, సౌకుమార్యముఁజూచి కలవరపడి "విశ్వామిత్రస్తు బ్రహ్మర్షిర్హుంకారేణాభిభర్త్స్య తామ్ స్వస్తి రాఘవయోరస్తు జయంచైవాభ్యభాషత" (రా. బా. ౨౬-౧౪.) అన్నట్లు విశ్వామిత్రుండుముందుఁబోయి హుంకారముచేసి శ్రీరామచంద్రునికిన్ని వారి తమ్ములగు శ్రీలక్ష్మణస్వామివారికిన్ని ఒకకష్టమున్ను రాకుండుటకై మంగళాశాసనముఁ జేసినవారయిరి.

దండకారణ్యమున నివసించునట్టి మహర్షులు "తే తం సోమమివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః" (రా. అ. ౧-౧౧-౧౩) (చంద్రు

మూ॥ తిరువడి, మహారాజర్,

---

భిమతసిద్ధియైయుమ్ పణ్ణిత్తరువారివరే యెన్ఱు సాధనానుష్ఠానమ్ పణ్ణుకిఱ తాఙ్గళ్, ఇవర్ నన్మై హితరానవాఱే అవర్గళై మఱన్దు, ఇవర్ వడివళకిలే తువక్కుణ్డు మఙ్గళాశాసనమ్ పణ్ణినార్ కళిఱే.

తిరువడి, ప్రథమదర్శనత్తిలే, ‘‘ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః। సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః’’ ఎన్ఱు కణ్డైయఙ్గళ్ పోలేయిరుక్కిఱ తిరుత్తోళ్కళిల్ మిడుక్కై క్కణ్డు నమక్కివర్ రక్షకరాక క్కడవరైయిల్లై’’ ఎన్ఱు బుద్ధిపణ్ణి నిఱ్కచ్చెయ్తేయుమ్, అవర్గళినళకై క్కణ్డు ఈడుపట్టు ‘‘పిఱర్ కణ్ణెచ్చిల్ పడిల్ శెయ్వతెన్’’ ఎన్ఱు అతిశఙ్కై పణ్ణి, తిరువాభరణఙ్గళాలే ఇత్తైమఱైత్తిట్టువైయ్యాతే ఇప్పడి వెళియిడ క్కారణమెన్నెన్ఱు వయిఱుపిడిత్తు, పిన్బు పెరుమాళుడైయ శక్తివిశేషత్తై బహుముఖమాక క్కాణానిఱ్కచ్చెయ్తేయుమ్ సౌకుమార్యానుసన్ధానత్తాలే ‘‘ఇవర్క్కెన్ వరుకిఱతో?’’ ఎన్ఱు తుణుక్కుత్తుణుక్కెన్ఱు సర్వదశైయిలుమ్ కూడనిన్ఱు నోక్కిక్కొణ్డు తిరిన్దానిఱే.

మహారాజర్, వాలివధాదికళాలే పెరుమాళుడైయ శక్తిగౌరవత్తై క్కణ్డిరుక్కచ్చెయ్తేయుమ్ సౌకుమార్యత్తైయే పార్త్తు కలఙ్గి శ్రీవిభీషణాళ్వాన్ నాలువరుమ్ తానుమాయ్ వన్దు తోన్ఱినపోతు ‘‘ఏష సర్వాయుధోపేత శ్చతుర్భిస్సహ రాక్షసైః। రాక్షసోఽభ్యేతి పశ్యధ్వమ

---

మూ॥ శ్రీయాంజనేయులు, సుగ్రీవుండు,

---

డుదయించునట్లు వేంచేయునట్టి శ్రీరామచంద్రునిచూచి ధర్మపరులగు మహాత్ములు మంగళాశాసనము నర్పుచు వారికి స్వాగతముసంగిరి) అన్నట్లు తమయొక్కయూపన్నివృత్తిని ఇష్టసిద్ధిని గలుగఁ జేయువారు వీరే యని సాధనానుష్ఠానముఁజేయువారలగు తాము వీరు సమీపించిన తోడనే దానిని మరచిపోయి వీరి శరీరసౌందర్యమువైపు మనస్సుపోయి మంగళాశాసనముఁజేసిన వారయిరి.

శ్రీయాంజనేయులవారు మొట్టమొదట శ్రీరామచంద్రుని సేవించినప్పుడు ‘‘ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః సర్వభూషణభూషార్హాః కిమర్థమ్ నవిభూషితాః (రా. కి. ౩-౧౪)(పొడుగైనవియును, గుండ్రనివియును కోటగోడవలెనుండునట్టి యీబాహువులు అన్నియాభరణములతో నలంకరింపదగినవిగానుండుగానేల యలంకరింపఁబడలేదు) అన్నట్లు కోటప్రాకారముల వలెనున్నట్టి భుజములయొక్క బలముఁగని ‘‘మనలను వీరు రక్షింపగలరు’’ అని నిశ్చయించుకొని యున్నను, వాటిసౌందర్యముఁజూచి ప్రీతిగలిగి ‘‘ఇతరులకంటపడినట్లయిన ఏమిచేయుగలము’’ అని భయపడి అభరణములతో నలంకరించుటచే నీబాహువులను మూయకుండ ఇట్లు బయిట కనపడునట్లుంచుటకుఁగారణమేమి?యని కడుపుపిసుకొని తిరిగిన్ని శ్రీరామచంద్రుని సామర్థ్యమును బహుముఖములుగాఁజూచుచున్నను, సౌకుమార్యమును తలంచినతోనే ‘‘వీరికేమి రాగలదో?’’ అని ఎక్కువ భయపడి ఎల్లప్పుడును కూడయుండి కాపాడినారు గదా.

సుగ్రీవుండు వాలివధాదులసమయమున శ్రీరామచంద్రుని పరాక్రమమును వీక్షించియున్నను, సౌకుమార్యమునే చూచి మనస్సు కలవరపడి శ్రీవిభీషణులవారు నలుగురితో గూడ తానున్నువచ్చి శరణుజొచ్చినప్పుడు ‘‘ఏష సర్వాయుధోపేతశ్చతుర్భి స్సహరాక్షసైః రాక్షసోఽభ్యేతిప

స్మాన్ హన్తుం నసంశయః" ఎన్ఱు నమక్కెల్లా మోరుయిరాన పెరుమాళై నలికివతఱ్‌యా లే నమ్మైయెల్లారైయుమ్ ముడిప్పతాక వరుకిఱా నివనెన్ఱులఱియిట్టు ముతలికళుక్కుక్కూట్టి, "రాఘవంశరణంగతః" "నివేదయతమాంక్షిప్రమ్" ఎన్ఱ వుక్తికళైక్కేట్టువైత్తుమ్ "వధ్యతామేషతీవ్రేణ దణ్డేన సచివైస్సహ। రావణస్యనృశంసస్యభ్రాతాహ్యేషవిభీషణః" ఎన్ఱు రావణసమ్బన్ధత్తైయేప్పార్త్తు ఇవనైచ్చిత్రవధమ్ పణ్ణవేణుమెన్బతు, "రావణేనప్రణిహితమ్ తమవైహినిశాచరమ్। తస్యాహమ్ నిగ్రహమ్ మన్యే క్షమమ్ క్షమవతామ్ వర" ఎన్ఱురావణనాలేవుప్పప్పట్టవనెన్ఱు అవనై తిరువుళ్ళమ్ పఱ్ఱవేణుమ్, అవనై దణ్డిక్కైయే ప్రాప్తమెన్ఱు బుద్ధిపణ్ణానిఱ్కె సెన్నతాయ్, ఇప్పడికళిలే పలవత్తైయుమ్ శొల్లి ఇవనై సర్వధాకైక్కొళ్ళవొణ్ణాతెన్ఱు ఉరునిలైనిన్ఱు, "పిశాచాన్ దానవాన్" ఇత్యాదియాలే తమ్ముడైయ బలత్తైక్కాట్టియుమ్ కపోతోపాఖ్యానమ్ కణ్డూపాఖ్యాన

---

శ్యధ్వం అస్మాన్ హన్తుమ్ నసంశయ" (రా. యు. ౧౭-౪) (ఈరాక్షసుండు నలుగురి రాక్షసులతోఁగూడి యాయుధపాణియై మనలను వధించుటకై వచ్చుచున్నాడు చూడండి) అన్నట్లు మనకందరికిని ప్రాణభూతులగు పెరుమాళ్లను వధించి అందుమూలముగ మనలనందరిని వధించుటకై యీతండు వచ్చుచున్నాఁడు, అని యిట్లు తెలియఁజేసి యచటనుండువారికిఁ జూపించి "రాఘవం శరణంగతః" "నివేదయత మాంక్షిప్రం" (రా. యు. ౧౭-౧౪) (శ్రీరామచంద్రుని శరణుజొచ్చినాఁడను శీఘ్రముగ విన్నవింపుఁడు) అని చెప్పినదానిని వినియున్నను, "వధ్యతామేషతీవ్రేణ దణ్డేనసచివైస్సహ। రావణస్య నృశంసస్య భ్రాతాహ్యేష విభీషణః" (రా. యు. ౧౭-౨౮) (ఈతనిని మంత్రులతోఁగూడ శీఘ్రముగవధింపుఁడు ఈతండుపాపియగు రావణుని తోఁబుట్టినవాఁడగు విభీషణుండు) అన్నట్లు రావణునితోనీతనికిఁగల సంబంధమునే ప్రధానముగాఁగొని యీతనిని చిత్రవధచేయవలయును అనియు "రావణేనప్రణిహితం తమవేహినిశాచరంతస్యాహంనిగ్రహంమన్యే క్షమంక్షమవతాంవర" (ఓక్షమించువారిలో శ్రేష్ఠుండవగు శ్రీరామచంద్రా! రాబోవురాక్షసుని రావణునిచే పంపబడినట్టి వానినిగా నెఱుంగుము. కావునవతనిని దండింపఁగోరుచున్నాను) అని అన్నట్లు రావణుని తమ్మునిగాఁ దలంచి వానిని వధింపవలయుననియే తలంచుచున్నాను అని యిట్లు అనేక విధములుగాఁజెప్పి, యీతని నెంతమాత్రము స్వీకరింపఁగూడదని ఒకటేపట్టుపట్టియుండఁగా, "పిశాచాన్ దానవాన్" ఇత్యాదితావుఁజెప్పియున్నట్టి తమబలమును విశదముగాఁదెలిపియు, * కపోతోపాఖ్యానమును * కండూపాఖ్యానమునున్న తెలియఁజేసియును భయమును పోఁగొట్టి "ఆనయైనంహరిశ్రేష్ఠ" (ఓసుగ్రీవుండా!

---

* కపోతోపాఖ్యానము—ఒక యడవిలో నొక చెట్టుమీఁద ఒక మొగపావురమును ఒక ఆడపావురమును దంపతులు నివసించియుండెను, వాటిలో నాడపావురమును నొక వేటకాఁడు వలవేసి పట్టుకొని చంపివేసెను. మొగపావురము మిక్కిలి దుఃఖముతోనుండఁగా, అంతలో నావేటకాఁడు గాలివానచేత బాధపడి చలితో వణఁకుచు నాచెట్టుక్రింద కష్టపడుచుండఁగాఁజూచి యామొగపావురము యెచ్చటనుండియో నిప్పుకొరువులను నోటకరచుకొనివచ్చి మంటచేసి వానిచలినిపోఁగొట్టి వాఁడు మిక్కిలియాకలిగొనియుండగా తానానిప్పులో పడి తన మాంసముతో నాతనియాకలినిన్ని తీర్చినదాయెను ఆవేటకాఁడు తనకపకారమొనర్చినవాఁడైనను తానుండు చెటువద్దకువచ్చి తనను శరణుజొచ్చినందున నొక కపోతము పక్షియైనను శరణాగతుని రక్షించినదనుట.

* కండూపాఖ్యానము—కండువనుమహర్షి శరణాగతరక్షణమును గుఱించి నాల్గు గీతలను రచియించినవాఁడాయెను. అవి యేవనఁగా (1) ఎవ్వడైనను శరణాగతుండై యంజలి

మ్ ఇవైయుళ్ళిచ్చెయ్‌దుమ్, తెళివిత్తు భంగత్తై క్కెడుత్తు, ‟అనఘాయనమహారిశ్రేష్ఠ” ఎన్న వేణ్డుమ్బ
డి పెరుమాళ్ కు ఐశ్వర్యక్కాకనినైత్తు క్కాత్తుక్కొణ్డు పోన్దారిరే.

(మహారాజర్) ఎన్గిఱదు- శ్రీజటాయుమహారాజరై యెన్ఱుమ్ శొల్లువర్ కళ్; అతావదు-శ్రీజ
టాయుమహారాజర్ పిరాట్టిక్కాక రావణనోడే పొరుదు కుఱ్ఱుయిరాయ్‌క్కిడక్కిఱ తిమ్మైప్
ప్పెరుమాళ్ వన విలే,జనస్థానత్తిలిరున్ద పదినాలాయిరమ్ రాక్షసరైయుమ్ తనివీరమ్ శెయ్
దునిన్ఱుకొన్ఱ అవ్ వలియై యఱిన్దిరుక్క చ్చెయ్‌తేయుమ్, ‟యూయమోషధిమివాయుష్మన్న న్వేషసిమ
హావనే సా దేవీ మమచప్రాణాః రావణేనోభయమ్ హృతమ్” ఎన్ఱు అరుమరున్దు తేడువారటవియిలుమ్
తడుమాఱుమాపోలే యూవళ్ళోరుత్తియై యిన్ద పరన్దకాట్టిలే తేడిక్కొణ్డు తిరికిఱీర్, ఉమక్కు నిత్యమ్
ప్రాణసమైయాన అవళుమ్ ఎన్నుడైయ ప్రాణజ్గళుమిరణ్డుమ్ రావణనాలే అపహృతమా
యిఱ్ఱు కాణుమెన్ఱు శొల్లానిఱ్క చ్చెయ్‌తే, ఇవరుడైయ విరహక్లేశత్తాల్ వన్ద తళర్‌త్తియైయుమ్
సౌకుమార్యత్తైయుమ్ రాక్షసగోష్ఠై వరక్షపక్షైయైయుమ్ నినైత్తు ‟ఎన్నాకత్తేడుకిఱతో?” ఎన్ఱఞ్జి,
‟ఆయుష్మన్” ఎన్ఱు ఆయుస్సై ప్రార్థిత్తారిరే.

ఈతని(గొనిరా) అని శ్రీరామచంద్రుండు అనతిచ్చ్యవలసినట్లు శ్రీరామచంద్రుని నొక్కంచే రక్షింప
వలసిన వానినిగా తలంచి వారిని రక్షించి యుండిరి కదా!

ఈతావున, మహారాజుఅనఁగా శ్రీజటాయుమహారాజని యర్థముచేసికొనినను చేసికొనవచ్చును.
అదెట్లనిన, శ్రీజటాయువు తాను పిరాట్టికిగాను రావణునితోఁబోరాడి కొనవూపిరితోనుండి
యుండగా తమను శ్రీరామచంద్రుండు వచ్చిచూచినప్పుడు, జనస్థానమునయున్నట్టి పదునాలుగు వేల
రాక్షసులతోను తానువొంటిరిగాయుద్ధముచేసినట్టి శ్రీరామచంద్రుని బలపరాక్రమము నెఱింగియు
న్నను, ‟యూయమోషధిమివాయుష్మన్ అన్వేషసి మహావనే। సా దేవీ మమచ ప్రాణాః రావణేనోభ
యంహృతం”(రా.అ. ౬౭-౧౫-౧౬) అనఁగా నోషధికై వెదకువారు అడవులందంతటను వెదకు
నట్లు యొవరికై యీమహారణ్యమున వెదకుచున్నారో, మీకు ఎల్లప్పుడును ప్రాణముతో సమాను
రాలగు ఆమెయును, నాప్రాణములును ఈరెండును రావణుండనుదురాత్ముని చేఁ గొనిపోబడినవి సుమీ
అని చెప్పుచు వీరికి విరహక్లేశమువలనఁగలిగిన దేహకార్శ్యమునున్ను సౌకుమార్యమునున్ను రావణు
నితోఁగల మహావైరమునున్ను యోచించి ‟ఏమికానున్నదో?” అని భయపడి ‟ఆయుష్మన్=
ఆయుష్మంతుఁడా.” అనియిట్లు ఆయుస్సును కోరినారు కదా.

జోడించుకొని దీనుఁడై రక్షింపుమని యాచించినచో, అట్టివాడు శత్రువుగానుండినను ఇతరులను
నొప్పింపకూడదనెడి యానృశంస్యముకొరకు రక్షింపవలయును. (2) అట్లు శరణాగతుండయిన
వాఁడు ఆర్తుండా (మిగుల పరితాపమునొందియున్నాఁడా?) దృప్తుఁడా? (నొప్పి నోర్వగలడా?)
అని యాలోచింపక శరణాగతుడయినంతమాత్రమున బుద్ధిమంతుండైనవాడు తనప్రాణములనైనను
విడనాడి శత్రువైనను వానిని కాపాడువది. (3) రక్షించినపిమ్మట వా (డేమిచేయునో యను
భయమువలనఁగాని, శరణాగతరక్షణము పరమధర్మమని యెఱుంగమిచేఁగాని, వాడిట్లేకష్టపడవల
యునని యెడి కామముచేఁగాని శక్తికొలది రక్షింపనివాఁడు ఈలోకమున నిందను పరలోకమున
నరకమునున్ను పొందగలడు (4) అట్లు శరణుజొచ్చినవానిని రక్షింపనందున వాడు నశించినచో
రక్షింపనివాని సుకృతమునంతయును గొనిపోవును.

మూ॥ శ్రీనన్దగోపర్, శ్రీవిదురర్, పిళ్ళైయుఅజ్గావిల్లిదాసర్, తుడక్కమానవర్కళ్
పక్కలిలే కాణలామ్.

శ్రీనన్దగోపర్, పూతనానిరసనత్తాలే కృష్ణనుడైయ దివ్యశక్తియోగత్తైక్కణ్డిరుక్కచ్చెయ్ తే యుమ్, శైశవప్రయుక్తమాన సౌకుమార్యత్తైయే పార్త్తుక్కలజ్గి వయిఱెరిన్దు, ‘‘రక్షతు త్వామశేషాణాంభూతానాంప్రభవోహరిః । యస్యనాభిసముద్భూత పఙ్కజాదభవజ్జగత్’’ ఎన్ఱు సర్వజగత్కారణభూతనాయ్ సకలవిరోధి నిరసనశీలనాన సర్వేశ్వరను మైత్ర రక్షిప్పానాకవెన్ఱు రక్షైయిట్టారిఱే.

శ్రీవిదురర్, కృష్ణనుడైయ సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదికళైయఱిన్దిరుక్కచ్చెయ్ తేయుమ్, దుర్యోధనగోష్ఠియిలే యెఴున్దరుళినపోతు పాయ్యాసనమిట్టపడియై క్కణ్డిజ్జే, ప్రేమాన్ధతైయాలే ‘‘సంస్పృశన్నాసనంశౌరే ర్విదురస్సమహామతిః’’ ఎన్ఱు తమ్ముడైయ తిరుమాళిగైయిల్ తామిట్ట ఆసనత్తైయుమ్ అతిశఙ్కైపణ్ణి త్తన్ కైయాలే అముక్కిప్పార్త్తారిఱే.

పిళ్ళైయుఅజ్గావిల్లిదాసర్, అత్తత్తైయిల్ జ్ఞానశక్త్యాదికళెల్లామఱిన్దు ‘‘పెరుమాళ్ నమక్కు రక్షకర్’’ ఎన్ఱిరుక్కచ్చెయ్ తేయుమ్- ప్రేమపరవశరాకైయాలే పెరుమాళులావియరుళుమ్పోతు ఎజ్గేను మొరుచలనమ్పిఱక్కిల్ నమ్ప్రాణనై విడువిత్తనైయెన్ఱు కొణ్డై యెరుళిప్పిడిత్తుక్కొణ్డు సేవిప్పరెన్ఱు ప్రసిద్ధమిఱే.

తుడక్కమానవర్కళెన్గిఱవిత్తాల్, ‘‘స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయంప్రాతస్సమాహి

మూ॥ నందగోపులు, విదురుండు, పిళ్ళైయురంగా విల్లిదాసులు మొదలగు వారి విషయమునఁ జూడవచ్చును.

శ్రీనందగోపులు పూతనను వధించినప్పుడు శ్రీకృష్ణుని దివ్యశక్తిని జూచియున్నను, బాల్యమునందు సౌమార్యము నేచూచి భయపడి ‘‘రక్షతు త్వామనుష్యాణాం భూతానాం ప్రభవోహరిః యస్యనాభిసముద్భూత పంకజాదభవజ్జగత్’’ అనఁగా సమస్తప్రపంచమునకును కారణభూతుఁడును సమస్తవిరోధులను నశింపఁజేయువాఁడగు సర్వేశ్వరుఁడు మిమ్ములను రక్షింపవలయును అని యిట్లు రక్షను కట్టినారు కదా.

విదురుఁడు శ్రీకృష్ణునియొక్క సర్వజ్ఞత్వమును, సర్వశక్తిత్వమును మొదలగువాటిని గుర్తెఱింగియున్నను, శ్రీకృష్ణుండు దుర్యోధనునిసభలో కవేంచేసినప్పుడు కల్పితమైనట్టియాసనమును ఉంచిన విషయమునుజూచి భయపడి ప్రీతిపారవశ్యమువలన ‘‘సంస్పృశన్నాసనంశౌరేః విదురస్స మహామతిః’’ అనఁగా తనగృహమున తాము వేసిన యాసనమునున్ను సందేహించి తనచేతితో నదిమిచూచినారు గదా]

పిళ్ళైయురంగావిల్లిదాసులు పెరుమాళ్ళయొక్క జ్ఞానశక్త్యాదులనన్నింటిని యెఱింగియుండి ‘‘పెరుమాళ్ళే మనకు రక్షకులు’’ అని నిశ్చయించుకొనియున్నను, ప్రేమపరవశులగుటంజేసి పెరుమాళ్ళు ఊరేగింపునకు వేంచేసినప్పుడు, ఎచ్చటనైన నొకయాపద సంభవించినట్లయిన, నాప్రాణములను విడనాడుదును!’అని నిశ్చయించుకొనుటంజేసి కత్తిని తమరొద్దయుంచుకొని యూరేగింపు సేవింతురని ప్రసిద్ధము కదా!

(మొదలగువారు) అనఁగా, ‘‘స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయంప్రాతస్సమాహితాః

**మూ॥ ౨౮౭॥ ఇళైయ పెరుమాళై శ్రీ గుహప్పెరుమాళ్ అతిశఙ్కిక్కప్పణ్ణ, ఇరువరై యుమ్ అతిశఙ్కిప్పణ్ణి శ్రీ గుహప్పెరుమాళ్ పరికరమ్ పెరుమాళై నోక్కిత్తిత్తే.**

తా॥ । సర్వాన్ దేవాన్ నమస్యన్తి రామస్యార్థే యశస్వినః’’ ఎన్ఱు తిరువయోధ్యావాసిజనఙ్గళ్, ‘‘యన్మఙ్గళం సుపర్ణస్య వినతాకల్పయత్పురా । అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మఙ్గళమ్’’ ఎన్ఱు శ్రీకౌసలైయార్, ‘‘జాతోఽసి దేవదేవేశ శఙ్ఖచక్రగదాధర । దివ్యరూపమిదం దేవ ప్రసాదే నోపసంహర’’ ఎన్ఱు శ్రీవసుదేవర్, ‘‘ఉపసంహర సర్వాత్మన్ రూపమేతచ్చతుర్భుజమ్ । జానాతు మావతారం తే కంసోఽయమ్ దితిజన్మజః’’ ఎన్ఱు దేవకి ప్పిరాట్టి ముతలానారై యెల్లామ్ నినైక్కిఱతు.

ఇవ్విషయత్తై అతిశఙ్కైయుమ్ యెల్లారైయుమ్ మఙ్గళాశాసనత్తిలే మూట్టుమెన్నుమిడత్తుక్కు ఇన్నుమొరు ఉదాహరణమ్ కాట్టుకిఱార్ (ఇళైయపెరుమాళై) ఎన్ఱుతుడఙ్గి. శృంగిబేరపురత్తిలే యెழున్దరుళి శ్రీగుహప్పెరుమాళై విషయీకరిత్తరుళినవన్ఱు, పాఙ్గతిన్ద ఇళైయపెరుమాళ్ పడుత్తుక్కొడుత్త పర్ణశయ్యైయిలే పెరుమాళుమ్ పిరాట్టియుమ్ పళ్ళికొణ్డరుళానిఱ్క, బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధరాకైయాలే ఏన్ వరుకిఱతో వెన్ఱఙ్గి ముతుకిలిట్ట అమ్బుఱాత్తూణియుమ్ కట్టినవిరల్ చ్చరడుమ్ నాణియేఱిట్టు నడుక్కొత్తుప్పిడిత్తవిల్లుమ్ తాముమాయ్ నడైయాడుమ్ మతిళ్ పోలే వళైయవరుకిఱ ఇళైయపెరుమాళై

**మూ॥ ౨౮౭॥ శ్రీ లక్ష్మణస్వామి విషయమున గుహుఁడు అనుమానపడఁగా, గుహుని పరిచారకులు వీరియుభయుల విషయమునను అనుమానపడి శ్రీరామచంద్రుని కాపాడినారు గదా!**

సర్వాన్ దేవాన్ నమస్యన్తి రామస్యార్థే యశస్వినః’’ (స్త్రీలును వృద్ధులును పడుచువారును. ప్రాతస్సాయంకాలములయందు గుమిగూడి శ్రీరామచంద్రునికొరకై దేవతలను నమస్కరించుదురు) అన్నట్లు శ్రీఅయోధ్యాపట్టణముననుండు జనులును, ‘‘యన్మంగళం సువర్ణస్య వినతాకల్పయత్ పురా అమృతం ప్రార్థయానస్య తత్తే భవతుమంగళం’’(అమృతమునుగొనిరానున్న గరుత్మంతుని తల్లియగు వినతాదేవి గరుత్మంతుని కొసంగిన మంగళము నీకుకలుగుగాక!) అన్నట్లు శ్రీకౌసల్యయును ‘‘జాతోసి దేవదేవేశ శంఖచక్రగదాధర।దివ్యరూపమిదం దేవప్రసాదేనోపసంహర’’(దేవతలకును దేవుఁడైనవాఁడా! అనుగ్రహించి దివ్యమగునట్టి యీరూపమును కానరానివ్వకుము) అన్నట్లు వసుదేవుండును, ‘‘ఉపసంహరసర్వాత్మన్ రూపమేతచ్చతుర్భుజమ్ జానాతు మావతారంతే కంసోయం దితిజన్మజః’’ (అన్నింటికి నాత్మయగువాఁడా! నాలుగు భుజములుగల నీయొక్క రూపమును కానరాకుండచేయుము రాక్షసుండగు కంసుడు నీయొక్క యవతారమును గుర్తెఱుంగకకుండుగాక;) అన్నట్లు దేవకియును మొదలగువారిని యీతావున దృష్టాంతముగాఁ గొనునది.

అవతారిక— ఈవిషయమునకుఁగల వైలక్షణ్యమనునది యందఱిచేతనున్న మంగళాశాసనమును చేయించునను విషయమున వేఱొక్క దృష్టాంతమును జూపించుచున్నారు.

(లక్ష్మణస్వామిని) ఇత్యాది. శృంగిబేరపురమున వేంచేసియుండి శ్రీగుహదేవుని స్వీకరించినప్పుడు సౌఖ్యమునుగుర్తెరింగిన వారై శ్రీలక్ష్మణస్వామివారు యేర్పఱచిన పర్ణశయ్యయందు శ్రీరామచంద్రుండును, సీతాపిరాట్టియును పవ్వళించియుండఁగా, లక్ష్మణస్వామివారు బాల్యమునుండియును శ్రీరామచంద్రుని విషయమున నెక్కువ ప్రీతిగలవారగుటచే ‘‘వారికేమి సంభవించునో?’’ యని భయపడి వీపున అంబులపొదినిన్ని, వ్రేలిని అంగుళిరక్షకమునున్ను ధరించి త్రాటిని సరిచేసి బాణమును మధ్యనుంచిన విల్లును చేతఁబట్టుకొని నడుచున్నట్టి

కణ్ణు, శ్రీగుహప్పెరుమాళ్, "ఒరుతమ్బి తాయైక్కొణ్డు రాజ్యత్తైవాఙ్గి క్కట్టినకాప్పోడే కాట్టిలే తళ్ళివిట్టాన్. ఇవనుమవ్వోపాతి ఒరుతమ్బియన్రో, తనియిడత్తిలే ఎన్న శెయ్యనినైత్తు ఇప్పడి అయత్తమాయ్ నిన్రానెన్రు తెరియాతు" ఎన్రతిశఙ్కైపణ్ణి, "అప్పడి ఏతేను మొరు తీఙ్గునినైక్కిల్ అవన్రనైత్తీరక్కొణ్డ కడవోమ్" ఎన్రు విల్లుమ్ కోలుమాయ్క్కొణ్డు ఇవరిట్టపడియిలే యుడియిట్టునిఱ్క శ్రీగుహప్పెరుమాళ్ ఏవల్ శెయ్యుమ్ పరికరమ్, "అవన్ జ్ఞాతి, ఇవన్ కుటిలమ్బనాన వన్యన్, ఇవర్కళిరువరుమాక ఇవ్విషయత్తై ఎన్న శెయ్యత్తేడు కిఱార్కళో!" ఎన్రు ఇవర్గళైయుమతిశఙ్కైపణ్ణి, "అప్పడి శెయ్యిల్ ఇవర్కళై యుమ్ శేయ్తుమ్ నామ్ రక్షిక్కైయుమ్ నోక్కక్కడవోమ్" ఎన్రు తనిత్తనియే కైయుమ్ విల్లుమాయ్క్కొణ్డు పెరుమాళైరక్షిత్తతిఱేయున్రై. శ్రీభరతాళ్వానుక్కు విశేషమ్ శొల్లుకిఱవిడత్తిలే శ్రీగుహప్పెరుమాళ్, "నియమ్యబద్ధగోధాఙ్గులిత్రవాన్ శరైస్సుపూర్ణామిషుధిం పరన్తపః । మహద్ధనుస్సజ్యముపోహ్య లక్ష్మణో నిశామతిష్ఠత్పరితోఽస్య కేవలమ్ । తతస్త్వహం చోత్తమచాపబాణధృత్ స్థితోఽభవం తత్ర సయత్ర లక్ష్మణః । అతన్ద్రిభిర్జ్ఞాతిభిరాత్తకార్ముకైర్మహేన్ద్రకల్పం పరిపాలయంస్తదా" ఎన్రు అవ్విరాత్రియిల్ వృత్తాన్తత్తై చ్చొన్నానిఱే.

శ్రీగుహప్పెరుమాళుక్కుమ్ పరికరత్తుక్కుమ్ అన్రుకణ్డమాత్రమొழియ పెరుమాళుడన్ మున్బు వాసనైయిల్లైయిఱే. ఇప్పడియిరుక్కచ్చెయ్తే ఇవర్కళుక్కు వ్యాకారమ్ కూడినపడియెన్నన్న, అ

---

ప్రకారమో? యనునట్లు వంచేయునట్టి శ్రీ లక్ష్మణస్వామి వారిని చూచినవాఁడై శ్రీగుహదేవుండు "ఒకతమ్ముఁడు తల్లిమూలముగ రాజ్యమును గైకొని కట్టియున్న కంకణములోఁ గూడనే యరణ్యముకుఁ బంపినవాఁడాయెను. వానివలెనే ఈతండును యొక తమ్ముఁడు కాఁడా?

"ఏకాంతమున నేమిచేయఁదలంచి యిట్లు సన్నద్ధుండైయున్నాఁడో తెలియదు" అనియిట్లు అనుమానించి "అట్లు యేదైన నొకయనిష్టమును తలంచియున్నట్లయిన, ఈతనినే చంపివేయుదము" అనుకొని విల్లును బాణములనున్నుఁ దీసికొని వీరునిల్చియుండుతావున నే నిలచియుండఁగా, గుహదేవునికి పనిచేయునట్టి పరజనము "వాఁడు దాయాది, ఈతండు కుటిలవృత్తిగల వనచరుండు వీరిరువురు కలిసి యీవిషయమున నేమి చేయఁతలంచియున్నారో!" అనుకొని యిద్దఱియెడలను అనుమానపడి "అట్లు చేసినచో, వీరిని వధించి శ్రీరామచంద్రుని రక్షింపఁగలము" అనుకొని ఒక్కొక్కఁడును విల్లును చేఁబట్టుకొనియుండి శ్రీరామచంద్రుని రక్షించినవారయిరి. భరతునికి యిచ్చటి విశేషములఁ దెల్పునప్పుడు శ్రీగుహప్పెరుమాళ్లు, "నియమ్యబద్ధగోధాఙ్గులిత్రవాన్ శరైస్సుపూర్ణామిషుధిం పరన్తపః । మహద్ధనుస్సజ్యముపోహ్యలక్ష్మణో నిశామతిష్ఠత్పరితోఽస్య కేవలమ్॥ తతస్త్వహం చోత్తమచాపబాణధృత్ స్థితోఽభవం తత్రసయత్రలక్ష్మణః । అతన్ద్రిభిర్జ్ఞాతిభిరాత్తకార్ముకైర్మహేన్ద్రకల్పంపరిపాలయంస్తదా" (లక్ష్మణస్వామి అంగుళిత్రమును ధరించి బాణములతో నిండియుండు అంబులపొదులను వీపున రెండువైపులఁ దగిలించుకొని విల్లును చేతఁబట్టుకొని రాత్రియంతయును కాచియుండెను. అంతట నేనున్ను బాణములను విల్లును చేతఁబట్టుకొని జ్ఞాతులు వనివాండ్రు మొదలగువారితోఁ గూడ మహేంద్రుని వలెనుండి శ్రీరామచంద్రుని రక్షించుచు లక్ష్మణస్వామి యుండుతావుననుంటిని) అనుతావున నీసమాచారమును ఆరాత్రి జరిగినదానినిగాఁ దెలిపియున్నారు.

. అవతారిక:—శ్రీగుహప్పెరుమాళ్లకున్ను పరజనముకున్ను ఆనాడు శ్రీరామచంద్రుని చూచియుండుటయేతప్ప పూర్వపుపరిచయమెద్దియును లేదు గదా! ఇట్లుండ, వీరికట్టితలంపు కలుగుట యెట్లంటివేని, తెలుపుచున్నారు.

**మూ॥ ౨౮౮॥ ఒరునాళ్ ముకత్తిలే విழித్తవర్కళై వడివழகు పడుత్తుమ్ పాడా యిర్ఱతు,**

**మూ॥ ౨౮౯॥ ఇవర్కళ్ నమ్ముడైయ కోటియిలే యెన్నుమ్పడి యాయిర్ఱు ఆழ్వార్కళ్ నిలై.**

రుళిచ్చెయ్కిఱార్, (ఒరునాళ్) ఎన్దుతుడఙ్గి. అతావతు- నెడునాళ్ వాసనైపణ్ణుకైయన్ఱిక్కే ఒరునాళ్ ముఖదర్శనమ్ పణ్ణినవర్కళైయుమ్, అవర్ విగ్రహవైలక్షణ్యమ్ పడుత్తుమ్పడియాయిర్ఱితు ఎన్ఱై "సదాపశ్యన్తి" పణ్ణినాల్ పోలే సకృద్దర్శనమ్ పణ్ణినాగైయుమ్ ప్రేమాన్ధరాయ్ అస్థానే భయశఙ్కైయాలే అనుకూలరైయుమ్ మతిశఙ్కైపణ్ణి ప్పరిన్దు నోక్కుమ్పడిపణ్ణవల్లా యిఱే భగవద్విగ్రహసౌన్దర్య మిరుప్పతు.

ఇన్నుమివ్వర్థత్తుక్కు ఉదాహరణమాకక్కీழ్ చ్చొన్నవర్కళిటాట్టిల్ వ్యావృత్తరాన ఆழ்வார్కళుడైయ మఙ్గళాశాసననిష్ఠైయై యరుళిచ్చెయ్కిఱార్, (ఇవర్కళ్) ఎన్దుముడఙ్గి. (ఇవర్కళ్) ఎన్దుచక్రవర్తిముతలాకక్కీழ் చ్చొన్న వధికారికళైయడైయ పరామర్శిక్కిఱతు. ఆనాల్ పిరాట్టియైయుమ్ ముక్కచ్చొల్లలామోవెన్నిల్, ఆழ்వార్కళిల్ తలైవరాన నమ్మాழ்వారిలుమ్ కాట్టిల్ పెరియాழ్వార్కుక్కు ఏఱ్ఱమ్శొల్లుకిఱపోపోలే, భోగపరవశైయాన అవళిటాట్టిల్ మఙ్గళాశాసనత్తిలూఱ్ఱత్తాలే ఆழ్వార్కళుక్కేఱ్ఱమ్ శొల్లక్కుఱైయిల్లై. ఆనాలుమ్ నమ్ముడైయ

**మూ॥ ౨౮౮॥ ఒకరోజున ముఖదర్శనము చేసినవారినిన్ని దివ్యమంగళ విగ్రహ సౌందర్యము ప్రేమపరవశులనుగాఁ జేయును,**

**మూ॥ ఆழ్వారులకుఁగల ప్రీతినిబట్టి చూడఁగా, ఈ దశరథాదులు అస్మదాదులతో సమానులుగా నెన్నఁదగియుందురు.**

(ఒకరోజున) ఇత్యాది. చిరకాలానుభవములేకుండ ఒక్కరోజున సేవించినవారినిన్ని వాని దివ్య మంగళ విగ్రహవైలక్ష్యము ప్రీతిపరవశులనుగాఁ జేయునదియయినది.

"సదాపశ్యంతి" అన్నట్లు ఎల్లప్పుడును రెప్పవాల్పకుండ చూచు నిత్యసూరులవలెనే ఒక్కతడవ సేవించినవారున్ను ప్రేమాంధులయి అనుచితవిషయమునను భయముతోచుటచే అనుకూలులగు వారియెడలనున్ను అనుమానముగలిగి భయపడి రక్షించునట్లు చేయువట్టిదికాను గదా భగవద్విగ్రహ సౌందర్యముండును.

ఇఁకను ఈవిషయమున దృష్టాంతముగాను ఇంతకుముందు పేర్కొనిన వారికంటెను విలక్షణులగు ఆழ్వారుల మంగళాశాసననిష్ఠను తెలుపుచున్నారు.

(వీరు) ఇత్యాది. వీరు అనఁగా నింతకుముందు పేర్కొనఁబడినట్టి దశరథచక్రవర్తి మొదలుగాఁగల యధికారులందరుననుట. అయితే పిరాట్టినిగూడ వీరితోఁజేర్చి చెప్పవచ్చునా యంటివేని, ఆழ்వారులలోఁ బ్రధానులగు నమ్మాழ்వారులకంటెనున్న పెరియాழ்వారుల నెక్కుపవారినిగాఁ దెలుపునట్లు, భోగపరవశురాలగు ఆమెకంటెనున్న మంగళాశాసనమునఁగల ప్రీతిమూలమున నాழ்వారులే యెక్కువవారని చెప్పవచ్చును.

**మూ॥ ౨౫౦॥ అళ్వార్కళెల్లారైయుమ్పోలల్లర్ పెరియాళ్వార్**

**మూ॥ ౨౫౧॥ అవర్కళుక్కు ఇతు కాదాచిత్కమ్, ఇవర్క్కు ఇతు నిత్యమ్,**

---

కోటియిలే) ఎన్నలామోవెన్నిల్, ఇప్పద్ధనిష్ఠైయిఅవర్కళుడైయ యాధిక్యత్తైదర్శిప్పిక్కైక్కాక చ్చొన్నతాకైయాలే విరోధమిల్లై. అకైయాల్ ఇవ్విషయవైలక్షణ్యకలుషచిత్తరాయ్ "ఇతు క్కెన్నవరుకిఱతో?" ఎన్ఱు పరన్ఱు నోక్కినవర్కళాక క్కొచ్చొల్లప్పట్టవర్కళెల్లారు మెన్నపడి. (నమ్మైడైయకోటియిలేయొన్నప్పడియాయిర్ఱు) ఎన్నతు-ఇవ్విషయత్తిలేయన్వయిత్తిరుక్కచ్చెయ్ తేయుమ్, ప్రేమాభావత్తాలే మఙ్గళాశాసనత్తిలూన్ఱిమన్ఱిరుక్కిఱ నమ్మోపల్వార్సాత్రమె న్ఱుశొల్లలామ్పడియాయిర్ఱైన్నపడి. (అళ్వార్కళ్ నిలై) ఎన్నతు- మయర్వఱమతినలమ్ పెఱ్ఱవర్కళాకైయాలే నిరతిశయప్రేమయుక్తరాన అళ్వార్కళుడైయ మఙ్గళాశాసననిష్ఠైయెన్నపడి.

ఇవ్వాళ్వార్కళ్ తాఙ్గళ్ మఙ్గళాశాసనత్తిల్ వన్దాల్ తఙ్గళిలొప్పర్కళో వెన్న, అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (అళ్వార్కళ్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు- మఙ్గళాశాసనత్తిల్ మఱ్ఱుళ్ళఆళ్వార్కళుక్కుమ్ పెరియాళ్వారుక్కుమ్ నెడువాశియుణ్డెన్నై.

అవర్కళైప్పఱ్ఱ ఇవర్క్కుత్తిలేఱ్ఱమేతెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (అవర్కళుక్కుతు) ఎన్ఱుతుడఙ్గి. (అతావతు- మయర్వఱమతినలమ్ పెఱ్ఱమై రొటుత్తిరుక్కచ్చెయ్తే వయిరవురు

---

**మూ॥ ౨౫౦॥ ఆళ్వారులందఱువంటివారు కారు పెరియాళ్వారులు,**

**మూ॥ ౨౫౧॥ వారు మంగళాశాసనమును కదాచిత్కముగ జేయుదురు. వీరు దీని నెల్లకాలమున్ను చేయుచునే యుందురు.**

---

అయినను "మనబోటివారు" అని చెప్పనెట్లు నాయంటివేని, ఈవిషయమునందు యను ష్ఠానమున వీరికిఁగల యాధిక్యమును జూపించుటకై చెప్పినదియగుటంజేసి బాధకము లేదు. కావున ఈవిషయమునకుఁగల వైలక్షణ్యముచే చలించిన యంతఃకరణముగలవారై "దీనికేమిసంభవించు నో?" అని భయపడిరక్షించునట్టివారుగాను ఇంతకుముందు చెప్పఁబడినట్టి వారందఱునని యర్థము మనబోటివారుగా నయినట్లయినది యనఁగా—ఈవిషయముతో సంబంధించియున్నను, ప్రీతిలేక పోవుటంజేసి, మంగళాశాసనము విషయమున ప్రీతిలేకయుండు మనవంటివారేయని చెప్పఁదగి నట్లయినది. ఆళ్వారులస్థితియనఁగా నించుకైనను ప్రమాదములేనట్టి జ్ఞానానందమును లభించిన వారగుటంజేసి ఎక్కువ ప్రీతిగలవారలగు నాళ్వారులకు మంగళాశాసనము విషయమునఁగల నిష్ఠయనుట.

అవతారిక—ఈయాళ్వారులందఱును మంగళాశాసనమున తమలో నొకరితో నొకరు సమానులేనా? యంటివేని తెలుపుచున్నారు.

(ఆళ్వారులు) ఇత్యాది. మంగళాశాసనమువిషయమున తక్కినయాళ్వారులకును పెరియాళ్వారులకున్ను యెక్కువ భేదము కలదు.

అవతారిక;—వారికంటెను వీరికీవిషయమునఁగల యాధిక్యమేది యంటివేని తెలుపు చున్నారు.

(వారికి) ఇత్యాది. ఇంచుకైనను ప్రమాదములేనట్టి జ్ఞానానందమును లభించియుండువిష యమున నందఱును సమానులేయైనను, వజ్రలేపమై పురుషులనున్ను స్త్రీవేషము వేసికొన గోరునట్టు

**మూ॥ ౨౭౧॥ విషయదోషత్తాలే వరుమవైయెల్లామ్ దుస్త్యజమాయిఱే యిరుప్పతు,**

---

లరన్ఱు నినైక్క వేణ్డివరుకైయాల్, స్వప్రయోజనపరరై ప్రతికూలరన్ఱై దోషమన్ఱో వెన్ఱునినైత్తు ప్పణ్ణుకిఱ శఙ్కైయై యనువదిక్కిఱార్. (స్వప్రయోజనపరరల్లారైయుమ్ ప్రతికూలరాకనినైక్కలా మోవెన్నిల్) ఎన్ఱు.

అత్తై ప్పరిహరిక్కిఱార్, (ఇఙ్గు) ఎన్ఱుతుడఙ్గి. అర్థమ్ పూర్వవత్.

నిగమిక్కిఱార్, (ఆకైయాలే దోషమిల్లై) ఎన్ఱు. స్వప్రయోజనపరరై ప్రతికూలరన్ఱు శొన్నతిల్ దోషమిల్లైయెన్నై. ఎన్ఱిఙ్గనే యోజిక్కవుమామ్.

ఇప్పడి ఆశ్రయదోషజన్యమన్ఱిక్కే విషయదోషజన్యమానాలుమ్ స్వరూపవిరుద్ధమానతు త్యాజ్యమన్ఱోవెన్న; అరుళిచ్చెయ్ కిఱార్ మేల్, (విషయదోషత్తాల్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు- అనుభవ విషయమాన అవనుడైయ వయిరవురుక్కాయ్ అణ్ణైయుమ్ పెణ్ణుడై యుడుత్తుమ్పడి యాన విగ్రహత్తై అత్యున్యమాకిఱదోషత్తాలే వరుకిఱ స్వప్రయోజనపరతై, తద్ధేతువాన ప్రావణ్యమ్, తత్సిద్ధ్యర్థమాన వ్యాపారఙ్గళాకిఱవివైయెల్లామ్ స్వరూపవిరుద్ధమెన్ఱు విడప్పార్త్తాలుమ్ విడవరితాయిఱే యిరుప్పతెన్నై. (విషయదోషత్తాలే వరుమతు) ఎన్ఱు పాఠమానపోతు, స్వప్రయోజనమాత్రత్తైయే శొల్లుకిఱతు.

---

మూ॥ ౨౭౧॥ **విషయదోషమువలనఁ గలిగినవి యన్నియును త్యజించుట కశక్యములుగాను కదా యుండును.**

---

డుటంజేసి, వారున్ను స్వప్రయోజన పరులని తలంపవలసియుండుటంజేసి, స్వప్రయోజనపరులు ప్రతికూలులనుట దోషముకాదా? యనెడి శంకను అనువదించు చున్నారు. (స్వప్రయోజనపరుల నందఱిని ప్రతికూలులని తలంపవచ్చునాయంటివేని) ఇత్యాది.

**అవతారిక:**—ఆశంకను పరిహరించు చున్నారు. (ఇచ్చట) ఇత్యాది. ఈ వాక్యముల కర్థము పూర్వమువలెనే.

**అవతారిక:**—ఈ విషయమును ముగించు చున్నారు. (కావున) ఇత్యాది "కావున" అను దాని కర్థము పూర్వమువలెనే. దోషము లేదనఁగా స్వప్రయోజనపరులను ప్రతికూలులనుట దోషముకాదనియును అర్థము చెప్పఁకొన వచ్చును.

**అవతారిక:**—ఇట్లు ఆశ్రయదోషము వలనఁ గలిగినది కాక, విషయదోషమువలనఁ గలిగినది యైనను స్వరూపవిరుద్ధమైనది త్యాజ్యముకాదా? యంటివేని తెలుపుచున్నారు

(విషయదోషమువలన) ఇత్యాది. అనుభవ విషయమైనట్టి సర్వేశ్వరునియొక్క ఘనీభవించినదియు పురుషులనున్ను స్త్రీలనుగా భావించికొనునట్లు చేయునట్టి శరీర వైలక్షణ్యరూపమగు దోషమువలనఁగలుగునట్టి స్వప్రయోజన పరతయును, అందులకుఁగారణ భూతమగు ప్రావణ్యమును, అది సిద్ధించుటకై యొనర్చునట్టి వ్యాపారమున్ను ఇవి యన్నియును స్వరూపవిరుద్ధములని వదలుకొన తలంచినను వదలుకొనుటకు దుర్లభములుగాను కదా యున్నవి. "విషయదోషముచేతను వచ్చునది" అను పాఠమున్నట్లయిన స్వప్రయోజన మాత్రమునే అర్థమునఁ గొనునది.

**మూ॥ ౨౨౩॥ ‘‘ఊమైయరోడు శెవిడర్ వార్తై’’ ‘‘కథమన్యదిచ్ఛతి.’’**

---

విషయదోషత్తాల్ వరుమతీఙ్దు త్యజిక్కైత్తిల్ ప్రమాణమ్ కాట్టుకిఱార్ మేల్, (ఊమై యరోడు శెవిడర్ వార్తై, కథమన్య దిచ్ఛతి) ఎన్ఱు. ‘‘మర్ఱిరున్దిర్ కట్ట’’ ఎన్ఱు తుడఙ్గి ‘‘అత్తై యాలే పేఱెన్ఱుణరియిట్టాల్ అవన్ వరుమళవుమ్ కర్మప్రాప్తి పార్త్తు ఆఱియిరుక్కవేణుమ్ ఙాన్, నీ ఇజ్జనే పతఱలాకాదుకాణ్’’ ఎన్ఱ తాయ్మార్కైక్కుఱిత్తు, ‘‘ఇవ్విషయత్తిల్ ప్రావణ్య మిన్ఱిక్కే ఏన్నుడైయ నిలైక్కు వేరాయిరున్ద ఉఙ్గళుక్కు ఎనక్కోడుకిఱ దశై యఱియప్పోకాదు, ‘‘అవన్ అవన్’’ ఎన్ఱు వాయ్వులర్ఱుమ్పడి శ్రియఃపతి విషయమాన ప్రావణ్యత్తై మఱుపాడురువ వుడైయేనాయ్, ఇప్పడి ఇవనై యొழியచ్చెల్లామైయుణ్డానాల్ అవనిరున్ద విడత్తే శెన్ఱు కిట్టుకైప్రాప్తమాయిరుక్క, అతుక్కు కాల్నడై తారాతపడి యిరుక్కిఱ వెనక్కు, నానవనోడే శెన్ఱు శేరామైక్కు ఉపాయ నీఙ్గళ్ శొల్లుమ్వార్తై, కేట్కైక్కు ప్పరికరమిల్లాత శెవిడరోడే శొల్లుకైక్కు ప్పరికరమిల్లాత ఊమైకళ్ వార్తై శొన్నాప్పోలే యిరుప్పతొన్ఱు’’ ఎన్ఱు ఆణ్డాళరుళిచ్చెయ్కైయాలుమ్, ‘‘తవామృతస్యన్దిని’’ ఎన్ఱుతుడఙ్గి ‘‘వకుత్తశేషియాన దేవరుడైయ తేనేమలరుమ్ తిరువడి తామరైకళిల్ భోగ్యతైయి లేయూన్ఱిన నెఞ్జు మర్ఱోరు క్షుద్రవిషయత్తై విరుమ్బుమ్పడి యెజ్జనే? మధువే జీవనమానవణ్డు, మధుపరిపూర్ణమాన తామరైప్పూవానతు నిఱ్కచ్చేయ్తే అతిక్షుద్రమాన తాఱ్, కిట్టుకై యరితాయ్ కిట్టినాలుమ్ నాక్కునైక్కప్పోకాతతాయిరుక్కిఱ ముళ్ళిప్పూవిల్

---

**మూ॥ ౨౨౩॥ ఈ సంధర్భమున ‘‘మూంగవారితో చెవిటివారి సంభాషణమును’’ ‘‘కథమన్యదిచ్ఛతి’’ అను శ్రీసూక్తినిన్ని అనుసంధించుకొనునది.**

---

అవతారికః—విషయదోషము వలనఁ గలిగిన దానిని వదలుట దుర్లభమను విషయమును గుఱించిన ప్రమాణముఁ దెలుపు చున్నారు.

(మూంగవారితో) ఇత్యాది ‘‘ మర్ఱిరున్దిర్ కట్కు’’ (నా,తి. ౧౨—౧) అనునది మొదలుకొని ‘‘వాని వలననే ఫలము కలుగ వలయునని తెలిసికొనియుంటివేని, వాడు వచ్చువరకును, కర్మప్రాప్తిని నిరీక్షించుచు సహించియుండ వలయును సుమీ! నీవు ఇట్లు అవసరపడగూడదు’’అని చెప్పునట్టి తల్లిని చూచి ‘‘ఈ విషయమునఁ బ్రీతిలేక, నాస్థితికంటెను వేఱయిన స్థితిలోనుండునట్టి మీకు నాస్థితి తెలియుట దుర్లభము. ‘‘వాఁడు వాఁడు’’ అని నోరార శ్రియఃపతి విషయమగు ప్రావణ్యమును పూర్తి గలదాననై ఇట్లు వానిని విడిచియుండజాలని నాననగుటచే వాఁడుండు నటి తావునకుఁబోవలసియుండఁగా అచటికిఁబోజాలక యుండునట్టి నాతో మీరు నేనువానితోఁ జేరకుండునట్లు చేయుటకై చెప్పునట్టి మాటలన్నియును,వినజాలని చెవిటివారితో మాట్లాడజాలని మూంగవాళ్ల సంభాషణమువంటిది’’ అని ఆండాళు ఆనతిచ్చియున్నందునను, ‘‘తవామృతస్యందిని’’ (స్తో.ర)అని యారంభించి‘‘ప్రాప్తశేషియగు దేవరవారియొక్క తేనెతోనిండియుండుశ్రీపాదకమలముల భోగ్యతయందు రుచిమరిగినట్టి నామనస్సు తక్కిన క్షుద్రవిషయములఁ బ్రేమించుట యెట్లు? తేనెతో జీవించునట్టి తుమ్మెద తేనెతో నిండియుండు పద్మముతెదురుగ నుండఁగా, వాటి రుచి నెఱింగట్టి తానువెన్నడును పోనిదియు,ఒకవేళ పోయినప్పటికిన్ని నాలుకతో నాస్వాదించుట కశక్యమైనట్టి ముండ్లపువ్వునందు వాలదు సరియే కదా! దానిని కన్నెత్తి చూడనున్ను చూడదు కదా !

**మూ॥ ౨౭౮॥ఇప్పడి యివై యిత్తనైయుమ్ సదాచార్య ప్రసాదత్తాలే వర్ధిక్క**
**మ్పోతైక్క, వస్తవ్యమ్ ఆచార్య సన్నిధియుమ్ భగవత్సన్నిధియుమ్,**

---

శెన్రు పడియాతమాత్రమన్రిక్కే, అత్తైక్కటాక్షిప్పతుమ్ శెయ్యాతిరో" ఎన్రు ఆళవన్దారరుళిచ్చెయ్కైయాలుమ్, విగ్రహవైలక్షణ్యమ్కణ్డు భగవద్విషయత్తిల్ ప్రవణరానవర్కళై మీట్కవరితెన్రు తోన్ఱుకైయాలే, విషయదోషత్తాల్ వరుమతు దుస్త్యజ మెన్నుమిడమ్ సిద్ధమిఱే.

అక, దినచర్యోక్త మఙ్గళాశాసన,అనుకూలసహవాస, ప్రతికూలసహవాసనివృత్తికళై వివరిత్తార్కీళ్, "సదాచార్య ప్రసాదత్తాలే వర్ధిక్కుమ్పడి పణ్ణికొణ్డుపోరక్కడవన్" ఎన్రత్తైవివరిక్కిఱార్ మేల్, (ఇప్పడి) ఎన్రుతుడఙ్గి. (ఇప్పడి యివై యిత్తనైయుమ్ సదాచార్య ప్రసాదత్తాలే వర్ధిక్క మ్పోతైక్క) ఎన్రతు=కీళ్ చొన్న ప్రకారత్తిలే ఇన్దస్వభావవిశేషఙ్గళెల్లామ్ సదాచార్యనుడైయ ప్రసాదత్తాలే కొళున్దువిట్టు ఏఱిన్దు వరుమ్పోతైక్కొళ్ళుమ్పడి. (వస్తవ్యమాచార్య సన్నిధియుమ్ భగవత్సన్నిధియుమ్) ఆవాతు=ఇవనుక్కు వాసస్థలమ్, హితైషియాయ్ ఉపదేశాదికళాలే ఇవన్ఱనుక్కు ఉత్పాదకనాన స్వాచార్యనుడైయ సన్నిధియుమ్, అవన్ కాట్టికొడుక్కక్కణ్డు అవనుకన్దవిషయమాయ్ తన్పక్కలిలే విశేష కటాక్షాదికళై ప్పణ్ణికొణ్డుపోరు మర్చావతార మాన భగవాన్ సన్నిధియుమెన్గై. ఇతుసముచ్చయముమన్రు, సమవికల్పముమన్రు, ఆచార్య సన్నిధియే ప్రధానమ్, తదలాభత్తిల్ అర్చావతార సన్నిధియన్రపడి, ఆకైయిఱే అచా

---

**మూ॥ ౨౭౮॥** ఇట్లు వీటినన్నింటిని సదాచార్యుని యనుగ్రహమువలన వృద్ధిబొందించుకొనుటకుగాను వసింపవలసినది ఆచార్య సన్నిధియును, భగవత్సన్నిధియును,

---

అని యిట్లు శ్రీ యామునాచార్యులును సాయించి యున్నందుననున్ను భగవద్విగ్రహవైలక్షణ్యముం గని భగవద్విషయమునం బ్రీతికలవారిని ఆవిషయమునుండి మరల్పుట దుర్లభమని తోచుటంజేసి, విషయ దోషమువలన సంభవించునది దుస్త్యజమని సిద్ధమగుచున్నది.

అవతారిక:—కావున దినచర్యయందు చెప్పంబడిన మంగళాశాసనము అనుకూల సహవాసము, ప్రతికూలసహవాసనివృత్తి అను వీటిని యింతకుముందు వివరించిరారు. "సదాచార్యునియనుగ్రహమువలన వృద్ధిపొందించుకొనుచు పోగలడు" అను దానిని వివరించుచున్నారు.

(ఇట్లు) ఇత్యాది "ఇట్లు వీటినన్నింటిని సదాచార్యుని యనుగ్రహమువలన వృద్ధి పొందించుకొనుట" యనఁగా "ఇంతకుముందు చెప్పినప్రకారము ఈ స్వభావవిశేషములనన్నింటిని సదాచార్యుని యనుగ్రహమువలన చిగిర్చి పిలకలు వేయునట్లు వృద్ధిపొందించు కొనుట" అని యర్థము.

"వసింపవలసినది ఆచార్యసన్నిధియు,భగవత్సన్నిధియును"అనఁగా "ఈతండు వసించుతావు ఈతని హితమును గోరువాఁడై ఉపదేశాదుల మూలమున వీటింగలుగఁజేసినవాఁడగు స్వాచార్యుని సన్నిధియును,అట్టియాచార్యుండు చూపింపఁగా తాను చేపట్టినదియు, అతఁడు ప్రేమించినదియు, తనవిషయమున విశేషకటాక్షముఁజూపించినట్టి యర్చావతారమగు భగవంతునిసన్నిధియును అనుట. ఈ పైని చెప్పినది సముచ్చయము కాదు.అనఁగా ఈ రెండున్ను వాసస్థలములని కాదు. సమ వికల్ప

సూ॥ వక్తవ్యమ్ ఆచార్యవైభవమున్ స్వనికర్షమున్,
జప్తవ్యమ్ గురుపరమ్పరైయుమ్ ద్వయముమ్

ర్యసన్నిధిగళై ముఖ్యమాగ వరుళిచ్చెయ్‌తతు. «మద్భక్తైస్సహసంవాస స్తదసిద్ధావయాపివా» ఎన్ఱిఱే భగవదుక్తియుమ్. ఇని (వక్తవ్యమ్) తుడఙ్గి మేలైయసముచ్చయమ్.

(వక్తవ్యమాచార్యవైభవముమ్ స్వనికర్షముమ్) అతావతు-ఇవనుక్కు సర్వకాలముమ్ నాక్కాల్ శొల్లప్పడుమతు, దుర్గతియేపర్ట్రాశాక త్తైయ ఉజ్జీవిప్పిత్తరుళిన ఆచార్యనుడైయ దయాక్షాన్త్యాది వైభవముమ్, ఎత్తనైయేనుమ్ దయాదిగుణపరిపూర్ణరు మేయిట్టుప్పార్క్క వరువరుక్కుమ్బడి నిన్ఱ ఆత్మగుణపూర్తియాకిల తన్నుడైయ నికర్షముమాకిల ఇవైయిరణ్డుమెన్ఱై, శ్రీమధురకవియాళ్వార్ «నన్ఱ్ఱయాల్» ఎన్ఱుమ్ పాట్టు తుడఙ్గి ఇవై యిరణ్డైయుమ్ విశదమాక వరుళిచ్చెయ్‌తారిఱే.

(జప్తవ్యమ్ గురుపరమ్పరైయుమ్ ద్వయముమ్) అతావతు-ఇవనుక్కు కాలక్షేపత్తుక్కుమ్ భోగత్తుక్కుమ్ ముఖ్యమాక రహస్యమాక వనుసన్ధిక్కక్కడవతు - «రామానుజాఙ్ఘ్రి శరణోఽస్మి» ఇత్యాదియిల్ పడియే సర్వేశ్వరన్ తిరునామత్తుక్కు క్కడలాగ «సదాచార్య వంశోజ్జ్ఞేయః ఆచార్యాణామసావసావిత్యాభగవత్తః» ఎన్గిఱపడియే స్వాచార్యాదిపరమాచార్యర్

మూ॥ చెప్పవలసినది ఆచార్య వైభవమును తన నైచ్యమును.
మూ॥ అనుసంధింపవలసినది గురుపరంపరయును ద్వయమును.

మున్నుకాగు అనఁగా ఈ రెంటిలో నెద్దియైన నొక్కటిమాత్రము అట్టిది యనియును కాదు. అయితే ఆచార్య సన్నిధియే ప్రధానము. అది లభింపనప్పుడు అర్చావతార సన్నిధియని యెఱుంగునది. కావుననే మూలమున ఆచార్య సన్నిధిని ముందుగ పేర్కొనియున్నారు. «మద్భక్తైస్సహసంవా స స్తదసిద్ధావయాపివా» (నా భక్తులతోఁగూడ వసించునది. అది లభింపక పోయినట్లయిన, నా సన్నిధిని వసించునది) అని కదా భగవంతుఁడున్ను చెప్పియున్నాఁడు.

«వక్తవ్యమ్» అను వాక్యము మొదలుకొని యిఁక మీఁద చెప్పఁబోవు వాటినన్నింటిని సముచ్చయముగాఁగొనునది. అనఁగా నిఁక మీఁదు చెప్పఁబోవు వాటినన్నింటిని అనుష్ఠింపవలయు ననుట.

«చెప్పవలసినది ఆచార్య వైభవమును స్వనైచ్యమును» అనఁగా «ఇతఁడు సర్వకాలముల యందును వాక్కుచేఁ జెప్పవలసినది తన దుర్గతినే హేతువునుగాఁగొని తనను అంగీకరించి నట్టి యాచార్యుని యొక్క దయా క్షాంత్యాది వైభవమున్ను ఎంత దయాదిగుణములున్న వారైనను [illegible] నంత దోషపరిపూర్ణుఁడుగా నుండుటయును తనయొక్క తక్కువస్థితియును» అనుట. «నన్ఱి యాల్» (కణ్ణి, ౮-౫-౨) ఇత్యాది పాశురముల యందు ఈ రెంటినిన్ని శ్రీమధురకవియాళ్వారులు విశదముగాఁ దెలిపియున్నారు కదా!

«జపింపవలసినది గురుపరంపరయును ద్వయమున్ను» అనగా «ఇతనికి ప్రొద్దు పోవుటకును భోగమునకును అనుకూలముగాను రహస్యముగ అనుసంధించుకొనవలసినది. «రామానుజాంఘ్రిశరణోఽస్మి» «రామానుజదాసుఁడను» అని చెప్పియున్నట్లు సర్వేశ్వరుని తిరుమంత్రమునకు పూర్వము «సదాచార్యవంశో జ్ఞేయః ఆచార్యాణామసావసావిత్యా భగవత్తః» (ఆచార్యులలో నితండీతండు సదా

**మూ॥ పరిగ్రాహ్యమ్ పూర్వాచార్యర్కళుడైయ వచనముమ్ అనుష్ఠానముమ్,**

**పరిత్యాజ్యమ్ అవైష్ణవ సహవాసము మభిమానముమ్,**

---

గవత్పర్యన్తైయాన గురుపరమ్పరైయుమ్, అన్దగురుపరమ్పరాప్రాప్తమాయ్ స్వాచార్యన్ తనక్కు రక్షకమాక ఉపదేశిత్త ద్వయముమెన్గై ఇత్తాల్ గురుపరమ్పరాపూర్వకమాన ద్వయమే ఇవనుక్కు రహస్యమాక వనుసన్ధిక్కక్కడవదు ఎన్ఱపడి. భాష్యకారర్ కూరత్తాళ్వాన్ ప్రకారమ రుళిచ్చెయ్దరుళిన త్తిల్ "ద్వయమర్థానుసన్ధానేన సహ సదైవం వక్తా" ఎన్ఱు పెరియ పెరుమా ళరుళిచ్చెయ్దతు.

(పరిగ్రాహ్యమ్ పూర్వాచార్యర్ కళుడైయ వచనము మనుష్ఠానముమ్) ఆవదు- తనక్కు జ్ఞానానుష్ఠానజ్ఞ ళ్ఞ్గళిరుక్కైక్కు ఉపాయమాక క్కడవద్గళాన ఇవనాల్ పరిగ్రహిక్కప్పడు మవై- నాథమునికళ్ ముదలాక ఇవ్వరుమళవు పూర్వాచార్యర్ కళుడైయ జ్ఞాతవ్యార్థప్రకాశకమాన దివ్యవచనఙ్గళుమ్, అన్దవచనానురూపమాక మవర్ అనుష్ఠానఙ్గళుమెన్గై. "సువ్యాహృతాని మహతాం సుకృతాని తత స్తతః। సఞ్చిన్వన్ ధీర ఆసీత శిలహారీ శిలం యథా" ఎన్నక్కడవదిఱే.

(పరిత్యాజ్యమవైష్ణవసహవాసము మభిమానముమ్) ఆవదు- జ్ఞానానుష్ఠాననాశకమెన్నుమ్

---

**మూ॥ అవలంబింపవలసినది పూర్వాచార్యుల శ్రీసూక్తియును అనుష్ఠానమును.**

**మూ॥ త్యజింపవలసినది వైష్ణవులుకాని వారితో సహవాసమును, అభిమానమును.**

---

చార్యకంశముగ జన్మించినవాఁడు అని యిట్లు భగవంతునివరకు నెఱుంగునది) అని వ్రాయించి యున్నట్లు స్వాచార్యుండు మొదలు పరమాచార్యులద్వారా భగవంతుని వరకునుపోవు గురుపరం పరను అట్టి గురుపరంపర మూలముగ వచ్చినదియు, తనయాచార్యుండు తనకు రక్షకమైనట్టి దానినిగా నుపదేశించినట్టి ద్వయమును" అనుట.

ఇందువలన "గురుపరంపరా పూర్వకమగు ద్వయమే ఈచేతనుండు రహస్యముగ అనుసంధించు కొనవలసినది" అని యేర్పడుచున్నది.

భాష్యకారులకు కాలమును, గడపు మార్గము నుపదేశించు సందర్భమున, "ద్వయమును అర్థముతోఁగూడ ఎల్లప్పుడును అనుసంధించుకొనునది" అని కదా పెరియ పెరుమాళ్లు (శ్రీవరద రాజప్పెరుమాళ్లు) వ్రాయించియున్నారు.

"గ్రహింపవలసినది పూర్వాచార్యుల శ్రీసూక్తియు అనుష్ఠానమును" అనఁగా "తనకు జ్ఞానా నుష్ఠానములు వృద్ధిపొందుట కనుకూలముగ తానుచూచిన వానులనంతటను ఈతండు గ్రహింప వలసినది నాథమునులు మొదలుకొని యింతవరకుండు ఆచార్యులయొక్క తెలియవలసిన వాటిఁ దెలుపునట్టివియగు శ్రీసూక్తులును, వాటిని యనుసరించినవై దోషరహితములగు యనుష్ఠానములును" అనుట. "సువ్యాహృతాని మహతామ్ సుకృతాని తతస్తతః। సంచిన్వన్ ధీర ఆసీత శిలహారీ శిలం యథా" "(పరిగ్రహింపదగినవలెనే పూర్వాచార్యుల శ్రీసూక్తులను వారి యనుష్ఠానములను గూడ సంగ్రహించునది" అని శాస్త్రమునందును చెప్పియున్నదికదా!

"త్యజింపవలసినది వైష్ణవులుకాని వారిసహవాసమును, అభిమానమును" అనఁగా "జ్ఞానా నుష్ఠానములను నశింపఁజేయునవెడి భయముతో నీతండు బొత్తుగ వదలవలసినది వైష్ణవలక్షణములు

**మూ॥ కర్తవ్యమాచార్యకైఙ్కర్యముమ్ భగవత్కైఙ్కర్యముమ్.**

**మూ॥ ౨౭౫॥ కీழ் చ్చొన్న భగవత్కైఙ్కర్యమఱివతు శాస్త్రముఖత్తాలే.**

---

భయత్తాలే ఇవనుక్కు సవాసనమాక విడప్పడుమతు. వైష్ణవలక్షణమిల్లాతవర్ కళోడే సహవాసముమ్, అవర్కళ్ "ఇవన్ నమ్మవన్" ఎన్ఱు ఓరన్వయత్తాలే తన్నిడత్తిల్ పణ్ణుమభిమానముమేనై.

(కర్తవ్యమాచార్యకైఙ్కర్యముమ్ భగవత్కైఙ్కర్యముమ్) ఎన్నావతు - ఇవనుక్కు స్వరూపానుకూలమాకవే ఎప్పోతుమ్ శెయ్యప్పడుమతు, మహోపకారకనాన స్వాచార్యన్ విషయత్తిల్ ప్రేమపూర్వకమాకప్పణ్ణుమ్ కైఙ్కర్యముమ్. తన్నిడైయాగపరతన్త్రనాయ్ప్పణ్ణుమ్ భగవత్కైఙ్కర్యముమెన్నై. ఆక, దినచర్యైయిల్ శొన్న స్వభావవిశేషఙ్గళెల్లామ్ (సదాచార్యప్రసాదత్తాలే వర్ధిక్కుమ్బడి పణ్ణిక్కొణ్డుపోరుకైయావతు)- ఇప్పడి యిరుక్కుమ్ వస్తవ్యజప్తవ్య పరిగ్రాహ్య పరిత్యాజ్యకర్తవ్యఙ్గళైయఱిన్దు ఇవత్తిలే నిష్ఠనాయ్పోరుకై యెన్ఱతాయిత్తు.

ఇప్పడి కర్తవ్యమాన కైఙ్కర్యఙ్గళిరణ్డుమఱివతెమ్ముఖత్తాలే యెన్నుమాకాఙ్క్షైయిలే యరుళిచ్చెయ్కిఱార్ మేల్, (కీழ் చ్చొన్న) ఎన్ఱుతొడఙ్గి. (కీழ்) ఎన్నతు- వస్తవ్యాదికళైచ్చొన్న ఇన్దగ్రన్థత్తిలెన్నపడి. (భగవత్కైఙ్కర్యమఱివతు శాస్త్రముఖత్తాలే) ఎన్నతు- భగవానివనుక్కిప్పోతు వాయ్తిఱన్దు ఒన్ఱై అరుళిచ్చెయ్యామైయాలే తత్ప్రతిపాదకమాన శ్రుతి స్మృ

---

మూ॥ చేయవలసినది ఆచార్య కైంకర్యమును భగవత్కైంకర్యమును.

మూ॥ ౨౭౫॥ ముందు చెప్పిన భగవత్కైంకర్యమును శాస్త్రమునుండి తెలిసికొనునది

---

లేనివారితో సహవాసమును, అట్టివారు ఈతండు మనవాడు అని యేదొక సంబంధమువలన తన యెడలచూపునట్టి యభిమానమును" అనుట. "చేయవలసినది ఆచార్య కైంకర్యమును భగవత్కైంకర్యమును" అనఁగా "ఈతఁడు స్వరూపానుకూలముగ ఎప్పుడున్ను చేయవలసినది మహోపకారకుండగు స్వాచార్యుని విషయమున ప్రీతిపూర్వకముగాఁజేయునట్టి కైంకర్యమును, అట్టి యాచార్యుని యాజ్ఞకుబద్ధుండై చేయునట్టి భగవత్కైంకర్యమును" అనుట.

కావున దినచర్యయందుఁజెప్పఁబడిన స్వభావ విశేషములన్నింటిని సదాచార్యుని యనుగ్రహమువలన వృద్ధిపొందించుకొని పోవుటయనఁగా, ఈ పైని చెప్పఁబడినట్లు వసింపవలసిన వాటిని, జపింపవలసినవాటిని, త్యజింప వలసినవాటిని, చేయవలసినవాటినిన్ని తెలిసికొని, వాటిని అనుష్ఠించు కొనుచుండుట యని యేర్పడుచున్నది.

అవతారిక:—ఇట్లు చేయవలసినవిగాను చెప్పఁబడినటి కైంకర్యములను రెండింటినిన్ని తెలిసికొనుట యెట్లంటివేని తెలుపుచున్నారు.

• (ముందుచెప్పిన) ఇత్యాది. (ముందు) అనఁగా వసింపవలసినది మొదలగు వాటిఁజేర్చి పేర్కొనఁబడిన సందర్భమున ననుట. "భగవత్కైంకర్యమును తెలుసుకొనుట శాస్త్రద్వారా" అనఁగా "భగవంతుఁడు ఈతనికి ఇప్పుడు నోరుతెరచి ఒక్కదానిన్ని చెప్పియుండనందున

**మూ॥ ఆచార్య కైఙ్కర్యమఱివతు శాస్త్రముఖత్తాలు మాచార్యవచనత్తాలుమ్.**

మూ॥ ౨౭౬॥ కైఙ్కర్యమ్తాన్ ఇరణ్డు అతావతు-ఇష్టమ్ శెయ్కైయుమ్ అనిష్టమ్ తవిరుకైయుమ్

మూ॥ ౨౭౭॥ ఇష్టానిష్టఙ్గళ్ వర్ణాశ్రమఙ్గళైయుమ్ ఆత్మస్వరూపత్తైయుమ్ అవలమ్బిత్తిరుక్కుమ్.

---

త్యాది శాస్త్రముఖత్తాలే అఱియవేణుమెన్గై. (ఆచార్యకైంకర్యమఱివతు శాస్త్రముఖత్తాలు మాచార్య వచనత్తాలుమ్) ఎన్తు- ఆచార్యవిషయత్తిల్ శుశ్రూషాప్రకారఙ్గళై ప్రతిపాదిక్కుమ శాస్త్రముఖత్తాలుమ్, తనక్కిష్టానిష్టఙ్గళిన్న తెన్నుమిడత్తై యవరరుళిచ్చెయ్త వచనత్తాలుమెన్గై.

ఇని మేల్ కైఙ్కర్యవేషత్తైయరుళిచ్చెయ్కిఱార్ (కైంకర్యన్తాన్ ...) ఎన్గిఱార్.

అతావతే తెన్న, (అతావతిష్టమ్ శెయ్కైయుమనిష్టమ్ తవిరుకై ...) ఎన్గిఱార్.

ఇవై తానిరణ్డుమెత్తై యవలమ్బిత్తిరుక్కుమెన్న, అరుళిచ్చెయ్కిఱార్ మేల్ (ఇష్టానిష్టఙ్గళ్) ఎన్తుతొడఙ్గి. అతావతు - కీళ్చ్చొన్న కైంకర్య ప్రతిసమ్బన్ధిక ళాగువరుడైయవు మిష్టానిష్టఙ్గళ్ ఇవ్వధికారియుడైయ వర్ణాశ్రమఙ్గళైయుమ్ ఆత్మస్వరూపత్తైయుమ్ పత్తిగ్గియిరుక్కుమెన్గై. (ఇష్టానిష్టఙ్గళ్ వర్ణాశ్రమఙ్గళైప్పత్తి యిరుక్కైయావతు) - స్వవర్ణాశ్రమోచితమాన ధర్మఙ్గళై పరార్థబుద్ధ్యావనుష్ఠిక్కై యిష్టమాయ్ స్వార్థబుద్ధ్యావనుష్ఠిక్కై అనిష్టమాయిరుక్కై. పరార్థబుద్ధ్యా

---

**మూ॥ ఆచార్యకైంకర్యమును శాస్త్రమువలనను ఆచార్యుని వలనను తెలిసికొనునది.**

మూ॥ ౨౭౬॥ కైంకర్యము రెండువిధములు—ఇష్టమును చేయుటయును, అనిష్టమును తొలగించుటయును. ఇష్టానిష్టములు వర్ణాశ్రమములనున్ను ఆత్మస్వరూపమునున్ను బట్టియుండును.

---

తాని ప్రతిపాదించునట్టి శ్రుతిస్మృత్యాది రూపమగు శాస్త్రమువలన తెలియంగునది" అనుట.

"ఆచార్య కైంకర్యమును తెలిసికొనుట శాస్త్రముచేతను ఆచార్యునివచనమువలననుగా ఆచార్యవిషయమగు శుశ్రూష యొక్క విధములఁ దెలుపుట్టి శాస్త్రముచేతనున్ను తనకిష్టానిష్టములు ఇవియని తెలుపునట్టివాఁడగు ఆచార్యుని శ్రీసూక్తివలనను" అనుట.

అవతారిక:— ఇఁకమీఁదు కైంకర్యముయొక్క స్వరూపముఁ దెలుపుటకుగాను, కైంకర్యము రెండువిధములని యివ్విధమున తెలుపుచున్నారు.

అది యెద్దియనఁగా—ఇష్టముఁ జేయుట అనిష్టముఁ దొలగించుట యని తెలుపుచున్నారు.

అవతారిక— ఈరెండున్ను దేనిని అవలంబించి యుండునని తెలుపుచున్నారు.

(ఇష్టానిష్టములు) ఇత్యాది. ఇంతకుముంగు కైంకర్యమును గ్రహించువారలుగాఁ జెప్పఁబడినట్టి యుద్దతియొక్కయును ఇష్టానిష్టములు ఈయధికారియొక్క వర్ణాశ్రమములను, ఆత్మస్వరూపమునున్ను బట్టియుండును.

"ఇష్టములు వర్ణాశ్రమములనుబట్టి యుండుననఁగా—స్వవర్ణాశ్రమముల కనుకూలములగు ధర్మములను పరార్థము అనుష్ఠించుట యిష్టమై వాటినే స్వార్థముగా ననుష్ఠించుట యనిష్టమైయుం

అనుష్ఠిక్కైయావతు-లోకసఙ్గ్రహార్థమాగవుమ్ శిష్యపుత్రర్కళుడైయ ఉజ్జీవనార్థమాగవుమ్ అనృశంస్యత్తాలే అనుష్ఠిక్కై. ఇవ్వర్థత్తై, "ఇనియివఱ్ఱిల్ నమ్మాచార్యర్కళ్ అనుష్ఠిక్కుమతై శిష్యపుత్రర్కళుడైయ ఉజ్జీవనార్థమాగ అనృశంస్యత్తాలే అనుష్ఠిక్కుమార్ కళిత్తై. ఇప్పడి యనుష్ఠియాతపోదు భగవద్విభూతిభూతరాన చేతనర్కళ్ నాశహేతువాకైయాలే ఈశ్వరనుక్కు అనభిమత భూతవావర్. ఆకైయాల్ యాతొరళవాలే లోకసఙ్గ్రహమ్ పిఱక్కుమ్, యాతొరళవాలే శిష్యపుత్రర్కళుక్కు జీవనముణ్డామ్, అవ్వళవుమనుష్ఠేయ మెన్ఱతాయిఱ్ఱు. ప్రవృత్తి ధర్మమ్దానే అభిసన్ధిభేదత్తాలే నివృత్తిధర్మమాగవోపా* ఇన్దనివృత్తిధర్మముమ్ ప్రాప్యమాగక్కడవతు. ఇవ్విడత్తిల్ అకరణే ప్రత్యవాయమ్ ఎన్బురమానుడైయ అనభిమతత్వముమ్ తన్నుడైయ పురుషార్థహానియుమాగక్కడవతు" ఎన్ఱు తనిశ్లోకత్తిలే ఇవర్తామే యరుళిచ్చెయ్దారిఱే. ఇనిస్వార్థ బుద్ధ్యావనుష్ఠిక్కైయావతు- స్వవర్ణాశ్రమోచితమాగ విహితమాకైయాలే నమక్కిదై యనుష్ఠియాతొళియిల్ కృత్యాకరణరూపపాపమ్ వరుమెన్ఱు నినైత్తనుష్ఠిక్కై.

(ఇష్టానిష్టఙ్గళాత్మ స్వరూపత్తైప్పఱ్ఱియిరుక్కైయావతు), "ఇచ్ఛైస్వరూపమ్" ఎన్గి అపడియే వినియోగదశైయిల్ శేషియుడైయ ఇచ్ఛానుగుణమాగ స్వరూపత్తై వినియోగప్పడుత్తు

---

డుట పరార్థముగా ననుష్ఠించుట యనఁగా—లోక సంగ్రహార్థముగాను, శిష్యులయొక్కయు పుత్రులయొక్కయును ఉజ్జీవనముకుగాను దయతో ననుష్ఠించుట.

ఈయర్థమును, "ఇఁక వీటిలో మనపూర్వాచార్యులు అనుష్ఠించునవి, శిష్యులయొక్కయును పుత్రులయొక్కయును ఉజ్జీవనముకుగాను దయతో ననుష్ఠించినారు ఇంతియే. ఇట్లు అనుష్ఠింపకపోయినయెడల, భగవంతుని విభూతియగు చేతనులకు నాశముఁ గలుగఁజేయువాఁడగుటచే సర్వేశ్వరునికి అయిష్టుండగును. కావున నెంతమాత్రమనుష్ఠించుటచే లోకసంగ్రహము కలుగునో, మఱియు ఎంతమాత్ర మనుష్ఠించుటచే శిష్యులకును పుత్రులకును ఉజ్జీవనముగలుగునో అంతమాత్రము అనుష్ఠించునది యని యేర్పడుచున్నది.

* ప్రవృత్తిధర్మమే అభిప్రాయభేదముచే నివృత్తిధర్మ మగునట్లు ఈ నివృత్తిధర్మమున్ను ప్రాప్యముగాను కాఁగలదు.

ఈ విషయమును అనుష్ఠింపక పోయిన యెడల చెడుపును, సర్వేశ్వరుని కిష్టము కాక పోవుటయు, తన పురుషార్థమునకు హానియును కలుగఁగలవు" అని తనిశ్లోకమున వీరే (శ్రీపిళ్లైలోకాచార్యులవారు) సాయించియున్నారు కదా!

ఇఁక స్వార్థబుద్ధితో ననుష్ఠించుట యనఁగా, తనవర్ణమునను ఆశ్రమమునకున్ను కావలసినవిగాను విధించియుండుటంజేసి, వీటి ననుష్ఠింపకపోతిమేని మనకు కృత్యాకరణరూపమగు (చేయవలసినదానిఁ జేయనందువలగలుగు) పాపము వచ్చునసెడి తలంపుతో ననుష్ఠించుట.

"ఇష్టానిష్టములు ఆత్మస్వరూపమును బట్టియుండును" అనఁగా "ఇచ్ఛైస్వరూపము = భగవంతుని యిచ్ఛయే స్వరూపము" అన్నట్లు భగవంతునికై వినియోగపడునప్పుడు శేషియగు సర్వే

---

* "జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత" ఇత్యాదివాక్యముల స్వర్గాదులను బొందించుటకై విధింపఁబడిన జ్యోతిష్టోమాదికర్మములు "యజ్ఞేనదానేన" ఇత్యాది శ్రుతిప్రకారము ఉపాసనాంగములుగాను వినియోగపడునట్లు, ప్రపన్నునియొక్క వర్ణాశ్రమధర్మములును "ప్రియాయమమవిష్ణోశ్చ" ఇత్యాదివాక్యములఁ జెప్పియున్న వినియోగవశమున కైంకర్యముగాను కాఁగలవు. అనఁగా ఫలాపేక్ష లేకుండ, అనుష్ఠించునపుడు యజ్ఞాదులు ఉపాసనాంగములగునట్లు, సర్వేశ్వరునిప్రీతికై యనుష్ఠించునప్పుడు వర్ణాశ్రమధర్మములును వానికైంకర్యముగాను కాఁగలవు.

**మూ॥ ౨౭౯॥ పుణ్యత్తుక్కు అంజివన్ పాపత్తైప్పణ్ణానిఱే.**

---

కూంమాఱో హైదవపేక్షోఽపి తాప్యుప్రతి॥ ఏతంసల జ్ఞయాణా మర్యాదాం వేదనిర్మితామ్। ప్రియోఽపి న ప్రియోఽసౌ మే మదాజ్ఞావ్యతివర్తనాత్ । ఉపాయత్వగ్రహం తత్రవర్జయేన్మనసా సుధీః'' ఎన్ఱుమ్ సర్వేశ్వరనుమ్ పిరాట్టియుమ్ మరుళిచ్చెయ్ద వచనజ్గళోడుమ్ పూర్వాచార్యర్కళుడైయ వచనానుష్ఠానజ్గళోడుమ్ విరోధిక్కుమిఱే! ఆనపిన్బు కీఴ్ చొన్నపడియే ఇవ్వాక్యత్తుక్కు ప్పొరుళాకక్కడవతు.

''ఇమ్మూన్ఱు ప్రయోజనత్తైయుమ్ మేలిల్ వాక్యత్తోడు సజ్గతియోణా''ఎన్నిల్! ప్రథమ ప్రయోజనత్తైయిల్, ఇప్పడి వర్ణాశ్రమానుష్ఠానత్తిల్ ప్రతిపత్తివిశేషజ్గళైయుమ్ ఆత్మస్వరూపత్తినుడైయ వినియోగదశైయిల్ అనుకూల్య ప్రాతికూల్యజ్గళైయుమాక ఇష్టానిష్టజ్గళుక్కు విషయవిభాగమ్ పణ్ణవేణుమో? వర్ణాశ్రమానురూపమాయుమ్ స్వరూపానురూపమాయుమ్ ఇరుక్కుమ్ వైచ్చెయ్కై ఇష్టమ్, తద్విరుద్ధజ్గళాన అనుష్ఠానజ్గళై చ్చెయ్కై అనిష్టమెన్ఱు తోన్ఱ, అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (పుణ్యత్తుక్కు) ఎన్ఱుతొడజ్గి. ద్వితీయ ప్రయోజనత్తైయిల్, ఇప్పడి వర్ణాశ్రమవిరుద్ధజ్గళైయుమ్ స్వరూప విరుద్ధజ్గ

---

**మూ॥ ౨౭౯॥ పుణ్యముచేయుటకే భయపడువాఁడు పాపముఁజేయడు కదా!**

---

వేదనిర్మితామ్। ప్రియోఽపి న ప్రియోఽసౌ మే మదాజ్ఞావ్యతివర్తనాత్ । ఉపాయత్వగ్రహం తత్రవర్జయేన్మనసా సుధీః''

(ధర్మపరిపాలనముకొఱకున్ను, కులపరిపాలనముకొఱకున్ను, లోకసంగ్రహముకొఱకున్ను మర్యాదలను స్థాపించుటకొఱకున్ను దేవదేవుఁడును, శార్ఙ్గపాణియును, విష్ణువును నగు నాయొక్క ప్రీతికొఱకున్ను బుద్ధిమంతుఁడయినవాఁడు వేదశాస్త్రమున విధింపఁబడినట్టి యాచారమును మన స్సునందయినను అతిక్రమించుటకై తలంపగూడదు. రాజుయొక్క మంత్రి రాజుచేఁబ్రవర్తింపఁ బడినదియు లోకమునకు యుపయుక్తమైనదియు, సుందరమైనదియు, ఎక్కువసస్యమును పండిం చునదియును నగు నదిని అబుద్ధిపూర్వకముగానయినను చెడగొట్టువిధమున వేదనిర్మితమగు మర్యా దను అతిక్రమించువాఁడు నాయాజ్ఞను అతిక్రమించుటంజేసి వాఁడు ప్రియుండయినను నాకు ప్రియుండుకాఁడు, అయితే నాసవిషయమున మోక్షోపాయమనెడి తలంపు నుంచగూడదు.) అని యును చెప్పియున్నట్లు, సర్వేశ్వరుండును పిరాట్టియును సాయించియున్నట్టి వాక్యములతోను న్ను పూర్వాచార్యుల శ్రీసూక్తులతోను అనుష్ఠానములతోనున్ను విరోధించును కదా! కావున నింతకుముందు చెప్పినవిధముననే యీపైవాక్యమునకు అర్థముఁజేసికొనవలయును.

అవతారిక—ఇట్లు మూఁడువిధములగు ప్రయోజనలకున్ను పైవాక్యముతో సంబంధమెట్లనఁ నగా, ప్రథమప్రయోజనమునందు, ఇవ్విధమున వర్ణాశ్రమానుష్ఠానములవిషయమునఁగల యభిప్రాయ భేదములను ఆత్మస్వరూపముయొక్క వినియోగదశయందు అనుకూల్య ప్రాతికూల్యములనున్ను ఇష్టానిష్టములనుగాను గ్రహింపవలయునా? వర్ణాశ్రమములకనుకూలమైనవాటినిన్ని స్వరూపము నకనుకూలములగు వాటినిన్ని యొనర్చుట యిష్టమనియు, వర్ణాశ్రమములతో విరోధించునట్టి వాటి నిన్ని స్వరూపముతో విరోధించునట్టి వాటినిన్ని చేయుట యనిష్టమనియును అర్థముఁ జెప్పఁగొన ుంబడా? యాటివేని తెలుపుచున్నారు. (పుణ్యముకు) ఇత్యాది.

సూ॥ ౨౮౦॥ ఇవన్ పుణ్యత్తై ప్పాపమెన్ఱిరుక్కుమ్.

---

ౖయుమ్ శెయ్‌కై అనిష్టమెన్ఱు ఇవనుక్కుచ్చొల్లి త్తవిర్ప్పిక్కవేణుమో? ఎన్న, (పుణ్యత్తుక్కు అఞ్జుకిఱవన్) ఎన్ఱుతొడఙ్గి యరుళిచ్చెయ్‌కిఱార్. తృతీయయోజనైయిల్, ఇప్పడి వర్ణాశ్రమఙ్గళి లాద్రమయుత్తాల్ అకృత్యకరణఙ్గళ్ వన్దు పుకురాతో వెన్న, (పుణ్యత్తుక్కు అఞ్జుకిఱవన్) ఇత్యాది యాలే యరుళిచ్చెయ్‌కిఱార్. (పుణ్యత్తుక్కు అఞ్జుకిఱవన్ పాపత్తైప్పణ్ణానిఱే) ఎన్దతు - భగవదను గ్రహహేతువాక శాస్త్రసిద్ధమాయిరుక్కచ్చెయ్‌తేయుమ్ మోక్షవిరోధియెన్నుమత్తాలే పుణ్యమ్ శెయ్‌కైక్కు అఞ్జుకిఱ ఇవ్వధికారి, భగవన్నిగ్రహహేతువాక శాస్త్రసిద్ధమాయ్ నరకావహమెన్ఱు సామాన్యరుమఞ్జ్ పడచ్చెయ్యాతపాపత్తై యొరుకాలుమ్ శెయ్యానిఱే యెన్ఱపడి.

ఇవన్ పుణ్యత్తుక్కఞ్జుమ్పడియైయుమ్ వత్సలనాన ఈశ్వరనుక్కు మిడమయుమ్పడి పాపప్రవృత్తియిలన్వయ మత్త్తిరుక్కుమ్పడియైయుమ్ దర్శిప్పిక్కిఱార్ మేల్, (ఇవన్ పుణ్యత్తై) ఇత్యాదివాక్యత్రయత్తాలే. అతావతు, ‘‘తదావిద్వాన్ పుణ్యపాపేవిధూయనిరఞ్జనః పరమంసామ్యముపైతి’’ ఎన్గైయాలే పుణ్యపాపఙ్గళిరణ్డుమ్ మోక్ష విరోధియెన్ఱిరుక్కు మివ్వధికారి, నాట్టార్ సుఖహేతువెన్ఱు విరుమ్బియిరుక్కుమ్ పుణ్యత్తై భగవత్ప్రాప్తిప్రతిబన్ధకతయా అనిష్టావహమాక్కై

---

సూ॥ ౨౮౦॥ ఈతఁడు పుణ్యమును పాపమునుగాఁ దలంచియుండును.

---

ద్వితీయయోజనయందు, ఇట్లు వర్ణాశ్రమవిరుద్ధములయిన వాటినిన్ని స్వరూపవిరుద్ధములయిన వాటినిన్ని చేయుట యనిష్టమని యీతనికిఁ దెలిపి యీతనిని వాటినుండి తొలగింపవలయునా? యంటివేని, తెలుపుచున్నారు. (పుణ్యమునకు భయపడువాఁడు) ఇత్యాది.

తృతీయయోజనయందు ఇట్లు వర్ణాశ్రమములయెడలఁగల ప్రావణ్యమును పోఁగొట్టితిమేని అకృత్యకరణములు వచ్చి చేరవా? యంటివేని ‘‘పుణ్యమునకు భయపడువాఁడు’’ ఇత్యాది వాక్యముచేఁ దెలుపుచున్నారు.

‘‘పుణ్యమునకు భయపడువాఁడు పాపముఁజేయఁడు’’ అనఁగా ‘‘భగవంతునికి అనుగ్రహము కలుగుటకు హేతువయినదిగాను శాస్త్రమునఁ జెప్పియున్నప్పటికిన్ని, మోక్షమునకు విరోధియగుటంజేసి యట్టిపుణ్యము నాచరించుటకు మిక్కిలిభయపడునట్టి యీతఁడు భగవంతుని నిగ్రహమునకు హేతువుగాను శాస్త్రసిద్ధమైనదియు, ‘‘నరకమును గలుగఁజేయునది’’ అనితలంచి సామాన్యజనులున్ను చేయనట్టి పాపమును ఒకప్పుడున్ను చేయఁడుకదా’’ యనుట.

అవతారిక—ఈతండు పుణ్యమును భయపడువిధమును, వాత్సల్యముగల సర్వేశ్వరుండును దయచూపనట్టి పాపప్రవృత్తితో సంబంధింపకయుండునట్టి విధమునున్ను ‘‘ఈతఁడు పుణ్యమును’’ ఇత్యాది వాక్యత్రయముచేఁ దెలుపుచున్నారు.

‘‘తదా విద్వాన్ పుణ్యపాపేవిధూయనిరఞ్జనః పరమం సామ్యముపైతి’’ (జ్ఞానియగువాఁడు పుణ్యపాపములను వదలుకొని కర్మసంబంధములేనివాఁడై పరమసామ్యమును బొందుచున్నాడు’’ అని చెప్పియుండుటచే పుణ్యపాపములు రెండును మోక్షవిరోధులని నిశ్చయించుకొని యుండునట్టి యీయధికారి లోకులు సుఖహేతువునుగాను ప్రేమించియుండునట్టిపుణ్యమును భగవత్ప్రాప్తి ప్రతిబంధకమగుటచే ననిష్టమును గలుగఁజేయునది యగుటంచేసి దుఃఖహేతువగు పాపమనితలంచి భయపడుచుండును.

**మూ ॥ ౨౭౨ ॥ అతువు మిల్లాతపోతు అధికారత్తిలుమ్ ఉపాయోపేయఙ్గళిలుమ్ అన్వయమిల్లైక్కై యెయ్ఱియుమ్.**

**మూ ॥ ౨౭౩ ॥ కైఙ్కర్యన్దన్నై ఫలసాధనమాక్కాతే ఫలమాక్కవేణుమ్**

---

వరుకైయావతు). అతిల్ నిక్కైయెయ్ఱిన్దాల్, "అకిఞ్చిత్కరస్య శేషత్వానుపపత్తిః" ఎన్గిఱపడియే శేషత్వవృత్తియిల్లాతపోతు శేషత్వ హానిపిఱక్కుమెన్నుమ్ భీతియడియాకవరుకై. ఇతిల్ భక్తిమూలమానతువే ముఖ్యమ్, తదలాభత్తిల్ భీతిమూలన్దానాకిలుమ్ వేణుమెన్నపడి.

అతుతానుమిల్లావిడిల్ శెయ్వతెన్నెన్న; అరుళిచ్చెయ్కిఱార్, (అతువుమిల్లాతపోతు) ఎన్ఱుతుడఙ్గి. అతావతు-అముఖ్యమాన భీతిమూలకైఙ్కర్యన్దానుమిల్లాతపోతు, కిఞ్చిత్కారాభావత్తాలే శేషత్వరూపమాన వధికారత్తిలుమ్, అధికారిసాపేక్షమాయిరున్దుళ్ళ శేషియుడైయ కృపారూపమాన ఉపాయత్తిలుమ్, ఇవనుడైయ అనుకూలవృత్తిసాపేక్షమాన అవనుడైయ ముకమలర్త్తియాన ఉపేయత్తిలుమన్వయమఱ్ఱువిడుమెన్గై

అక, కీఴ్ రణ్డువాక్యత్తాలుమ్ కైఙ్కర్యావశ్యకత్వముమ్ కైఙ్కర్యాభావత్తిల్ వరుమనర్థవిశేషఙ్గళుమ్ కాట్టప్పట్టతు; ఏవం విధకైఙ్కర్యత్తిల్ సాధనబుద్ధియై త్తవిర్క్కిఱార్ మేల్, (కైఙ్కర్యన్దన్నై) ఎన్ఱుతుడఙ్గి. అతావతు-ఇప్పడి అవశ్యకరణీయమాక కీఴ్ చ్చొన్న కైఙ్కర్యన్దన్నై ప్పణ్ణుమళవిల్ దృష్టాదృష్టఫలఙ్గళిలేతేనుమొన్ఱుక్కు సాధనమాక ప్రతిపత్తిపణ్ణాతే స్వయమ్ప్రయోజనమాక ప్రతిపత్తిపణ్ణవేణుమెన్గై.

---

**మూ ॥ ౨౭౨ ॥ అదియైనను లేనిచో, అధికారముతోను, ఉపాయోపేయములతోనును గల సంబంధమును వదలుకొనును.**

**మూ ॥ ౨౭౩ ॥ కైంకర్యమును ఫలసాధనమునుగాఁదలంపక, ఫలమునుగానే తలంచవలెను.**

---

"అకించిత్కుర్వతః శేషత్వానుపపత్తిః" (కొంచమయినను చేయనివాని శేషత్వమునకు భంగము కలుగును) అన్నట్లు శేషత్వవృత్తి లేకపోయినట్లయిన శేషత్వమునకు హానికలుగునని భయమువలన జేయునది. వీటిలో భక్తిమూలముగ జేయునదియే ముఖ్యము. అది లేకపోయినయెడల భీతిమూలముగా నయినను చేయుచుండవలయును.

అవతారిక—అదియును్న లేకపోయినచో, చేయవలసినది యేమంటివేని తెలుపుచున్నారు.

అంతముఖ్యమైనదిగా నెన్నఁబడనట్టి భీతిమూలకమగు కైంకర్యమున్ను లేనిచో అట్టివాఁడు కొంచమైనను చేయనందున శేషత్వరూపమగు నధికారముతోను అట్టి యధికారమును బట్టి యుండునట్టి శేషియగు సర్వేశ్వరుని కృపారూపమగు ఉపాయముతోనున్ను, ఈతనియొక్క యనుకూలమగు నడవడికను బట్టియుండు వానిముఖవికాసరూపమగు ఉపేయముతోనున్ను సంబంధములేనివాఁడగును" అనుట.

అవతారిక:—కావున ఈపైరెండు వాక్యములచేతను కైంకర్యమును ఆవశ్యముగ చేయవలయుననియు, లేనియెడల సంభవించునట్టి యనర్థములున్ను చెప్పఁబడినవి. యివ్విధమగు కైంకర్యమును సాధనముగాఁ దలంపఁగూడదని తెలుపుచున్నారు.

(కైంకర్యము) ఇత్యాది, ఇట్లు ఆవశ్యముగ చేయవలసినదిగాను ఇంతకుముందు చెప్పఁబడినట్టి కైంకర్యము నొనర్చునప్పుడు దీనిని దృష్టాదృష్టఫలములలో దేనికైన నొకదానికి సాధనము [illegible] గాఁ దలంపవలయును.

**మూ॥ ౨౮౪॥ అతావతు - తాన్ కైయేలాతే అవనైక్కయేఱ్ఱప్పణ్ణుకై.**
**మూ॥ ౨౮౫॥ కొడుత్తుక్కొళ్ళాతే కొణ్డత్తుక్కు క్కైక్కూలి కొడుక్కవేణుమ్.**

ఇత్తై విశదీకరిక్కిఱార్ మేల్, (అతావతు) ఎన్తుటఙ్గి. (అతావతు) ఎన్తు. ఇత్తైసాధనమాక్కాతే ఫలమాక్కైయావతెన్తపడి. (తాన్ కైయేలాతే అవనై క్కైయేఱ్ఱప్పణ్ణుకైయావతు). కైఙ్కర్యమ్పణ్ణుకిఱ తాన్ అతుక్కు ఫలమాక అవన్ పక్కలిలే ఒన్తైయర్థియాతే స్వయప్రయోజనమాక చ్చెయ్యానిన్తుకొణ్డు, కైఙ్కర్యమ్ కొళ్ళుకిఱవనై ‹‹తాన్సర్వా శ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతివై స్వయమ్›› ఎన్గిఱపడియే తన్ పూర్తిపారాతే సాపేక్షనాయ్ విరుమ్బికైక్కొళ్ళుమ్బడి పణ్ణుకై.

ఇవ్వళవుమ్ పోరాతు, తాన్ కొడుత్తై అవన్ కొణ్డత్తుక్కు ప్రత్యుపకారమ్ పణ్ణవుమ్ వేణుమెన్గిఱార్ మేల్, (కొడుత్తు) ఎన్తుటఙ్గి. అతావతు ‹‹దేహి మే దదామి తే››ఎన్గిఱపడియే తానవనుక్కొన్తై సమర్పిత్తు అవన్ పక్కలిలే ఒరుప్రయోజనమ్ కొళ్ళాతే, ‹‹ఇన్తు వన్దిత్తైయుమ్ నుమతు శెయ్తిడప్పెఱిల్ నానొన్తు నూఱాయిరమాక కొడుత్తు ప్పిన్నుమాళుమ్ శెయ్వన్›› ఎన్త పెరియాళ్వార్ తిరుమకళైప్పోలే తాన్ సమర్పిత్త ద్రవ్యత్తై అవనఙ్గీకరిత్త ఉపకారత్తుక్కాక, అప్పడియిరున్దుళ్ళవఱ్ఱై త్తన్నభినివేశానుగుణమాక నిఱైయ కొణ్డువన్దు సమర్పియానిన్తుకొణ్డు పిన్నైయుమడిమై శెయ్కైయాకిఱ కైక్కూలి కొడుక్కవేణుమెన్తై.

మూ॥ ౨౮౪॥ అనఁగా తాను చేయిజాపక వానిని చేయిజాపునట్లు చేయునది.
మూ॥ ౨౮౫॥ ఇచ్చి పుచ్చుకొనక, పుచ్చుకొనినందుకు కూలి యివ్వవలయును.

అవతారిక :— ఈవిషయమును పెంచుచున్నారు.

(అనఁగా) ఇత్యాది. అనఁగా = దీనిని సాధనముగాఁగొనక ఫలముగాఁగొనుట యనఁగానుట. తానుచేయిజాపక వానిని చేయిజాపునట్లు చేయుటయనఁగా — కైంకర్యముఁజేయునట్టి తాను అందులకు ఫలముగాను వానివద్దనుండి యెద్దియైన నొకదానిఁగోరక తానొనర్చునట్టి కైంకర్యమునే ఫలమునుగా భావించి యిట్టి కైంకర్యమును స్వీకరించునట్టి సర్వేశ్వరుని ‹‹తాన్సర్వాశ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతివై స్వయమ్›› (వాటినన్నింటిని సర్వేశ్వరుండు నెత్తినపెట్టుకొనును) అని సాయించియున్నట్లు తనయొక్క సంపూర్ణత్వమును చూడక, ఇవి కావలసినవాడై వీటిని ప్రీతితో గ్రహించునట్లు చేయునది.

అవతారిక :— ఇంతమాత్రమేకాదు. తాను ఇచ్చినదానిని వాఁడంగీకరించినందులకు ప్రత్యుపకారము చేయవలయునని తెలుపుచున్నారు.

‹‹నీకిదియిచ్చుచున్నాను. నాకదియ్యి›› అన్నట్లు తానొకదానిని సమర్పించి వానివలన నొక ప్రయోజనము నపేక్షింపక, ‹‹ఇన్తువన్దిత్తైయుమ్ నుమతు శెయ్తిడప్పెఱిల్, నానొన్తు నూఱాయిరమాక కొడుత్తుప్పిన్నుమాళుమ్ శెయ్వన్›› (నా. తి. ౯-౭) (ఇప్పుడిచ్చుటికి వేంచేసి వీటి నారగించితిరేని ఒకటికి నూరువేలుగా సమర్పించుటయే కాక కైంకర్యము జేయుదును) అని యానతిచ్చిన పెరియాళ్వారుల కుమార్తెయగు శ్రీ ఆండాళువలెనే ‹‹తాను సమర్పించిన ద్రవ్యమును వాఁడు అంగీకరించుటయనెడి యుపకారమునకుగాను అట్టి ద్రవ్యములను తనప్రీతికొలది మిక్కుటముగాఁగొనివచ్చి సమర్పించుచు తిరిగి కైంకర్యముఁజేయుట యను కూలినియ్యవలయును›› అనుట.

మూ॥ ౨౮౬ ॥ శ్రీవిదురర్రైయుమ్ శ్రీమాలాకారర్రైయుమ్ కూనియైయుమ్ పోలే కిఞ్చిత్కరిత్తాల్ స్వరూపమ్ నిఱమ్‌పెఱువదు.

మూ॥ ౨౮౭॥ మడి తడవాతశోఱుమ్ శురుళ్ నాఱాత పూవుమ్ శుణ్ణాంబుపడాత శాన్దుమితే ఇవర్‌కళ్ కొడుత్తతు.

---

ఇప్పడి యనన్యప్రయోజననాయ్ కిఞ్చిత్కరిత్తాలాయి త్తు స్వరూప ముజ్జ్వలమావతెన్నుమత్తై సదృష్టాంతమాక వరుళిచ్చెయ్‌కిఱార్, (శ్రీవిదురర్రైయుమ్) ఎన్నుతుడఙ్గి.

దృష్టాంతభూతరానవర్‌కళ్ కిఞ్చిత్కరిత్తి ప్రకారత్తై యరుళిచ్చెయ్‌కిఱార్, (మడితడవాత)ఎన్నుతుడఙ్గి. (మడితడవాతశోఱావతు)-మున్దఱ వాదరత్తోడేయిట్టు పిన్నై "ఇతుక్కు కైక్కూశ తరలాకాతో" ఎన్ఱు మడిచ్చీరైశోధిక్కైక్కాక మడియైయవిడాత్తు త్తడవి ఉణ్డాన్ నెఞ్జు ఉళ్ళైయుమ్పడిపణ్ణుమ్ ప్రయోజనాన్తరపరరిడుమ్ శోఱుపోలన్ఱిక్కే, ఉణ్డవన్ నెఞ్జు ఉకక్కుమ్బడి అనన్యప్రయోజనమాన శోఱు.ఇప్పడియిఱున్దుళ్ళ శోఱిఱే "భుక్తవత్సు ద్విజాగ్ర్యేషు నిషణ్ణః పరమాసనే। విదురాన్నాని బుభుజే శుచీని గుణవన్తి చ" ఎన్ఱు పావనత్వభోగ్యత్వ ప్రశస్తమామ్బడి శ్రీవిదురర్ అవనుక్కు సమర్ప్పిత్తతు. (శురుళ్ నాఱాతపూవావతు) - అగ్నిస్పర్శముణ్డానాల్ శురుళ్ నాఱుమ్బడి యిఱే పూవిన్ స్వభావమిరుప్పతు, అప్పడియే ప్రయోజనాన్తరస్పర్శమాకిఱ శురుళ్ నాఱ్ఱమిల్లాతపడి అనన్యప్రయోజనత్వ పరిమళయుక్తమాకయిరుక్కుమ్ పువ్వమ్.ఇప్పడి యిఱున్దుళ్ళ పూవిఱే "ప్రసాద

---

మూ॥ ౨౮౬॥ శ్రీవిదురునివలెను, మాలాకారునివలెను, కూనివలెనున్న కైంకర్యముఁజేసినట్లయిన, స్వరూపము ప్రకాశించును.

మూ॥ ౨౮౭॥ రొండిపట్టిచూడని యన్నమును, వెంట్రుకలవాసనలేని పుష్పమును సున్నముతగలని చందనమును గదా వీరు సమర్పించినది.

---

అవతారిక:—"ఇట్లు ఫలాపేక్షలేకుండ కైంకర్యమొనర్చినచో, స్వరూపము ప్రకాశించును" అను విషయమును దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుచున్నారు.

(శ్రీవిదురుని) ఇత్యాది.

(రొండిపట్టిచూడని అన్నము) అనఁగా మొదట ఆదరణచేసి యన్నముపెట్టి పిమ్మట దీనికి గాను డబ్బులియ్యజాలవా? యని రొండిపట్టి వెదకిచూచి, అన్నముతినినవానిమనస్సును కష్టము గలుగఁజేయునట్టి ప్రయోజనాంతరపరులు పెట్టునట్టియన్నము వంటిదికాకుండ, తినినవాని మనస్సు సంతోషపడునట్లు యనన్యప్రయోజనులగు వారు పెట్టిన యన్నము.

ఇవ్విధమైనట్టి యన్నమునే కదా "భుక్తవత్సు ద్విజాగ్ర్యేషు నిషణ్ణః పరమాసనే। విదురాన్నాని బుభుజే శుచీని గుణవన్తి చ" (బ్రాహ్మణాద్యగ్రవర్ణములవారు భుజింపఁగా మంచియాసనమునఁగూర్చుండి పరిశుద్ధమును రుచికరమును నగు విదురునియన్నమును భుజించెను) అన్నట్లు పావనత్వభోగ్యత్వములమూలముగ శ్లాఘ్యమైనదిగానుండునట్టి యన్నము నగదా విదురుండు భగవంతునికి (శ్రీకృష్ణునికి) సమర్పించినది.

కమురు కంపుకొట్టని పుష్పమనఁగా అగ్నిస్పర్శము తగిలినట్లున, కమురుకంపు కొట్టునది గానుకదా పుష్పముయొక్క స్వభావముండును. అట్లు ప్రయోజనాంతర స్పర్శరూపమగు కమురు కంపు లేకుండ అనన్యప్రయోజనత్వరూపమగు పరిమళముతోఁగూడియుండునట్టి పుష్పముండును.

**మూ॥ ౩౮౮॥ కైజ్కర్యదశైపోలే మున్బుళ్ళదశైకళిలుమ్ స్వరూపత్తై ఉజ్జ్వల మాక్కవేణుమ్.**

---

పరమాశాధా మమగేహముపాగతౌ। ధన్యోఽహమర్చయిష్యామి త్యాహమాల్యోపజీవనః" ఎన్రు విశేషజ్ఞర్ శ్లాఘిక్కుమ్బడి అత్యాదర పూర్వకమాక శ్రీమాలాకారర్ అవనుక్కుక్కొడుత్తదు. (శుద్ధామ్బుపడాతె కాద్దావకు)-అయిరమ్పొన్నైయ కొట్టియుమ్ శుద్ధామ్బత్తివ త్తైపడక్కడు మ్బడియిఱే కాన్దిస్వభావమ్, అప్పడియే ప్రయోజనాన్తరస్పర్శమాకిఱ దోషమిన్రిక్కే అనన్యప్రయోజనమాన కాన్దు. ఇప్పడి యిరున్దుళ్ళ కాన్దిఱే "సుగన్ధమేతద్రాజార్హం సుచిరం సుచిరాననే। అవయోర్గాత్రసదృశం దీయతామనులేపనమ్" ఎన్రు అవనర్థిత్తవనన్తరమ్ పూశుమ్ కాన్దామ్బడి కొనిక్కొడుత్తదు. ఆక, ఇప్పడి అనన్యప్రయోజనమాక క్కుబ్జైక్కురిత్తాలాయిత్తు కైజ్కర్యాశ్రయమాన స్వరూపముజ్జ్వలమానతెన్రు. ఆక, ఇవ్వళవుమ్ వస్త్వాద్యగణనైయిల్ చరమోక్తమాన కర్తవ్యరూప కైజ్కర్యత్తైశోధిత్తు, తాదృశకైజ్కర్యత్తాలే స్వరూపముజ్జ్వలమామెన్నుమిడత్తైయుమ్ అరుళిచ్చెయ్దారాయిత్తు.

ఇప్పడి అనన్యప్రయోజనరాయ్క్కొణ్డు కైజ్కర్యమ్ శెయ్దాలే స్వరూపముజ్జ్వలమావ

---

**మూ॥ ౩౮౮॥ కైంకర్యదశయందువలెనే పూర్వమందు దశలయందును స్వరూపమును ప్రకాశింపఁజేయవలయును.**

---

ఇవ్విధముగ నుండునట్టి స్వరూపము కదా! "ప్రసాదపరమౌ నాథౌ మమగేహముపాగతౌ ధన్యోఽహమర్చయిష్యామీత్యాహ మాల్యోపజీవనః" (అనుగ్రహపూర్ణులగు శ్రీరామలక్ష్మణులు నా గృహమునకు వేంచేసినారు నేను ధన్యుండను. వారల నర్చింప లభించితినని మాలాకారుండు చెప్పెను) అన్నట్లు విశేషజ్ఞులు శ్లాఘించునట్లు యెక్కువ ఆదరణతో శ్రీమాలాకారుఁడు సర్వేశ్వరునికి సమర్పించినది.

స్వచ్ఛమువడని చందన మనఁగా— వేలువేలుగ ద్రవ్యమును ఖర్చుపెట్టినను, స్వచ్ఛముపడితే చెడిపోవునటిదిగాను కదా! చందనముయొక్క స్వభావముండును. అట్లు ప్రయోజనాంతర స్పర్శరూపమగు దోషములేకుండ అనన్యప్రయోజనమైన చందనముగ ఫలాపేక్షలేకుండ నమర్పించినట్టి చందనము)

ఇవ్విధమైనట్టి చందనమే కదా! "సుగంధమేతద్రాజార్హమ్ రుచిరం రుచిరాననే అవయోర్గాత్రసదృశం దీయతామనులేపనం" (ఓరుచిరాననా! ఈచందనము మంచి పరిమళముగలది. ఇది రాజులకుఁదగినది. ఇది మనోహరమయినది. మాశరీరములకుఁదగినట్టి చందనము నొసంగుమా) అన్నట్లు సర్వేశ్వరుండు కోరినపిమ్మట పూసుకొనుట కనుకూలమగునట్టి చందనము కదా కూని సమర్పించినది.

కావున నింతవరకును వాసస్థలము మొదలగువాటిఁ జేర్కొనునప్పుడు కుట్టకుదిని పేర్కొనఁబడినదియు, అవశ్యము చేయవలసినదియునగు కైంకర్యమునుగురించి విచారించి యట్టికైంకర్యమువలన స్వరూపము ప్రకాశించునని తెలిపినవారయిరి.

అవతారిక:—ఇట్లు ఫలాపేక్షలేకుండ కైంకర్యము చేయుటచేతనే స్వరూపము ప్రకాశించునని చెప్పినందున మోక్షావస్థయందలి కైంకర్యదశయందు స్వరూపము ప్రకాశించునని వేఱు

**మూ॥ ౨౮౯॥** మున్నే నాలుదశైయుణ్డు.

**మూ॥ ౨౯౦॥** అతావతు - జ్ఞానదశైయుమ్, వరణదశైయుమ్, ప్రాప్తిదశైయుమ్, ప్రాప్యానుభవదశైయుమ్.

---

తెన్ను శొన్నవితిలే ముక్తావస్థైయిల్ కైఙ్కర్యదశైయిల్ స్వరూపౌజ్జ్వల్యముమ్ అర్థాదుక్తమెన్ఱు నినైత్తు, ఇప్పడి కైఙ్కర్యదశైయిల్ స్వరూపత్తై ఉజ్జ్వలమాక్కుమోపాతి ఏతత్పూర్వదశావిశేషఙ్గళిలుమ్ స్వరూపత్తై ఉజ్జ్వలమాక్కవేణుమెన్ఱు తిరుళిచ్చేయ్కిఱార్ మేల్, (కైఙ్కర్యదశైపోలే) ఎన్ఱుతొడఙ్గి. (మున్పుళ్ళదశైకళిలుమ్) ఎన్ఱతు - కైఙ్కర్యత్తుక్కు పూర్వదశైకళిలుమెన్ఱపడి.

మున్నే ఎత్తనైదశై యుణ్డెన్న మాకాంక్షైయిలే యరుళిచ్చేయ్కిఱార్, (మున్నే నాలుదశైయుణ్డు) ఎన్ఱు.

అన్ద నాలుదశైయుమ్దానే తెన్ను మపేక్షైయిలే యరుళిచ్చేయ్కిఱార్, (అతావతు) ఎన్ఱుతొడఙ్గి, (జ్ఞానదశైయావతు) - ఆచార్యోపదేశత్తాలే తనక్కు జ్ఞానమ్పిఱన్దు నిఱ్కుమ్ నిలై. (వరణదశైయావతు) - సిద్ధోపాయభూతనాన సర్వేశ్వరనై త్తనక్కు ఉపాయమాగ వరిక్కుమ్ నిలై. (ప్రాప్తిదశైయావతు) - సాంసారిక సకలదురిత నివృత్తిపూర్వకమాక అవనై ప్రాపిక్కుమ్ నిలై. (ప్రాప్యానుభవదశైయావతు) - ప్రాప్యభూతనానవనై కిట్టి యనుభవిక్కుమ్ నిలై. ఇవ్వనుభవజనితప్రీతికారిత కైఙ్కర్యమిఱే పరమపురుషార్థమ్. ప్రథమాపేక్షితమాన తత్త్వజ్ఞానమ్, జ్ఞాన

---

**మూ॥ ౨౮౯॥** ముందే నాల్గు దశలు కలవు.

**మూ॥ ౨౯౦॥** అవి యెవ్వియనఁగా—జ్ఞానదశయును, వరణదశయును, ప్రాప్తిదశయును, ప్రాప్యానుభవదశయును.

---

చెప్పనక్కఱలేకుండనే సిద్ధమగుచున్నదనితలంచి, ఇట్లు కైంకర్యదశయందు స్వరూపమును ప్రకాశింపఁ జేసికొనునటుల, దీనికిముందు దశలయందును స్వరూపమును ప్రకాశింపఁజేసికొనవలెనని తెలుపుచున్నారు.

(కైంకర్యదశవలెనే) ఇత్యాది, పూర్వపుదశలనఁగా కైంకర్యమునకు పూర్వపు దశలనుట.

అవతారిక:—పూర్వము ఎన్నిదశలున్నవంటివేని తెలుపుచున్నారు. (మునుపే నాల్గుదశలు కలవు) ఇత్యాది.

అవతారిక:—ఈ నాల్గుదశ లెవ్వియనగా దెలుపుచున్నారు (అవియెవ్వి) ఇత్యాది.

జ్ఞానదశయనఁగా—ఆచార్యోపదేశమువలన తనకు జ్ఞానము గలుగునట్టి దశ.

వరణదశయనఁగా—సిద్ధోపాయమగు సర్వేశ్వరుని ఉపాయముగాను వరించునట్టిదశ.

ప్రాప్తిదశ యనఁగా—సాంసారి సకల పాప నివృత్తిపూర్వకముగ సర్వేశ్వరుని బొందునట్టి దశ.

ప్రాప్యానుభవదశయనఁగా—ప్రాప్యవస్తువగు సర్వేశ్వరుని కెక్కువ సమీపమునయుండి వాని ననుభవించునట్టి దశ.

ఇట్టి యనుభవమువలనఁ గలిగిన ప్రీతిమూలముగఁ జేయునట్టి కైంకర్యమేకదా; పరమపురుషార్థము.

మొట్టమొదట కావలసిన తత్త్వజ్ఞానమును, దానిమూలముగ ఉపాయవరణమును, దాని

మూ॥ ప్రాప్యానుభవదశైయిల్ అభినివేశత్తైయున్నిషుమ్.
మూ॥ ౨౯౨॥ అజ్ఞానమ్ పోవతు ఆచార్యజ్ఞానత్తాలే.
మూ॥ అపూర్తిపోవతు ఈశ్వరపూర్తియాలే,

---

ప్పడియే విలమ్బాసహత్వవిబన్ధనమాన తన్నుడైయక్లేశాతిశయత్తై దర్శిప్పిక్క. (ప్రాప్యానుభవదశైయిలభినివేశత్తై మున్నిడుక్కైయావతు) - పెరువిడాయనుక్కు కుడిక్కత్తణ్ణీరాలాప్పోలే అనుభూతాంశత్తాల్ తృప్తిపిఱవాతే మేన్మేలుమ్ పెరుక్కు విరైన్దుశెల్లుకిఱ అనుభవాభినివేశత్తై ప్రకాశిప్పిక్క. అక జ్ఞానదశై ముతలాన నాలుదశైయిలుమ్ స్వరూపత్తై ఉజ్జ్వలమాక్కుకైయావతు - ఇవ్వాకారజ్గళై మున్నిడుకైయెన్నుకరుత్తు.

ఇప్పడి ఇవనివత్తై మున్నిట్టాల్ ఇవనుక్కు వైశమిప్పతెత్తాలేయెన్న, అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (అజ్ఞానమ్ పోవతు) ఎన్నుతుడక్కి. అతావతు - తత్త్వహితాదికళిల్ ఇవనక్కుళ్ళ అజ్ఞానమ్ సవాసనమాక నివృత్తమావతు అవత్తై అలకలకాకదర్శిప్పిత్తు అజ్ఞాతజ్ఞాపనమ్పణ్ణుకై క్కుడాన ఆచార్యనుడైయ జ్ఞానత్తాలే. పేత్తుక్కు హేతువాయిరుక్కుమ్ సత్కర్మాదికళొన్ఱుమ్ తనక్కిల్లామైయాకిఱ అపూర్తిశమిప్పతు, ఇత్తలైయిలుళ్ళ తొన్ఱైయుమపేక్షియామల్ కార్యమ్ శెయ్యుముపాయభూతనాన. ఈశ్వరనుడైయ సహకారినైరపేక్ష్యమాకిఱ పూర్తియాలే. అవిలమ్బ్యన తిరువడికళై

---

మూ॥ ప్రాప్యానుభవదశయందు అభినివేశమును పురస్కరించుకొనునది.
మూ॥ ౨౯౨॥ ఆచార్యునికిఁగల జ్ఞానమువలన ఈతని యజ్ఞానము తొలఁగిపోవును.
మూ॥ సర్వేశ్వరునికిఁగల పూర్తివలన నీతని యసంపూర్తి తొలఁగిపోవును.

---

పఁజాలను) అనియు ‹‹కూవిక్కొళ్ళుమ్ కాలమిన్నమ్ కురుకాతో›› (కైంకర్యముకయి నన్నుకొని పోవుకాలమింకను సమీపింపలేదా) అనియును పాయించునట్లు ఆలస్యమును సహింపఁజాలమివలనఁ గలుగు తనకష్టముల జూపించుట.

ప్రాప్యానుభవదశయం దభినివేశమును పురస్కరించుకొనుట యనఁగా, ఎక్కువ దాహము కొనినవానికి ఎన్నినీళ్లు త్రాగినను దాహముతీరనట్లు అనుభవించినదానివలన తృప్తిగలుగక తనకు పైపైని వృద్ధిపొందునట్టి అనుభవవిషయపు కోరికను ప్రకాశింపఁజేయుట.

కావున జ్ఞానదశ మొదలుగాఁగల నాలుగుదశలయందును స్వరూపమును ప్రకాశింపఁజేసికొనుట యనఁగా, ఈయీయాకారములను పురస్కరించుకొనుట యని యభిప్రాయము.

అవతారిక:—ఇవ్విధమున నీతండు వీటిని పురస్కరించుకొనినచో, ఈతని కివి శమించుట యెట్లంటివేని తెలుపుచున్నారు.

(అజ్ఞానముపోవుట) ఇత్యాది. తత్త్వహితాదుల విషయమున నీతనికిఁగల యజ్ఞానము నివర్తించుటయనునది వాటిని వేర్వేరుగ తెలిపి వానిఁదెలియనివాటిఁ దెలియఁజేయుటకుఁ దగినట్టియాచార్యుని జ్ఞానమువలననని యెఱుంగునది.

ఫలమునకు హేతుభూతములగు సత్కర్మములలో నొక్కటియును తనకు లేకపోవుట యను అపూర్తి శమించుటయనునది యీతనివలన నొక్కదానినిన్ని యపేక్షింపక, పనిజరుపునట్టి యుపాయభూతుఁడగు సర్వేశ్వరునియొక్క వేఱొక్కసహాయము నపేక్షింపకుండుట యనెడి పూర్తివలన నని యెఱుంగునది.

మూ॥ ౪౩౨॥ ఆచార్యనుక్కు సదృశప్రత్యుపకారమ్ పణ్ణలావతు విభూతిచతుష్టయ
ము మీశ్వరద్వయము ముణ్డాకిల్.

మూ॥ ౪౩౩॥ ఈశ్వరసమ్బన్ధమ్ బన్ధమోక్షఙ్గళిరణ్డుక్కుమ్ పొతువాయిరుక్కుమ్;

---

తంమమ" ఎన్ఱు అభయప్రదానమరుళిచ్చెయ్కైయాలుమెన్గై, ఇత్తాల్ ఈశ్వరను మాశ్రేష్పడుమ్పడి యన్ఱో ఆచార్యత్వత్తిన్ పెరుమైయెన్ఱు ఆచార్యవైభవమ్ శొల్లిత్తాయిత్తు.

ఇన్నము మొరువఴియాలే ఆచార్యవైభవత్తై దర్శిప్పిక్కిఱార్, (ఆచార్యనుక్కు) ఎన్ఱు తొడఙ్గి. అతావతు- ఉభయవిభూతియుక్తనుమ్ విభూతిమానాన శ్రీశ్వరనైయుమ్ తానిట్టవఴక్కాక్కుమ్పడిపణ్ణికొణ్డిరుక్కుమ్ ఆచార్యన్ పణ్ణిన ఉపకారత్తుక్కు సదృశమాన ప్రత్యుపకారమ్ పణ్ణలావతు, ఇప్పడియే ఇన్నము మిరణ్డువిభూతియుమ్ విభూతిమానాయిరుప్పానోరీశ్వరనుమ్ వేణ్డుయుణ్డాకిలెన్గై. "యోదద్యాద్భగవద్జ్ఞానం కుర్యాద్ధర్మోపదేశనమ్। కృత్స్నాంవా పృథివీందద్యాన్నతత్తుల్యం కథఞ్చన" ఎన్ఱానిఱే. ఇత్తాల్, ఆచార్యనుడైయ ప్రత్యుపకారావకాశరహితమహోపకారకత్వమాకిఱ వైభవమ్ శొల్లిత్తాయిత్తు.

ఇన్నము మొరువఴియాలే ఆచార్యవైభవత్తై యరుళిచ్చెయ్కిఱార్, (ఈశ్వరసమ్బన్ధమ్ ఎన్ఱు

---

మూ॥ ౪౩౨॥ ఆచార్యునికి ప్రత్యుపకారమొనర్చుటయునునది విభూతిచతుష్టయ
మును, ఈశ్వరద్వయమును ఉన్నట్లయిన సంభవించును,

మూ॥ ౪౩౩ ఈశ్వర సంబంధము బంధమోక్షములకు రెంటికిన్ని సమానమైన
హేతు వగును

---

తూరి శరణాగతిచేసిన చాలును. సర్వభూతములకును అభయమునిచ్చుచున్నాడను. ఇది నాయొక్క వ్రతము" అని యభయప్రదానమును సాయించినదియు ననుట. ఈశ్వరుండు' గయితము ఆశ్రయించునట్టిది కాను కదా ఆచార్యత్వముండునని యాచార్యవైభవ మింగుమూలముగాఁ దెలుపఁబడినది.

అవతారిక— ఇంకొకవిధమునను ఆచార్యునివైభవముఁ దెలుపుచున్నారు.

(ఆచార్యునికి) ఇత్యాది. ఉభయవిభూతులనున్న వాటిని గలిగియుండు సర్వేశ్వరునిన్ని యుపకరించినవాఁడగు ఆచార్యుం డొనర్చిన ఉపకారమునకు ప్రత్యుపకారమొనర్చుట యెప్పుడనఁగా, ఇట్లై ఇంకను రెండు విభూతులును ఇంకొక యీశ్వరుండును ఉన్నట్లయిన నని యొప్పుంగునది. కావుననే "యోదద్యాత్ భగవత్ జ్ఞానం కుర్యాద్ధర్మోపదేశనం। కృత్స్నాంవాపృథివీందద్యాత్ నతత్తుల్యం కథంచన" (భగవంతుని విషయమగు జ్ఞానమునిచ్చినవానికిన్ని ధర్మము నుపదేశించిన వానికిన్ని యీ పృథివినంతయు నిచ్చినను వాని ఋణము తీరదు) అని చెప్పియున్నది కదా.

ఇందువలన ఆచార్యుం డొనర్చినట్టి యుపకారమునకు సరియయిన ప్రత్యుపకార మెద్దియును కాఁజాలదనుటచే నాచార్యుని మహోపకారముయొక్క వైభవము తెలుపఁబడినది.

అవతారిక—ఇంకొక విధమున ఆచార్యుని వైభవమును తెలుపుచున్నారు.

(ఈశ్వరసంబంధము) ఇత్యాది, ఈతావున ఈశ్వరసంబంధమనఁగా, ఈశ్వరునియొ

మూ॥ ఆచార్యసమ్బన్ధమ్ మోక్షత్తుక్కే హేతువాయిరుక్కుమ్.
మూ॥ ౪౩౪॥ భగవల్లాభమ్ ఆచార్యనాలే.

తుడఙ్గి. ఇవ్విడత్తిల్ (ఈశ్వర సమ్బన్ధమ్) ఎన్గిఱతు- "ఈశ్వరనై ప్పట్రుకై" ఎన్ఱు కీழ్ చ్చొన్న తదాశ్రయణరూపసమ్బన్ధత్తై: అతు (బన్ధమోక్షఙ్గళిరణ్డుక్కుమ్ పొతువాకై యావతు) కర్మానుగుణమాక సంసరిప్పిక్కవుమ్ కారుణ్యానుగుణమాక ముక్తనాక్కవుమ్ వల్ల నిరఙ్కుశస్వతన్త్రనోడుణ్డాన సమ్బన్ధమాకైయాలే. ఉభయసాధారణమాయిరుక్కై. (ఆచార్యసమ్బన్ధమాకిఱతు) "ఆచార్యనై ప్పట్రుకై" ఎన్ఱు కీழ్ చ్చొన్న తదాశ్రయణరూపసమ్బన్ధమ్. అతు (మోక్షత్తుక్కే హేతువాకై యావతు)- కర్మానుగుణమాక సంసరిక్కవుమ్విడుమ్ స్వతన్త్రనన్ఱిక్కే, సర్వప్రకారత్తాలుమ్ ఇవనై యుజ్జీవిప్పిత్తేవిడుమ్ నిరతిశయకృపావానోట్టై సమ్బన్ధమాకైయాలే, సంసారమోక్షఙ్గళుక్కు పొతువన్ఱిక్కే సంసారవిమోచనైకహేతు వాయిరుక్కై, ఇత్తాల్, మోక్షైకహేతుత్వ నిబన్ధనమాన వైభవమ్ శొల్లప్పట్టతు.

ఉత్తారకత్వత్తిల్ ఆచార్యనుడైయ ఆధిక్యత్తై యరుళిచ్చెయ్తార్ కీழ్, ఉపకారకత్వత్తిల్ ఈశ్వరనుడైయ ఆధిక్యత్తైయరుళిచ్చెయ్కైక్కాక అడిక్కొణ్డెழுన్దిరుక్కిఱార్ మేల్, (భగవల్లాభమ్) ఎన్ఱుతుడఙ్గి, ఆతావతు - నిరుపాధికశేషియాయ్ నిరఙ్కుశస్వతన్త్రనా యిరుక్కుమ్ భగవానై లభిక్కై, తత్సమృద్ధ్యేకప్రయోజననాయ్ క్కొణ్డు, మఙ్గళాశాసనత్తుక్కాకవేణుమెన్ఱు తన్నైయఙ్గీకరిత్తు, తద్వ్యామోహవిషయమాక్కిన స్వాచార్యనాలే యెన్గై.

మూ॥ ఆచార్యసంబంధమన్ననో, మోక్షముకే హేతువుగానుండును.
మూ॥ ౪౩౪॥ భగవల్లాభము ఆచార్యనివలన.

శ్రయించుటకు ఇంతకుముందు చెప్పిన యీశ్వరాశ్రయణరూపమగు సంబంధము, అది బంధమోక్షములకు రెంటికిన్ని సాధారణమైనది యనఁగా—కర్మానుగుణముగ సంసారమున నుంచుటకును కారుణ్యానుగుణముగ ముక్తునిగాఁజేయుటకున్ను సమర్థుండగు నిరంకుశస్వతంత్రునితోఁ గల సంబంధమగుటంజేసి, రెంటికిన్ని సాధారణముగానుండు ననుట.

ఆచార్యసంబంధమనఁగా—ఆచార్యుని యాశ్రయించుట. అది మోక్షముకే హేతువగుట యనఁగా కర్మానుగుణముగ సంసారములోనుంచునట్టి స్వతంత్రుండు కాకుండ, అన్నివిధములచేతను యీతనిని యుజ్జీవింపఁజేసియె తీరవలయునను పట్టుదలగల కృపావంతునితోఁ గల సంబంధమగుటంజేసి, యది సంసారమోక్షములకు రెంటికిన్ని సాధారణమైనది కాకుండ, సంసారమునుండి విముక్తిని గలుగఁజేయుటకు హేతువు కాఁగలదు. ఇందువలన మోక్షమునకుమాత్రమే హేతువగుటయనెడి యాచార్యవైభవము చెప్పఁబడినది.

అవతారిక—ఉత్తారకుండగు విషయమున ఆచార్యునికిఁగల యాధిక్యమును ఇంతకుముందు తెలిపియున్నారు. ఉపకారకుండగు విషయమున సర్వేశ్వరునికిఁ గల యాధిక్యమును తెలుపుటకై ఇఁకమీఁదు ఉపక్రమింపఁబోవుచున్నారు.

(భగవల్లాభము) ఇత్యాది. నిరుపాధికశేషియై నిరంకుశస్వతంత్రుడైయుండు భగవంతుని లభించుటయనునది భగవత్సమృద్ధినే కోరువాఁడై మంగళాశాసనమునఁ బ్రీతిగలవాడు కావలయునని తనను అంగీకరించిన భగవంతుని విషయమునఁ బ్రీతిగలవానినిగాఁ జేసినట్టి స్వాచార్యునివలన ననుట.

మూ॥ ౪౩౫॥ ఆచార్యలాభమ్ భగవానాలే.
మూ॥ ౪౩౬॥ ఉపకార్యవస్తుగౌరవత్తాలే ఆచార్యనిత్తాట్టిల్ మికవు
ముపకారకన్ ఈశ్వరన్.

వ్యాఖ్యానము. ఆచార్యనై లభిక్కైక్కు హేతువేతెన్ను మపేక్షైయిలే యరుళి చ్చెయ్కిఱార్, (ఆచార్యలాభమ్) ఎన్దుతుడఙ్గి. అతావతు - భగవల్లాభహేతువాయ్ పరమ ప్రాప్యభూతనాన ఆచార్యనై లభిక్కై. "ఈశ్వరస్యచ సౌహార్దమ్" ఇత్యాదిప్పడియే నిరుపాధికసుహృత్తాయ్ విశేషకటాక్షప్పడ్ త్తాశైయుమ్ తానేకల్పిత్తుక్కొణ్డు విశేషకటాక్షత్తై పణ్ణి, అద్వేషత్తై ప్పిఱప్పిత్తు ఆభిముఖ్యత్తైయుణ్డాక్కి సాత్త్వికసమ్భాషణత్తిలే మూట్టి సదాచార్యప్రాప్తియై పణ్ణు విక్కుమ్ నిర్హేతుక కృపావానాలే యెన్గై,

ఆనాల్ ఇరువరు ముపకారత్తిల్ సమరోయెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (ఉపకారవస్తు) ఎన్దుతుడఙ్గి. అతావతు- ఉభయరు ముపకరిత్తవస్తుక్కళై చ్చేర్తూక్కప్పార్త్తాల్, ఆచార్యోపకార్య వస్తువాన బన్ధమోక్షోభయహేతువాయ్ ప్రథమపర్వముమా యిరుక్కిఱ భగవద్విషయత్తిత్తాట్టిల్ భగవదుపకార్యవస్తువాన మోక్షైకహేతువాయ్ చరమపర్వముమాయిరుక్కిఱ ఆచార్యవిషయత్తినుడైయ గౌరవత్తాలే, ఈశ్వరనై ఉపకరిత్త ఆచార్యనిత్తాట్టిల్ ఆచార్యనై యుపకరిత్త ఈశ్వరన్ మహోపకారకనెన్గై.

---

మూ॥ ౪౩౫॥ ఆచార్యలాభము భగవంతునివలన.
మూ॥ ౪౩౬॥ ఉపకార్యవస్తు గౌరవమునుబట్టిచూచితే ఆచార్యునికంటెను
ఈశ్వరుండే యెక్కువ యుపకారకుండు.

అవతారిక—ఇట్టి యాచార్యుని లభించుటకు హేతు వెద్దియుంటి వేని తెలుపుచున్నారు.

(ఆచార్యలాభము) ఇత్యాది. భగవంతుని లభించుటకు హేతువై పరమప్రాప్య భూతుండగు ఆచార్యుని లభించుటయనునది "ఈశ్వరస్యచసౌహార్దమ్" ఇత్యాదితావులఁ జెప్పియున్నట్లు నిరుపాధిక బంధువై విశేషకటాక్షమునకుఁ గావలసినట్టి హేతువులను తానే కల్పించి, విశేషముగ కటాక్షించి అద్వేషమును కలుగఁచేసి, యాభిముఖ్యమునున్ను కలుగఁజేసి, సాత్త్వికసంభాషణమున రుచిని గలుగఁజేసి, సదాచార్యప్రాప్తిని గలుగఁ జేయునట్టి నిర్హేతుక కృపావంతుఁడగు భగవంతునివలన ననుట.

అవతారిక—అయితే ఉపకారము విషయమున ఇద్దఱును సమానులే నాయంటి వేని తెలుపుచున్నారు.

(ఉపకార్యవస్తువు) ఇత్యాది. ఉభయులయొక్క యును ఉపకారములను తుల్లతూచితిమేని ఆచార్యునిచే నుపకరింపఁబడునట్టిదియు, బంధమోక్షంబులకు రెంటికిన్ని హేతువయినదియు, ప్రథమపర్వమగు భగవద్విషయము కంటెనున్ను భగవంతునిచే నుపకరింపఁబడునదియు, చరమపర్వమునగు ఆచార్య విషయముయొక్క గౌరవమువలన ఈశ్వరుని లభింపఁజేసిన యాచార్యునికంటెనున్ను ఆచార్యుని లభింపఁజేసిన యీశ్వరుండె యెక్కువ యుపకారకుండు అనుట.

**మూ॥ ౪౩౭॥** ఆచార్యసమ్బన్ధమ్ కులైయాతే కిడన్దాల్ జ్ఞానభక్తివైరాగ్యఙ్గళుణ్డాక్కిక్కొళ్ళలామ్; ఆచార్యసమ్బన్ధమ్ కులైన్దాల్ అన్దయుణ్డానాలుమ్ ప్రయోజనమిల్లై.

"అచిన్త్యాద్భుతాక్లిష్ట జ్ఞానవైరాగ్యరాశయే అగాధభగవద్భక్తిసిన్ధవే" ఎన్గిఱపడియే ఆచార్యర్ తనక్కుళ్ళ జ్ఞానవైరాగ్యభక్తికళాలే యిఱే; అన్దజ్ఞానవైరాగ్య భక్తికళుణ్డానవన్ ఇన్ద ఆచార్యసమ్బన్ధత్తై నెకిழ్న్దానాకిలుమ్ అవై భగవల్లాభత్తుక్కుడలామోవెన్న, అరుళిచ్చెయ్‌కిఱార్ మేల్, (ఆచార్యసమ్బన్ధమ్ కులైయాతే కిడన్దాల్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు – కీழ్చ్చొన్నపడియే ఉత్తారకనుమాయ్ ఉపకారకనుమాయిరుక్కుమ్ స్వాచార్యర్ "ఇవన్ ఎన్నుడైయవన్" ఎన్ఱభిమానిత్తిరుక్కుమ్బడి అవర్ తిరువడికళిల్ తనక్కుణ్డాన సమ్బన్ధమ్ స్వవిప్రతిపత్తియాలే కులైయాతపడి అత్తైనోక్కిక్కొణ్డు కిడన్దాల్, ఆత్మాలఙ్కారఙ్గళాన తత్త్వజ్ఞానమ్ అప్రాప్తవిషయవైరాగ్యమ్ ప్రాప్తవిషయభక్తియాకిఱ ఆత్మగుణఙ్గళిల్లైయాకిలుమ్, అవ్వాచార్యప్రసాదాదికళాలే క్రమేణ ఉణ్డాక్కిక్కొళ్ళలామ్. సర్వమఙ్గళహేతువాన అన్ద ఆచార్యసమ్బన్ధమ్ స్వవిప్రతిపత్తియాలే కులైన్దాల్, జ్ఞానాదికళ్ పూర్వసుకృతఙ్గళాలే శిలతుణ్డాయిరున్దాలుమ్, భగవదఙ్గీకార హేతువాకామైయాలే నిష్ప్రయోజనమెన్గై.

ప్రయోజనమిల్లామైయేయన్ఱు, అవద్యకరముమెన్గిఱార్, (కులైన్దాల్) ఎన్ఱుతుడఙ్గి.

**మూ॥ ౪౩౭॥** ఆచార్యసంబంధనమును చెడకొట్టుకొనక యుండినట్లయిన, జ్ఞానభక్తివైరాగ్యములను సంపాదించుకొనవచ్చును. ఆచార్య సంబంధము చెడిపోయినట్లయిన, జ్ఞానభక్తివైరాగ్యములున్నను ప్రయోజనములేదు.

అవతారిక— "అచిన్త్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే, అగాధభగవద్భక్తిసింధవే" అన్నటుల ఆచార్యునికి గల యాధిక్యమనునది జ్ఞానభక్తివైరాగ్యములను బట్టియుండునది కదా అట్టి జ్ఞానభక్తివైరాగ్యములు కలవానికి యీయాచార్యసంబంధము లేకపోయినచో, అవి భగవల్లాభమునకు హేతువులు కాఁగలవా? యంటేని తెలుపుచున్నారు.

(ఆచార్యసంబంధము చెడిపోకున్నట్లయిన) ఇత్యాది. ఇంతకుముందు చెప్పిన ప్రకారము ఉత్తారకుండై ఉపకారకుండయినట్టి స్వాచార్యుండు "ఈతండు నావాఁడు" అని యభిమానించునట్లు వాని శ్రీపాదములతో తనకుఁగల సంబంధము తన విపరీతభావనవలన చెడిపోకుండ కాపాడుకొనినట్లయిన, ఆత్మాలంకారములగు తత్త్వజ్ఞానమును, అప్రాప్తవిషయములయెడల వైరాగ్యమును ప్రాప్తవిషయమున భక్తియును ఈయాత్మగుణములు లేకపోయినప్పటికిన్ని, వాటిని ఆ యాచార్యుని యనుగ్రహమువలన క్రమముగ కలుగఁజేసికొనవచ్చును. సమస్తమంగళములకును హేతువయినదియగు ఆ యాచార్యసంబంధము తనయొక్క విపరీతభావనలవలన చెడిపోయినట్లయిన, పూర్వజన్మసుకృతము మూలముగ జ్ఞానాదులు కొన్నికలిగినప్పటికిన్ని, అవి భగవంతుండు యీతని నంగీకరించుటకు హేతువులు కానందున, నవి నిరుపయోగములు.

అవతారిక— ఉపయోగము లేకపోవుటయే కాదు, అవమానకర మనియును తెలుపుచున్నారు.

మూ॥ ౪౩౮॥ తాలి కిడన్దాల్ భూషణఙ్గళ్ పణ్ణిపూణలామ్;
తాలి పోనాల్ భూషణఙ్గళెల్లా మవద్యత్తై విళైక్కుమ్.

మూ॥ ౪౩౯॥ తామరైయై యలర్త్తక్కడవ ఆదిత్యన్దానే నీర్రై ప్పిరిన్దాల్
అత్తై యులర్త్తుమాపోలే,

అతావతు-పతివ్రతైయాన స్త్రీక్కు ప్పతిసమ్బన్ధసూచకమాన తాలియొన్ఱుమ్ పోకామల్ కిడన్దాల్ భూషణఙ్గళిల్లైయేయాకిలుమ్ ముతలుణ్డానపోతు పణ్ణిప్పూణ్డుకొళ్ళలాయిరుక్కుమ్. "ఇత్తనై భూషణముణ్డు" ఎన్ఱునైత్తు త్తాలియై వాఙ్గిప్పోకట్టాల్, విధవాలఙ్కారకల్పమాకైయాలే పూణ్డభూషణఙ్గళెల్లా మవద్యావహఙ్గళాయిరుక్కుమెన్గై. ఇత్తాల్, ఆత్మభూషణఙ్గళాన జ్ఞానవైరాగ్య భక్తికళిల్లైయేయాకిలుమ్ ఆచార్యసమ్బన్ధమాత్రమ్ కిడన్దాల్ అవన్ ప్రసాదత్తాలే అవై క్రమేణ ఉణ్డాక్కిక్కొళ్ళలామ్ ; ఆచార్యసమ్బన్ధముత్తనైయుమ్ కులైన్దాల్ ఆత్మగుణఙ్గళాన జ్ఞానవైరాగ్య భక్తికళెల్లాముణ్డానాలుమ్, అవై శ్లాఘ్యతాహేతువన్ఱిక్కే అవద్యావహమాయ్ విడుమెన్ఱపడి.

ఆచార్యసమ్బన్ధమ్ కిడన్దాలుమ్ స్వరూపవికాసక నీశ్వరన్దాన్, అతు కులైన్దాకిలుమ్ ఇత్తనై యాత్మగుణముడైయవనుక్కు అవన్ స్వరూపవికాసత్తైప్పణ్ణానెన్ఱిఅశైక్కైయిలే యరుళిచ్చెయ్కిఱార్,(తామరైయై) ఎన్ఱుడఙ్గి. అతావతు-జలజమెన్ఱుమ్పడిజలత్తిలే పిఱన్దు జలైకధారమాయిరు

మూ॥ ౩౩౮॥ మంగళసూత్రమున్నట్లయిన, ఆభరణములను చేసివేసికొనవచ్చును.
మంగళసూత్రము పోయినట్లయిన ఆభరణములు నిందనుగలుగఁజేయును.

మూ॥ ౪౩౯॥ తామరపుష్పమును వికసింపఁజేయునట్టి సూర్యుండే నీటిలోనుండి
బయటపడి యున్నప్పుడు దానిని వాడిపోవునట్లు చేయును.

(మంగళసూత్ర మున్నట్లయిన) ఇత్యాది. పతివ్రతయయిన స్త్రీకి పతిసంబంధ సూచకమగు మంగళసూత్రము పోకుండ యున్నట్లయిన, ఆభరణములు లేకపోయినను ద్రవ్యమున్నప్పుడు చేయించి వేసికొనవచ్చును. ఇన్ని యాభరణములున్నవి కదా యని తలంచి మంగళసూత్ర మెందులకని దానిని తీసివేసినట్లయిన, విధవయొక్క యలంకార మగుటంజేసి, ధరించిన యాభరణంబులన్నియును అవమానాస్పదంబులగును,

కావున ఆత్మాలంకారంబులగు జ్ఞానభక్తివైరాగ్యములు లేకపోయినప్పటికిన్ని, ఆచార్యసంబంధముమాత్రము చెడిపోకుండ యున్నట్లయిన, యాతని యనుగ్రహమువలన వాటిని క్రమముగ కలుగఁజేసికొనవచ్చును. ఆచార్యసంబంధము మాత్రము చెడిపోయినచో, జ్ఞానభక్తి వైరాగ్యంబులన్నియును ఉన్నప్పటికిన్ని అవి శ్లాఘనకు హేతుభూతములయినవి కాకుండ నిందాస్పదములు కాఁగలవు.

అవతారిక—ఆచార్యసంబంధ మున్నప్పటికిన్ని, స్వరూపమును ప్రకాశింపఁజేయునట్టివాఁడు సర్వేశ్వరుడుకాఁడా? అది చెడిపోయినప్పటికిన్ని, యిన్ని యాత్మగుణములు గలవాని స్వరూపము నతండు ప్రకాశింపఁజేయఁడా? అంటివేని తెలుపుచున్నారు.

(తామరపుష్పమును) ఇత్యాది. జలజము అనఁబడునట్లు జలమునఁబుట్టి జలమునే యాధారముగాఁగలిగి యుండు తామరపుష్పమును "కెజ్జముల మన్దరంజేర్ వెజ్జతిరోఱ్క్కల్లాలలరావాల్ "

**మూ॥ స్వరూపవికాసత్తైప్పణ్ణు మీశ్వరన్దానే ఆచార్యసమ్బన్ధమ్ కులైన్దాల్ అత్తై వాడప్పణ్ణుమ్.**

**మూ॥ ౪౪౦॥ ఇత్తైయొఴియ భగవత్సమ్బన్ధమ్ దుర్లభమ్.**

---

క్కుమ్ తామరైక్కు, "శెజ్గమలమన్దరమ్ శేర్ వెజ్గతిరోనుక్కల్లాలలరావాల్" ఎన్నుమ్బడి నియమేన వికాసకనాయ్ప్పోరు మాదిత్యన్ తానే, స్వధారకమాన జలత్తై విశ్లేషిత్తాల్ అన్ద త్తామరైయై వికసిప్పియాతమాత్రమన్ఱిక్కే శోషిప్పిక్కుమాపోలే, ఆచార్యాన్వయత్తాలే సత్తైపెఱ్ఱు స్వసత్తాధారకమాన తత్సమ్బన్ధమ్ కులైయాతే నిఱ్కుమళవిల్ ఇవనుడైయ స్వరూపత్తై జ్ఞానవికాసముఖేన, "ఉళ్ళువులకళవుమ్ యానుముళేనావన్" ఎన్నుమ్బడి వికసిప్పిక్కు మీశ్వరన్దానే, స్వసత్తాధారకమాన ఆచార్యసమ్బన్ధత్తై స్వవిప్రతిపత్తియాలే ఇవన్ కులైత్తుక్కొణ్డకాలత్తిల్ తాన్ వికసిప్పిక్కక్కడవ అన్ద స్వరూపత్తై వికసిప్పియాతమాత్ర మన్ఱిక్కే నాళుక్కునాళున్ నష్టప్రజ్ఞనాయ్ సజ్కోచిత్తుప్పోమ్బడిపణ్ణుమెన్గై. "నారాయణోపివికృతిం యాతి గురోః ప్రచ్యుతస్యదుర్బుద్ధేః । కమలంజలాదపేతం శోషయతి రవిర్న తోషయతి" ఎన్నక్కడవతిఱే.

ఇజ్జ్ఞ శొల్లుకిఱతేన్, ఇవ్వాచార్యసమ్బన్ధమ్ కులైన్దతాకిలుమ్ "ఒఴిక్కవొఴియాతు" ఎన్గిఱ భగవత్సమ్బన్ధ ముజ్జీవనత్తుక్కు డలాకాతోవెన్న, అరుళిచ్చెయ్కిఱార్, (ఇత్తైయొఴియ)

---

**మూ॥ స్వరూపమునకు వికాసముఁ గలుగఁజేయునట్టి యీశ్వరుండే ఆచార్యసంబంధము చెడిపోయినట్లయిన, దానిని వాడిపోవునట్లు చేయును.**

మూ॥ ౪౪౦॥ ఇది లేకున్న, భగవత్సంబంధము దుర్లభము.

---

(పె. తి, ౬౫) (యెఱ్ఱ తామరపువ్వు ఆకాశమునఁ దిరుగుచుండు సూర్యునిచేఁ దప్ప ప్రకాశింపదు) అన్నట్లు నియతముగ వికసింపఁజేయునట్టి వాఁడగు సూర్యుండే అది తన కాధారభూతమగు జలమును విడిచియున్నట్లయిన, ఆ తామరపుష్పమును వికసింపఁజేయుడు సరియే కదా, పైగా దానిని (తన వేడిమివలన) శోషింపఁజేయును. అట్లే యాచార్యుని సంబంధమువలన సత్తనులభించి తన సత్తకాధారభూతమగు వాని సంబంధము చెడిపోకుండ యుంచుకొనునప్పుడు యీతని స్వరూపమును జ్ఞానవికాసము ద్వారా "ఉళ్ళువులకళవు యానుముళనావన్" (పె. తి ౪౬)(ఈ లోకము లున్నంతవరకును సత్తగలవాఁడనయి యుండును) అన్నట్లు వికసింపఁజేయునట్టివాఁడగు సర్వేశ్వరుండే, యీతండు తనసత్తకు ఆధారభూతమగు యాచార్యసంబంధమును తనయొుక్క విపరీతభావనవలన చెడగొట్టికొనినప్పుడు తాను వికసింపఁగలిగినట్టి యీస్వరూపమును వికసింపఁజేయకపోవుట మాత్రమే కాకుండ, రోజు రోజుకు జ్ఞానము నశించి సంకోచించిపోవునట్లు చేయుననుట. కావుననే "నారాయణోపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్యదుర్బుద్ధేః । కమలం జలాదపేతం శోషయతిరవిఃనతోషయతి" (గురువును విడనాడినవాని విషయమున నారాయణుండును కోపముగలవాఁడగును. జలమును విడనాడిన కమలమును సూర్యుఁడు శోషింపఁజేయునే కాని, వికసింపఁజేయఁడు కదా) అని చెప్పియున్నది.

అవతారిక—ఇట్లు సేల చెప్పఁదగును. ఈయాచార్యసంబంధము పోయినప్పటికిన్ని చెడ కొట్టినను చెడిపోనిదియని చెప్పఁబడునట్టి భగవత్సంబంధము ఉజ్జీవనమునకు హేతువుకాఁజాలదా? యంటివేని తెలుపుచున్నారు.

మూ॥ ౨౨౧॥ ఇరణ్డుమ్మైయాతో, నడువిల్ పెరుఙ్గుడియెన్నెన్నిల్;

---

ఎన్ఱుతుడఙ్గి. అతావతు - అనాదిసిద్ధమాయిరుక్కచ్చెయ్ తేయుమ్, ఆచార్యనుణర్ త్తువతఱ్కు మున్బు అసత్కల్పమాయ్ అవనుణర్ త్తినపిన్బు ఇవనుక్కు కార్యకరమాకక్కడవతాయిరుక్కుమతు. ఇవ్వాచార్యసమ్బన్ధమ్ కులైన్దపోతు ఇతడియాకవన్దతానుమ్ కులైన్దుపోమాకైయాలే, ఇవ్వాచార్యసమ్బన్ధత్తైయొழియ భగవత్సమ్బన్ధ మివనుక్కుక్కిడైయాతెన్నై. ఆకైయాల్ ఇతు పోయిన్ఱాకిలుమ్ అతునమక్కు ఉజ్జీవనత్తుక్కుడలెన్ఱిరుక్క విరకిల్లై యెన్ఱు కరుత్తు.

ఇప్పడి ఆచార్యసమ్బన్ధత్తైయొழియ భగవత్సమ్బన్ధమ్ లభియామైయాలే ఆత్మోజ్జీవనత్తుక్కు ఇరణ్డుమ్ వేణుమెన్నుమత్తై దర్శిప్పిత్తవనన్తరమ్, భాగవతవిషయసమ్బన్ధముమ్ అప్పోపాతి ఇవనుక్కవశ్యాపేక్షితమెన్నుమత్తై దర్శిప్పిక్కైక్కాక తద్విషయప్రశ్నత్తై యనువదిక్కిఱార్. (ఇరణ్డుమమైయాతో నడువిల్ పెరుఙ్గుడియెన్నెన్నిల్) ఎన్ఱు. అతావతు -ఆత్మోజ్జీవనత్తుక్కు భగవత్సమ్బన్ధస్థాపకమాన ఆచార్యసమ్బన్ధముమ్ తత్ స్థాపితమాన భగవత్సమ్బన్ధముమాకియ ఉభయముమ్ పోరాతో, ప్రాప్యమధ్యమపర్వోక్తతయా నడువిల్ పెరుఙ్గుడిపోలే యిరుక్కుమ భాగవతర్కళోడు, ‹‹సాత్త్వికైస్సమ్భాషణమ్›› ఎన్గిఱ సమ్బన్ధమెత్తుక్కు వేణ్డువతెన్గిఱతాకిలెన్నై.

ఇప్ప్రశ్నత్తుక్కు ఉత్తరమరుళిచ్చెయ్కిఱార్, (కొడియై) ఎన్ఱుతుడఙ్గి. అతావతు-ఉపఘ్నా

---

మూ॥ ౨౨౧॥ ఈ రెండును చాలవా? (ఊరి) మధ్యను పెద్దయిల్లు వలెనుండు భాగవత సంబంధమేమిటలకంటివేని,

---

(ఇది తప్పితే) ఇత్యాది అనాదిసిద్ధముగా నున్నట్టిదయినను, ఆచార్యుండు దిద్దుపాటు చేయుటకు పూర్వము అసత్తువలెనుండి, వాఁడు దిద్దుపాటు చేసినపిమ్మట వానికి యుపయుక్తమైనట్టిది యగు ఇది యీయాచార్య సంబంధము చెడిపోయినప్పుడు దానిమూలకముగ వచ్చినట్టి తానున్ను చెడిపోవుఁగాన, ఈయాచార్యసంబంధము లేకుండెనేని భగవత్సంబంధము కలుగజాలదు. కావున ఆచార్యసంబంధము పోయినప్పటికిన్ని, భగవత్సంబంధము ఉజ్జీవించుట హేతువుకాఁగలదను కొనుట కవకాశము లేదని భావము.

అవతారిక:—ఇట్లు ఆచార్యసంబంధమున్ననే తప్ప భగవత్సంబంధము కలుగజాలదు గాన, ఆత్మోజ్జీవనమునకై రెండును గావలసినవియే యని తెలిపిన పిమ్మట, భాగవతసంబంధమున్ను అట్లె ఈతని కవశ్యము కావలసినదియని తెలుపుటకుగాను అందువలను గురించిన ప్రశ్నను అనువదించుచున్నారు.

(ఈరెండును చాలవా మధ్యను పెద్దయిల్లెండుల కంటివేని) ఇత్యాది.

ఆత్మోజ్జీవనముకు గాను భగవత్సంబంధమును స్థాపించునట్టిదియగు ఆచార్యసంబంధమున్ను అట్టి యాచార్యసంబంధమున్ను యీ రెండును చాలవా! ప్రాప్యమధ్యమపర్వముగాఁ జెప్పుటచే గ్రామమధ్యముననుండు ఒక పెద్దయిల్లువలెనే యున్నట్టి భాగవతులతో ‹‹సాత్త్వికైస్సహసంభాషణం=సాత్త్వికులతో సంభాషణము›› అన్నట్టి సంబంధము దేనిని యాశ్రయించియుండు నంటివేని యనుట.

అవతారిక—యీపైప్రశ్నకు త్తరముఁ దెలుపుచున్నారు.

(తీగను) ఇత్యాది. ప్రాకుటకయి యొకమండ మొదలగుదాని సహాయము నపేక్షించు

మూ॥ ౪౪౨॥ కొడియైక్కొళ్ కొమ్బిలే తువక్కుమ్బోతు శుళ్ళిక్కాల్
వేణ్డుమాపోలే, ఆచార్యాన్వయత్తుక్కు మితు వేణుమ్.

పేతుమాయ్ వళరువతొరుకొడియై అతిఱ్ పరిణామత్తుక్కెల్లామిడమ్‌కొడుక్కత్తక్క పెరియతొరు ఉపఘ్నత్తిలే శేర్క్కుమ్బోతు ముతలిలే అతు తన్నోడే శేర్క్కప్పోకామైయాలే, తన్నైప్పడామల్ మున్దుఱత్తానితుక్కాశ్రయమాయ్‌క్కొణ్డు అణుకినిన్ఱు తన్నోడే యన్వయముణ్డేన కోల్ కొమ్బిలేకొణ్డునిక్కుమ్ శుళ్ళిక్కాలపేక్షితమామాపోలే, కోల్ తేడియోడుమ్ కొణ్డు పోలే అభిముఖనాన ఇచ్చేతనన్ ఆశ్రితర్ అధఃపతియామలుద్ధరిప్పిక్కుమ్ మహాశ్రయమాన ఆచార్యన్ తిరువడికళి లన్వయిక్కుమ్బోతు, ముతలిలే తదన్వయమ్‌సిద్ధిక్కైయాలే మున్దుఱత్తాన్దగ్గరాసన్నరాయ్‌నిన్ఱు తన్గళోడే ఇణక్కువిత్తు అవ్వళియాలే ఆచార్యవిషయత్తిలే శేర్క్కుమ్ భాగవతర్‌కళోట్టై సమ్బన్ధమవశ్యాపేక్షితమెన్గై. ఇప్పడి ఆచార్యాన్వయత్తుక్కడి భాగవతర్‌కళాకిల్, "ఆచార్యలాభమ్ భగవానాలే" ఎన్బానెన్నెన్నిల్; అతుక్కుక్కైయిల్లై, భాగవతాన్వయమ్‌తనక్కడి అవనాకైయాలే; అభిముఖ్యపర్యన్తమాకత్తానే కృపిపణ్ణికొణ్డు వన్దు పిన్నై భాగవతర్‌కళోడే ఇణక్కి అవ్వళియాలేయిఱే అవన్ఱానాచార్యవిషయత్తిలే శేర్ప్పతు. ఇతిత్తన్నైయుమ్ ఇవరరుళిచ్చెయ్‌త దృష్టాన్తత్తిల్ సిద్ధమ్! ఎజ్ఞనేయెన్నిల్, చేతనన్నై కొడియినుడైయస్థానే యాకవుమ్ ఆచార్యన్నై కొళ్ కొమ్బినుడైయస్థానేయాకవుమ్ భాగ

మూ॥ ౪౪౨॥ చెట్టపాదు తీగెను చెట్టపాదు పందిలికెక్కింపలయునన్న ప్రక్కను ఒక
చిన్నమండను పాతవలసియున్నట్లు ఆచార్యసంబంధమున కిదికావసిలనది

నట్టి తీగను దానిని పయికిగొనిపోయి వృద్ధిపొందునట్లు చేయునట్టిదియగు ఒకపెద్ద చెట్టపాదు పదిలితోఁ జేర్పవలయునన్న మొదటనే అది దానితోఁ జేత నేరదుగాన మొదట అది క్రిందపడి పోకుండ దానికి యాశ్రయమై తనతోఁగల సంబంధము మూలముగ పందిలితోఁ జేర్చునట్టిదియగు నొక చిన్నమండ గావలసియుండునట్లు, "కొయ్యకై వెతుక్కొనుచు ప్రాకునట్టి తీగవలెనే అభిముఖుండగు ఈచేతనుండు ఆశ్రితులధఃపతితులు గాకుండ యుద్ధరింపఁజేయునట్టి గొప్పయాశ్రయమగు యాచార్యుని శ్రీపాదముల నాశ్రయించునప్పుడు ముందుగ అట్టి యాచార్య సంబంధము లభించుట యరుదయినందున తాము ముందుగనిలిచి దగ్గిరకుతీసి, యందుమూలముగ యాచార్యునితోఁ జేర్చునట్టి భాగవతులతోటి సంబంధము అవశ్యముగ గావలసినది.

ఇట్లు యాచార్యసంబంధమునకు మూలము భాగవతు లయినట్లయిన, యాచార్యప్రాప్తి భగవంతునివలనఁ గలుగునని యింతకుముందేల చెప్పినారంటివేని, అట్లు చెప్పినందున బాధకము లేదు. భాగవతసంబంధమునకున్ను మూలకారణము భగవంతుండె యగుటంచేసి, యాభిముఖ్యము గలుగువరకును భగవంతుండె కృపిచేసికొనివచ్చి అటుపిమ్మట భాగవతుల చెంతచేర్చి యందుమూలముగ తానే ఆచార్యునితో చేర్చును, ఇది యంతయును వీరు ఉదహరించిన దృష్టాంతమునందే స్పష్టముగాఁ దెలియ గలదు. అది యెట్లనిన, యీచేతనుని యొకతీగెనుగానును ఆచార్యుని చెట్లపాదుపందిలిగానును, భాగవతులను అట్టి తీగె పందిలి కెక్కుటకుగాను దాని ప్రక్కను పాతునట్టి యొకచిన్నమండనుగానునుబోల్చి చెప్పియున్నందున వ్యాఖ్యాయదారుడు తన

వతర్కళై ప్పళ్ళిక్కొళ్ళినుడైయ స్థానేయాకవుమ్ మరుళిచ్చెయ్ తైయాలే కర్షక — యిరుప్పానొరువన్ స్వప్రయోజనార్థమాక ముతలిలే విత్తైయిట్టు ముళైప్పిత్తు క్కొళుందుశరిక్కుమళవుమ్ వళర్త్తుక్కొణ్డు పోన్దతొరుకొడియై, ఇతుక్కు ఇని యోరుపత్తున్ వేణుమెన్ఱు తానే ఉపత్తున్ ముమ్ తేడి అతిలేశేర్త్తేయుళ్ళైక్కు శుళ్ళిక్కొళుమ్ నాట్టి అవ్వఴియాలే, సర్వశేషియాన సర్వేశ్వరన్ స్వప్రయోజనార్థమాక ఇచ్చేతననై ముతలిలే సృష్టిత్తు, ,,ఈశ్వరస్యచసౌహార్దమ్'' ఇత్యాదిప్పడియే క్రమేణ అభిముఖ్యపర్యన్తమాక విళైత్తు ఇవనుక్కోరాచార్యనైయుమ్ మిన్నానెన్ఱు తానే తిరువుళ్ళమ్ పఱ్ఱి అవనోడే శేర్క్కుమ్ భాగవతర్కళోడే ముతలన్వయిప్పిత్తు అవ్వఴియాలే ఆచార్యవిషయత్తిలే యన్వయిప్పిక్కుమెన్నుమిడమ్ తోన్ఱుకైయాలే కొళ్కొమ్బిలేయేఱవిట్ట కర్షకనుక్కు అన్దక్కొడియాలుళ్ళ ప్రయోజనమామాపోలే, ఆచార్యవిషయత్తిలీశ్వరన్ శేర్త్త చేతననాలుళ్ళ ప్రయోజనము మీశ్వరనతే యెన్నుమిడముమ్ ఫలితమ్, ఇని అచేతనమాన కొళ్కొమ్బుపోలన్ఱియే చేతనోత్తమనాన ఇవ్వాచార్యన్ తానుమ్ పరసమృద్ధ్యేక పరనాకైయాలే, స్వశేషియాన ఈశ్వరనుడైయ ప్రయోజనమాక నినైత్తిరుక్కుమిడే.

ఇని (స్వాభిమానత్తాలే) ఎన్ఱుతొడఙ్గి, ',,ఆచార్యాభిమానమే ఉత్తారకమ్'' ఎన్నుమళవాక, ఇప్పడి తదీయర్ మున్నాకప్పఱ్ఱప్పడుమ్ సదాచార్యనుడైయ అభిమానమే ఉజ్జీవనత్తుక్కు ఉచితోపాయమెన్ఱు ఇప్ప్రబన్ధతాత్పర్యత్తై ప్రకాశిప్పిత్తరుళుకిరార్. పెరువిలైయనాన ఆభరణత్తుక్కు నాయకక్కల్ పోలేయాయిఱ్ఱు వచనభూషణత్తుక్కు ఇప్ప్రదేశమ్ నాయకరత్న

---

లాభమునకై మొట్టమొదట విత్తనమును చల్లి మొలిపించి తీగ వేయువరకును కాపాడుకొని పోయిన రొకమొక్కను ఇది యల్లుకొనుట కొక యాధారముండవలయునని కోరి, యందులకై యొక పందిలివేసి యాతీగె దానిపైకి పోవుటకుగాను దీనిప్రక్కను ఒకచిన్నమంకను పాతునట్లు సర్వశేషియగు సర్వేశ్వరుండును స్వప్రయోజనమునకై మొదట యీచేతనుని సృజించి, ,,ఈశ్వరస్యచసౌహార్దమ్'' అని సాయించినట్లు క్రమముగ అభిముఖ్యమువరకును గలుగఁజేసి; యీతని కొక యాచార్యుండు యుండవలయునని తానే తలంచి, వానిలోఁ జేర్చునట్టి భాగవతులతో ముందుగ సంబంధమును గలుగఁజేసి, తద్వారా ఆచార్యునితో సంబంధము గలుగునట్లు చేయునని తెలియవచ్చుటంజేసి తీగెను మండలోఁజేర్చునట్టి కాపుకానిదే ఆతీగెవలనఁ గలుగునట్టి ప్రయోజనమగునటుల ఆచార్యునితో నీచేతనునిచేర్చినట్టి యీశ్వరునిదే యీచేతనునివలనఁ గలుగుప్రయోజనమును అని తెలిపి యున్నారు.

ఇఁక ఈ యాచార్యుండు చెట్టుపాదుపందలివలెనే యచేతనముకాకుండ చేతనోత్తముండగుటంజేసి పరసమృద్ధినే (సర్వేశ్వరుని యతిశయమునే) కోరువాఁడుగాన, తనకు శేషియగు సర్వేశ్వరుని ప్రయోజనమే తన యొక్క ప్రయోజనము నని తలంచియుండును కదా.

అవతారిక:—ఇఁక (స్వాభిమానముచే) అనువాక్యము మొదలుకొని (ఆచార్యాభిమానమే యుత్తారకము) అను వాక్యమువరకును యిట్లు భాగవతపురుషకారము ద్వారా యాశ్రయింపఁబడునట్టి సదాచార్యునియొక్క యభిమానమే ఉజ్జీవించుటకుఁ దగినట్టి యుపాయ మని యీప్రబంధము యొక్క ముఖ్యాభిప్రాయముఁ దెలుపుచున్నారు.

గొప్ప వెలగల యాభరణమునకు నాయకరత్నమువలెనే శ్రీవచనభూషణగ్రంథమునకు యీ ఘట్టము నాయకరత్నముగా నుండును,

మూ॥ ౪౪౩॥ «స్వాభిమానత్తాలే ఈశ్వరాభిమానత్తై క్కులైత్తుక్కొణ్డ ఇవనుక్కు ఆచార్యాభిమానమొழியగతియిల్లై” ఎన్ఱు పిళ్ళైపలకాలు మరుళిచ్చెయ్య క్కేట్టిరుక్కైయా యిరుక్కుమ్.

మా యిరుక్కుమ్బడి. ఇత్తనైయు మరుళిచ్చెయ్కైయెప్పళ్ అధిష్ఠికైయిట్టు క్కొణ్డువన్దతు కీழ్ దజ్గలుమ్, మేలదజ్గలు మితిల్ నిష్ఠైయై స్థాపిక్కిఱతు. అతిల్ ప్రథమత్తిల్ ఇత్తర్థమ్ సత్సమ్ప్రదాయసిద్ధమెన్ఱు సర్వరుమ్ విశ్వసిక్కైక్కుడలాక ఇతు తమక్కు ఆప్తోపదేశలబ్ధమెన్నుమిడత్తైయరుళిచ్చెయ్కిఱార్, (స్వాభిమానత్తాలే) ఎన్ఱుతుడజ్గి. అతావతు-అనాదికాలమ్ «నానే యెనక్కు నిర్వాహకన్” ఎన్ఱిరుక్కుమ్ తన్నుడైయ దురభిమానత్తాలే, «ఇవన్ నమక్కు శేషమ్, ఇవన్ కారియమ్ నమక్కే భరమ్” ఎన్ఱు తన్నైఉజ్జీవిప్పిక్కైక్కుడలాన ఈశ్వరాభిమానత్తై యழித్తుక్కొణ్డ ఇవనుక్కు, దుర్గతియై పర్యాలోకవజ్గీకరిత్తు త్తన్నుడై యవన్” ఎన్ఱభిమానిత్తిరుక్కుమవ ద్వభిమానమొழியు, వేఱు ఉజ్జీవనోపాయమిల్లైయెన్ఱు సకలశాస్త్రసారవిదగ్రేసరరాన నమ్బిళ్ళైతిరువడికళిలే పఴక్కసేవిత్తు తదేకపరతన్త్రరాయ్ సకలశాస్త్రతాత్పర్యజ్గళైయు మవరరుళిచ్చెయ్యక్కేట్టు తన్నిష్ఠరాయిరుక్కుమ్ నమ్ముడైయ ఆచార్యరానపిళ్ళైతజ్గమాకప్పలకాలుమరుళిచ్చెయ్య క్కేట్టిరుక్కైయాయిరుక్కుమెన్నపడి. ఆకైయాల్, ఆచార్యాభిమానమే ఇవ్వాత్మావుక్కు ఉజ్జీవనోపాయమెన్ఱు కరుత్తు.

మూ॥ ౪౪౩॥ «స్వాభిమానమువలన సర్వేశ్వరుని యభిమానమును పోగొట్టుకొనినట్టి యీతనికి ఆచార్యాభిమానముతప్ప గతిలేదు” అని వడక్కుత్తిరువీధిపిళ్ళగారు పలుమారు సాయింపఁగా వినియున్నాము.

అవతారిక: —ఇంతవరకును సాయించినదానినిబట్టి యొకపీఠిక నేర్పఱచి, యింతకుముందు గ్రంథముచేతను పైగ్రంథముచేతనున్ను యీవిషయమున నుండవలసిన నిష్ఠను స్థాపించుచున్నారు అందులో మొట్టమొదట యీయర్థము సత్సంప్రదాయసిద్ధమని యెల్లరును విశ్వసించుటకుగాను ఇది తమకు ఆప్తోపదేశమువలన లభించినదియని తెలుపుచున్నారు.

(స్వాభిమానముచే) ఇత్యాది. అనాదికాలముగ « నేనే నాకు నిర్వాహకుఁడను ” అని తలంచియుండు తనయొక్క దురభిమానమువలన, «ఈతండు మనకు శేషభూతుండు ఈతని కార్యము మనచే నిర్వహింపవలసినది” అని తలంచి తనను ఉజ్జీవింపఁజేయ శక్తిగల సర్వేశ్వరుని యభిమానమునుపోగొట్టుకొనినట్టి తనయొక్క దుర్గతినే హేతువునుగాఁగొని యంగీకరించి, తనయుజ్జీవనమునకై కృషిచేయునట్టి పరమదయాళువగు ఆచార్యుండు «ఈతండు మనవాడు” అని యభిమానించియుండుట యనెడి యభిమానముతప్ప వేరొక్క యుజ్జీవనోపాయములేదని సకలశాస్త్రసారవేత్తలలో నగ్రేసరులగు నంబిళ్ళైగారి శ్రీపాదములయందు సేవచేసి వారికి పరతంత్రులయి సకలశాస్త్రతాత్పర్యార్థములను వారు ఉపన్యసింపగావిని వాటియందు నిష్ఠగల మాయాచార్యులగు వడక్కుత్తిరువీధి పిళ్ళైగారు యీయర్థమునే రక్షకముగాను పలుమారు ప్రసాదింపఁగా వినియున్నారమనుట. కావున ఆచార్యాభిమానమే యీయాత్మ కుజ్జీవనోపాయమని యభిప్రాయము.

మూ॥ ౪౪౪॥ స్వస్వాతన్త్ర్యభయత్తాలే భక్తి నఴువిఱ్ఱు.

మూ॥ ౪౪౫॥ భగవత్స్వాతన్త్ర్యభయత్తాలే ప్రపత్తి నఴువిఱ్ఱు.

---

ఇప్పడి “ఆచార్యాభిమానమొழிయ గతియిల్లై” ఎన్బాన్, శాస్త్రసిద్ధఙ్గళాన భక్త్యాద్యుపాయ విశేషఙ్గళుణ్డాయిరుక్కచ్చెయ్దే, ఇదొழிన్దవై యెల్లా మివనుక్కు ఉపాయమన్ఱిక్కే నిన్ఱపడియై అడైవే యరుళిచ్చెయ్కిఱార్ మేల్. ప్రథమత్తిలే భక్తి ఉపాయమన్ఱియే నిన్ఱపడియై యరుళిచ్చెయ్కిఱార్, (స్వస్వాతన్త్ర్య) ఇత్యాదియాలే. అదావదు-భగవత్ప్రాప్తిసాధనతయా విహితైయాయ్ స్వయత్నసాధ్యయాన భక్తి భగవదేకపారతన్త్ర్యవిరోధియాన స్వస్వాతన్త్ర్యత్తైయుణ్డాక్కు మెన్నుమ్ భయత్తాలే ఇవనుక్కు ఉపాయమన్ఱియిలే నఴువినిన్ఱతెన్గై.

అనన్తరమ్, ప్రపత్తి ఉపాయమన్ఱియే నిన్ఱపడియై యరుళిచ్చెయ్కిఱార్, (భగవత్స్వాతన్త్ర్య) ఇత్యాదియాలే. అదావదు-స్వపారతన్త్ర్యానురూపైయాయ్ మహావిశ్వాసరూపైయాన ప్రపత్తి, బన్ధమోక్షోభయ నిర్వాహకనాన భగవానుడైయ స్వాతన్త్ర్యత్తాలే మీళవుమ్ కర్మానుగుణమాక, వైత్తివిడాదు సంసరిప్పిక్కిల్ శెయ్వతెన్నెన్గిఱ మహాభయత్తాలే ఇవనుక్కు ఉపాయమన్ఱియిలే నఴువినిన్ఱతెన్గై.

అనన్తరమ్, ఆచార్యవిషయత్తిల్ స్వకీయస్వీకార ముపాయమన్ఱిక్కే యొழிన్దపడియై

---

మూ॥ ౪౪౪॥ స్వస్వాతంత్ర్యభయ మువలన భక్తి యుపాయము కాకున్నది.

మూ॥ ౪౪౫॥ భగవత్స్వాతంత్ర్యభయమువలన ప్రపత్తి యుపాయము కాకున్నది.

---

అవతారిక:—ఇట్లు యీతనికి ఆచార్యాభిమానముతప్ప వేఱొక్క గతిలేదని చెప్పవచ్చునా? శాస్త్రమునందు విధింపఁబడినట్టి భక్తి మొదలగు ఉపాయములనేకములు కలవేయంటివేని ఈ యాచార్యాభిమానము లెనట్లయినచో, అవి యన్నియును యీతని కుపాయము కాకపోవుటను క్రమముగ తెలుపుచున్నారు, అందులో ప్రథమమున భక్తి యుపాయము గాఁజాలదనువిషయమును “స్వస్వాతంత్ర్య” ఇత్యాదివాక్యముచే తెలుపుచున్నారు.

భగవత్ప్రాప్తికి సాధనముగాను విధింపఁబడినదై స్వయత్నసాధ్యమగుభక్తి భగవత్పారతంత్ర్యరూపమగుస్వరూపమునకు విరోధియగు స్వస్వాతంత్ర్యమును గలుగఁజేయునని యెఱుగుటంజేసి యది యీతని కుపాయము కాదగదు.

అవతారిక— అనంతరము ప్రపత్తి యుపాయము కాకపోవుటను దెలుపుచున్నారు.

(భగవత్స్వాతంత్ర్యము) ఇత్యాది. తనయొక్క పారతంత్ర్యమున కనుగుణమై మహావిశ్వాసరూపమగు ప్రపత్తియనునది బంధమోక్షంబులకు రెంటికిన్ని నిర్వాహకుండగు భగవంతుండు దాని విషయమై యుండునట్టి యభిప్రాయమునువదలుకొని కర్మానుగుణముగ మరల సంసారమునందుంచి నచో యేమిచేయఁ గలను అడెడి గొప్పభయమువలన, ఈతని కుపాయము కాదగదు.

అవతారిక—అనంతరము ఆచార్యుని విషయమున స్వకీయస్వీకారము ఉపాయము కాకపోవుటను తెలుపుచున్నారు.

మూ॥ ౪౪౬॥ ఆచార్యనైయుమ్ తాఙ్ పఱ్ఱుమ్ పఱ్ఱు అహఙ్కార గర్భమాకైయాలే, కాలన్ మోతిరమిడుమోపాతి.

మూ॥ ౪౪౭॥ ఆచార్యాభిమానమే ఉత్తారకమ్.

---

అరుళిచ్చెయ్కిఱార్, (ఆచార్యనైయుమ్) ఎన్ఱు తొడఙ్గి. అతావతు - ఆచార్యనైయుమ్ ఉపాయమాకత్తాఙ్ స్వీకరిక్కుమ్ స్వీకారమ్ స్వఫలిత్వకర్తృత్వరూపమాయ్ స్వరూపనాశకమాయిరుక్కుమ్ అహఙ్కారత్తై ఉళ్ళే యుడైత్తాయిరుక్కైయాలే, స్వవినాశకరమాన కాలనైప్పరిగ్రహిత్తు అన్దప్పాన్నాలే అఙ్గులీయకధారణమ్ పణ్ణినాల్ అవద్యకరమామోపాతి తన్నుడైయ స్వరూపత్తుక్కు అవద్యకరమాయిరుక్కుమెన్నై. ఆకైయాల్ ఇతువు ముపాయమన్ఱియేయెన్నతెన్ఱు కరుత్తు.

పారిశేష్యాత్ కీழ் తామరుళిచ్చెయ్తతే ఉపాయమెన్ఱు తలైక్కట్టుకిఱార్, (ఆచార్యాభిమానమే ఉత్తారకమ్) ఎన్ఱు. అతావతు- మోక్షసాధనతయా శాస్త్రసిద్ధఙ్గళాన భక్త్యాదికళొన్ఱుముపాయమన్ఱియిలేసిన్ఱుపిన్బు, నిరతిశయ కృపావానాయ్ నిర్హేతుకమాక త్తన్నై యఙ్గీకరిత్తరుళి నిరపాయమాక నోక్కిక్కొణ్డుపోరు మాచార్యన్ "ఇవన్ నమ్ముడైయవన్" ఎన్ఱిరుక్కుమవనభిమానమే యివనై సంసారత్తినిన్ఱుముత్తరిప్పిక్కుమెన్నై. అక. "స్వతన్త్రనైయుపాయమాకత్తాఙ్ పఱ్ఱినపోతిలే" ఎన్ఱుతొడఙ్గి ఉపపాతిత్తుక్కొణ్డువన్ద చరమోపాయస్వరూపత్తై ఉళ్ళపడి శోధిత్తు నిర్ణయిత్తరుళినారాయిఱ్ఱు.

---

మూ॥ ౪౪౬॥ ఆచార్యుని తాను ఆశ్రయించిన ఆశ్రయణము అహంకార గర్భితమగుటంజేసి యమునిప్రతిమయొక్క బంగారముతో వుంగరముచేసి ధరించునట్లు నిందాస్పదము.

మూ॥ ౪౪౭॥ ఆచార్యాభిమానమే యుత్తారకము.

---

(ఆచార్యుని) ఇత్యాది. ఆచార్యునిన్ని ఉపాయముగాను తాను స్వీకరించినట్టి స్వీకారమనునది స్వఫలిత్వస్వరూపకర్తృత్వమై (తన ప్రయోజనమును తాను సాధించుకొనుటయై) స్వరూపనాశకమగు అహంకారమును లోపలకలిగి యున్నదగుటంజేసి, స్వవినాశకుండగు యమునియొక్క బంగారపుప్రతిమను దానమియ్యఁగా స్వీకరించి, ఆ బంగారముతో నుంగరము చేయించి పెట్టుకొనుట నిందనీయమగునట్లు, తన స్వరూపము నిందాస్పదమగును. కావున నిదియును ఉపాయముకాదని భావము.

అవతారిక:—ఇఁక మిగిలినది యింతవఱకుఁ తాము సాధించినది యుపాయమని తెలుపుచున్నారు.

(ఆచార్యాభిమానమె యుత్తారకము) ఇత్యాది. మోక్షసాధనములుగాను శాస్త్రసిద్ధములయినట్టి భక్తి మొదలగు వాటిలో నొక్కటియును ఉపాయము కాని పిమ్మట, నిరతిశయకృపావంతుఁడయి నిర్హేతుకముగ తనను అంగీకరించి యెట్టి యపాయమున్ను రాకుండ తనను రక్షించుకొనుచు పోవునట్టి యాచార్యుండు "ఈతండు మనవాఁడు" అని తలంచియుండుట యనెడి యభిమానమె యీతనిని సంసారమునుండి యుద్ధరింపఁజేయును.

కావున "స్వతంత్రుండయినవానిని తాను ఉపాయముగాఁగొని యాశ్రయించినప్పుడు" అనువాక్యము మొదలుకొని ఉపపాదించుకొనివచ్చిన చరమోపాయస్వరూపమును బాగుగ పరిశీలించి నిర్ణయించిన వారయిరి.

**మూ॥ ౪౪౧॥ కైప్పట్టపొరుళై క్కై విట్టు ప్పుతైత్తపొరుళై క్కణిశిక్కక్కడవనల్లన్.**

అనన్తరమ్, ఇవ్వుపాయనిష్ఠనానవధికారిక్కు కర్తవ్యాకర్తవ్య విశేషఙ్గళై విస్తరేణ అరుళిచ్చెయ్‌కిఱార్. అతిల్ ప్రథమత్తిలే సులభమాన ఆచార్యవిషయత్తైవిట్టు దుర్లభమాన భగవద్విషయత్తై ఇచ్ఛిప్పానల్లనెన్నుమిడత్తై దృష్టాన్తముఖేన అరుళిచ్చెయ్‌కిఱార్, (కైప్పట్ట) ఇత్యాదియాలే. అతావతు - కైయిలే యిరుక్కుమ్ ధనమ్బోలే అతిసులభనాయిరుక్కుమ్ ఆచార్యనై క్కైయనిసైత్తు అనాదరత్తాలే కైవిట్టు, భూమియిలే పిఱర్ పుతైత్తువైత్త ధనమ్బోలే ఎట్టప్పడామైయాలే "అరుమ్పొరుళ్" ఎన్నుమ్పడి దుర్లభమాన భగవద్విషయత్తై రక్షకమాకప్పఱ్ఱవిచ్ఛిక్క క్కడవనల్లనెన్గై. "సులభం స్వగురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే। లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతి క్షితౌ" ఎన్ఱుమ్, "పఱ్ఱుకురువై" ఎన్ఱుతుడఙ్గి, "కైత్త పొరుళ్ విట్టారేనుమ్ కాశినియిల్ తామ్పుతైత్త వైప్పారుళ్ తేడి త్తిరివానఱ్ఱు" ఎన్ఱుమ్ శొల్లక్కడవతిఱే.

ఇన్నుమ్ శిలదృష్టాన్తముఖత్తాలే సులభమానఆచార్యవిషయత్తైవిట్టు దుర్లభమానభగవ

---

**మూ॥ ౪౪౨॥ చేఁజిక్కిన ద్రవ్యమును విడిచిపెట్టి, భూమిలో పాతిపెట్టిన దానికై ప్రయత్నింపకూడదు.**

---

కదా" అను వాక్యము మొదలుకొని యుపపాదించుకొనివచ్చి చరమోపాయస్వరూపమును యథార్థరీతిని పరిశీలించి నిర్ణయించినవారయిరి.

అవతారిక—అటుపిమ్మట యీయుపాయమున నిష్ఠగలవానిచే ననుష్ఠింపవలసినవాటిని విపులముగాఁ దెలుపుచున్నారు,

అందు మొట్టమొదట సులభమగు ఆచార్యవిషయమును వదలి దుర్లభమగు భగవద్విషయమును కోరకూడదను విషయమును దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుచున్నారు.

(చేఁజిక్కిన) ఇత్యాది, చేతిలోనున్నట్టి ధనమువలెనే అతిసులభుండగు ఆచార్యుని తక్కువగాఁ దలంచి అనాదరణచే విడిచిపెట్టి భూమిలో నెవ్వరో పాతిపెట్టియుండిన ధనమువలెనె పొందుట కశక్యమైనందున "అరుమ్పొరుళ్" (కష్టసాధ్యమైన విషయము) అని సాయించినట్లు దుర్లభమగు భగవద్విషయమును రక్షకముగాను, ఆశ్రయింపఁగోరకూడదు. "సులభం స్వగురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే। లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతి క్షితౌ" (సులభుండగు గురువుని వదలి భగవంతుని యాశ్రయింపఁగోరువాఁడు చేతిలోనుండు ద్రవ్యమును వదలి భూమిలోనుండు ద్రవ్యమునకై వెదకువానివంటివాఁడు) అనియు, "పఱ్ఱుకురువై" అని యారంభించి "కైత్తపొరుళ్ విట్టరేనుమ్ కాశినియిల్ పుతైత్త వప్పారుళ్ తేడి త్తిరివానత్తు) తన యాచార్యునివదలి కండ్లకగుపడని సర్వేశ్వరుని యాశ్రయించుట యను నది చేతనున్నసొత్తును పారవైచి భూమియం దెవ్వరో పూడ్చిపెట్టిన ద్రవ్యమును వెదకుటవంటిది) అని జ్ఞానసారమునను చెప్పఁబడియున్నది కదా!

అవతారిక — ఇంకను సులభమగు ఆచార్యవిషయమునువదలి దుర్లభమగు భగవద్విషయమునకై యాశపడగూడదను విషయమును దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుచున్నారు.

మూ॥ ౪౪౯॥ విడాయ్ పిఱన్దపోతు కరస్థమాన ఉదకత్తై యుపేక్షిత్తు, జీమూతజలత్తైయుమ్ సాగరసలిలత్తైయుమ్ సరిత్సలిలత్తైయుమ్ వాపీ కూప పయస్సుక్కళైయుమ్ వాఞ్ఛిక్కక్కడవన్గళ్.

ద్విషయత్తై యాశైప్పడువాన్గళ్ ఎన్గిఱార్ మేల్, (విడాయ్ పిఱన్దపోతు) ఎన్ఱుతుడఙ్గి. అతావతు- పిపాసై విఞ్జినపోతు శడక్కెనప్పానమ్ పణ్ణలామ్పడి పాత్రగతమాయ్ క్కొణ్డు తన్ కైయిలిరుక్కుమ్ జలత్తై సులభమ్ ఎన్ఱే హేతువాక అనాదరిత్తు, తరైయిలేయిరుక్కుమ్ ఆకాశస్థమాయ్ క్కొణ్డెట్టాతపడియాయుమ్, భూమిస్థమాయిరుక్క దూరస్థమాయుమ్., ఆసన్నమాయిరుక్కచ్చెయ్తే పెరుకుమ్ కాలమొழிయ ఎన్ఱైనకాలమిన్ఱిక్కేయుమ్, ఎప్పోతుముణ్డానాలుమ్ అవ్వళవుమ్ శెన్ఱు ఉపజీవిక్కవేణ్డియుమ్, ఇరున్దవిడమ్ తన్నిలే యుణ్డాయుమ్ ఖనిత్రాదికళ్ కొణ్డు కల్లిప్పెఱవేణ్డియుమిరుక్కుమ్ జీమూతాదికళిన్ జలత్తై యాశైప్పడుమవనైప్పోలే, రక్షకాపేక్షై పిఱన్దదశైయిల్ అప్పోతే తనక్కు ఉతవుమ్పడి కైపుకున్దిరుక్కుమ్ ఆచార్యవిషయత్తై సౌలభ్యమే పఱ్ఱాశాక ఉపేక్షిత్తు, పరమాకాశవర్త్తియాయ్ దుష్ప్రాపమాయిరుక్కుమ్ పరత్వత్తైయుమ్. భూమియిలేయాయుమ్ క్షీరాబ్ధియళవుమ్ శెల్లవల్లవర్కళుక్కన్ఱి యుతవాత వ్యూహత్తైయుమ్, ఆసన్నమానవన్దుమ్ తాత్కాలికర్క్కొళ్ళియ పాశ్చాత్యర్కుతవాత విభవత్తైయుమ్, నిత్యసన్నిధియుణ్డాయుమ్ సమ్భాషణాదికళా లివనోడు కైకలన్దిరాత అర్చావతారత్తైయుమ్, ఇరున్దవిడమ్ తన్నిలే యుణ్డాయిరున్దాలుమ్ యమనియమాదిక్రమేణ యత్ని

మూ॥ ౪౪౯ ॥ దప్పికగొనినప్పుడు చేతిలోనుండు ఉదకమును ఉపేక్షించి, మేఘములలోనుండునట్టి జలమును, సముద్రములోనుండు జలమును, నదిలోనుండు జలమును, వాపీకూప తటాకంబులలోనుండు జలమునున్ను ఆశింపకూడదు.

(దప్పిక గొనినప్పుడు) ఇత్యాది. దప్పిక గొనినప్పుడు వెంటనే త్రాగుటకు యోగ్యమై తన చేతిలోని పాత్రములో నున్నట్టి ఉదకమును సులభప్రాప్యమైనదియని యనాదరణచేసి, భూమిమీద యునికి ఆకాశమునకుఁబోయి పొంద సాధ్యముగానట్టి మేఘోదకమునున్ను, భూమియందున్నను దూరముగానుండు సముద్రోదకమునున్ను, దగ్గరయున్నను వర్షాకాలమునతప్ప తక్కిన కాలములయందు లభింపని నద్యుదకమునున్ను ఎల్లకాలముండునదైనను అంతదూరముపోయి కొని రావలసినట్టి కూపోదకమును, ఉన్నచోటనే యున్నను గడ్డపలుగు మొదలగు యాయుధములఁగొని వచ్చి త్రవ్వి పొందవలసిన భూగతజలమునున్ను ఇవ్విధమున మేఘాదులలోనుండునటి జలమునకై యాశపడు వానివలెనే రక్షకుం డెవ్వఁడా యనెడి యాశగలిగినప్పుడు వెంటనే యాశ్రయించుటకుఁ దగియుండునట్టి యాచార్యవిషయమును సులభమైనదను హేతువువలన వదలుకొని, పరమపదముననుండి దుష్ప్రాప్యమగు పరస్వరూపమును, భూమియందున్నను క్షీరాబ్ధివరకుఁబోగల్గుసామర్థ్యముగలవారికే తప్ప తక్కినవారికి యుపయోగముతేనట్టి వ్యూహమును, సమీపముననున్నను ఆకాలమున నున్నట్టి వారికే తప్ప తరువాతికాలముననుండిన వారికి ఉపయోగపడని విభవమునున్ను, యెప్పుడును సమీపముననే యున్నను, సంభాషణాదులమూలముగ నితనితోఁ గలిసిమెలసి యుండని యర్చావతారమును, తానున్నచోటనే యున్నను, యమనియమాది క్రమప్రకారము

**మూ॥ ౪౧౦॥ పాట్టుక్కేట్కుమిడముమ్ కూప్పీడు కేట్కుమిడముమ్ కుతిత్తవిడముమ్ వళైత్తవిడముమ్ ఊట్టుమిడముమ్ ఎల్లామ్ వకుత్తవిడమే యెన్నిరుక్క క్కడవన్.**

---

త్తుదర్శిక్క వేణ్డు మన్తర్యామిత్వత్తైయుమ్ మాశైప్పడక్కడవనల్లనెన్గై. ‹‹చక్షుర్గమ్యంగురుంత్యక్త్వా శాస్త్రగమ్యన్తుయః స్మరేత్ హస్తస్థ ముదకంత్యక్త్వా ఘనస్థం సోఽభివాఞ్ఛతి’’ ఎన్నుమ్, ‘ఎట్టవిరున్దకురువై యిఱైయన్నెన్నవిట్టు’’ ఎన్నుతుడఙ్గి, ‹‹అమ్బుత్తైప్పార్ త్తిరుప్పారన్న’’ ఎన్నుమ్ శొల్లక్కడవతిఱే. ఇతు వ్యూహాదికళుక్కు ముపలక్షణమ్.

ఇప్పడి సులభమాన వాచార్యవిషయమ్ స్వరక్షణత్తుక్కుణ్డాయిరుక్క ఇత్తైయుపేక్షిత్తు దుర్లభమాన పరత్వాదికళై వాఞ్ఛిక్కక్కడవనల్లనేయాకిలుమ్, ప్రాప్యత్వేన అవై ఇవనుక్కు వాఞ్ఛనీయఙ్గళన్రోవెన్న, అవైయెల్లామాచార్యనేయెన్నిరుక్క క్కడవనెన్గిఱార్, (పాట్టుక్కేట్కుమిడముమ్) ఎన్నుతుడఙ్గి. అతావతు- ‹‹ఏతత్సామగాయన్నాస్తే’’ ఎన్గిఱపడియే నిరన్తరానుభవపరరాన నిత్యముక్తర్ అనుభవత్తుక్కుప్పోక్కువీడాకప్పణ్ణుమ్ సామగానమ్ కేట్కుమ్ స్థలమాన పరమపదముమ్, అసురరాక్షసపీడితరాన బ్రహ్మాదిదేవర్కళార్తనాదమ్ కేట్కుచ్చెవికొడుత్తుక్కొ

---

**మూ॥ ౪౧౦॥ సామగానము వినంబడు ప్రదేశమును (పరమపదమును) దేవతల ప్రార్థనలనువినునట్టి ప్రదేశమును (పాలసముద్రమును) వచ్చి దుమికిన ప్రదేశమును (అవతారమును) వ్యాపించి యుండు ప్రదేశమును (అంతర్యామిత్వమును) ప్రత్యక్షముగా ననుభవింపఁజేయు ప్రదేశమును (అర్చావతారమును) కోరతగినవన్నియును ఈ యధికారికి ఆచార్యుఁడే.**

---

కృషిచేసి దర్శింపవలసినదియగు అంతర్యామిత్వమునున్నా ఆశపడువాఁడు కాకూడదనుట. ‹‹ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యంతుయఃస్మరేత్ । హస్తస్థముదకంత్యక్త్వా ఘనస్థమ్సోఽభివాంఛతి’’ (కంటికిఁ గానవచ్చునట్టి యాచార్యునివదలి శాస్త్రగమ్యమగు భగవద్విషయముఁ గోరువాఁడు చేతిలోనుండు నీటిని వదలుకొని మేఘములలో నుండునీటికై యపేక్షించువానివంటివాఁడు) అనియును ‹‹ఎట్టవిరుందకురువై యిఱైయన్నెన్నవిట్టు’’ (జ్ఞానసార ౩౪) (సమీపమునున్నట్టి గురువును వదలినవాఁడు) అని యారంభించి ‹‹అంబుదత్తై ప్పార్త్తిరుప్పానన్ఱు’’ (ఉదకమునకయి మేఘముల కెదురుచూచువాని వంటివాఁడు) అనియును చెప్పియున్నది కదా ! ఇది వ్యూహాదులకును ఉపలక్షణము.

అవతారిక—తనను రక్షించుటకై సులభుండగు ఆచార్యుడుండగా, వానిని ఉపేక్షించి, దుర్లభంబులగు పరత్వాదులను వాంచించుట కూడని దయినను, ప్రాపకములయినందున నవియును ఈతనిచే కోరవలసినవి కావాయని యడిగితివేని, అవియన్నియును ఆచార్యుండేయని తలంచుకొని యుండవలయునని తెలుపుచున్నారు.

(సామగానముచేయు స్థలమును) ఇత్యాది. ‹‹ఎతత్సామగాయన్నాస్తే’’ అన్నట్లు నిరంతర భగవదనుభవ పరులగు నిత్యులును ముక్తులును, ఆనంద భరితులై చేయునట్టి సామ గానము వినవచ్చునట్టి దేశమగు పరమపదమును, అసురులచేతను రాక్షసులచేతనున్ను బాధిం

ణ్డుకణ్ వళరుమ్ వ్యూహస్థలముమ్, అవర్ కళార్తధ్వనికేట్టుత్తుయిత్తుక్కొణ్డెళున్దిరున్దు, ‘‘నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాంపురీమ్’’ ఎన్గిఱపడియే తిరుప్పాఱ్కడలిలే తిరువరవణైయిల్ నిన్ఱుమివ్వురుకేవర క్కుతిప్పాఱప్పోలే వన్దవతరిత్త అవతారస్థలముమ్, నినైత్తదు తలైక్కట్టుమళవుమ్ మనైయాళర్ వళైక్కుమాపోలే ఇట్టవడిపేరవిడాతే వళైత్తుక్కొణ్డిరుక్కుమ్ అర్చావతారస్థలఙ్గళుమ్, ‘‘యేషామిన్దీవరశ్యామో హృదయేసుప్రతిష్ఠితః’’ ఎన్నుమ్, ‘‘ఒణ్శఙ్గదైవాళాఴియానొరువనడియేనుళ్ళానే’’ శొల్లుకిఱపడియే హృదయకమలత్తిలేయిరున్దు తానుకన్దార్క్కుత్తన్నఴకై భుజిప్పిక్కుమ్ అన్తర్యామిత్వస్థలమాకిఱ ఇవ్వప్రాప్యస్థలఙ్గళెల్లామ్, తనక్కు వకుత్త స్థలమాయ్ ప్రాప్యమాయిరుక్కుమాచార్యవిషయమే యెన్ఱధ్యవసిత్తిరుక్కక్కడవనై.- (వళైత్తవిడమానతు)- పిఱరఱియాతపడి తిరై వళైత్తుక్కొణ్డిరుక్కుమ్ అన్తర్యామిత్వమ్ (ఊట్టుమిడమానతు) చక్షుర్విషయమాయిరున్దు తిరుమేనియైయుమ్ గుణఙ్గళైయుమ్ ఆశ్రితరై భుజిప్పిక్కుమ్ అర్చావతారస్థలమెన్ఱు శొల్లువుమామ్. ‘‘యేనైవగురుణాయస్య న్యాసవిద్యాప్రదీయతే। తస్యవైకుణ్ఠదుగ్ధాబ్ధి ద్వారకాస్సర్వ ఏవసః’’ ఎన్నుమ్, ‘‘విల్లార్ మణికొఴిక్కుమ్’’ ఎన్ఱుతుడఙ్గి, ‘‘అరుళాలేవైత్తవర్’’ ఎన్నుమ్ శొల్లక్కడవతిఱే.

---

పఁబడినట్టి బ్రహ్మాదిదేవతల యార్తధ్వనిని వినుటకు చెవియిచ్చి యోగనిద్ర సలుపుచుండునట్టి క్షీరాబ్ధియు, వారియొక్క యార్తధ్వనిని విని మేల్కాంచి- ‘‘నాగపర్యంకముత్సృజ్య హ్యాగతో మధురాంపురీమ్’’ (శేషశయనమును వదిలి మధురాపట్టణమునకు వచ్చియున్నాఁడు) అని సాయించియున్నట్లు, క్షీరాబ్ధియందుండు శేషపర్యంకమునుండి యుప్పటికి ఒక మునుకు దుమికినట్లు వచ్చి యవతరించినట్టి యవతారస్థలమును, ‘‘యేషామిందీవరశ్యామో హృదయేసుప్రతిష్ఠితః’’ (యెవ్వారి హృదయమునకలువపుష్పమువలెనే నల్లనివాఁడగు సర్వేశ్వరుండు స్థిరముగా నిల్చియున్నాఁడో) అనియు ‘‘ఒణ్శఙ్గదైవాళాఴియానొరువనడియేనుళ్ళానే’’ (తి, వా. ౮-౮-౧) (శంఖచక్రగదాదులను ధరించినవాఁడు దాసుని హృదయములోనున్నాఁడు) అనియును సాయించి యున్నట్లు హృదయకమలమునందుండి తాను ప్రేమించినవారిచే తన సౌందర్యము ననుభవింపఁజేయునట్టి యంతర్యామిస్థలమునునగు నీప్రాప్యస్థలంబుల నన్నింటిని తనకు ఇష్టమైన తావై ప్రాప్యమైనదియగు ఆచార్యవిషయమే యని నిశ్చయించుకొని యుండునది.

మూసికొనియుండు తావనఁగా—ఇతరులకుఁ దెలియకుండ తెరవేసికొని యుండునట్టి యంతర్యామిత్వమనుట.

అనుభవింపఁజేయు స్థలమనఁగా— కంటికిఁ గానవచ్చునట్టిదియై తన శరీరకాంతినిన్ని గుణంబులనున్న ఆశ్రితులచే ననుభవింపఁజేయునట్టి యర్చావతారస్థలమనియును చెప్పవచ్చును,

‘‘యేనైవగురుణా యస్య న్యాసవిద్యాప్రదీయతే। తస్యవైకుంఠదుగ్ధాబ్ధి ద్వారకాస్సర్వఏవసః’’ (యే యాచార్యునిచే నెవ్వని కధ్యాత్మవిద్య యుపదేశింపఁబడుచున్నదో శ్రీవైకుంఠక్షీరాబ్ధిద్వారకాదులన్నియును ఆయాచార్యుండే) అనియు ‘‘విల్లార్మణికొఴిక్కుమ్’’ (జ్ఞానసారం) (కిరణములు మిక్కుటముగాఁగల మణులు చేరియుండు తిరుమల మొదలగు దివ్యదేశములు) అని యారంభించి ‘‘అరుళాలేవైత్తవర్’’ (అవి యన్నియును దయాళువగు ఆచార్యుండు) అనియును సాయించియున్నారు కదా!

**మూ॥ ౪౫౧॥** ఇవనుక్కు ప్రతికూలర్ స్వతన్త్రరుమ్, దేవతాన్తరపరరుమ్; అనుకూలర్-ఆచార్యపరతన్త్రర్; ఉపేక్షణీయర్ ఈశ్వరపరతన్త్రర్.

అన్ఱిక్కే, (పాట్టుక్కేట్కుమిడమ్) ఇత్యాదిక్కు రక్షకమాక అవన్ ఱైయాలే ప్పడవల్ల నెన్ఱిలవఱివన్ఱిక్కే అవైయెల్లామ్ తనక్కు విషయమే యెన్ఱిరుక్కక్కడవనెన్ఱుం తెన్తుర్ కీర్త్తిదేశేర యోజిక్కవుమామ్.

ఏవమ్భూతనాన ఇవ్వధికారిక్కు స్వరూపనాశకత్వ స్వరూపవర్ధకత్వ తదుభయరహితత్వఙ్గళాల్ ప్రతికూలరాయుమ్ అనుకూలరాయుమ్ అనుభయరాయు మిరుక్కుమవర్కళై దర్శిప్పిక్కిఱార్ మేల్, (ఇవనుక్కు ప్రతికూలర్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు- ఇప్పడి ఆచార్యాభిమాననిష్ఠనాయ్ పరత్వాదిపఞ్చకత్తిలుముళ్ళ ప్రావణ్యమఱ్ఱు ఇవ్విషయత్తిలే ఒరుమైప్పట్టు “తేవుమత్తఱియేన్” ఎన్ఱిరుక్కు మివ్వధికారిక్కు, అణుకిల్ ఆత్మనాశత్తై ప్పిఱప్పిక్కుమ్ ప్రతికూలర్, ఆత్మాపహారికళాన స్వాతన్త్ర్యరుమ్ పారతన్త్ర్యత్తుక్కెల్లై దేవతాన్తరపరరుమ్ భగవద్వ్యతిరిక్తదేవతైకళుక్కు పరతన్త్రరాయిరుక్కుమవర్కళుమ్; స్వసంసర్గత్తాలే స్వరూపత్తై వళర్క్కుమనుకూలర్, స్వరూపత్తై ఉళ్ళపడియుణర్న్దు తచ్చరమావధి నిష్ఠరాన సదాచార్యపరతన్త్రర్; ఇప్పడి స్వరూపనాశకరుమ్ స్వరూపవర్ధకరుమల్లామైయాలే వెఱుప్పుక్కుమ్ విరుప్పుక్కుమ్ విషయమల్లాత ఉపేక్షణీయర్, చరమపర్వమాన ఆచార్యపారతన్త్ర్యత్తిలూన్ఱామన్ఱియిలే ప్రథమపర్వమాన ఈశ్వర పారతన్త్ర్యత్తిలే యూన్ఱినిఱ్కుమవర్కళెన్ఱపడి.

**మూ॥ ౪౫౧॥** ఈతనికి ప్రతికూలులు—స్వతంత్రులును, దేవతాంతరపరులును. అనుకూలులు—ఆచార్య పరతంత్రులు, ఉపేక్షణీయులు—ఈశ్వరపరతంత్రులు.

అథవా (సామగానము వినఁబడుదేశము) ఇత్యాది వాక్యమునకు “రక్షకములనుగాను వాటికయి యాశపడకుండుటమాత్రమే కాకుండ, అవియన్నియును తనకు ఆచార్యుండే యని తలంచియుండువాఁడనియును అర్థముచెప్పఁకొనవచ్చును.

అవతారిక—ఇవ్విధమున నుండువాఁడగు ఈయధికారికి స్వరూపనాశకుల లగుటంజేసి ప్రతికూలులయినట్టివారును, స్వరూపవర్ధకులగుటంజేసి యనుకూలు లయినట్టివారును, యీ పైరెంటి నిన్ని చేయనివారగుటంజేసి యీ రెండువిధము లయినవారున్ను కానివారు వీరని చూపించుచున్నారు. (ఈతనికి ప్రతికూలులు) ఇత్యాది.

ఇట్లు ఆచార్యాభిమాననిష్ఠుండై పరత్వాదు లయిదింటివిషయమున నుండవలసిన ప్రీతికంతయు నాస్పదమైనట్టి యీవిషయమున తదేకదృష్టితో “తేవుమత్తఱియేన్” (వేఱొక్కగతి నెఱుంగను) అన్నట్లు ఉన్నట్టి యీయధికారికి దగ్గిరకుపోతే యాత్మనాశనముఁ గలుగఁజేయునట్టి ప్రతికూలులు. ఆత్మాపహారకులగు స్వతంత్రులును, పారతంత్ర్యమున కొప్పుకొనియుండియు, దేవతాంతరములకు పరతంత్రులుగా నుండునట్టివారును, తమ సంబంధమువలన స్వరూపమును వృద్ధిపొందించునట్టి యనుకూలులు స్వరూపమును యథార్థముగ తెలిసికొని తచ్చరమావధినిష్ఠులగు ఆచార్య పరతంత్రులు, ఇవ్విధమున స్వరూపనాశకులును స్వరూపవర్ధకులును కాకపోవుటంజేసి, త్యాజ్యో

**మూ॥ ౪౯౩॥ జ్ఞానానుష్ఠానఙ్గళిరణ్డుమ్ అల్లాతార్కక్కు ఉపాయాఙ్గమా యిరుక్కుమ్, ఇవనుక్కు ఉపేయాఙ్గమాయిరుక్కుమ్.**

---

ప్రతికూలరై చ్చొల్లుకిఱ విడత్తిల్ స్వతన్త్రి దేవతాన్తరపరతన్త్రిరువరైయుమ్ శొన్నవితు ప్రపత్తిప్రకరణత్తిల్ శొన్న తుర్జనర్ ప్రతికూలర్క్కుముపలక్షణమ్. ప్రథమపర్వనిష్ఠనుక్కు ప్రతికూలరానవర్కళ్ ఇవనుక్కు ప్రతికూలరల్లామైయిల్లైయిఱే. ఇత్తాల్, కీళ్ భగవత్సన్నిధికారిక్కు సహవాసతన్నివృత్తికళుక్కు ఉప్పాక అనుకూలప్రతికూలదర్శనమ్ పణ్ణువిత్తాప్పోలే ఆచార్యాభిమాననిష్ఠనాన ఇవనుక్కుమ్ సహవాసనివృత్తివిషయమాన ప్రతికూలరైయుమ్ సహవాసవిషయమాన అనుకూలరైయుమ్ దర్శిప్పిత్తు, తదధికమాన ఉపేక్షణీయ విషయముమ్ ఇవనుక్కుణ్డెన్నుమిడమ్ దర్శిప్పిత్తారాయిత్తు.

ఇవ్వధికారిక్కుణ్డాక వేణ్డుమ్ ప్రతిపత్త్యనుష్ఠానఙ్గళై ప్పలపడియాలు మరుళిచ్చెయ్తారకీళ్ ; ఇన్దప్రసఙ్గత్తిలే అన్యోపాయనిష్ఠరుడైయ జ్ఞానానుష్ఠానఙ్గళుక్కుమ్, ఇవనుడైయ జ్ఞానానుష్ఠానఙ్గళుక్కుముణ్డాన వినియోగవిశేషత్తై యరుళిచ్చెయ్కిఱార్ మేల్, (జ్ఞానానుష్ఠానఙ్గళిరణ్డుమ్) ఎన్తుతుడఙ్గి. అతావతు- తత్త్వజ్ఞానముమ్ తదనురూపమాన అనుష్ఠానముమ్, ఆచా

---

**మూ॥ ౪౯౩॥ జ్ఞానానుష్ఠానంబులు రెండును తక్కినవారికి ఉపాయంగముగా నుండును. ఈతని కవి యుపేయాంగముగా నుండును.**

---

పాదేయంబులకు విషయభూతులు కానట్టివారలగు ఉపేక్షణీయులు చరమపర్వమగు యాచార్యపారతంత్ర్యమునఁ బ్రీతిలేనివారయి ప్రథమపర్వమగు యీశ్వరపారతంత్ర్యమునఁ బ్రీతికలవారు.

ప్రతికూలులను పేర్కొనుసందర్భమున స్వతంత్రులనున్ను దేవతాంతరపరతంత్రులనున్ను పేర్కొనుట యనునది ప్రపత్తి ప్రకరణమునఁ బేర్కొనినట్టి తక్కిన ప్రతికూలులకున్ను ఉపలక్షణము. ప్రథమపర్వమున నిష్ఠగలవానికి ప్రతికూలులయినవారు ఈతనికిన్ని ప్రతికూలులు కాకుండ యుండరు కదా; కావున నింతకుముందు భగవత్సన్నిధియందు ప్రపత్తి చేసినవానిచేఁ జేయవలసిన సహవాసమునకున్ను తన్నివృత్తికిన్ని తగినట్లు అనుకూలులనున్ను ప్రతికూలులనున్ను చూపించినట్లు, ప్రకృతముననున్ను ఆచార్యాభిమానమున నిష్ఠగలవానిచే సహవాసము చేయకూడనివారగు ప్రతికూలులనున్ను అట్లు సహవాసము చేయఁదగినవారలగు అనుకూలులనున్ను చూపించి అటుపిమ్మట దానికిపైగా ఉపేక్షింపవలసిన విషయము వేఱొక్కటి కలదని దానినిన్ని చూపించినవారయిరి.

అవతారిక — ఈ యధికారి కుండవలసిన యధ్యవసాయమునున్ను అనుష్ఠానమునున్ను ఇంతకుముందు తెలిపిన వారయిరి. ఈసందర్భమున ఇతరోపాయంబుల నవలంబించినవారికిఁ గల జ్ఞానానుష్ఠానములయొక్కయును ఈయధికారికిఁ గల జ్ఞానానుష్ఠానములయొక్కయును ఉపయోగములకుఁ గల తారతమ్యముఁ దెలుపుచున్నారు.

(జ్ఞానానుష్ఠానములు) ఇత్యాది. ఆచార్యాభిమాన నిష్ఠునికంటెనున్ను వేఱయిన యధికారులకుఁ గల తత్త్వజ్ఞానమును, అందుల కనుగుణమగు అనుష్ఠానమున్ను, వారవలంబించిన యుపాయము అధికారిని బట్టియుండునది గావున, ఉపేయము లభించువరకును ఉపాయాధికారము చెడి

**మూ॥ ౪౫౩॥ ఇవనుక్కు నిషిద్ధానుష్ఠానమ్ తన్నైయుమ్ పిఱరైయుమ్ నశిప్పిక్కైయాలే త్యాజ్యమ్.**

ర్యాభిమాననిష్ఠనాన ఇవనై యొత్తిన్ద అధికారికళుక్కు, ఉపాయమధికారి సాపేక్షమాకైయాలే ఉపేయప్రాప్తియళవుముపాయాధికారమ్ నడవామల్ నడక్కైక్కు ఉపాయత్తుక్కు అవ్వళ్ళియాలే ఉపాయశేషమాయిరుక్కుమ్; ఆచార్యాభిమానమే ఉత్తారకమాకైయాల్ ఉపాయాధికారశేషమాక వేణ్డువతొన్ఱిల్లామైయాలే, ఇవ్వధికారిక్కుణ్డాన జ్ఞానానుష్ఠానఙ్గళిరణ్డుమ్ ఆచార్యన్ ముకమలర్త్తియాకిఱ ఉపేయత్తుక్కు శేషమాయిరుక్కుమెన్నై. (ఇవనుక్కు ఉపేయమాయిరుక్కుమ్) ఎన్ఱు పాఠమానపోతు, ఆచార్యనుక్కభిమతమాయ్ క్కొణ్డు ఇవైతానివనుక్కు ఉపేయమాయిరుక్కుమెన్నపడి.

ఇప్పడి జ్ఞానానుష్ఠానఙ్గళిరణ్డుమ్ ఆచార్యప్రీతిహేతువాక నినైత్తు కుఱిక్కొణ్డువర్తిక్కు మివ్వధికారిక్కు అవశ్యమ్ నివర్తనీయఙ్గళై అరుళిచ్చెయ్యవతాక త్తిరువుళ్ళమ్పఱ్ఱి, ప్రథమమ్ నిషిద్ధానుష్ఠానమ్ త్యాజ్యమెన్నుమతై యరుళిచ్చెయ్కిఱార్, (ఇవనుక్కు నిషిద్ధానుష్ఠానమ్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు- ఏవమ్భూతనాన ఇవ్వధికారిక్కు ప్పరదారపరిగ్రహాది నిషిద్ధానుష్ఠానమ్, స్వవినాశహేతువుమ్ స్వానుష్ఠానమ్కణ్డుపరరుడైయ వినాశహేతువుమ్ పణ్ణుకైయాలే పరిత్యజిక్కప్పడుమతొన్ఱైన్నై,

**మూ॥ ౪౫౩॥ తననున్ను ఇతరులనున్ను నశింపఁజేయునది యగుటంజేసి నిషిద్ధానుష్ఠానమీతనికి త్యాజ్యము.**

పోకుండ యుండుట కనుకూలముగానుండి ఆవ్విధమున యుపాయాధికారముకు అంగభూతము లయియుండును. ఈయధికారికన్ననో, ఆచార్యాభిమానమే యుత్తారకమగుటంజేసి, ఇవి యుపాయాధికారము కంగములు కావుగాన, ఈతనికిఁగల జ్ఞానానుష్ఠానములు రెండును ఆచార్యుని సంతోషింపఁజేయుట యనెడి యుపేయమునకు అంగములయి యుండఁగలవు.

ఈ వాక్యమున ‹‹ఇవనుక్కు ఉపేయమాయిరుక్కుమ్ = ఈతనికు ఉపేయముగానుండును›› అని పాఠమున్నట్లయిన, ‹‹ఈతని జ్ఞానానుష్ఠానంబులు రెండును ఆచార్యునికి ప్రీతిని గలుగఁజేయునవియై యివియే యుపేయముగా నుండఁగలవు›› అని యర్థము చేసికొనునది,

అవతారిక—ఇట్లు జ్ఞానుష్ఠానములను రెంటినిన్ని ఆచార్యునికి ప్రీతిని గలుగఁజేయునట్టివాటినిగాఁ దలంచి జాగరూకతో ననుష్ఠించుకొనునట్టి యీయధికారిచే అవశ్యముగ పరిత్యజింపవలసినవాటిఁ దెలుపఁదలంచి ప్రథమమున, నీతనిచే నిషిద్ధానుష్ఠానము త్యాజ్యమనువిషయమును తెలుపుచున్నారు,

(ఈతనికి నిషిద్ధానుష్ఠానము) ఇత్యాది. ఇవ్విధమున నుండునట్టి యీయధికారిచే పరదారపరిగ్రహాది నిషిద్ధానుష్ఠానము తనను నశింపఁజేయుటయే కాకుండ, తనను చూచి యవ్విధమున నడచుకొనునట్టి యితరులనున్ను నశింపఁజేయుటంజేసి దానిని యీతండు అవశ్యముగ పరిత్యజింపవలయుననుట.

అవతారిక—దీనివలన ఉభయులును నశించుట యెట్లంటి వేని, తెలుపుచున్నారు,

**మూ॥ ౪౫౪॥ తాన్ నశిక్కిఱతు మూన్ఱపచారత్తిలు మన్వయిక్కైయాలే; పిఱర్ నశిక్కిఱతు తన్నైయనాదరిక్కుమ్ తన్ననుష్ఠానత్తై యఙ్గీకరిక్కుమ్.**

---

ఉభయవినాశముమిత్తాలే వరుకిఱపడి యెజ్జనేయెన్న; అరుళిచ్చెకిఱార్. (తాన్ నశిక్కిఱతు) ఎన్ఱుతుడజ్గి. అతావతు - ఆచార్యాభిమానత్తిలేయొతుజ్గి భగవద్భాగవతాచార్య విషయజ్గళ్ మూన్ఱుక్కుమభిమత విషయమాయిరుక్కిఱ తాన్ నశిక్కిఱతు, అమ్మూవర్కుమితు అనిష్టమాకైయాలుమ్, (అపచారమావతు)- అనిష్టకరణమాకైయాలుమ్ అతిక్రూరమాన అపచారత్రయత్తిలు మన్వయిక్కైయాలే. పిఱర్ నశిక్కిఱతు, చరమపర్వవర్త్తమాకవన్ద నిఱ్కిఱ భాగవతోత్తమనాన తన్నైనిషిద్ధానుష్ఠానమ్ పణ్ణినవనెన్ఱు అనాదరిత్తుమ్, తత్త్వవిత్తాన ఇవనిప్పడిశెయ్కిఱాన్ ఇతిల్ దోషమిల్లైయాకప్పట్టతో, నమక్కుప్పిన్నైయెన్? ఎన్ఱు తన్నుడైయ వనుష్ఠానత్తై త్తాజ్గళఙ్గీకరిత్తుమెన్నై. అనాదరిప్పార్ భాగవతవైభవ మఱియాతవర్కళ్, అనుష్ఠానత్తై యఙ్గీకరిప్పార్ ప్రాప్తాప్రాప్త వివేకమిల్లాతవర్కళ్. అనుష్ఠానత్తై యఙ్గీకరిక్కిఱవర్కళ్ నశిక్కిఱార్కళ్, అనాదరిత్తవర్కళ్ నశిప్పానెన్? దోషమ్కణ్డా లనాదరిక్కలాకాతో వెన్నిల్, రాజపుత్రనుక్కు దోషముణ్డానాల్ రాజా తాన్ శిక్షిత్తుక్కొళ్ళుమతొழிయ అవనై యనాదరిత్తవర్కళ్ మేలే నిగ్రహం పణ్ణి దణిక్కుమాపోలే. స్వాభిమత

---

మూ॥ ౪౫౪॥ తాను నశించుటయనునది మూఁడు అపచారములతోనను సంబంధిచియుండుటవలన.

మూ॥ ఇతరులు నశించుట యనునది తనను అనాదరణచేసియు, తన యనుష్ఠానము నవలంబిఁచియును.

---

(తానునశించుట) ఇత్యాది, ఆచార్యాభిమానమే యుత్తారకమని నిశ్చయించుకొని భగవంతునికిన్ని భాగవతులకున్ను ఆచార్యునికిన్ని యీముగ్గురికిన్ని మిక్కిలి యిష్టుండగు తాను నశించుట యెట్లనఁగా— నిషిద్ధానుష్ఠానము ఆముగ్గురికిన్ని అయిష్టమయినది. అపచారమనఁగా అయిష్టమయిన దానిఁజేయుటయే కదా; వారి కయిష్టమయిన దాని నాచరించుటంజేసి వారి ముగ్గురియెడలను అపచారమొనర్చినవాఁడయినందున నశించిపోవును. ఇతరులు నశించుట యెట్లనఁగా, చరమపర్వమువరకును వచ్చియున్నట్టి భాగవతోత్తముండగు తనను నిషిద్ధానుష్ఠానముగలవాడని యనాదరణచేసియును, తత్త్వవేత్తయగు యీతండు యీకార్యమును చేసినాడు, ఇందువలన దోషమెద్దియును లేకపోవుటంజేసియే కదా! యీతండట్లుచేయఁగలిగెను. కావున మనమట్లు చేసినచో నేమి యని తలంచి తన యనుష్ఠానము నవలంబించినందున ఇతరులు నశించుదురు,

అవతారిక—ఈతనిని అనాదరణ చేయువారు భాగవతవైభవము తెలియనివారు. ఈతని యనుష్ఠానమునవలంబించువారు ప్రాప్తాప్రాప్తవివేకము లేనివారు. ఈతని యనుష్ఠానము నవలంబించువారు నశించుదురు. ఈతని కనాదరణచేయువారేల నశింపగలరు? దోషమున్నట్లయిన అనాదరణ చేయకూడదా యంటివేని చెప్పెదను. రాజుయొక్క కుమారునివలన తప్పున్నట్లయిన రాజు వానిని తానే శిక్షించును. అయితే, అందుమూలముగ వానిని అనాదరణజేసినవారియెడల కోపించుకొని వారిని దండించు

మూ॥ ౪౧౫॥ విహితభోగమ్ నిషిద్ధభోగమ్బోలే లోకవిరుద్ధముమన్ఱు, నరకహేతు వుమన్ఱు; ఆయిరుక్కచ్చెయ్ తే, స్వరూపవిరుద్ధముమాయ్ వేదాన్తవిరుద్ధముమాయ్ శిష్టగర్హితముమాయ్ ప్రాప్య ప్రతిబన్ధకముమా యిరుక్కైయాలే త్యాజ్యమ్.

---

గాన ఇవనుక్కుదోషముణ్డానాలుమ్ సర్వేశ్వరన్దానే తిరుత్తిక్కొళ్ళుమతొழிయ పిఱరనాదరిక్క ప్రాప్తమైయాలే. అనాదరిత్తవర్ కళుక్కు వినాశమేఫలిక్కైయాల్ అనాదరిక్కలాకాతు, ‘‘అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ । సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః’’ ఎన్ఱు ఉపాసకవిషయమాక వరుళిచ్చెయ్తపడి కణ్డాల్ ఎల్లైనిలత్తిల్ వన్దు నిన్ఱ ఇవ్వధికారివిషయత్తిలవనిరుక్కుమ్బడి శొల్లవేణ్డావిఱే. అక్కైయాల్, ఇప్పడి తానుమ్ పిఱరుమ్ నశిక్కుమ్బడియిరుక్కైయాలే ఇవనుక్కు నిషిద్ధానుష్ఠానమ్ పరిత్యాజ్యమెన్ఱతాయిత్తు.

ఇప్పడి పరదారాదిభోగమ్ స్వపరవినాశహేతువాకైక్కాడి శాస్త్రనిషిద్ధమాకైయిఱే. ఇజ్జనన్నిక్కే శాస్త్రవిహితవిషయమాన స్వదారభోగత్తుక్కు క్కైయిల్లైయోయెన్న అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (విహితభోగమ్) ఎన్ఱుతుడఙ్గి. అతావతు– విశిష్టవేషవిషయ యాన

---

మూ॥ ౪౧౫॥ శాస్త్రమునందు విధింపఁబడినట్టి భోగము నిషిద్ధ భోగము వలెనే లోకవిరుద్ధము కాదు నరకహేతువున్ను కాదు. అయినప్పటికిన్ని స్వరూప విరుద్ధమై వేదాంత విరుద్ధమై శిష్టగర్హితమై, ప్రాప్యప్రతి బంధకమునునయియుండుటంజేసి, త్యాజ్యము.

---

చందమున,తన కిష్టుండయినట్టి యీతనియందు తప్పున్నను, సర్వేశ్వరుండు తాను స్వయముగ దిద్దుపాటుచేయునేతప్ప, ఇతరులు చేయునట్టి యనాదరణమును సహింపఁజాలనందున అట్లుఅనాదరణ చేసినవారికి వినాశమే కలుగునుగాన, అనాదరణ చేయరాదు. కావుననే ‘‘ అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్ । సాధురేవసమన్తవ్యః సమ్యగ్వ్యవసితోహిసః ’’ అనఁగా (ఎక్కువ దురాచారవంతుఁడైనను నన్ను విడువక యుపాసించునట్టివాడు మంచివాఁడే వాఁడు మంచినడవడిక కలవాఁడు కదా) అని ఇట్లు ఉపాసకునిగుఱించి చెప్పినదానిని చూచితే కట్టకడదిని (చరమపర్వమున) యున్నట్టి యీయధికారివిషయమై యతని మనస్సునుగుఱించి వేఱుచెప్ప నక్కఱలేదు. కదా! కావున నిటులు తానున్ను ఇతరులున్ను నశించునట్లుండుటంజేసి యీతనికి నిషిద్ధానుష్ఠాన మెంతమాత్రము కూడదు.

అవతారిక—ఇట్లు పరదారాదిభోగము తనను న్ను ఇతరులనున్ను నశింపఁజేయునట్టిది యగుటకుం గారణ మది శాస్త్రనిషిద్ధ మగుటకదా! అట్లుకాకుండ, శాస్త్రమున విధింపబడినట్టిదైన స్వభార్యాభోగమునందు తప్పులేదు కదా యంటివేని తెలుపుచున్నారు.

(విహితభోగము) ఇత్యాది. దేహవిశిష్టస్వరూపమునుగుఱించి నదియగు శాస్త్రముచే విధింపఁబడినట్టి స్వభార్యాభోగము శాస్త్రనిషిద్ధమగు పరదారాపరిగ్రహమువలెనే లోకవిరుద్ధమైనదియును కాదు. (కాలిన) రాగివిగ్రహమును ఆలింగనము జేసికొనునటువంటి ఘోరమయినదుఃఖానుభవముఁ గలుగఁజేయునట్టి నరకములోఁబడుటకు హేతువున్ను కాదు. ఇవ్విధమున ప్రత్యక్షమగు లోకవిరో

మూ॥ ౪౫౬॥ భోగ్యతాబుద్ధి కులైన్దు ధర్మబుద్ధ్యా ప్రవర్త్తిత్తాలుమ్ స్వరూపమ్ కులైయుమ్.

శాస్త్రత్తిలే విధిక్కప్పట్ట స్వదారత్తిల్ భోగమ్, తాదృశశాస్త్రనిషిద్ధమాన పరదారభోగమ్పోలే లోకవిరుద్ధమున్నన్ఱు, ఎమ్బనాలియన్ఱ పాళైయై త్తళువుకై ముతలాన ఘోరదుఃఖానుభవమ్ తిణ్ణుమ్ నరకహేతువుమన్ఱు. ఇప్పడి ప్రత్యక్షపరోక్షసిద్ధఙ్గళాన లోకవిరుద్ధత్వ నరకహేతుత్వఙ్గళిరణ్డుమ్ ఇల్లాదిరుక్కచ్చెయ్తే, అనన్యభోగత్వరూపమాన స్వరూపత్తుక్కు విరుద్ధముమాయ్. "శాన్తోదాన్త ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్" ఇత్యాదికళాలుమ్ తిరుమన్త్రాదికళాలుమ్, ఉపాసకనోడు ప్రపన్ననోడువాసియఱ ఇరువర్క్కుమ్ విషయభోగమాకాతెన్నుమిడత్తై ప్రతిపాదిక్కిఱ వేదాన్తత్తుక్కు విరుద్ధముమాయ్, దోషదర్శనత్తాలుమ్ అప్రాప్తదర్శనత్తాలుమ్ విషయభోగత్తై అరువరుత్తియుక్కుమాచార్యప్రధానరాన శిష్టర్కళాలే హేయమెన్ఱు నిన్దిక్కప్పట్టిరుప్పతుమాయ్, అప్రాప్తవిషయవిరక్తి ప్రియన ఆచార్యనుక్కనభిమతమాకైయాలే ఆచార్యముఖకమలవికాసానుభవరూపప్రాప్యత్తుక్కు ప్రతిబన్ధకముమాయ్, ఇప్పడి అనేకానర్థావహమాయిరుక్కైయాలే ఇవ్వధికారిక్కు ప్పరిత్యాజ్యమెన్ఱపడి.

భోగ్యతాబుద్ధియొవిట్టు ధర్మబుద్ధ్యా ప్రవర్త్తిక్క మళవిల్ ఇవైయొన్ఱుమిల్లైయేయెన్న, అరుళిచ్చెయ్కిఱార్ మేల్, (భోగ్యతాబుద్ధికులైన్దు) ఎన్ఱతుడఙ్గి. అతానతు- విహితవిషయప్రవృత్తియిల్ కాముకతయా వరుమ్ భోగ్యతాబుద్ధియై విట్టు ఉపాసకరాన మహర్షికళ్ కుడక్కమానవి

మూ॥ ౪౫౬॥ భోగ్యమనెడి తలంపును వదలి ధర్మమనెడి తలంపుతో ప్రవర్త్తించినను స్వరూపము చెడిపోవును.

థమును పరోక్షమగు నరకహేతువున్ను ఈరెండును లేనిదేయైనను, అనన్యభోగత్వరూపము స్వరూపముతో విరోధించునట్టిదియై "శాంతోదాన్త ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్" (బాహ్యేంద్రియ నిగ్రహముగలవాఁడును, ఆంతరింద్రియ నిగ్రహముకలవాఁడును, ఉపరతుండును, సహనశీలుండును, సమాధిగలవాఁడునయి పరమాత్మను తనయందే యనుభవించునది) ఇత్యాద్యుపనిషద్వాక్యములచేతనున్ను, తిరుమంత్రాదులచేతనున్న ఉపాసకులకును ప్రపన్నులకును వీరియుభయులకున్న విషయానుభవముకూడదని ప్రతిపాదించునట్టి వేదాంతమునకు విరుద్ధమైనందువల్లనున్న దోషదర్శనమువల్లనున్న స్వరూపమునకు తగినట్టిదికానందుననున్న విషయభోగమును బొత్తుగ విడనాడియుండు ఆచార్యాభిమాననిష్ఠులగు శిష్టులచేత హేయమని నిందింపఁబడినదై స్వరూపోచితములుగానట్టి విషయములయెడల వైరాగ్యమును ప్రేమించునట్టి యాచార్యునికి అయిష్టమైనందున; ఆచార్య ముఖకమలవికాసానుభవరూపమగు ప్రాప్యమునకు ప్రతిబంధకమై యివ్విధమున ననేకానర్థంబులకుఁ గారణమగుటంజేసి యీయధికారిచే త్యజింపవలసినది.

అవతారిక —భోగ్యతాబుద్ధినివిడిచి ధర్మబుద్ధితోఁ ప్రవర్త్తించునప్పుడు ఇవి యన్నియును లేకయుంటివేని తెలుపుచున్నారు,

(భోగ్యమనెడితలంపును) ఇత్యాది. శాస్త్రవిహితమగు విషయమునఁ బ్రవర్తించునప్పుడు కాముకులకుఁగల భోగ్యతాబుద్ధినివిడిచి ఉపాసకులగు మహర్షులు మొదలగు శిష్టులు పితృఋణ

